


- డా॥ పాటిబండ మాధవశర్మ

# ఆంధ్ర మహాభారతము - అరణ్యపర్వం

శ్రీ

# ఆంధ్రమహాభారతము

## [ ఆరణ్యపర్వము ]

సంపాదకులు

డాక్టర్ పాటిబండ మాధవశర్మ



ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి

కళాభవన్

సైఫాబాదు - హైదరాబాదు-4.

# తొలిపలుకు

ఆంధ్రప్రదేశ్ మాజీ మంత్రివర్యులు శ్రీ యం. ఆర్. అప్పారావుగారు చేసిన సూచన ననుసరించి ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి తెలుగుభాషలోని ప్రాచీన సాహిత్యము అందరికి అందుబాటులో నుండునట్లుగా ముద్రించి ప్రకటింప వలెనని నిశ్చయించినది. తెలుగుభాషలోని పూర్వ గ్రంథ సముదాయము యీనాడు పాఠకునకు సక్రమముగా సరసమైన ధరకు లభ్యమగుటలేదు. ఈ లోటును తీర్చి ప్రాచీన గ్రంథ సంచయమును విడివిడిగా ప్రకటించుటకు సాహిత్య అకాడమి ఒక ప్రణాళికను సిద్ధము చేసినది. ఈ ప్రణాళిక ప్రకారము ఈ కార్యక్రమము మూడు తరగతులుగా విభజించనైనది. మొదటిది ప్రాచీన ప్రబంధాల ప్రకటన; రెండవది మహా భారతము ప్రచురణ; మూడవది హరివంశము, భాస్కర రామాయణము, బసవపురాణము, భోజరాజీయములను సంగ్ర హించి ప్రకటించుట. పై ప్రణాళిక ప్రకారము ప్రచురింపబడు ప్రతి గ్రంథములో గ్రంథకర్తనుగూర్చి, గ్రంథప్రాశస్త్యమును గూర్చి వివరించు సుమారు 40 పేజీల పీఠికను చేర్చవలెనని నిశ్చయించనైనది.

ఈ కార్యక్రమములో ప్రాచీన ప్రబంధాల ప్రకటనము పూర్తియైనది. సంక్షిప్త గ్రంథప్రచురణ కార్యక్రమములో బసవపురాణ, భాస్కరరామాయణ, హరివంశ, భోజరాజీయ ములు ప్రచురింపబడినవి. ప్రస్తుతము ఆంధ్రమహాభారత ప్రకటనము చేపట్టనైనది. ప్రసిద్ధులైన విద్వాంసులచే మహా భారత సంపుటముల పరిష్కారము నిర్వహింపబడుచున్నది.

ఆంధ్రమహాభారత సంపుటములలో మూడవదైన ఆరణ్యపర్వమును పరిష్కరించి, పీఠిక వెలయించి మా కందజేసిన డా. పాటిబండ మాధవశర్మగారికి అకాడమి పక్షాన కృతజ్ఞతలు.

పైన పేర్కొనబడిన గ్రంథసంపుటాల వ్రాతప్రతులను సిద్ధముచేసి ముద్రించుటకు అవసరమైన డబ్బును పూర్తిగా అకాడమికి యిచ్చుటకు కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు వాగ్దానము గావించి అందులో చాలమట్టుకు డబ్బును విడుదలకూడ చేసినవి. అందుకు అకాడమి పక్షాన కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలకు ధన్యవాదాలు. సాధ్యమైనంత త్వరలో మహాభారత సంపుటముల నన్నింటిని సిద్ధముచేసి, ఆంధ్ర పాఠకలోకానికి అందజేయుట జరుగగలదని విశ్వసించుచున్నాను.

హైదరాబాదు,
24–12–1970

దేవులపల్లి రామానుజరావు
కార్యదర్శి

శ్రీః

# పీ ఠి క

"శారదరాత్రు లుజ్వ్వల ల
సత్తర తారక హారపంక్తు లం
జారుతరంబు లయ్యె, విక
సన్నవ కైరవ గంధబంధురో
దార సమీర సౌరభము
దాల్చి, సుధాంశు వికీర్యమాణ క
ర్పూర పరాగ పాండురుచి
పూరములం బరిపూరితంబులై "

ఇంతవఱకే నన్నయ్యగారి కవిత్వమట. ఇది అరణ్యపర్వము - చతుర్థాశ్వాసమున 142వ పద్యము. ఈ పద్యము వ్రాసి నన్నయగారి గంటము ఆగిపోయినది. గంటమేకాదు ఆయనగుండెయే ఆగిపోయినది, కానిచో ఆయన గంటము ఆగదు. శరన్నదీ ప్రవాహమువలె ప్రసన్నమధురమై ధీరసుందరగమనమున సాగిపోవుచున్న ఆయన కవితాధారయు హఠాత్తుగా ఆగిపోదు.

ఆయన మరణించుటకు కారణములుగా చెప్పబడు భీమకవి శాపము, అధర్వణుని ఉసురు కట్టుకథలని చరిత్ర తేల్చివైచినది. భారతరచన ఆగిపోవుటకు రాజకీయకల్లోలములు, రాజరాజుమరణము కారణములుగా కొందఱు సూచింతురు. ఆగిన భారతరచన తిరిగి కొనసాగకుండుటకు అవి కారణములు కావచ్చును. కాని నన్నయగారి రచన ఆగిపోవుటకు ఆయన యాకస్మిక మరణము తప్ప వేఱు కారణము కనపడదు.

రాజరాజు రాజ్యమేలిన నలువది యేండ్లలో రాజకీయ కల్లోలము లేనికాలము చాలతక్కువ. పట్టుమని పదియేండ్లపాటు ప్రశాంతముగా జీవించు అదృష్టము ఆ ప్రభువునకు పట్టలేదు. తండ్రి మరణించిన మూడేండ్లకు 1022 లో గాని ఆయన గద్దెపై గూర్చుండ జాలడయ్యెను. పదియేండ్లయినను దానిపై కుదురుకొన జాలడయ్యెను. 1030 లో సవతి తమ్ముడైన విజయాదిత్యునిచే గద్దె దింపబడి

మేడేండ్లు చోళరాజ్యమున ప్రవాసము చేసెను. మరల గద్దె సంపాదించి 1046 వరకు దినదినగండముగా గడపెను. 1046-53 నడుమ కొంతయూపిరి తీసి కొనెను. అప్పుడే ఆయనకు భారతమును దెనుగున వెలయించు సంకల్పము కలిగి యుండును. ఆయన ప్రియమిత్రుడైన నన్నయగారికి తన యభిలాషను ఎఱుక పఱిచి భారతాంధ్రీకరణమునకు ఆయనను పురికొల్పియుండును. నన్నయ బ్రహ్మాం డాది నానాపురాణ విజ్ఞాన నిరతుడు. ఆయనకు వ్యాసభారతము సుపరిచితమైయై యుండవలయును. ఐనను భారతాంధ్రీకరణమునకు పూనుకొని యుండడు. మూల భారతమును మరల మరల పఠించి మననము చేసి దాని పరమార్థము తెల్లమగు నట్లు తెనుగున వెలయించుటకు పథకమును నిర్మించుకొని రచన మారంభించుటకు కొంతకాలము వినియోగించి యుండును. రాజరాజు రాజ్యారంభకాలమున వేంగి రాజ్యమునకు బెజవాడ రాజధానిగా నుండెను. కొప్పము యుద్ధమున తనకు పరా జయము శంకించి కర్ణాట చాళుక్యులతో సంధిచేసికొన్న యనంతరమే రాజరాజు రాజధానిని రాజమహేంద్రవరమునకు మార్చినట్లు కనబడుచున్నది. భారతరచనము రాజమహేంద్రవరమునందే ఆరంభమైనది.

రాజమహేంద్రపురమున నిండుసభలో అపార శబ్దశాస్త్రపారగులైన వైయా కరణులును, భారతరామాయణాద్యనేక పురాణ ప్రవీణులైన పౌరాణికులును, మృదుమధురరసభావభాసురనవార్థవచనరచనావిశారదులైన మహాకవులును ఆదిగా గల విద్వజ్జనములు పరివేష్టించి కొలువ విద్యావిలాసగోష్ఠి సుఖోపవిష్టుండయి యిష్టకథావినోదంబులనుండి నన్నపార్యుని జూచి ''నాహృదయంబున ననవరతం బును శ్రీమహాభారతంబునందలి యభిలాషంబు విన నభిలాష పెద్దయై యుండు'' కావున కృష్ణద్వైపాయనమునివృషభాభిహిత మహాభారతబద్ధ నిరూపితార్థమేర్పడ తెనుగున రచియింపు మధిక ధీయుక్తి మెయిన్' అని రాజరాజు ఆనతిచ్చెను.

సభలో వైయాకరణులు, పౌరాణికులు, మహాకవులునుండినను ఈలక్షణము లన్నియు పుంజీభవించి యున్న నన్నయ భట్టునే రాజరాజు భారతాంధ్రీకరణము నకు ఎన్నిక చేసెను. ఆయనయు "దేవా! నీ యనుమతంబున విద్వజ్జనంబుల యనుగ్రహంబునంజేసి నానేర్పువిధంబున నిక్కావ్యంబు రచియించెద'నని దుస్సా ధ్యమని యెఱింగియు ప్రభువు పట్లగల యనురక్తిచే ఉదాత్తమయిన ఆయన యభిలాషమును నెరవేర్పదలంచి మహత్తరమైన ఆ కార్యభారము నంగీకరించెను.

"పాయక పాకశాసనికి భారత ఘోరరణంబునందు నా
రాయణునట్లు వాసిగ ధరామర వంశవిభూషణుండు నా
రాయణభట్టు వాఙ్మయ ధురంధరుఁడుం దన కిష్టుడున్ సహా
ధ్యాయుఁడు నైన వాఁడభిమతస్థితిఁ దోడయి నిర్వహింపగాన్"

తాను భారతసంహితారచన బంధురుడు అయినట్లు నన్నయభట్టు చెప్పికొనెను. ఆయనకు నారాయణభట్టు తోడ్పాటు లభించుటకు 1053 అనంతరమే అవకాశము గలదు. నన్నయభట్టు, నారాయణభట్టు ఏగురుకులముననో కలిసి చదువుకొని యుండిరి. నన్నయభట్టు తూర్పుచాళుక్యుడైన రాజరాజు నాస్థానమున ప్రవేశించెను. నారాయణభట్టు పశ్చిమచాళుక్యుడైన త్రైలోక్యమల్లుని యాస్థానమున ప్రధానిగా ప్రవేశించెను. 1050 ప్రాంతమున పశ్చిమచాళుక్యులు వేంగిపై దండెత్తిరి. రాజరాజు చోళుల తోడ్పాటున వారి నెదిర్చెను. ఈ యుద్ధము రెండుమూడేళ్ళు జరిగెను. 1053 లో కొప్పము యుద్ధమున చోళచక్రవర్తి రాజాధిరాజు నిహతుఁడయ్యెను, ఆయన తమ్ముడు రాజేంద్రుడు పారిపోయెను. ఒంటరిగా పోరుసాగింప లేని రాజరాజు పశ్చిమ చాళుక్యులతో సంధిచేసికొనక తప్పలేదు. ఈ సంధిని కుదుర్చుటలో సహాధ్యాయులైన నన్నయభట్టు, నారాయణభట్టుకలసి తీవ్రమైన కృషిచేసి యుండిరని విజ్ఞుల యభిప్రాయము సంధిఫలితముగా రాజరాజు వేంగీరాజ్యమందలి దక్షిణభాగమును త్రైలోక్యమల్లున కర్పించి ఆయన ప్రధానియైన నారాయణభట్టును తన ఆస్థానమున స్థానాపతిగా అంగీకరింపవలసి వచ్చెను.

భారతాంధ్రీకరణమున నన్నయభట్టునకు తోడ్పడుటకే కాబోలు రాజరాజు నారాయణభట్టునకు నందంపూడి అగ్రహారమును ధారవోసెను. ఆ దానశాసనమును నన్నయభట్టే వ్రాసెను. నారాయణభట్టు అనుష్ఠిత జగదుపకరణుడని, సంస్కృత కర్ణాట ప్రాకృత పైశాచికాంధ్రభాషలందు సుకవిత్వ విభవముచేత కవిరాజశేఖరుడని ప్రసిద్ధికెక్కిన వాడని, మనీషాలవదుర్విదగ్ధులైన కవులను మనోహరములైన తన సూక్తులచే అగర్వులనుచేసి కవీభవజ్రాంకుశుఁడను సార్థకనామము వహించెననియు జగదభిగుణశాలి యనియు సరస్వతీ కర్ణావతంసుడనియు అష్టాదశావధారణ చక్రవర్తియనియు ఆ శాసనమున కొనియాడబడియున్నాడు. ఆ శాసనమునందలి—

"విచిత్రవీర్యాత్ పాండురాజః పుత్రాస్తస్య చ పంచ ధర్మజ భీమార్జున నకుల సహదేవాః పంచేంద్రియవత్ పంచస్యు ర్విషయగ్రాహిణస్తత్ర"

అను వాక్యము ఆరణ్యపర్వమందలి "మోముహ్యమానాం తాం తత్ర జగృహుః పంచపాండవాః ఇంద్రియాణి ప్రసక్తాని విషయేషు యథా రతిం" అనువాక్యమునకు ప్రతిబింబమువలె నుండి నన్నయ అప్పటికి భారతమును మననము చేయుచున్నట్లు వ్యక్తము చేయుచున్నది.

నారాయణభట్టు తోడ్పాటున నన్నయభట్టు 1053 తరువాతనే భారతాంధ్రీకరణము ప్రారంభించెను. భారతయుద్ధమున శ్రీకృష్ణుడు అర్జునునకు తోడ్పడినట్లు భారతరచనమున నారాయణభట్టు నన్నయభట్టునకు తోడ్పడె ననుటవలన రాజరాజు అభిలషించినట్లు వ్యాసునిచే నిరూపితమైన పరమార్థము తేటతెల్లమగు తీరున భారతము నాంధ్రీకరించుటలో నన్నయభట్టు ఎదుర్కొనిన సంకట పరిస్థితులను తనబుద్ధి కుశలతచే తొలగించుచు నారాయణభట్టు ఆయనకు వాఙ్మాత్రమైన సహాయముచేసె నని భావింపవలెను, పండితపరిషత్తులలో నన్నయ అనువాదసరణిపై ఆక్షేపములు కలిగినప్పుడు వాని నధిగమించుటలో కూడ బహుభాషాకోవిదుఁడు, కవీభవజ్రాంకుశుఁ డయిన నారాయణభట్టు నన్నయకు అండదండగా నిలిచియుండును.

ధర్మరాజువంటి రాజరాజు సంకల్పము, నరునివంటి నన్నయభట్టు కృషి, నారాయణునివంటి నారాయణభట్టు సహకారము— ఇట్టి మహత్తర సాధనసంపత్తి సమకూడి ఆంధ్రజాతి పుణ్యోదయమున ఆంధ్రభాషలో పంచమవేదమునకు శ్రీకారోదయమైనది.

ఈ విధముగ ఆరంభమైన భారతాంధ్రీకరణము ఆరణ్యపర్వము చతుర్థాశ్వాసమున 142 వ పద్యమువద్ద ఆగిపోయెను. దీనికి నన్నయగారి ఆకస్మిక మరణము తప్ప వేరుకారణము కనబడదు. 1053 ప్రాంతమున ఆరంభించి ఏకదీక్షతో రచన సాగించి 1057 ప్రాంతమున నన్నయ మరణించి యుండును. సహాధ్యాయుని మరణమువలన నారాయణ భట్టునకు రాజరాజు విషయమున, భారత రచన విషయమున ఆసక్తి నశించియుండును. 1058 లో త్రైలోక్యమల్లుడు దిగ్విజయయాత్రకు పూని వేంగిపై నెత్తివచ్చినపుడు నారాయణభట్టు వెనుకటివలె ఉభయరాజ్యములకు సంధిగావింప యత్నింపక తటస్థముగా నూరకుండెనుగాబోలు! రాజరాజునకు యుద్ధములోనికి దిగక తప్పలేదు. చోళులసాయము కూడ ఆయనకు తగినంత లభించినట్లు లేదు. శక్తికొలది పోరి రాజరాజు 1061 లో రణరంగముననే వీరమరణము పొందెను. భారతము వ్రాయువాడులేడు వ్రాయించువాడునులేడు. ఆగిన భారతరచన రెండు శతాబ్దులకు పైగా అట్లే ఆగియుండెను.

ఆంధ్రమహాభారతము నన్నయ చేతిమీఁదుగనే పూర్తియై యుండినచో దాని స్వరూపమెట్లుండెడిదో. కాని ఆంధ్రులయదృష్టము వేరువిధముగా నున్నది. మూఁడువందలయేండ్లలో ముమ్వురు మహాకవుల కృషిఫలముగా ఆంధ్రమున మహాభారతము పూర్తియగునని విధినిర్ణయము. ఋషియైన నన్నయ మంగళాచరణ శ్లోకమందలి "వేదత్రయమూర్తయః" అను మాటయందే ఈ యంశము సూచింపబడినదని కొందఱందరు. కాని రాజరాజు సంకల్పమునకు, తనకృషికి విఘ్నము సంభవించునన్న అమంగళకరమైన యర్థము వ్యక్తమగునట్లు మంగళశ్లోకము చెప్పెననుట నన్నయ ఋషిత్వమునకు గౌరవము నాపాదింపదు.

ఆరణ్యపర్వమున కాలము పండ్రెండేండ్లు జరిగినది. కథమాత్రము పండ్రెండు అంగుళములు కూడ జరుగలేదు. మఱి జడిగినదేమిటి? ధర్మజుని ధర్మబలము పెరిగినది. భీముని భుజబలము పెరిగినది. అర్జునుని అస్త్రబలము పెరిగినది. అజ్ఞాతవాస సమ్యగనుష్ఠానమునకు, రాజ్యపునః ప్రాప్తికి, ప్రతిజ్ఞా పరిపూర్తికి సదుపాయములు అమరినవి. సౌకర్యములు పెరిగినవి. ఆరణ్యపర్వము ఏడాశ్వాసములు సాగినవి. అందులో నన్నయ రచించినది మూడశ్వాసముల మీద 142 పద్యములు. పాండవులజీవితము ఈ పర్వమున చక్కని పరిపాకమును పొందినది. నన్నయ రచనయు మంచిపాకమున బడినది.

## భారతపరమార్థము

రాజరాజు విమలమతితో ననేక పురాణములు వినెను. అర్థశాస్త్రముల తెలఁగెఱింగెను ఉదాత్తరసాన్విత కావ్యనాటక క్రమములు పెక్కు చూచెను. జగత్పరి పూజ్యములైన ఈశ్వరాగమములయందు భక్తితో హృదయము నిల్పెను. అయినను ఆయనహృదయమున అనవరతమును శ్రీమహాభారతము నందలి యభిప్రాయమును వినవలెనన్న యభిలాష పెద్దయై యుండెను. మహాభారతము ఆయన వంశమున ప్రసిద్ధులై విమల సద్గుణశోభితులైన పాండవోత్తముల చరిత్ర. కనుక కృష్ణద్వైపాయన ముని వృషభాభిహిత మహాభారతబద్ధ నిరూపితార్థమేర్పడ అధిక ధీయుక్తిమెయిన్ తెనుగున రచియింపుమని ఆయన నన్నయనుకోరెను.

నన్నయ 'నానేర్చువిధంబున నిక్కావ్యంబు రచించెద' నని తొడంగెను. సారమతిం గవీంద్రులు ప్రసన్నకథా కవితార్థయుక్తి లో నారసిమేలునా నితరుల క్షరరమ్యత నాదరింప నానారుచి రార్థసూక్తినిధియైన నన్నయ తెనుంగునన్ మహా

భారత సహితారచన బంధురుడయ్యెను. భారతము సంహిత-ఇతిహాస సముదాయము. కర్మఫల సంబంధ రూపములగు ఆగమికార్థములు దేనియందు ప్రత్యక్షపరి దృశ్యమానము లగునో ఆ చరిత్ర ఇతిహాసమగునని అభినవగుప్తపాదులు వివరించిరి. పాండవోత్తముల చరిత్ర అట్టిది. ఆగమోక్తములయిన ధర్మకర్మల యనుష్ఠానము వలన, అననుష్ఠానము వలన గలుగు ఫలములను ప్రత్యక్షముగా నిరూపించుటకే వ్యాసుడు పాండవోత్తముల చరిత్రను ఇతిహాసముగా నిర్మించెను. కృష్ణద్వైపాయన మునివృషభాభి హితమైన మహాభారతమున బద్ధమై నిరూపితమైన యర్థము ఆగమోక్త కర్మఫలసంబంధమే. కర్మానుష్ఠానము మానవాధీనము. ఫలప్రదానము దైవాధీనము. భారతమున కర్మానుష్ఠాతలు పాండవులు. దైవము శ్రీకృష్ణుడు.

"శ్రీకృష్ణుని మాహాత్మ్యంబును, పాండవాది భారతవీరుల మహాగుణంబులును దన విమల విజ్ఞానమయంబైన వాగ్దర్పణంబునం దేర్పడ వెలుంగుచుండ" వేదవ్యాసుడు భారతమును నిర్మించెను అని చెప్పిన నన్నయ భారత పరమార్థమును గుర్తించినవాడు. తమిళమున పెరిందేవనార్ రచించిన భారతమున ఈ పరమార్థము సువ్యక్తము కాలేదు కాబోలు. జైనుడైన పంపన్న కన్నడమున విక్రమార్జున విజయమను పేర వ్రాసిన భారతకథ యందీపరమార్థమునకు స్థానమేలేదు. రన్నడు సాహసభీమవిజయము అనుపేర కన్నడమున రచించిన భారతము కూడ మూలభారత కథను వికృతము కావించినదగుట వ్యాసుని హృదయము నది యావిష్కరింప జాలదు. మూల భారత రహస్యమెఱిగిన రాజరాజునకు తమిళకన్నడ భారతములు వ్యాసహృదయమును ప్రకటించుటలేదని గుర్తించెను. అది యేర్పడునట్లు తెనుగున రచింపుమని నన్నయను కోరెను. అవిరళజపహోమ తత్పరుడు, సంహితాభ్యాసుడు, నానా పురాణ విజ్ఞాన నిరతుడు, విపుల శబ్దశాసనుడు, ఉభయబాషా కావ్యరచనాభిశోభితుడు నైన నన్నయ అందుకు సమర్థుడని ఆయన గ్రహించెను.

## నన్నయ నేర్చిన విధము

మహాభారత బద్ధనిరూపితార్థ మేర్పడునట్లు రచించుట యనగా ప్రసన్న కథా కవితార్థయుక్తితో రచించుట. కథను తత్పరమార్థము ప్రసన్నమగు తీరున వర్ణించుటలో నన్నయ నిపుణుడు. భారతము ఇతిహాస వస్తుసముదాయము. దానిని కావ్యముగా తీర్చినపుడు ఇతిహాసకావ్యమగును. అనగా కర్మఫల సంబంధ నిరూపకమగు కథాకావ్యమగును. నన్నయ అట్టి కథాకావ్య నిర్మాణమున దక్షుడు. అందువల్లనే

కాబోలు ఆయన పుణ్యకథా కథన దక్షుడైన సూతుడు శౌనకాది మహర్షులకు చెప్పిన తెలుగున భారతకథను రాజరాజునకు చెప్పదొరకొనెను.

భారతము 'లోకాగమన్యాయైకాంత గృహంబు'. అనగా లోకన్యాయములకు, ఆగమన్యాయములకు భాండారము. లోకన్యాయము లనగా నీతులు. ఆగమన్యాయ ములనగా ధర్మములు. ఇవి ఇతిహాస వస్తుగుణములను దీపింపజేయును. వీనిని శ్రోతృహృదయరంజకముగా ప్రతిపాదించు నైపుణి నన్నయకు గలదు. ఆయన నానా రుచిరార్థ సూక్తినిధి.

భారతము శ్రవ్యకావ్యము. శ్రోతల శ్రవణేంద్రియములను రంజిల్లజేయు శబ్ద మాధుర్యము దానియం దవశ్యముగా నుండవలయును. ఆవిరళజపహోమతత్ప రుడు, సంహితాభ్యాసుడు అయిన నన్నయ నాదబ్రహ్మవేత్త. తెలుగుజాతి మధుర నాదప్రణవము. తెలుగుభాషయందలి గసడదవాదేశ సరళాదేశములు ఈజాతినాద ప్రవణతకు నిదర్శనములు. నన్నయ్య ఇది గుర్తించెను. తనరచనలో నూటింట డెబ్బదియైదు తత్సమపదములనే వాడినను మృదువైన తెలుగుపదములలో మెత్తగా ఒదిగిపోవు తత్సమపదములనే యెన్నికచేసెను. తెలుగు జాతి శ్రుతికి ఇంపుగొల్పు అక్షరరమ్యతను నిండుగా సాధించెను.

ఈ విధముగా ఆయన అక్షరరమ్యతచే, నానారుచిరార్థ సూక్తులచే, ప్రసన్న కథాకవితార్థయుక్తిచే భారతేతిహాసమును తెలుగుజాతి చెవులకు మనస్సునకు హృద యమునకు ఎక్కునట్లు ఆంధ్రమున వెలయించి ఆదికావ్య నిర్మాతయై సర్వాంధ్రకవి సార్థమునకు ఆచార్యత్వము వహించెను.

## ప్రసన్న కథా కవిత

భారతాంధ్రీకరణమున నన్నయ దాని ఇతిహాసత్వమునకు, రాజరాజు అభి లాషకు, తన ప్రతిభకు అనుగుణమైన విధానమునే అవలంబించెను. నాటకాను వాదమునకు అవసరమైన యథాపదానువాదముగాని, కావ్యానువాదమునకు దగిన యథా శ్లోకానువాదమును గాని, అవలంబింపక ఇతిహాసోచితమైన యథా కథానువాద మును ఆయన అవలంబించెను. ఇతిహాస వస్తుసముదాయమును పుణ్యకథాకావ్య సముదాయముగా రూపొందించెను.

కథా కవిత అన్న పదబంధము సంస్కృతాలంకార గ్రంథములందు కన బడదు. ఎన్నియోవిధముల కావ్యభేదములను, కవిభేదములను పేర్కొన్న ఆలం కారికులు కథా కావ్యము, కథాకవి అను భేదములను పేర్కొన రైరి. అలంకార శాస్త్రములు పుట్టు నాటికే సంస్కృతమున విస్తారమైన వాఙ్మయము యేర్పడి యుండెను. ఆలంకారికులు దానిని స్థూలముగ వేదశాస్త్రములు, పురాణేతిహాసములు, కావ్యనాటకములు అను తీరున విభజించి కావ్యనాటకముల స్వరూపమును, వాని యందలి అవాంతర భేదములను చర్చించిరి. పురాణేతిహాస ప్రసిద్ధములైన వృత్తాంతములే సర్వకావ్య నాటక భేదములకు మూలద్రవ్యములగుటచే ద్రవ్యా పేక్షతో వారు కావ్యభేద నిరూపణము చేయవలసిన అవసరము కలుగలేదు.

దేశభాషలలో వాఙ్మయసృష్టి ఆరంభమగు నాటికే సంస్కృతమున నాటకాంత మైన సాహిత్యము పరిపక్వదశ నందియుండెను. ఆ సాహిత్యమును చక్కగా జీర్ణించుకొన్న విద్వత్కవీశ్వరులే దేశభాషలలో ఆది వాఙ్మయస్రష్టలైరి. వారిచే దేశభాషలం దవతరింపజేయబడిన పురాణేతిహాసములు భాషాంతరీ కరణములే కాక రూపాంతరీ కరణములు అయినవి. ఇతిహాసత్వ, కావ్యత్వముల అనురూప సమ్మే ళనమున రూపొందిన దేశభాషా కావ్యములు ఆ తొలినాళ్ళలో వస్తుకావ్యములన్న వ్యపదేశమును పొందినట్లు కనబడుచున్నది. పంపకవి తన ఆదిపురాణమును 'ఆది పురాణ వస్తుకృతి' అనెను. నాగవర్మ 'ఛందోంబుధి' లో తన్ను గూర్చి 'వస్తుకవి ప్రవర స్తుత' అని చెప్పుకొనినాడు, నన్నయకు సమకాలికుడని భావింపబడుచున్న రేచన 'కవిజనాశ్రయము' న తన్నుగూర్చి 'వస్తుకవి జనాశ్రయా' అని చెప్పికొని నాడు. పండ్రెండవ శతాబ్దియందుండిన నన్నెచోడమహాకవి 'వస్తుకవి' 'వస్తు కావ్యము' 'వస్తుకవిత' అను పదములను కుమారసంభవ పీఠికలో ఉపయోగించి యున్నాడు. పదునాల్గవ శతాబ్ది యందుండిన విన్నకోట పెద్దన వస్తుకావ్యము ఒక కావ్యభేదముగా పేర్కొనినాడు. ఇట్లు క్రమముగా వస్తు ప్రధానమైన కావ్యము లాక్షణికమైన ఒక కావ్యభేదముగ ఆంధ్రమున గుర్తింపబడినది.

క. "ఆరయ వస్తురసాలం
కార ప్రాధాన్యవృత్తిఁ గబ్బంబులు పెం
పారుఁ ద్రివిధార్థఘటనల
ధీరులు పరికించి వానిఁ దెలియఁగ వలయున్"

(కావ్యాలంకార చూడామణి)

మూడువిధములైన యర్థములను కావ్యములందు ఘటింప వచ్చును. అవి వస్తువు, అలంకారము, రసము. వీనిలో అన్యతమప్రాధాన్యవృత్తినిబట్టి కావ్యములు (కబ్బంబులు) వస్తు, అలంకార, రస ప్రధానకావ్యములగును. పెద్దన వస్తుకావ్యము అను పదబంధమును ఉపయోగింపకున్నను, వస్తు ప్రధానమైన కావ్యము వస్తు కావ్యము అని ఆతని అభిప్రాయమనుట స్పష్టము.

ఇతివృత్తము, వస్తువు, కథ అన్న మాటలు సమానార్థకములుగా సంస్కృతాలంకార శాస్త్రములందు ఉపయోగింపబడి యుండుట ఎల్లరు నెరింగినదే. ఇతరులు వస్తుకవిత అన్నదానినే నన్నయ కథాకవిత అనెనని ఊహించుట సులభము. కథా కవిత అన్న మాటకంటె వస్తుకవిత అన్నమాటయే ప్రచురముగ నుండుటచే పెద్దన వస్తుశబ్దమునే గ్రహించి యుండును. నన్నయ భారతము వస్తుకావ్యము లేక కథా కావ్యము అనుటకు తగియున్నది. ఇతిహాస వస్తు సముదాయమైన భారతమును వస్తుప్రధానముగా తప్ప అన్యథా నన్నయ ఎట్లు తెలుగున రచింపగలడు? పాండవోత్తముల చరిత్ర వినుట తన యభీష్ట మగుటచే రాజరాజు నన్నయను భారత రచనకు ప్రేరేచెను. పాండవోత్తముల చరిత్రకు ప్రాధాన్యములేనిచో అది భారతమే కాదుగదా!

ఇతిహాసము పుణ్యకథ. దానిని రమ్యముగా చెప్పుట నన్నయ ఆశయము. పర్వక్రమమున తన రచన పక్వమై ఆరణ్యపర్వమున తన కథనము రమణీయ మగుట ఆయన గుర్తించెను. ఆరణ్యపర్వమున ప్రథమాశ్వాసాంతమున "పుణ్యకథ యతి రమణీయంబుగాను" అనియు, ద్వితీయాశ్వాసాంతమున "కథాక్రమంబతి రమ్యంబుగాను" అనియు, తృతీయాశ్వాసాంతమున "కథ రమ్యంబుగ" అనియు రమణీయ రమ్య శబ్దములు ప్రయోగించి నన్నయ తన కథా కథన సౌందర్యము పట్ల సంతృప్తిని వెల్లడించెను. నన్నయ భారతము నాంధ్రీకరింప మొదలిడిన తరువాత పౌరాణికులు సంస్కృత భారతము బదులు నన్న భారతమునే సభలలో పఠింప దొడగిరి కాబోలు. శ్రోతలు ఆయన ప్రసన్న కథాకలితార్థ యుక్తిని అరసి దాని రమ్యతను 'మేల'ని యభినందించిరి కాబోలు.

విశ్వనాథ సత్యనారాయణగారు 'నన్నయ ప్రసన్న కథా కలితార్థయుక్తి' అను గ్రంథమున పరిశీలనకు స్వీకరించిన నలోపాఖ్యానము, సౌకన్యోపాఖ్యానము, ఋష్యశృంగుని చరిత్ర ఆరణ్యపర్వము నందలివే. ఆరణ్యపర్వమున నన్నయ కథాకవిత పరిపక్వదశ నందియుండుటయే దీనికి కారణమని భావింప వచ్చును.

# ఆరణ్య పర్వము

ఆదిపర్వమందలి కథలో ఎక్కువ భాగము పాండవులకు సాక్షాత్తుగనో పరంపరగనో సంబంధించినది. సభాపర్వమున కథయంతయు వారిదే. ఆరణ్య పర్వమున వారికి సంబంధించిన కథ చాల తక్కువ. నానావిధములైన ఉపాఖ్యానములు పర్వమంతయును ఆక్రమించినవి. వీనికి ధర్మరాజు శ్రోత. నన్నయ రచించిన భాగమున కిమ్మీరవధ, జటాసురవధ, కాలకేయవధ, సౌగంధికాహరణము, కిరాతార్జునీయము పాండవులకు సంబంధించిన వృత్తాంతములు. సౌంభకాఖ్యానము శ్రీకృష్ణునకు సంబంధించినది. నలోపాఖ్యానము, అగస్త్యచరిత్ర, ఋష్యశృంగుని కథ, సౌకన్యాఖ్యానము, మాంధాత, సోమకుడు, శిబి, అష్టావక్రుడు, యవక్రీతుడు, అర్ధావసువు, సగరుడు పరశురాముడు మున్నగువారి కథలు ప్రాసంగికముగా చెప్పబడినవి. ఈ కథ లన్నింటిలో నలోపాఖ్యానము తలమానికము వంటిది. ధర్మజుని చరిత్రమునకు ప్రతిబింబ ప్రాయముగా నున్న ఈ కథను నన్నయ ప్రత్యేకమైన అభినివేశముతో 226 గద్య పద్యములలో ఒక చిన్న రసవత్ప్రబంధముగా రూపొందించెను.

నలోపాఖ్యానము చెప్పినది బృహదశ్వుడను మహాముని. ఆయన ధర్మరాజునకు ఈ కథ చెప్పుటకే వచ్చినట్లున్నది. కథ చెప్పి ఆయన వెడలి పోయెను. ఈ సందర్భమున తక్క భారతమున బృహదశ్వుని ప్రసంగము ఎచ్చటను ఉన్న జాడ కనబడదు.

ఆరణ్యపర్వమున నన్నయ వ్రాసిన భాగము మూలమున 6981 శ్లోకముల పరిమితి గలది. దానిని నన్నయ 1299 గద్య పద్యములలో వ్రాసెను. అనగా మూలమును ఇంచుమించు అయిదవ వంతునకు సంక్షేపించెను. మూలమున నలచరిత్రము 976 శ్లోకము లున్నవి. దానిని నన్నయ 226 గద్య పద్యములలో వ్రాసెను. అనగా నాలవ వంతునకు మాత్రమే సంక్షేపించెను. దీనిని బట్టి నలోపాఖ్యానమును నన్నయ కొంత విస్తరించి వ్రాసెనని స్పష్టమగు చున్నది. పాండవుల కథకు నలదమయంతుల కథకు గల అసాధారణ సాదృశ్యమే దీనికి కారణమని ఊహింప వచ్చును. ధర్మజాదుల కష్టములకు ఉపమానముగా ఈ కథ చెప్పబడినది. 'ద్వాపరంబుతో వచ్చు కలింగని" అనుటచే నలుని చరిత్ర పాండవుల చరిత్ర జరుగు చుండిన కాలమునకు మిక్కిలి సన్నిహితపూర్వ కాలముననే జరిగి

యుండవలెను. బృహదశ్వుడు ఆ కథవిని వచ్చి పాండవులకు చెప్పెను. ఎవ్వరో పురాణ పురుషుని కథకంటె అవ్యవహితపూర్వుడైన రాజన్యుని వృత్తాంతము పాండవులకు చిత్తశాంతిని ధైర్యమును కలిగింపగలదు. ఆరణ్య పర్వ మందలి కథలలో పాండవుల జీవితముతో ఇంతగా సంవదించు కథ వేఱొకటిలేదు.

నలుడు, ధర్మజుడు సత్యవ్రతులు ధర్మనిత్యుడు అక్షప్రియులే కాని అక్ష హృదయజ్ఞులు కారు. ఇరువురు ద్యూతవ్యసనాభిభూతులు, నిర్వాసితులు.

"ద్యూతార్థము తత్కృత వాహూతుడనై జూదమాడకుండుట ధర్మాపేతం బని" ధర్మజుడు జూదమాడెను. "బలవద్ద్యూతార్థముగాఁ బిలువంబడి" నలుడు జూదమాడెను. రెండింటను ద్యూతము దాయాదులకే జరిగెను. బ్రాహ్మణ వేషమున కలి పుష్కరునకు తోడ్పడెను. ద్వాపరాంశమున బుట్టిన శకుని కల్యంశ మున పుట్టిన దుర్యోధనునకు తోడ్పడెను. కలిద్వేషమే ఉభయత్ర కారణము. ఉభయత్ర స్త్రీయే కారణము. దమయంతి తన్ను వరించలేదని కలికి ద్వేషము. ద్రౌపది తన్నుజూచి నవ్వెనని దుర్యోధనునకు కోపము. రెండును కపట ద్యూత ములే. రెండింటను పునర్ద్యూతము కలదు.

రెండింటను స్వయంవరము కలదు. అర్జునిని ఉద్దేశించి ద్రుపదుడు, నలుని ఉద్దేశించి భీముడు స్వయంవరమును చాటించిరి. రెండును వ్యాజస్వయంవరములే. దాంపత్యములు పూర్వజన్మ నియతములే.

రెండింటను అరణ్యవాసము, అజ్ఞాతవాసము కలవు. అజ్ఞాతవాసమున ధర్మజునివలె నలుడును ఉక్తిచమత్కారముచే సత్యవ్రతమును ఎట్లో నిలుపు కొనును. నలునివలె అర్జునుడు వికృతరూపము పొందెను. నలుడు ఋతుపర్ణునకు చేసినట్లు అర్జునుడు ఉత్తరునకు సారథ్యముచేయును. నలుడు ఋతుపర్ణునియొద్ద అజ్ఞాతవాసము చేసినట్లు పాండవులు విరాటునియొద్ద చేయుదురు. నలుడు వంటల వాడు. భీముడును వంటలవాడు. నలునివలె నకులుడు అశ్వశిక్షకుడు.

దమయంతి కిరాతపీడితయైనట్లు ద్రౌపది కీచకపీడిత యగును. ఇంద్రసేనా దులు విదర్భకు పంపబడినట్లు ప్రతివింధ్యాదులు పాంచాలమునకు పంపబడుదురు. దమయంతి నలుడు చింపుకొనిపోగా మిగిలిన మలినార్ధ వస్త్రము ధరించి సునందా దేవికడ సైరంధ్రీవృత్తము నడపును. ద్రౌపది దుశ్శాసనుడు ఆకర్షించి త్రెంపగా మిగిలిన కురులను ముడువక సుదేష్ణకడ సైరంధ్రిగా నుండును.

రెండింటను వస్త్రాపహరణము కలదు. అక్షములు పక్షుల రూపమున వచ్చి నలునివస్త్ర మపహరించెను. దుశ్శాసనుడు సభలో ద్రౌపదివస్త్ర మపహరించెను. రెండింటను ఏకవస్త్రధారణము కలదు.

జ్ఞాతిప్రీతిచే నలుడు పుష్కరుని క్షమించును. ధర్మజుడు దుర్యోధనుని క్షమించును, విజయసాధనముగా నలుడు అక్షహృదయము సంపాదించును. అర్జునుడు పాశుపతము సంపాదించును.

ఇన్ని సామ్యములతోపాటు ఉపమానమైన నలచరిత్రయందు ఉపమేయమైన పాండవ చరిత్రకంటె కొన్ని విశేషములును గలవు. పాండవుల వనవాసము అజ్ఞాతవాసము సమయబద్ధములు. నలునివి ఐచ్ఛికములు. అభిమానవశమున ఆయన కొనితెచ్చుకొన్నవి. పాండవులు అరణ్యాజ్ఞాతవాసములు ద్రౌపదీసహితులై గడపిరి. నలదమయంతులు వియుక్తులైరి. ద్రౌపదికి పతుల రక్షకలదు. దమయంతి నిరాశ్రయ. పాండవుల అజ్ఞాతవాస మొక్కయేడే. నలునిది మూడేండ్లు. పాండవుల కష్టమునకు పదుమూడేండ్లని అవధి కలదు. నలదమయంతుల కష్టమునకు అట్టి యవధిలేదు. పాండవులకు, ద్రౌపదికి లేని శాపానుగ్రహశక్తులు నలదమయంతులకు కలవు.

తమకంటె మహిమాన్వితులైన వ్యక్తులే తమకంటె కఠోరములైన కష్టముల ననుభవించిరి అని యుపదేశించి తన్మూలమున పాండవులకు ద్రౌపదికి చిత్తోపశాంతిని కలిగించుటయే కాక ఈ నలోపాఖ్యానము పాండవులకు అజ్ఞాతవాస నిర్వహణమునకు చక్కని ఉపాయములనుగూడ సూచించుచున్నది. వ్యాసమహర్షి ఈ కథను విస్తరించి వ్రాయుటలోని తాత్పర్యమును గ్రహించియే నన్నయ దీనిని హితోపదేశజనకమైన రసవత్కావ్యముగా రూపొందించెనని భావింపవచ్చును.

నన్నయగారి రచన రత్నగర్భమైనదని చెప్పి విశ్వనాథ సత్యనారాయణ గారు అనర్ఘములైన మహారత్నములను పైకితీసి ప్రదర్శించి యుండిరి. కాని ఉపరితలమున తెట్టెలుగట్టియున్న ముత్యములను పగడములను పట్టిచూపుపని వారు పెట్టుకొనలేదు. పెట్టుకొన్నచో నదియొక గ్రంథము పట్టును.

## అనువాద విధానము

సంక్షేపించుట, విస్తరించుట, అన్యథాకరించుట, పరిహరించుట, నూత్నముగా కల్పించుట నన్నయ ఆంధ్రీకరణలక్షణములు. సంక్షేపించుట, పరిహరిం-

చుట కథకు నిబిడత్వము కథనమునకు ప్రౌఢత్వము సంపాదించుటకు విస్తరించుట, కల్పించుట రసభావముల పోషణకు, అన్యథాకరించుట ఔచిత్యమునకు. ఇతిహాసమును కావ్యముగా రూపొందించుటకు ఈ విధానము సర్వథా యోగ్యమైయున్నది. నన్నయ అనువాద పద్ధతిని ఆచార్య దివాకర్ల వేంకటావధానిగారు సోదాహరణముగా విస్తరించి నిరూపించి యున్నారు. ఇచ్చట దిఙ్మాత్ర ముదాహరణము.

నలోపాఖ్యానమునకు అవతారిక మూలమున నిట్లున్నది.

ఆశ్వస్తం చైన మాసీన ముపాసీనో యుధిష్ఠిరః
అభిప్రేక్ష్య మహాబాహుః కృపణం బహ్వభాషత.
అక్ష్య ద్యూతేచ భగవన్ ధనం రాజ్యంచ మే హృతమ్.
ఆహూయ నికృతిప్రజ్ఞైః కితవైరక్షకోవిదైః.
అనక్షజ్ఞస్య హి సతో నికృత్యా పాపనిశ్చయైః,
భార్యాచ మే సభాం నీతా ప్రాణేభ్యోఽపి గరీయసీ.
పునర్ద్యూతేన మాం జిత్వా వనవాసం సుదారుణం,
ప్రావ్రాజయన్ మహారణ్య మజినైః పరివారితం,
అహం వనే దుర్వసతీర్వసన్ పరమదుఃఖితః,
అక్షద్యూతాధికారేచ గిరః శృణ్వన్ సుదారుణాః,
ఆర్తానాం సుహృదాం వాచో ద్యూతప్రభృతి శంసతామ్,
అహం హృది శ్రితాః స్మృత్వా సర్వరాత్రీర్విచింతయన్.
యస్మింశ్చైవ సమస్తానాం ప్రాణా గాండీవధన్వని,
వినా మహాత్మనా తేన గతసత్త్వ ఇవాభవం.
కదా ద్రక్ష్యామి బీభత్సుం కృతాస్త్రం పునరాగతం,
ప్రియవాదిన మక్షుద్రం దయాయుక్తమ తంద్రితః.
అస్తిరాజా మయా కశ్చిదల్ప భాగ్యతరో భువి,
భవతా దృష్టపూర్వో వా శ్రుతపూర్వోఽసి వా క్వచిత్
న మత్తో దుఃఖితతరః పుమానస్తీతి మే మతిః,

దీనికి నన్నయ అనువాదము.

"విశ్రమించియున్న యమ్మునివరునకు ధర్మతనయుం డధర్మపరులైన పరుల చేతం దమపడిన నికార ప్రకారంబంతయు నెఱింగించి యిట్లనియె

క. పుడమియు రాజ్యము బంధుల
విడిచి మృగావలులఁ గలసి, విపినంబులలోఁ
గడుకొని మాయట్లిడు మలఁ
బడిన నృపులు గలరె యొరులు ? పరమ మునీంద్రా !'

ధర్మరాజు మితభాషి. ఆయన తన కష్టములనుగూర్చి దీర్ఘోపన్యాసము చేయుట పునరుక్తి యగుటయే కాక ఆయన యుదాత్తతకు భంజకము కూడ అగుచున్నది. అనువాదమున సంక్షేపణ విధానము నవలంబించి నన్నయ పునరుక్తి పరిహారణముతో పాటు పాత్రపోషణమును కూడ సాధించెను. మూలమున కృపణుడు బహుభాషి, స్వదుఃఖదుఃఖితుడు అయిన ధర్మరాజు అనువాదమున ధీరోదాత్తుడు. గంభీరుడు, పరదుఃఖదుఃఖితుడు అయినాడు, మూలమందలి "మత్తః" అనుమాటను మాయట్లు అనియు 'న అస్తి ఇతిమేమతిః' అను వ్యతిరేక నిశ్చయార్థకవాక్యమును "నృపులు కలరె యొరులు" అను ప్రశ్నార్థక వాక్యముగను మార్చి నన్నయ ధర్మజుని శీలమునకు మెఱుగుపెట్టెను. ఈ ప్రశ్నను ధర్మజుడు స్వీయదుఃఖోపశాంతికై కాక ద్రౌపదీ భీమసేనాదుల క్రోధోపశాంతికై అడిగినట్లై ఆయన గడుసుదనము వ్యక్తమైనది.

తన అంతఃపురమున ప్రవేశించిన నలుని జూచి దమయంతి ఇట్లన్నదని మూలము—

'కస్త్వం సర్వానవద్యాంగ ! మమ హృచ్ఛయ వర్ధన !'

దమయంతి నలునిపై మనస్సు నిలిపియున్నది. ఆతనికొఱకే స్వయంవరము ఏర్పాటై యున్నది. ఇప్పుడు తన యంతఃపురమున ప్రవేశించిన వాడెవ్వడో ఆమె యెఱుగదు. ఆతనిని 'మమహృచ్ఛయవర్ధన' అని సంబోధించుచున్నది. ఇది యనుచితము. ఇది యొక గ్రంధి. నన్నయ్య ఈ గ్రంధిని విప్పికొనెను. నలదమయంతులు పూర్వజన్మమున ఆహుకులు అను భిల్లదంపతులు. శివుడు వారి తపస్సునకు మెచ్చి ఉత్తరజన్మమున వారు నలదమయంతులై జన్మింతు రనియు, తాను వారికి సంయోగము ఘటింతుననియు వరమిచ్చెను. నానాపురాణ విజ్ఞాన నిరతుడైన నన్నయ శివపురాణాంతర్గతమయిన ఈ గాథను స్మరించి నలోపాఖ్యానమును తదనుగుణముగా పరిష్కరించెను. మొదటి నుండియు కథను అట్లే నడిపెను.

'స దదర్శ తతో హంసాన్ జాతరూప పరిష్కృతాన్
వనే విచరతాం తేషా మేకం జగ్రాహ పక్షిణామ్'

అన్న మూలమును.—

'అంతరిక్షకాంతాహారావలియుంబోలె హంసావళి యవనీతలంబున కవత రించిన'

'వీరసేనసుతుఁడు వీరుండు హంసల
నడబెడంగుఁజూచి నగుచు వాని
నెగచి యెగచి యందు నెగయకుండఁగ నొక్క
హంసఁబట్టుకొనియె నతిరయమున'.

అని నన్నయ యనువదించెను. "అవతరించిన" అను శబ్దముచే ఆ హంస సామాన్య హంస కాదనియు, హంస రూపము ధరించి వచ్చిన ఈశ్వరు డనియు నన్నయ సూచించెను.

"దమయంతికి నలునకు సంగమ కారణదూతయైన కల హంస"

అని తరువాత ఈ యంశమును తేట పఱిచెను. మూలమందలి హంస జాతరూప పరిష్కృతము. రూపవైచిత్రిచే అది నలుని దృష్టినాకర్షించెను. నన్నయ హంసలు శారదాభ్రశకలములవంటివి. దమయంతీ గతచిత్తుడైన నలునకు ఆ హంసలబారు అంతరిక్ష కాంతాహారావళి వలె కనపడినది. వాని నడబెడంగులందు దమయంతి నడబెడంగులు కనబడినవి. అతడు నవ్వుకొనుచు వానిని బెదరగొట్టెను. అన్నియు ఎగిరిపోయినవి కాని ఒక్క హంసమాత్రము ఎంత ఎగచినను ఎగయలేదు. నలుడు దానిని పట్టుకొనెను. అదియేల ఎగురలేదు ? సంగమకారణ దూతయై హంసరూపమునవచ్చిన పరమేశ్వరుడు గనుక. ఆ హంస నలునితో—

"దమయంతీ సకాశే త్వాం కథయిష్యామి నైషధ !"

అని పలికినట్లు మూలము. నన్నయ "నీ హృదయేశ్వరియైన దమయంతి పాలికింబోయి" అని వ్రాసెను. దమయంతి నలుని హృదయేశ్వరి అని హంసకెట్లు తెలిసెను. అది కారణజన్మమైన హంసము గనుక. మూలమున—

"సా తా నద్భుత రూపాన్వై దృష్ట్వా సఖిగణావృతా,
హృష్టా గ్రహీతుం ఖగమాం స్త్వరమాణోపచక్రమే.
అథ హంసా విససృపుః సర్వతః ప్రమదావనే,
ఏకైక శ స్తదా కన్యాస్తాన్ హంసాన్ సముపాద్రవన్.
దమయంతీతు యం హంసం సముపాధావ దంతికే,
స మానుషీం గిరం కృత్వా దమయంతీ మథా బ్రవీత్"

అని హంసల యద్భుతరూపమును జూచి హర్షించి దమయంతి తానే త్వరపడి యొకదానిని పట్టుకొనుటకు పరువిడినట్లున్నది. నన్నయ ఆ హంసలు ఉపవనమున సఖీపరివృతమై యున్న దమయంతి యంతికమున విహరించుచుండగా వానింజూచి పరమకౌతుకమున

"ఒండొరులఁ గడవంగ నయ్యువిదలెల్లఁ
బఱచి యొక్కొక్క కలహంసఁ బట్టికొనఁగఁ
జెలువముగ నందు దమయంతిచేతఁ బట్టు
వడియె నలుచేత విడువంగఁబడిన హంస."

అని ఆ హంస తానై బుద్ధిపూర్వకముగాఁ బట్టువడెనని వ్రాసెను. ఇదియు ఆ హంస కారణజన్మమని సూచించుటకు చేసిన మార్పే. దమయంతి పట్టుకొనఁబోయిన హంస నలుడు విడిచిపెట్టినదే యనుట కంటె నలునిచే విడువఁబడిన హంసయే దమయంతిచేత పట్టుబడెననుట వల్ల ఆ హంస నలదమయంతులకు సంగమ కారణ దూతయై వచ్చెనని సువ్యక్తమగును. ఇచ్చట కూడ మూలమున—

"దమయంతి నలోనామ నిషధేషు మహీపతిః,"

అని హంస ఆరంభించును. నన్నయ హంస నలునియొద్దవలెనె దమయంతి యొద్ద కూడ తన కారణజన్మకు తగినట్లు "నీ హృదయేశ్వరుండైన నలుని యొద్దనుండి వచ్చితి" నని చెప్పును. హంస దౌత్యమున ఈ యంశము గమనింపబడినచో మూలమందలి " మమహృచ్ఛయ వర్ధన !" అన్న సంబోధనయు, నన్నయవ్రాసిన

"నాకు మనోజ వేదనా వివర్ధనుండవైన"

అన్న వాక్యమును అనౌచిత్య దూరములగును. నలదమయంతులు జన్మాంతర దాంపత్య సంస్కారముతో జన్మించిరను రహస్యమును నిరూపింపదలచియే నన్నయ ఇట్లు రచించెను "పతివాయనో పడాలలన నుదీర్ణ సౌహృదబలంబున" అని నన్నయ

నలుడు దమయంతిని వనమున వీడిపోజాలని స్థితిని వర్ణించెను. నన్నయ చెప్పిన ఉదీర్ణసౌహృదబలము కాళిదాసు చెప్పిన 'జననాంతర సౌహృదాని' వంటిది.

అగస్త్యుడు లోపాముద్రను పెండ్లాడి ఆమెను తీసికొనిపోయి గంగాద్వారమున తపస్సు చేయుచుండెను.

"తతో బహుతిథేకాలే లోపాముద్రాం విశాంపతే
తపసా ద్యోతితాం స్నాతాం దదర్శభగవానృషిః.
స తస్యాః పరిచారేణ శౌచేన చ దమేనచ,
శ్రియా రూపేణ చ ప్రీతో మైథునా యాజుహావ తాం."

అని మూలమునందున్న దానిని నన్నయ—

"నీచ తరనాభిఁ జపలవి
లోచనఁ బృథుజఘన చక్రలోపాముద్రం
జూచి మునీంద్రుఁడు మన్మథ
గోచరుఁడై దానిఁ బ్రీతిఁగూడఁగఁ దివిరెన్.

అని లోపాముద్రాచిత్రమును దిరుగవ్రాసి అగస్తునివంటి మహర్షిని మన్మథగోచరుని కావించుటకు సర్వథా సమర్థమైన విభావమును రూపొందించెను. "మైథునా యాజుహావతాం" అన్న గ్రామ్యార్థమును "కూడఁగఁదివిరెన్" అని సుకుమారముగావించెను.

అప్పుడు లోపాముద్ర—

"ఇచ్ఛామి త్వాం స్రగ్విణం చ భూషణైశ్చ విభూషితం
ఉపసర్తుం యథా కామం దివ్యాభరణభూషితా.
అన్యథా నోపతిష్ఠేయం చీరకాషాయవాసినీ"

అనిపలికినట్లు మూలము. ఇట్లనుట లోపాముద్ర పాతివ్రత్యమునకు మచ్చయగునని నన్నయ "అన్యథా నోపతిష్ఠేయం" అనుమాటను తొలగించెను.

అర్జును డమరావతికేగినప్పుడు దేవేంద్రుని పనుపును అచ్చరలు నాట్యగానములు ప్రదర్శింతురు. అర్జునుడు ఊర్వశియందు చూపునిలుపుట గుర్తించి యింద్రుడు చిత్రసేనునితో రహస్యముగా అర్జునుని సంతోషపెట్టుటకై ఊర్వశిని

పంపుమని చెప్పును. ఇంద్రుడీపనిచేయుట అనుచితముగా నుండునని ఈ సన్నివేశ మును వర్ణించు పదునారు శ్లోకముల అధ్యాయమును నన్నయ విడచివైచెను. "నిలింపపతిపంపున సొంపార నూర్వశి యర్జునసమాగను కాంక్షంజేసి" యని యింద్రుని పంపుననే ఊర్వశి వెళ్ళినట్లు నన్నయ సూచనచేసెను కాని అర్జునుని నిగ్రహమును పరీక్షించుటకై యింద్రుడు ఊర్వశిని పంపియుండు నన్నభావము సహృదయులకు తోచునట్లు సన్నివేశమును నిర్వహించెను. ఈ సందర్భమున ఊర్వశి జ్యోత్స్నాభిసరణమును నన్నయ మృదుమధురమైన శైలిలో రమణీయ ముగా చిత్రించెను. ఈ ఘట్టమునందలి రెండువచనములు ఆయన యక్షరరమ్యతకు లక్ష్యప్రాయములు. ఊర్వశి యభిసారికా మూర్తి అర్జునుని ఇంద్రియ నిగ్రహము నకు గీటురాయిగా నుండునట్లు నన్నయ చిత్రించెను. అట్టి రత్యుద్దీపక సామాగ్రికి చలింపని అర్జునుని—

"నీ యింద్రియజయము కీర్తనీయము తండ్రీ"

అని యింద్రునితో పాటు సహృదయుడును కీర్తించును.

అగస్త్యుడు వాతాపిని మ్రింగినంతనే ఇల్వలుడు యథాప్రకారము తమ్ముని పిలుచును. అప్పుడు—

"తతో వాయుః ప్రాదురభూదదగస్త్య మహాత్మనః
శబ్దేన మహతా తాత! గర్జన్నివ యథాఘనః"

అని యగస్త్యుడు అపానవాయువు విడిచినట్లు మూలమున చెప్పబడినది. ఇది జుగుప్సా కరముగా నుండునని నన్నయ—

"కడుపుఁ దడవికొనుచు గ్రున్నఁద్రేఁచిన
నసుర జీర్ణమయ్యెనాక్షణంబు"

అని అన్యథాకరించెను.

నన్నయ యనువాదవిధానమంతయు ఇట్లే ప్రాచీనమైన ఇతిహాస వస్తువును సుందరమైన కావ్యవస్తువుగా పరిష్కరించుట ఉచితమైన మార్గమున నడచినది.

## వర్ణనలు

నన్నయవర్ణనలు పరిమితములయ్యు పటుత్వముగలవై యుండును. నన్నయ దృష్టి ప్రధానముగా కథనప్రౌఢిమీదనే యున్నను ఆకథను రసవంతము చేయుట

యందును ఆయనకు తాత్పర్యము గలదు. తానుజగద్ధితంబుగా భారతసంహితారచన బంధురుఁడనైతినని ఆయనయే చెప్పుటవల్ల భారతరచనచే లోకమునకు ఆయన ప్రధానముగా కలిగింపదలచినది వ్యుత్పత్తియే యనిభావింపవచ్చును. అనుషంగిక ఫలముగా రసానందమును కూడ ఉద్దేశించుటవల్లనే ఆయన ఆలంబనోద్దీపన తటస్థ విభావములను జడసాత్త్వికాను భావములను నన్నయ పెక్కుపట్ల ఎంతోనిపుణ ముగా వర్ణించెను. కిరాతార్జునీయ ఘట్టమున అర్జునునకు ప్రత్యక్షమైన పరమేశ్వరుని రూపము.

వరదుఁడు పార్థుశౌర్య విభవంబున కాతని ధైర్యవృత్తిక
ప్డరుదుగ మెచ్చి సన్నిహితుఁడయ్యె జటామకుటేందురేఖయుం
గరమున శూలమున్ గరళకాలగళంబు బృహద్గజాజినాం
బరముఁ దృతీయలోచనముఁ బన్నగహారము నొప్పుచుండఁగన్.

ఇది నేత్రప్రత్యక్ష విషయమైన పరమేశ్వరుని మూర్తి. ఈ మూర్తి నిర్మాణ మందలి సర్వాంశములు నేత్రగ్రాహ్యములే యగుట నన్నయ ఆలంబన విభావర్ణనా నైపుణి.

దమయంతి అంతఃపురము ప్రవేశించి ఆమెకు మనోజవేదనా వివర్ధనుండైన నలునిమూర్తి—

దమయంతి మనోభవ విభు
న మరేంద్రప్రతిము దినకరాభు సుధారు
క్సము వరుణసదృశు ధనదో
పము నశ్విసమాను నిషధపతిఁజూచి నలున్

ఇంద్రాదుల దూతయై వచ్చిన నలునియందు లోకపాలాదుల అనుభావ సర్వస్వము రూపుకట్టించి నన్నయ దమయంతి లోకపాలురను తిరస్కరించి నలునే వరించునన్న భావివృత్తాంతము విభావవరర్ణనముచేతనే చక్కగా సూచించెను. సౌగంధికాహరణార్థ మరుగుచుండిన భీముని వర్ణన—

గమనవేగంబున ద్రుమలతాజాల సంచాలనసేయుచు శైలగుహల
నడఁగి యదృశ్యులై కడువేడ్కతోఁదన్నుఁజూచు ఖేచరసిద్ధసురభుజంగ
గరుడగంధర్వ కిన్నర కామినులచేత మానుగా నభివీక్ష్యమాణుఁడగుచు

ప్రాఁకులు విఱుచుచు వీఁకతో దీవలఁ బెఱుకుచుఁబదహతిఁబృథునగేంద్ర

మద్రువ నున్నతంబులయి నెడలెక్కఁచు

మదగజంబువోలె మధ్యముండు

పవన వైనతేయ పటుజవయుక్తుఁడై

యరిగె గంధమాద నాంతరమున.

"మదగజంబువోలె మధ్యముండు" అను ఉపమానమునకు కావలసిన సామగ్రి యంతయు పద్యమున నిపుణముగా సమకూర్చబడినది. ఈ పద్యము తరువాతి వచనమున 'ఒక్కసరోవరంబు గని యందుఁ గృతావగాహుండై నవనలినదళ మృణాళవలయాలంకృతుఁ డగుచు దాని వెలువడి యనేక యోజన విస్తారాయామ రమణీయంబైన కదళీషండంబుఁ జొచ్చి యందు శంఖధ్వానంబుఁజేసిన' అని పద్యమున వాచ్యము చేయబడిన వనగజసామ్యము రమణీయముగా వ్యంగ్యము చేయబడినది. ఈ విధముగా పాంచాలీప్రియకరంబయిన పరాక్రమ మాచరింపబోవు ప్రియసాహసుడైన భీముని చేష్టలయందు అంతర్వాహినిగ వన్యమదగజచేష్టా విశేషములను భాసింపజేయుచు మదగజసామ్యమునుకొనలు సాగించుట మహాకవియైన నన్నయ దర్శనైక్యమును ప్రదర్శించును.

కదళీషండ మధ్యమున నొక్క శిలాతంబున శయనించియున్న హనుమంతుని మూర్తి—

హ్రస్వపీనగ్రీవు, నచలితాయత హను

నతి చపల స్వభావాభిరాముఁ

దను మధ్యకటిచక్రు, దహన కణాకార

తామ్రోష్ఠు, నతికృశదశన కరజుఁ

బృథుల విద్యుత్పుంజ పింగాక్షు, నుత్తుంగ

దృఢవక్షు, నాజానుదీర్ఘ బాహు

నూర్ధ్వలాంగూల మత్యున్నత ధ్వజలీలఁ

గ్రాలుచునుండ నేకాంతయోగ

నిద్రనున్న ధర్మనిర్మలు, హనుమంతుఁ

జూచి పాండురాజ సుతుఁడు వాని

నిద్రఁజెఱుపఁగడఁగి నిజసత్వ మేర్పడ

సింహనాద మొప్పఁజేసె దాసి

విశాల శిలాతలమున శయనించిన ఈ మూర్తి సామాన్య కపిమూర్తి కాదు. 'విశాల శిలాతల' శబ్దముచే ఆ కపి అసాధారణమూర్తి గౌరవము కలది యని సూచింప బడినది. మదగజమువలె విజృంభించుచున్న భీమునిదృష్టి నాకర్షించి నిద్రాభంగము చేయవలెనన్న చిలిపియూహ ఆతనికి కలిగించుటకు సమర్థమైన అసాధారణమూర్తి.

పాండవులతో నొడంబడి యుండుమని హితవు చెప్పిన మైత్రేయుని పలుకు లాదరింపక దుర్యోధనుడు 'పాదాంగుష్ఠంబున నేల వ్రాయుచు బాహువెత్తి తొడలు నటచి నగు' చుండుట—

కేశిని దమయంతి విరహావస్థను వర్ణింపగా విని బాహుక రూపముననున్న నలుడు 'అవిరళోద్గత బాష్పపూర్ణంబులైన లోచనంబు లెఱుకపడకయుండ వదన పద్మంబు వాంచి తానొండువలను చూచుచుండుట—

భీముడు నిద్రాభంగము చేయగా హనుమంతుడు 'మెల్లమెల్లన మేల్కని జృంభసంభృత జలార్ద్రసంచల విలోచనుండగుచు ననాదరంబున' భీముని జూచుట—ఇత్యాదులు చక్కని గాత్రారంభానుభావాళినయ వర్ణనలు.

అమరావతికి వచ్చి తనకు మ్రొక్కిన అర్జుని అర్ధాసనమున గూర్చుండ బెట్టుకొని దేవేంద్రుడు ఉపలాలించునప్పటి వాత్సల్యవ్యంజక చేష్టావిశేషమును నన్నయ సహజముగా చిత్రించెను.

> లీలైరావతకుంభా
> స్ఫాలన కర్కశకరములఁ బలుమరును మరు
> త్పాలకుఁ డంటుచునుండె గు
> ణాలంకృతుఁడైన పార్థునంగముఁ బ్రీతిన్.

ఈ వర్ణనమున కాళిదాసు కుమారసంభవమున చేసిన—

> "ఐరావతాస్ఫాలన కర్కశేన హస్తేన పస్పర్శ తదంగమింద్రః"

అన్న వర్ణనమును జీర్ణము చేసికొన్న సంస్కారము గోచరించుచున్నది.

తననివాసమైన యరణ్యమునకు వచ్చిన వారు ధర్మజభీమాదులని తెలిసిన కిమ్మీరుడు 'ఎట్టెట్టు! భీముండె యీతఁడేమి పుణ్యమొ! వీని నెప్పుడు సంపఁ గాంతునో యని యున్నచోఁ దాన యరుగుదెంచె' ననుట—

సౌంభకముతో ద్వారవతిపై నెత్తివచ్చి సాళ్వుడు 'ప్రతినరపాలకాలు శిశుపాలు బలాధికుఁ జంపి దర్పసంహితుఁడగుచున్న వృష్ణిఖలుఁ డెక్కడనెక్కడ'ననుట—

తాను ధిక్కరించి యెదిరించినది పరమేశ్వరునని గుర్తించి పశ్చాత్తప్తుడై అర్జునుడు 'నన్నున్ గలకంఠాక్షమింపుము' అని వేడుటయు—

హనుమంతుని పూర్వరూపమును దిలకించి అతివిస్మితుడై భయముతో భీముడు 'అతిభీషణ మిది యత్యద్భుతమోహో ! చాలు భూనభోమధ్యవ్యాపితమయ్యె భవద్దేహాయతత్త్వముపసంహరింపు' మనుట—

ఇత్యాదులు రసవ్యంజ్యకములైన వాగారంభానుభావ వర్ణనములు.

నలదమయంతుల విరహావస్థావర్ణనమున నన్నయ రమ్యమైన శిల్పమును ప్రదర్శించెను. జనులు ఒకరి గుణముల నింకొకరి యొద్ద వర్ణింపగా వారియెదలలో మనోభవవికార విభ్రమము వెలసెను. హంస ఒకరి రూపము నింకొకరి యొద్ద వర్ణింపగా వారు అనోన్యరూప గుణశ్రవణ సంజాతప్రీతులై విరహసంతప్తులగుచుండిరి. పారస్పరికమై ఉభయనిష్ఠమైన ఆ మదనతాపమును నన్నయ యొక చంపకమాలయందు వర్ణించెను.

> నలదమయంతు లిద్దఱు మనః ప్రభవానల బాధ్యమానులై
> సలిపిరి దీర్ఘవాసరనిశల్ విలసన్నవ నందనంబులన్,
> నలినదళంబులన్, మృదుమృణాళములన్ ఘనసారపాంసులన్
> దలిరుల శయ్యలన్, సలిలధారలఁ జందన చారు చర్చలన్.

ఈ పద్యమునందలి 28 గురువులలో 11 మాత్రమే దీర్ఘములు. తక్కినవి వ్యంజనాంత హ్రస్వములు. కాఁగా పద్యగతి మిక్కిలి ద్రుతమైనది. క్షణవిలంబనమును సహింపని రతిత్వర యక్షరవృత్తియందు చక్కగా నిర్వహింపబడినది. నలదమయంతుల మదనానల తాపమును ఏకవృత్తమున వర్ణించి నన్నయ వారి పరస్పరానురాగ సాదృశ్యమును విరహతాప సాదృశ్యమును జక్కగా వ్యంజించెను. "మనః ప్రభవానల" మన్న యక్షరసంపుటి యందలి విసర్గ పరక గురుత్వమున జగణము అత్యంతము ఉచ్చము, దీప్తమునై విరహానలోద్రేకమును రూపు కట్టించుచున్నది. అయినను ఈ సంతాపము మధురమైనది. కనుక పద్యమంతటను సరళానునాసికాక్షరములు నళినదళములవలె కప్రపుఁబలుకులవలె, చివురు గుత్తులవలె, శీతల జలకణములవలె వెదజల్లబడి సౌకుమార్య మాధుర్యములు వెలార్చుచున్నవి

ప్రకృతి వర్ణనములందును నన్నయ నైపుణి కొనియాడదగినది. పాండవులు గంధమాదన పర్వతము చూచుట—

నానావర్ణ శిలావిహ
గానేక మృగాభిరామమై భూనారీ
నానా భరణ విభూషిత
పీనోన్నతకుచమువోలె వెలిగెడు దానిన్.

ఈ వర్ణనమున కాళిదాసుని ఆమ్రకూట పర్వత వర్ణన అనుకరణము కనబడుచున్నది. అనుకరణముతోపాటు నవీకరణమును కనబడుచున్నది

ఛన్నోపాన్తః పరిణత ఫలద్యోతిభిః కాననామ్రైః
త్వయ్యారూఢే శిఖరమచలః స్నిగ్ధవేణీసవర్ణే
నూనం యాస్యత్యమరమిధున ప్రేక్షణీయా మవస్థాం
మధ్యే శ్యామః స్తన ఇవ భువః శేషవిస్తార పాణ్డుః.

ఆకాశమందున్న అమరమిధునములకు ఆమ్రకూటము భూదేవి స్తనము వలె నగపడినది. అంత యెత్తున నున్నవారికి ఆ విధముగా నగపడుట అతి సహజము. పాండవులకు గంధమాదనము భూనారీ స్తనమువలె నగపడిన దనగా వారును ఆకాశము నుండియే ఆపర్వతమును చూచుచుండవలెను. అట్లే చూచుచుండిరని నన్నయ సూచనచేసెను. భూమార్గమున గంధమాదనమునకు పోవుట శక్యము కాదని తెలిపి రోమశుడు 'అతుల తపోవీర్యబలోన్నతిఁ బోదము గంధమాదనంబునకు' అనెను. కనుక పాండవులు రోమశుని తపోబలముచే గగనమార్గముననే వచ్చి గంధ మాదనంబును గాంచిరి. నన్నయ వర్ణనము సుసంగతము సుందరము నైనది. పాండవులు గగనమార్గమునుండి దిగుచు కొంతచేరువకు రాగా గంధమాదనము ఎట్లగపడినదో నన్నయ మరల వర్ణించెను.

లలితాచ్ఛ స్ఫటికశిలా
తలములపైఁబాఱు విమలతర నిర్ఝరిణీ
జలపూరములను తారో
ల్లల దురుహారాళి నుజ్జ్వలంబగు దానిన్.

దూరము నుండి నానా భరణ విభూషిత మైన స్తనముగా కనబడిన పర్వతము చేరువకు రాగా స్ఫటికశిలలపైఁ బ్రవహించు విమల నిర్ఝరములనెడు తారహార

ములచే నలంకృతమైన స్తనముగా కనబడినది. ఇచ్చట నన్నయ ప్రదర్శించిన సుకుమార పరిశీలనము, దర్శనైక్యము కాళిదాసుని తలపించుచున్నది.

పాండవులు గంధమాదనము నందుండగా వర్షర్తువు ప్రారంభమయ్యెను. ప్రథమవర్ష ప్రచండతను నన్నయ 'కురిసెఁ బ్రచండవృష్టి' అను పద్యమున చక్కగా వర్ణించెను. సౌగంధికాపహరణార్థ మరుగుచు భీముడు జలధర ద్విరద తతులచే ఆవరింపబడియున్న గంధమాదన శృంగములను దిలకించి ఆశ్చర్యపడుట నన్నయ సాలంకారముగా వర్ణించెను.

'ఆషాఢస్య ప్రథమదివసే మేఘమాశ్లిష్టసానుం
వప్రక్రీడా పరిణత గజప్రేక్షణీయం దదర్శ'

అన్న కాళిదాసుని వాక్యము చిత్తమున మెఱసెను గాబోలు. నన్నయ ఆదృశ్యము నిట్లు వర్ణించెను—

వారిధారల, ననివారిత నిర్గళ
దానధారలఁ దటిద్దామములను
దళనధామంబుల, నశని ఘోషంబుల
ఘోర బృంహిత బృహద్ఘోషణముల
నివి ఘన బృందంబు లివి గజయూథంబు
లని విచారింపంగ నక్కజంబు
లై లలితోత్తుంగ శైల శృంగంబులఁ
గ్రిమ్మరు జలధర ద్విరదతతుల

విస్మయంబుతోడ వీక్షించుచుం జని
రజతగిరి సమీప రమ్యభూమి
నక్కుబేరు వనమునందు సౌగంధిక
కమలవనముఁ గనియె ఘన భుజుండు.

కవిలోక ప్రసిద్ధమైన జలధరద్విరద సాదృశ్యమునకు నన్నయ చక్కని రూపకల్పనము చేసెను. కాళిదాసుని శ్లోకమున మేఘము ప్రకృతము, గజము అప్రకృతము. ఇచ్చట రెండును ప్రకృతములే, రెండును ప్రత్యక్షములే. భిన్నము లయ్యు అభిన్నములుగా నగలడి విస్మయజనకము లగుచున్నవి. విస్మయజనకమైన

సాదృశ్యము సాధించుటకు నన్నయ జలధర, ద్విరద శబ్దములను గ్రహించి సమాన ధర్మములను సమగ్రముగా రూపించెను ఈ వర్ణనమున నన్నయ అతికాళిదాసమైన చాతుర్యమును ప్రదర్శించెనా యనిపించుచున్నది.

## రుచిరార్థ సూక్తులు

వేదశాస్త్రార్థముల ఉపబృంహణము వలననే పాండవుల ఇతిహాసమునకు పంచమవేదత్వమహత్త్వము సిద్ధించినది. వేదార్థములు శాస్త్రార్థములు పాండవుల ఇతిహాసమున యథావకాశము సూత్రప్రాయములైన వాక్యములలో పొదుగబడియున్నవి. భారతము 'లోకాగమన్యాయైకాంతగృహము' అని చెప్పిన నన్నయ ఆ న్యాయములను ప్రతిపాదించు వాక్యములను సూక్తులు అని వ్యవహరించినట్లు తోచును. వేదశాస్త్రములందు వాచ్యార్థ ప్రధానమై శుష్కములుగా నుండు సూక్తులు పురాణేతిహాసములందు లక్ష్యార్థ ప్రధానములై కొంత చమత్కారము సంతరించుకొన్నవి. కాంతా సమ్మితములైన కావ్యములందవియే రుచిరార్థములై హృదయంగమములగును భారతము శాస్త్రము, ఇతిహాసము, కావ్యమునని చెప్పబడినది. కనుక అందలి సూక్తులు ఈ త్రివిధలక్షణములుగలవై యుండును. ఈ సూక్తులకు అలంకరించియు, అలంకారములుగా రూపొందించియు వానిని నన్నయ రుచిరార్థవంతములుగా తీర్పుటకు యత్నించెను.

"క్రోధంబు పాపంబు" అనుట శాస్త్రఫక్కి. 'క్రోధంబుననచేసి యగుఁజువ్వే ధర్మకామార్థహాని' అనుట ఇతిహాసఫణితి. "క్రుద్ధుండు గురునైన నిందించు" అనుట కావ్యభంగి.

'క్రోధంబు పాపంబు' అనుట ప్రభుసమ్మితమైన శాసనము. 'క్రోధంబునన చేసియగుఁజువ్వే ధర్మకామార్థహాని' యనుట మిత్రసమ్మితమైన హితబోధ. భీముని క్రోధము పాండవులకు సర్వవిధముల హానికరమని బోధించుట. క్రుద్ధుండు గురువైన నిందించు ననుట కాంతాసమ్మితమైన ఉపదేశము. కౌరవులపట్ల క్రోధావేశము పూని భీముడు గురువైన ధర్మజుని క్షమాగుణమును అధిక్షేపించుచున్నాడని వ్యంగ్యముగా మందలించుట.

'ఎఱుకగలమహాత్ముఁ డెఱుక యన్జలముల
నార్చుక్రోధమను మహానలంబు'

అనుట పరమార్థమును అలంకరించి రమణీయము చేయుట.

'ధర్మదూరులైన ధార్తరాష్ట్రులయందు
ధర్మవేమిసేయు ధరణినాథ
నికృతి పరులయందు నికృతిసేయనివారు
వారి నికృతిఁజేసి వధ్యులండ్రు,'

అనుట ఇతిహాసార్థమును సమర్థించుటకై ఒక పరమార్థమును అర్థాంతరన్యాసముగా రూపించి హృద్యము చేయుట.

బలముగలవానిఁ బలువురు బలవిహీను
లొక్కపై కూడి నిర్జింతు రుత్సహించి
మధువుఁ గొన నుత్సహించిన మనుజుఁ బట్టి
కుట్టి నిర్జించు మధుకర కులమునట్లు.

అనుట నగ్నమైన లోకన్యాయమును ప్రకృతిసిద్ధమైన ఉపమానముచే నలంకరించి రుచిరము చేయుట.

'విలాసినుల సహాలాపసహాసన సహయానములు బంధనసమములుగావే'

అనుట కథాపరమార్థమును పిండి సారవంతమైన అర్థాంతరన్యాసముగా రూపొందించి రుచిరము గావించుట.

'పురుషులందు దోషపుంజంబు గలిగిన
నెఱిఁగి యెద సహించునేని భార్య
పురుషునం దభీష్టభోగంబు దేహాంత
రంబునందు ధర్మరతియుఁ బడయు'

అన్న ఆగమన్యాయము ప్రకరణబలమున నలుడు ధ్వనిసుందరముగా దమయంతికి బంపిన సందేశమగుచున్నది.

'అఖిల దుఃఖరోగార్తున కౌషధంబు సురుచిరంబుగ భార్యయ చూవె' అన్న లోకన్యాయము రూపకాలంకృతమై రుచిరమగుటయేకాక నల కథా పర్యవసాన వ్యంజకమై ఆస్వాద్యమైన కావ్యమగుచున్నది.

నన్నయ రచనయందుగల పెక్కుసూక్తులు ప్రకరణ వశమున ఎట్లు రుచిరార్థములై హృదయంగమము లగుచున్నవో అనుశీలించి గుర్తింపవచ్చును.

## అక్షర రమ్యత

పదసంఘటనారూపమైనరీతి, వర్ణసంఘటనారూపమైన వృత్తి, పదముల అన్యోన్యమైత్రీరూపమైనశయ్య, పదపరివృత్త్య సహిష్ణుతారూపమైన పాకము–ఈ సర్వమును నన్నయ అక్షరరమ్యత అనెను. నన్నయభారతమున సర్వశ్రోతృజన భోగ్యమైన లక్షణమిది. శబ్దార్థములు కావ్యశరీర మన్నప్పుడు శబ్దము ఇంద్రియ గ్రాహ్యమైన స్థూలశరీరమనియు, అర్థము బుద్ధిగ్రాహ్యమైన సూక్ష్మశరీర మనియు గ్రహింపవలెను. ఇంద్రియ గ్రాహ్యమైన శబ్దశరీరము సర్వజన సంవేద్యము. అర్థము బుద్ధిమంతులు మాత్రమే గ్రహింపదగినది. ఎంతరుచిరమైన యర్థమైనను శ్రుతిరమ్యమైన శబ్దముచే ప్రతిపాదింప బడినపుడే బుద్ధినిచేరగలదు. కనుకనే రమణీయమైన అర్థమును ప్రతిపాదించు రమణీయమైన శబ్దమే కావ్యమని జగన్నాథపండితరాయలు ఆంధ్రుల కావ్యమతమును ప్రతిపాదించెను.

నన్నయనాటికి దేశమున వామనుని రీతిప్రస్థానము సుప్రతిష్ఠితమై యున్నది ఆనందవర్ధనుని ధ్వనిప్రస్థానము కూడ నన్నయకు సుపరిచితమే అయి యుండును. ఆయన శబ్దశాసనత, సంహితాభ్యాసత, అక్షరరమ్యతా ప్రవణత, పరికించినచో నన్నయ రీతిమార్గమునే అతిశయముగా ఆదరించెననిపించును. కథాకవిశార్దయుక్తిని చూచినచో ధ్వనిమార్గమున వస్తుధ్వనియందే యెక్కువ దృష్టి యుంచినట్లు తోచును.

నన్నయరీతి వైదర్భి. సమగ్రగుణ గుంఫితయైన వైదర్భి సర్వరస నిర్వాహకి, పృథక్పదమైనను, సమాసభూయిష్ఠమైనను, ఆయన రచన రమ్యతా ధర్మమును వీడదు. రమ్యతలు నానా ప్రకారములు. ఉపనాగరిక, పరుష, కోమల ఇత్యాది వృత్తిభేదముల సంక్రమణముచే ఆయనరీతి వస్తురసభావాది వ్యంజనా సమర్థములైన ఛాయాభేదములను పొందుచుండును.

'అలఘు తపస్సమాధి నియతాత్మలకున్ బహుపుణ్య లోకకాం
క్షలకు, విశుద్ధమానసులకున్ సతతంబును సంశ్రయంబవై
లలిత నిలింప దంపతి విలాస విహార మహోత్సవంబులున్
గలిగి వెలుంగు రత్నమయ కందరసుందర ! మందరాచలా !'

ఇందలి మాధుర్యము కృతజ్ఞతారూపమైన ప్రీతిని వ్యంజించునది. పూర్వార్ధమున తపోధనుల స్మరణచే ఓజోలేశసంక్రమణము ఉత్తరార్థమున నిలింపదంపతి విలాసస్మరణచే శుద్ధమాధుర్యము.

'అతుల రణాంతరంబున నిరంతర మత్పటుబాణ పాతితో
చ్ఛ్రిత దనుజాంగ నిర్గళ దసృగ్గలధారలు నూడనొప్పె, నా
తత గిరిశృంగ సంగ దళిత ప్రచలజ్జలవాహజాల సం
తత గళదంబుధారల విధంబున నంబరమెల్లఁ గప్పుచున్'

అర్జునుడు నివాత కవచులను సంహరించివచ్చి తన వీరకృత్యమును ధర్మజాదులకు వర్ణించి చెప్పుచున్నాడు. ఈ పద్యము వీరరస వ్యంజకముగాలేదు. ఉండనక్కర లేదు. ప్రీతిపూర్వకమైన అద్భుతమును వ్యంజించుట ఈపద్యమునకు కర్తవ్యము. కనుక ఓజోమాధుర్యములు క్షీరనీరన్యాయమున ఈపద్యమున కలసియున్నవి.

'అవనీనాథ! తదాహవాంతరమునం దస్మత్కరాకృష్ట శార్
ఙ్గవినిర్ముక్త నిశాతసాయక శతాగ్రచ్ఛిన్నమై దైత్యదా
నవదేహప్రకరంబు వాత విధుతార్ణః పూర్ణసంఘూర్ణితా
ర్ణవ కుక్షింబరియెం గపిప్రవర సైన్యక్షిప్త శైలాకృతిన్'

ఇది శ్రీకృష్ణుడు తాను సాల్వుని సంహరించిన వృత్తాంతమును ధర్మజాదులకు వర్ణించి చెప్పుసందర్భములోనిది. తన పరోక్షమున ద్వారకను ముట్టడించి వసుదేవుని చెరబట్టి అవమానించిన రాక్షసాంశ సంభూతుడైన సాల్వునిపై తాను విజృంభించిన తెఱగును శ్రీకృష్ణుడు వర్ణించుచున్నాడు. ఇదియు భూతార్థస్మరణ పూర్వకమైన వర్ణనమే. రౌద్రమిశ్రితమైన అద్భుతమును వ్యంజించుట దీని కర్తవ్యము. అందుకు తగినట్లే ఓజస్సున మాధుర్యసంచారము ఈపద్యమున స్పష్టపడుచున్నది.

'ప్రణుత క్షాత్త్రగుణంబు, విక్రమము, దర్పంబేర్పడన్ విక్రమ
క్షణదానం బొనరింపుమీ క్షణమ విఖ్యాతంబుగా సంగరాం
గణ మధ్యంబునఁ జేయు మర్జున బృహద్గాండీవ నిర్ముక్తమా
ర్గణ ధారావళి ధార్తరాష్ట్ర కదళీకాంతార విచ్ఛేదమున్'

ఇది భీమసేనోక్తి. శత్రుసంహారోన్ముఖమైన ఈ యుత్సాహము పరుషమైనది. రేఫ, రేఫసంయోగావృత్తిచే అది సుష్ఠుగా నిర్వహింపబడుచున్నది.

'దేవర్షి ద్యుచరాహిలోకములు, నాదిత్యాశ్వినీ లోకముల్
దేవాధీశ్వరుఁ జూచితిన్, మఱియు నద్దేవేంద్రు నొద్దన్ నగాం
డీవోద్దామ మహాభుజార్గళుఁ గిరీటిన్ సవ్యసాచిన్, జయ
శ్రీ విభ్రాజితుఁ బారుఁజూచితి; జగత్సేవ్యా! మునీంద్రోత్తమా!'

ఇది భయభక్తిభావ సంక్రాంతమైన అద్భుతరసము. ఈ వృత్తము, ఈ యక్షర వృత్తి ధర్మజునకు స్వాభావికములు కావు. అచింతితోపనతమైన అతిలోకవస్తు దర్శనమున ఆయన పొందిన పరమాశ్చర్యము ఈ పద్యము.

'అశనాశా వివృతాస్య గహ్వరుఁ గృతాంతాకారు, నిశ్వాసధూ
మశిఖాధూసరితోగ్ర దుర్గతరు గుల్మవ్రాతు, హారిద్రవ
ర్ణశరీరున్, భృశరూక్ష దర్శను మహానాగప్రభుంగాంచె న
ర్ధశశాంకద్యుతిహాసిదారుణ చతుర్దంష్ట్రున్ జగత్త్రాసకున్'.

మృగయా పరిశ్రాంతుండైన భీమసేనునకు కనబడిన అజగరస్వరూపము. 'ఇది ప్రకృతి సర్పంబుగా దెద్దియేనియు నొక్క యద్భుతరూపంబు' అని భీమసేను డాశ్చర్యపడునంతటి మహానాగప్రభునిమూర్తి ఈ మత్తేభపాదములలో పట్టుబడి ఊష్మమహాప్రాణాక్షరములలో బుసలు కొట్టుచున్నది.

నన్నయ రచనమున అక్షరములు పదములు పదబంధములు పరివృత్తి సహింపనంతటి నిబిడమైన మైత్రితో పొందియుండును. అక్షరఘటనము పదఘటనము పరిపక్వములై శ్రోతను కావ్యార్థగ్రహణోన్ముఖుని చేయుటయందు ఆయన గద్యపద్యములు సమ్మోహన మంత్రములవలె పనిచేయును.

## శబ్ద శాసనత

నన్నయ తాను విపులశబ్దశాసనుడనని చెప్పికొనెను. ఆయన శాసనమునకు లోబడిన శబ్దములలో తెలుగుశబ్దములకంటె సంస్కృత శబ్దములే అధికసంఖ్యాకములైనట్లు కనబడును. ఆయన రచనలో సంస్కృత శబ్దములే అధికము. కారకములు, వాక్యనిర్మాణములు కూడ కొంతవఱకు సాంస్కృతికములే.

ఆయన తఱుచుగా ప్రయోగించు సంస్కృతపదములు—మహా, బృహత్, పృథు, భూరి, నిరంతర, అనంత, అనవరత, అపూర్వ, అద్భుత, పరమ, పరమార్థము, ప్రభులు, తరప్ ప్రత్యయము—ఇవి అలంకారము కాని అతిశయోక్తి పట్ల ఆయనకుగల రుచిని పట్టి యిచ్చును. ధర్మశబ్దమును సమాసమున ఆకారాంతముగను, వ్యస్తముగా ఉకారాంతముగను ప్రయోగించుట ఆయన కిష్టము. నీ తదర్థము, నీకృతమున, ప్రస్తవమున—ఆయన ప్రయోగించు విలక్షణ పదములు.

తిక్కనాదుల రచనలో కనబడని కారకవిశేషములు కొన్ని నన్నయ రచనలో తఱచు కనబడును. ఇవి సంస్కృత భాషాసాహిత్యముల ప్రభావమున ఆయన రచనలో ప్రవేశించి యుండును. 'విదితముగ నిన్నుఁ జేయించెదఁ గ్రతువు'— 'నీచేతఁ జేయించెద' అను తృతీయకు ద్వితీయ. 'నీవు మాయందుఁ గుడిచి;— దేశవాచియయిన వ్యస్తపదముగా 'అందు' ప్రయోగింపబడినది. 'ఎఱుకని యెఱుఁగక నీకున్ మఱకువ నెదిరితిని'—నిన్ను నెదిరితిని అను ద్వితీయకు షష్ఠి. 'దానికి వర్ణించి'—వర్ణించి చెప్పి లేక వివరించి యని యభిప్రాయము. 'నన్నుఁ బ్రదక్షిణంబు నిత్యమ్మును జేయక'—నాకు అను షష్ఠికి బదులు ద్వితీయ. 'కన్ను మూయదు నాకున్'— మూతపడదు అని అర్థము. 'పల్వుర నిర్వహించె' భరించెను పోషించెను అనుటకు. 'ఋతుపర్ణునందుఁ బ్రకాశింప'—ఋతుపర్ణుని సభయందు ప్రకటింప అనుటకు, 'ఒక్క మడువున నీర్వాడుచున్న'—స్నానమాడు చున్న అనుటకు.

ఏకదేశాన్వయ సమాసములు సంస్కృతమున తఱచు. నన్నయయు కొన్ని ప్రయోగించెను. 'ప్రధానవరులందు సమర్పిత రాజ్యభారుడై,' 'హరుచేత సంప్రాప్త వరుడయ్యె,' 'పృథుభుజునకుఁ గృతప్రణాముండయ్యెన్,' 'భీష్మాదుల యంద ధిగతాశ్రయంబయ్యె' మున్నగునవి. 'రథంబుల షష్టిసహస్రకంబుతో' అనుట సంస్కృత పద్ధతియే.

భుజవిక్రమ ప్రకటీ కృతుల్, కలిసంప్రాప్తుడనై, ఉదిత క్రోధుండ వగుము మున్నగు ప్రయోగములుకూడ విలక్షణములు.

'అన్నల భూపాలుడు పోయిన వలనొండెఱుఁగునొకో'— అన్నచోట ఒండు శబ్దమునకు ఒకవేళ యను నర్థముగా కనబడుచున్నది.

'ఎఱలేని కఱకుటెఱుకపేక్షించెఁ గాదనక తనకు నాయు వల్పమైన'— ఇచ్చట 'కాదు' శబ్దము అనుచితము, పాపము అను నర్థమున ప్రయోగింప బడినది.

'కాదనకిట్టి పాటి యపకారము' —అని ఆదిపర్వమునకూడ కలదు.

'నైషధేశ్వరుఁడు' నైషధుడు అనురాజు అను నర్థమునను, 'ధౌమ్యరోమశ ప్రభృతి వరులు' ధౌమ్యుడు రోమశుడు మొదలుగాగల శ్రేష్ఠులు అను నర్థమునను విలక్షణముగా ప్రయోగింపబడినవి.

'దానశీలంబు లెందేనిఁ గాననగు నట్టివాఁడు బ్రాహ్మణుఁడు' ఇచట ఎందేని అన్న శబ్దము సంస్కృతమున యస్మిన్ అను నర్థమున ప్రయుక్తమగు యత్ర శబ్దము వంటిది.

> పలికి రంతఁదరుణి పాంచాలి బీభత్సు
> కడకు నరుగుదెంచి కమలనేత్ర
> యరిజయార్థ మరుగు నాతని యుత్సాహ
> మెఱిగి యిట్టులయ్యె నిందువదన.

కమలనేత్ర, ఇందువదన అను విశేషణములు పాంచాలి అను విశేష్యమునకు ముందుండ వలసినవి తరువాత ఉన్నవి. ఇది సంస్కృత వాక్య నిర్మాణపద్ధతి. తనవద్దకు వచ్చి స్తుతించుచున్న దేవతలను అగస్త్యుఁడు 'ఏమి వచ్చితిరి' అని ప్రశ్నించుటయు, యుద్ధరంగమునుండి తన రథమును తప్పించి తెచ్చిన సారధితో ప్రద్యుమ్నుఁడు 'అక్రూరాదులును నేమియని నగరె సభన్' అని మందలించుటయు చక్కని తెనుగుజాతీయములు.

## ఛందస్సు

ఆరణ్యపర్వమున నన్నయ రచించిన గద్యపద్యములు మొత్తము 1199. వాని వివరములు.

| | | | |
|---|---|---|---|
| గద్యములు | 519 | కందములు | 388 |
| సీసములు | 76 | తేటగీతులు | 75 |
| చంపకములు | 59 | ఆటవెలదులు | 84 |
| ఉత్పలములు | 39 | మధ్యాక్కరలు | 23 |
| మత్తేభములు | 10 | శార్దూలములు | 2 |
| లయగ్రాహి | 1 | మత్తకోకిలము | 10 |
| తరలము | 4 | తరువోజ | 2 |
| మణిభూషణము | 1 | స్వాగతము | 1 |
| ఉత్సాహము | 1 | కవిరాజవిరాజితము | 1 |
| పృథ్వి | 1 | వసంతతిలకము | 1 |
| దండకము | 1 | | |

గద్యముతో కలిపి మొత్తము 21 భేదములు. వీనిలో విశేషవృత్తభేదములు, దండకము గలవు. నన్నయరచనలో ఈ పర్వభాగము కొంచెము తక్కువగా మూడవవంతున్నది. కాని ఆయన రచించిన మొత్తము వృత్తములలో, కందములలో మూడవవంతు ఈ పర్వమున కానరావు. మధ్యాక్కరలు, తేటగీతులు, ఆటవెలదులు, మూడవవంతును మించినవి. దేశీయములైన ఉపజాతులపై ఆయనదృష్టి యెక్కువగా పడెననవచ్చును. తీర్థయాత్రావర్ణనమున గద్యములు ఎక్కువగా వాడుటచే గద్యసంఖ్యయు కొంచెము పెరిగినది.

యతి, ప్రాసయతి విన్యాసవైచిత్రిచే పదునాఱు విధములయిన సీసపద్య భేదములను నన్నయ భావించెను. వానిలో 13 రకములు మాత్రమే ఆయన వాడెను. ఆరణ్యపర్వమున మాత్రము 10 రకములే వాడెను. మొత్తము 76 సీసములలో 55 పూర్తిగా సాధారణయతి పాటించినవి. పూర్తిగా ప్రాసయతి పాటించినవి 6. ఇట్టివి ఆయన రచనలో మొత్తము 33 కలవు. దీనివలన ఆయన ఆరణ్యపర్వమున సీసపద్యముల యలంకరణము తగ్గించెనని ఊహింపదగును. పద్యరచన, శైలి చక్కని పాకమున బడినవి గనుక అలంకరించుట అనవసరమని యెంచెను గాబోలు.

తేటగీతులను, ఆటవెలదులను రచించుటయందు గూడ నన్నయ యతి, ప్రాసయతి నియమము పాటించెను. ఈ పర్వమున వీని విషయమునందును ప్రాసయతి తగ్గించెను. ఈ పర్వమందలి 76 సీసములలో 70 సీసముల క్రింద ఆటవెలదులే వ్రాసెను. ప్రాసనియమముతో ఒక యాటవెలది వ్రాసెను. లాక్షణికు లట్టిదానిని పవడగీతి యనిరి.

నన్నయ ఛందోనిర్మాణ, అలంకరణ, వినియోగనైపుణిని గురించి 'ఛందః శిల్పము' అనుగ్రంథమున విస్తరించి వ్రాసియుంటిని గనుక పునరుక్తి యని యిట విరమించితిని.

## హాస్య రసికత

పరమనైష్ఠికుడైన నన్నయకు పరిహాసము రుచింపదనిపించును, కాని ఆయనయందు మృదువైన హాస్యము కలదు. అది యన్యభావములతో మిశ్రితమై తథ్యమిథ్యామధ్యస్థితిలో నుండును.

భీముడు కిమ్మీరుని జంపి చచ్చిన వానితో నిట్లనును.

"బక హిడింబులు హతులైనఁ బనివిపనివి
యఱచి శోకింపఁగానక యమపురమున
కరిగితక్కట రాక్షస" యనుచుఁదెరువు
వాయఁబావని తత్కళేబరమువైచె"

కళేబరమును విసరివైచుచు 'చచ్చినవారికొరకు ఏడ్చుటకును అవకాశము లేకుండ నీవును చచ్చితివి పాపము' అనుటలో కృతార్థమైన క్రోధముయొక్క క్రూరహాసము తొంగిచూచును. 'అక్కట' యనుట శోకభిన్నమైన హాస్యమును వ్యంజించుచున్నది.

దుర్బలబలీవర్దములను జనులు బాధించుచుండ చూడజాలక గోమాతయేడ్చుచు నింద్రునికడ కరుగగా ఆయన 'ఇట్లేల రోదనాకులితలోచనయయి యున్నదానవు? ఎల్లవారికి లగ్గకదా?" యని ప్రశ్నించును. కష్టమునుగూర్చి యడుగవలసిన యింద్రుడు క్షేమమును గూర్చి ప్రశ్నింపగా గోమాత యిట్లన్నది.

'నీ వజ్రము రక్షింపఁగ
నావారికిఁ దక్కఁ ద్రిభువనంబులఁ గల భూ
తావలి కెల్లను సేమము,
దేవేంద్ర! జగత్రయ ప్రదీప మహాత్మా!'

ఇంద్రుని ప్రశ్నయందు అనౌచిత్యము తోచినగోమాతకు శోకములో హాసము అంకురించినది. 'నావారికిదక్క యెల్లవారికి సేమమే యని దీనహాసమును ప్రకటించినది.

సగరుని తపస్సునకుమెచ్చి ఈశ్వరుడాతనికి అరువదివేవురు పుత్రులు పుట్టుదురని వరమిచ్చును. కొంతకాలమున కాతనిభార్య వైదర్భి గర్భవతియై యొక్క అలాబూఫలమును ప్రసవించును. దానిని పారవేయబోవుచు సగరాదులు ఇట్లనుకొందురు —

'వరదుఁడైన యీశువరమున నిదియొక్క
వదరుపుట్టె నెట్టివరమొ...'

ఆశాభంగజనితమైన విరక్తహాసము 'ఎట్టివరమొ' అన్నమాట నుండి ఉట్టిపడుచున్నది. క్రోధశోకములు హాస్యవిరోధులు. అట్టివానినుండి నన్నయ పుట్టించిన ఈ హాస్యములు విచిత్రములైన హాస్యాభాసములు.

## రసము

మహాభారతము శాంతరసప్రధానమైనదని ఆనందవర్ధనాచార్యుల వారు చెప్పిరి. ఇది ఎంత శాస్త్రసమ్మతమైనను అనుభవరూఢమైనదిగా కనబడదు. శాంత రసప్రధాన మనుటకంటె శాంతరస పర్యవసాయి యనుట యుచితమనిపించును. సంస్కృతభారతము శాస్త్రకావ్యమన్న ఆనందవర్ధనులు దానిని శాంతరసప్రధాన ముగా భావింపవచ్చును. కాని తెలుగుభారతము ఇతిహాసకావ్యము. ఇది ధర్మవీర ప్రధానము. శాంతరసము మోక్షఫలకమని అనందవర్ధనులు. ధర్మజాదులు స్వర్గా రోహణము చేసిరేకాని మోక్షముపొందలేదు. కనుక తెనుగుభారతమున స్వర్గఫల మైన ధర్మవీరమే ప్రధానరసమని భావించుటయుచితమే. కర్మఫల సంబంధ నిరూపకమైన ఇతిహాసమున చిత్రింపబడిన కర్మ వేదవిహితమైనది. దానిఫలము స్వర్గము. సశరీరముగ దానిని పొందిన ధర్మరాజు ధర్మవీరుడు. అతడు నాయకు డైన కావ్యమున ప్రాధాన్యము ధర్మవీరమునకే.

ధర్మనిష్ఠమైె పుణ్యకర్మలు, పుణ్యకథాశ్రవణము, పుణ్యతీర్థయాత్రలు మున్నగువానితో ధర్మరాజు కాలముగడపుటను చిత్రించు అరణ్యపర్వమున రసము ధర్మవీరమే యనుట యుచితము. దీనికిఅంగములుగా భీమునియొక్కయు అర్జునుని యొక్కయు యుద్ధవీరములు నిబంధింపబడినవి. పాండవులకు ప్రత్యక్షముగా సంబంధింపని సౌంభకాఖ్యానము యుద్ధవీరప్రధానము. ఋషిమహత్వ బోధకము లైన కథలందు రసము వివక్షింపబడదు,

నన్నయ అభినివేశముతో రచించిన నలోపాఖ్యాన మున్నది. నలదమ యంతుల దాంపత్యప్రణయము ఇందుముఖ్యము. స్వయంవరము వఱకు అయోగ శృంగారము. పునఃస్వయంవరము వఱకు వియోగశృంగారము. ఈ రెంటికి నడుమ దమయంతి ఎంత శోకించినను అది నలాలంబనకమైన రతికి అంగమే. నలుని శోకమును అట్టిదే.

'వనజాయతాక్షి ! కతిపయదినములలోఁ జూడఁ గాంతు తివిరి నలుని' అని చెప్పి తాపసులు అంతర్హితులైన యనంతరము దమయంతియందు నలుని జీవిత మును గూర్చిన శంక పొడముటకు ఇసుమంతయు అవకాశములేదు. నలుడుమ 'అశనాపేక్షఁబఱచుచున్న యుగ్ర మృగంబుల యుదరంబులో నున్నదానవే' అను కొన్నప్పుడు మాత్రమే ఆతని చిత్తమున దమయంతీ జీవితశంక స్ఫురించును.

'నీ తల్లి దండ్రులొద్ద ధృతినున్నదానవే' అన్న యూహ కలిగినప్పుడు దమయంతీ జీవితశంక నలుని చిత్తమునుండి తొలగిపోయినట్లే. ఆతడు ఉత్కటముగా పొందిన శోకమంతయు రత్యంగమే. 'భార్యాసంగమంబును నెప్పటి రాజ్య విభవంబుననగు' నని కర్కోటకుడు చెప్పిన పిదప నలునకు దమయంతి భద్రతను గూర్చిన చింత యవసరము లేదు.

విభవనాశనమువల్ల కలుగు శోకము నలునియందు ఉత్కటముగా వర్ణింపబడ లేదు. ఏ కొంచెమో ఉన్నను అది దమయంతీ వియోగ దుఃఖమునకు పోషకము మాత్రమే యగును. విభవనాశనము ప్రవాసమునకు కారణమై విప్రలంభమునకు రూపము కల్పించినది. కాగా నలోపాఖ్యానమున పోషింపబడినది కరుణ విప్రలంభ శృంగారము.

నన్నయ్య రసపోషణమున దక్షుడేయైనను కథను ఆస్వాద్యము చేయునంత వఱకే రసమును పోషించుట ఆయన నియమముగా పెట్టుకొనెనేమో యనిపించును. రసమునకు ప్రాధాన్యము వచ్చినచో కథకు గుణభావము పట్టును. తత్పరమార్థమైన వ్యుత్పత్తికి ఆనుషంగికత్వము పట్టును, కృష్ణద్వైపాయనుడు నిబంధించి నిరూపించిన పరమార్థము తెల్లమగునట్లు ధీయుక్తితో మహాభారత సంహితను ఆంధ్రమున వెలయింప బూనిన నన్నయ రసమునకు దీప్తి కలిగించునని భావింపజాలము. ఉదాత్త రసాన్విత కావ్యనాటక క్రమములు పెక్కు చూచిన రాజరాజు భారతము వ్రాయుమన్నది వ్యాసుడు నిరూపించిన పరమార్థమును వినుటకుగాని రసానందము కొఱకు కాదుగదా! ఆయనయందు రక్తుడై ఆయన హృదయ మెఱింగిన నన్నయ రాజరాజు నభిలాష ననుసరించియే భారతము రచించెననుట యుచితము.

రాజరాజు నభిలాషయు, నన్నయ కృషియు ఆనాడే ఫలోన్ముఖములయ్యెను. తాము కలలుగన్న—

'అనఘమై శిష్టాగ్రహార భూయిష్ఠమై
ధరణీసురోత్తమాధ్వర విధాన
పుణ్యసమృద్ధమై పొలుచు వేంగీదేశ'

విభవంబు కన్నులార తిలకించి ఆ పుణ్యాత్ములు ధన్యాత్ములైరి. చారుతరములైన శారద రాత్రులలో, ఉజ్జ్వలలసత్తర తారకహార పంక్తులలో రెండు తారకలై

ఆ మహనీయుల పవిత్రాత్మలు తమ వేంగిదేశమును కలకాలము కన్నులు చల్లగా చూచుకొనుచుండును. వికసన్నవకైరవ గంధబంధురోదార సమీరమువలె, కర్పూర పరాగ పాండు రుచిపూరమువలె వారి మధురకీర్తి అనంతకాలము ఆంధ్రజాతిని ఆహ్లాదపరవశము కావింపగలదు.

* * *

భవ్యచరిత్రుఁ, డాప స్తంబసూత్రుండు,
　　శ్రీ వత్సగోత్రుండు, శివపదాబ్జ
సంతతధ్యాన సంసక్తచిత్తుఁడు, సూర
　　నార్యునకును బోతమాంబికకును
నందనుండిలఁ బాకనాటిలో నీలకం
　　ఠేశ్వరస్థానమై యెసకమెసఁగు
గుడ్లూరు నెలవుగ గుణగరిష్ఠత నొప్పు
　　ధన్యుఁడు, ధర్మైకతత్పరాత్ముఁ

డెఱ్ఱనార్యుండు సకలలోకైకవిదితుఁ
డయిన నన్నయభట్ట మహాకవీంద్రు
సరససారస్వతాంశ ప్రశస్తి దన్నుఁ
జెందుటయు, సాధుజనహర్ష సిద్ధిఁగోరి
ధీరవిచారుఁడు తత్కవి
తారీతియుఁ గొంత దోఁపఁ దద్రచనయ కా
నారణ్యపర్వశేషము
పూరించెఁ గవీంద్ర కర్ణపుటపేయముగాఁ.

నన్నయ యనంతరము రెండు వందల సంవత్సరములు భారత రచనము అట్లే నిలిచియుండెను. కవులు పుట్టిరి. కావ్యములు వ్రాసిరి. కాని భారతాంధ్రీ కరణమును కొనసాగించు బాధ్యత ఎవ్వరును చేపట్టరైరి. పంచమ వేదమున వ్రేలు పెట్టుటకు తగిన ఆత్మప్రత్యయము లేమియే అందుకు కారణమై యుండును.

ఎట్టకేలకు తిక్కన పుట్టెను. భారతము కడముట్ట చెప్పవలెనని సంకల్పించెను. కాని అరణ్యపర్వశేషమును ముట్టక విరాటపర్వముతో మొదలుపెట్టెను.

'తుదిముట్టన్ రచియించుటొప్పు బుధసంతోషంబు నిండారగన్' అని 'భారతామృతముకర్ణపుటంబుల నారఁగ్రోలి యాంధ్రావళి మోదముంబొరయునట్లుగ' భారతము రచియింతునన్న తిక్కన సోమయాజి అరణ్యపర్వశేషము నేల విడిచిపెట్టెనో! ఏల విడిచిపెట్టితిరని యడిగినవారికి ఏమి సమాధానము చెప్పెనో! ఆయనకును ఆ నాటివారికిని తెలిసియేయుండును. ఆయన శిష్యుడైనమారనకు కూడ తెలిసి యుండవలెను. 'ఆది దొడఁగి మూఁడు కృతు లాంధ్రకవిత్వ విశారదుండు విద్యాదయితుండొనర్చె మహితాత్ముఁడు నన్నయభట్టు దక్షతన్' అని తిక్కన యనెను. ఆయన అన్నట్లే 'భారతసంహితన్ మునుద్రిపర్వము లెవ్వఁడొనర్చె నట్టి విద్యారమణీయు నాంధ్ర కవితాగురు నన్నయభట్టుఁ గొల్చెదన్' అని మారనయు ననెను.

క్రీ. శ. 1320 ప్రాంతమున మారన మార్కండేయపురాణము వ్రాయు నాటికి భారతకవులు ఇద్దరే— నన్నయ, తిక్కన. ఎఱ్ఱయసంగతి మారనకు తెలియదు. 1380 ప్రాంతముల విక్రమార్క చరిత్రము వ్రాసిన జక్కన నాటికి భారతకవులు ముగ్గురు. 'ఈత్రయి దాఁ బ్రబంధపరమేశ్వరుఁడై విరచించె శబ్దవైచిత్రి నరణ్యపర్వమున శేషము' అని ఎఱ్ఱయ ప్రబంధ పరమేశ్వరుఁడయి అరణ్యపర్వశేషము విరచించి భారతకవిత్రయిలో చేరినట్లు జక్కన చెప్పుచున్నాఁడు.

'ఉన్నత సంస్కృతాది చతురోక్తిపథంబులఁ గావ్యకర్తవై
యెన్నికమైఁ బ్రబంధపరమేశుఁ డనంగ నరణ్యపర్వశే
షోన్నయ మాంధ్రభాష సుజనోత్సవ మొప్పఁగ నిర్వహించి తా
నన్నయభట్ట తిక్కకవినాధుల కెక్కిన భక్తి పెంపునన్.'

అని నృసింహపురాణములో తన తాత తన్ను ప్రశంసించినట్లు ఎఱ్ఱయ చెప్పికొనెను. ఉన్నయమనగా ఉద్ధరించుటయనియు, తిక్కనమారనల నాటికి సమగ్రముగా నుండిన అరణ్యపర్వమున శిథిలములైన భాగములను మాత్రమే ఎఱ్ఱయ పూరించెననియు కొందఱందురు. కాని ఉన్నయశబ్దము కావ్యశాస్త్రములలో కల్పించుట అనునర్థమున వాడబడుచున్నది. ఆనందవర్ధనాచార్యులవారి ప్రయోగము.

'ఇతివృత్తవశాయాతాం త్యక్త్వాననుగుణాం స్థితిం
ఉత్ప్రేక్ష్యో ప్యంతరాభీష్ట రసోచిత కథోన్నయః.'

ఇచట ఉన్నయమనగా ప్రతిభాబలమున భావించి ఉత్పాదించుటయని అర్థము. ఎఱ్ఱన అరణ్యపర్వమును ఉన్నయముచేసెననగా నన్నయయైనచో ఎట్లు రచించునో తన

ప్రతిభాబలముచే భావించి ఆ రీతిగా రచించెనని యర్థము. 'ప్రతిభతో నారణ్య పర్వశేషముఁ జెప్పెఁ గవులకుఁ జెవులపండువులుగాఁగ' అని చెదలువాడ మల్లయ చెప్పినమాటయు, నంతకుముందే 'విరచించె శబ్దవైచిత్రి నరణ్యపర్వమున శేషము' అని జక్కన చెప్పినమాటయు పరమార్థములు. అరణ్యపర్వశేషోన్నయము నిర్వహించి నందువల్లనే ఎఱ్ఱయకు 'ప్రబంధపరమేశ్వరుఁడు' అను బిరుదము లభించినట్లు పలువురు చెప్పుచున్నారు. ఇదియు సత్యముగా కనపడదు. ఎఱ్ఱయకు శంభుదాసుడు అను బిరుదము కలదుగాని ప్రబంధపరమేశ్వరుడు అను బిరుదములేదు. ఆయన ప్రబంధరచనా ప్రావీణ్యమునుబట్టి ఆనాటివారు ఆయనను ప్రబంధపరమేశునిగా నెన్ని స్తుతించిరి. అది బిరుదమే యైనచో ఆయన గద్యలోగాని యితర గ్రంథములలోగాని దాని ప్రసక్తి ఉండవలెనుగదా? అది బిరుదము కాకపోవుట అట్లుండ అది అరణ్యపర్వశేషరచనవలన లభించెననుటయు సరికాదు. ఆయన కాలమునకు సన్నిహితోత్తరకాలమందేయుండిన జక్కన 'ఈత్రయి దాఁ బ్రబంధ పరమేశ్వరుఁ డై విరచించె శబ్దవైచిత్రి నరణ్యపర్వమున శేషము' అని ప్రబంధ పరమేశ్వరుడయిన యనంతరమే అరణ్యపర్వశేషము రచించెనని స్పష్టముగా చెప్పియున్నాడు. 'సకల భాషాకవిత్వ విశారదుఁడవు' అని హరివంశమున వేమారెడ్డిచే కొనియాడించుకొన్న ఎఱ్ఱన 'ఉన్నత సంస్కృతాది చతురోక్తిపథంబుల కావ్యకర్త' యైనాడు. నాటి రసజ్ఞులాయనను 'ఎన్నికమై ప్రబంధపరమేశుఁడు' అనినారు. ఈ విధముగా ప్రతిష్ఠనార్జించిన పిమ్మటనే ఆయన 'అరణ్యపర్వశేషోన్నయ మాంధ్ర భాష' నిర్వహించినాడు. ఈ నిర్వహణమునకు పూనుకొనుటకు కారణములు సుజనులకు ఉత్సవముకలిగించుట, నన్నయ తిక్కనలపట్ల భక్తి ప్రకటించుట అని చెప్పబడినది. ఎఱ్ఱయ అరణ్యపర్వాంతమున చెప్పికొన్న పద్యములనుబట్టి చూడగా ఈ యంశములు సత్యమేయని తోచును.

నన్నయభట్ట మహాకవీంద్రుని సరససారస్వతాంశ ప్రశస్తి తన్ను చెందినదట. నన్నయభట్టు సరససారస్వతము భారతము, దాని యంశము అరణ్యపర్వశేషము. దానిని రచించు ప్రశస్తి తనకు లభించినది— తనకు పూర్వులు విడిచిపెట్టుటవలన. కనుక 'సాధుజన హర్షసిద్ధిఁ గోరి', 'కవీంద్రకర్ణపుట పేయముగా' ఎఱ్ఱయ దానిని రచింపదలచెను. 'బుధసంతోషంబు నిండారగన్', 'భారతామృతము కర్ణపుటంబుల నారఁగ్రోలి యాంధ్రావళి మోదముంబొరయు నట్లుగ' భారత రచనకు పూనిననాటి తిక్కనసోమయాజి మనః పరిపాకమెట్టిదో 'సాధుజనహర్షసిద్ధిఁగోరి',

'కవీంద్రకర్ణపుటపేయముగా' ఆరణ్య పర్వశేషరచనకు పూనిన నాటి ఎఱ్ఱయ మనః పరిపాకము గూడ అట్టిదే. ఈ సాధుజనులలో నన్నయ, రాజరాజు. తిక్కనకూడ ఉండుట విశేషము.

ఆరణ్యపర్వశేషమునగూడ నన్నయ వక్తృత్వము, రాజరాజు శ్రోతృత్వము చెల్లుచునే యున్నవి. అట్లు చెల్లవలయుననియే ఎఱ్ఱయ నిశ్చయము. ఇందుకు కారణములుగా— ఆరణ్యపర్వమును రచించుచు నన్నయ మరణించెను గనుక అందులో కాలుపెట్టుటకు ఎఱ్ఱయ భయపడెనని కొందఱు, అది తన తొలిరచన యగుటచే తనపేర ప్రకటించుటకు ఆయనకు ధైర్యము చాలలేదని కొందఱు చెప్పుదురు. శిథిల పూరణవాదమువంటిదే ఈ భీరుత్వవాదము.

ఎఱ్ఱయ ధీరవిచారుడు. తిక్కన ఆరణ్యపర్వశేషమును ఏల వదలిపెట్టెనో మనకు ఊహవిషయముగాని ఆయనకు నిశ్చయజ్ఞానవిషయమే. మా గురుపాదులు ఒక ఊహచెప్పిరి. భారతభాగములు పర్వములు గనుక భారతము పదునెనిమిది కణుపులు గల చెఱకుగడ. అందు రెండున్నర పర్వములు నన్నయచే రాజరాజునకు నివేదింపబడినవి. తిక్కనసోమయాజి భారతరచనము కొనసాగింప సంకల్పించి నప్పుడు హరిహరనాథుడు కలలో నగపడి—

'పారాశర్యుని కృతియై
భారతమను పేరఁబరగు పంచమవేదం
బారాధ్యము జనులకుఁ ద
ద్గౌరవ మూహించి నీ వఖండిత భక్తిన్.

తెనుఁగు బాస వినిర్మింపఁ దివురుటరయ
భవ్యపురుషార్థ తరుపక్వ ఫలముగాదె
దీనికెఱ నియ్యకొని వేడ్కనూని కృతిప
తిత్వమర్థించి వచ్చితిఁ దిక్కశర్మ'

అని పలికెను. తిక్కన ఆదేవుని అభ్యర్థన నంగీకరించెను. తాను వ్రాయబూనిన భారతమును ఆస్వామికి నివేదింప నిశ్చయించెను. నరునకు నివేదింపబడిన వస్తువును ఈశ్వరునకు నివేదించుట ఉచితముకాదుగనుక అయన రాజరాజు ఉచ్ఛిష్టమయిన ఆరణ్యపర్వమందలి శేషమును పరిహరించి— అనగా మూడు కణుపులను త్రుంచి వైచి— నాల్గవపర్వమునుండి పదునైదుపర్వములు ఈశ్వరునకు నివేదించెను.

రాజరాజు ఉపభోగించిన మూడుపర్వములు నన్నయచే ఆయనకు నివేదింపబడినట్లే భావించి నన్నయ మూడుకృతులు చెప్పెనని తిక్కన నుడివెను. ఆయన అభిప్రాయము తెలిసిన వారనయు ఆమాటయే అనెను

ఎఱ్ఱయ ఈ విషయములు వినెను. నాటికవులే చెప్పిరో, ఉభయకవిత్వప్రౌఢుడైన ఆయన తండ్రియే చెప్పెనో! అరణ్యపర్వశేషరచన తనకొక కర్తవ్యముగా నేర్పడినపుడు ఎఱ్ఱయ ధీరముగా విచారించెను. తిక్కనపై నాతని కమితమైన భక్తి. తిక్కన సమకాలికులైన వృద్ధులు ఆ మహనీయుని మహిమాన్వితమైన చరిత్రమును కొనియాడుట ఆయన చెవులారవినెను. తనతండ్రి నూరిపోసిన పదునేను పర్వముల సారమును చక్కగా జీర్ణించుకొనెను. తిక్కన కావించిన సృష్టి తక్కొరులచేతకాదని, ఆయన కవిబ్రహ్మయని మనసున పట్టించుకొనెను.

తిక్కన మూడుకృతులు అన్న మాటకర్థమేమి ? అయన దేవతా నివేదనమునకు పనికిరాదన్న దానిని తానెట్లు రచింపవలెను, ఎవ్వరికర్పింపవలెను ? వేదధర్మప్రియులైన సాధుజనులు తన్ను ప్రబంధ పరమేశ్వరుడని యెన్నికచేసి ఆరణ్యపర్వశేషము పూరింపుమని అర్థించుచుండిరి. ఎఱ్ఱయ ధీరముగా విచారించి నిశ్చయించుకొనెను. తిక్కనచెప్పినట్లు ఈ మూడుపర్వములు నన్నయపేరనే చెల్లవలెను. నరుని యుచ్ఛిష్టము ఈశ్వరున కర్పింపరాదుగదా ? ఒక నరుని యుచ్ఛిష్టమింకొక నరున కర్పింపవచ్చునా? అర్పింపరాదు. కనుక ఈ మూడుపర్వములు రాజరాజునకే నివేదింపబడవలెను. రాజరాజు నాస్థానమున సరసకావ్య రచనా ధురీణులైన కవులెందరో యుండిరి. అయినను రాజరాజు భారతాంధ్రీకరణమున నన్నయనే నియోగించెను. ఆ మిత్రుల జీవలక్షణముల సంవాదమట్టిది. రాజరాజునకు నన్నయకవితారీతి ప్రీతిపాత్రము. కనుక ఎఱ్ఱన నన్నయ కవితారీతియు కొంత తోచునట్లు వ్రాసిననే రాజరాజునకు ప్రీతికలుగును, తాను ప్రతిభావంతుడు. బాల్యమునుండియు తనపై ఉభయకవిత్వ ప్రౌఢుఁడయిన తన తండ్రి కవితారీతి ముద్రపడి యున్నది. దానిపై చెఱుపరానంత గాఢముగా తిక్కన ముద్ర పడి యున్నది. ఎఱ్ఱయ బుద్ధిపూర్వకముగా ప్రయత్నించి నన్నయ కవితారీతి కొంతయైనను తోచునట్లు అరణపర్వశేషము పూరింప నిశ్చయించెను. ఇది యంతయు ఎప్పటి మాట ?

## జననాభిజనములు

ప్రజ్ఞాపవిత్రుఁ డాపస్తంబసూత్రుండు
　　శ్రీవత్స గోత్రుఁ డూర్జిత చరిత్రుఁ
డగుబొల్లనకుఁ బోలమాంబకుఁ బుత్రుండు
　　వెలనాటి చోడని వలన మిగుల
మన్ననగన్న భీమనమంత్రి పౌత్రుండు
　　పేరమాంబామనః ప్రియుఁడు పోత
మాంబికావిభు సూరనార్యు మజ్జనకుని
　　బొల్లధీనిధికిని బోలనకును

జన్నసకు ననుజన్ముని గన్నతండ్రి
వేఁగినాఁటఁ గరాపర్తి వృత్తిమంతుఁ
డనఘుఁ డెఱపోతసూరి కంసారిచరణ
కమల మధుకరపతి సారవిమలయశుఁడు

ఈ పద్యమునుబట్టి ఎఱ్ఱన తాత తాతయైన భీమన వెలనాటిచోడని సమకాలికుడు. 1170–80 నడుమ ఆచోడనిచే మన్ననగన్న మంత్రి. భీమన జననము 1130 ప్రాంతము కావచ్చును. తరమునకు ముప్పదియైదేండ్ల చొప్పున చూడగా బొల్లన 1165 ప్రాంతమునను, ఎఱపోతసూరి 1200 ప్రాంతమునను పుట్టియుందురు. సూరనార్యుడు ఎఱపోతసూరికి నాల్గవకుమారుడు కనుక ఆయనపుట్టుక 1250 లో కావచ్చును. ఈ ప్రకారము ఎఱ్ఱయపుట్టుక 1285 ప్రాంతమగును. ఎఱపోత సూరి వేగినాట కరాపర్తి వృత్తిమంతుడై యుండెను. వెలనాటిచోడుల పతనము తరువాత తిక్కన కుటుంబమువలె ఎఱ్ఱన కుటుంబముకూడ నెల్లూరిమండలమునకు తరలిపోయెను, ఉభయ కవిత్వప్రౌఢుడైన సూర్యసుకవియే నెల్లూరిచోడులనో, అద్దంకి ప్రాంతమందలి పంటరెడ్లనో ఆశ్రయించుటకై నెల్లూరి మండలమునకు వచ్చి నీలకంఠేశ్వర స్థానమైన గుడ్లూరున నివాసమేర్పరచుకొనియుండును. ఎఱ్ఱన పాకనాటనే పుట్టినట్లున్నది. 'పోవంబనిలేదు', 'సందేహింపంబనిలేదు', అను తీరున నెల్లూరి మాండలికము తిక్కనకువలెనే ఆయనకును పట్టుపడినది. తిక్కన తఱచు ప్రయోగించు, నెల్లూరి మాండలికమా యనిపించు 'పొంపిరివోవు కూడ' ఎఱ్ఱనకు పట్టువడినది.

ఎఱ్ఱయతాత పరమవైష్ణవుడు— 'కంసారిచరణ కమలమధు కరపతి.' ఎఱ్ఱయ తండ్రి పరమశైవుడు— 'ఆరాధ్యసర్వజ్ఞుండు.' ఎఱ్ఱయ 'శంభుదాసుఁ డనంగాఁ బఱగియు గోవిందగుణాదర సంభృతసౌమనస్య ధన్యుఁడు.' తండ్రి తత్త్వము, తాతతత్త్వము ఆయనయందు జక్కఁగా సమన్వయమొందినవి. ఎఱ్ఱన శంకరస్వామి సంయమివల్ల దీక్షపొంది శంభుదాస లక్షణాధేయము నందియు గోవింద గుణాదరముచే నిండైన సౌమనస్యము పెంపొందించుకొని ధన్యుడగుటకు తిక్కన భారతసంసేవనము కూడ కొంత కారణము కావచ్చును. రామభక్తుడైన మల్లారెడ్డి ఎఱ్ఱననుచేపట్టి ఆతతశ్రీతో సముపేతుని చేయుటకు ఎఱ్ఱయ భవ్యచరిత్రయు, ప్రతిభా పాండిత్యములును మాత్రమే కాక ఈ సౌమనస్యము కూడ కారణమై యుండును.

క్రీ. శ. 1325 ప్రాంతముల మల్లారెడ్డి గుండ్లకమ్మ తీరముననున్న చెదలువాడలో శ్రీరామాలయము కట్టించెను. ఆయన అన్నయైన ప్రోలయ వేమారెడ్డి ఆ ఆలయమునకు ఒకగ్రామమును తమ్ముని పేర మల్లవరము అను పేరుపెట్టి అగ్రహారము గావించెను. ఆ సందర్భముననే మల్లారెడ్డి ఎఱ్ఱయను వేమారెడ్డికి పరిచయము చేసియుండును. మల్లారెడ్డికి అన్నగారనిన పరమభక్తి. రామునకు లక్ష్మణుడెట్టివాడో వేమయకు మల్లారెడ్డి అట్టివాడని ఎఱ్ఱయమే చెప్పినాడు, రామభక్తుడైన మల్లారెడ్డి ఎఱ్ఱయచే రామాయణము వ్రాయించి దానిని తన అన్నగారి పేర అంకితము చేయించెనని భావింపవచ్చును. ఎఱ్ఱయ ఈ విధముగా ప్రోలయ వేమారెడ్డి ఆస్థానకవియై అద్దంకిచేరుకొనెను. హరివంశ రచనము ఆరంభించు నప్పటికి ఆయనవయస్సు నలువదియేండ్లకు పైబడియుండవచ్చును.

1335 నాటి చీమకుర్తి శాసనమున వేమారెడ్డికట్టించిన శ్రీశైలాహోబిల సోపానముల ప్రసక్తిగలదు. హరివంశమున లేదు. కనుక అప్పటికే హరివంశరచన పూర్తియై యుండవలెను. ప్రోలయవేముని రెండవకుమారుడైన అనవేమారెడ్డి అప్పటికి పుట్టలేదు. పెద్దకుమారుడైన అనపోతారెడ్డి బాలుడు. హరివంశ తృతీయాశ్వాసాంతమున 'రామాయణ హరివంశ శ్రీమన్మధుర ప్రసంగసిద్ధ చిరయశస్సామర్థ్య కరణనిపుణా' అన్నసంబోధన యుండుటచే ప్రోలయ వేమారెడ్డి ఎఱ్ఱనచే సంస్కృత హరివంశమును ముందే విని పిమ్మట ఆంధ్రీకరణము చేయించినా యని పించుచున్నది. సంతానకాంక్షులు హరివంశ పారాయణముచేయుట పరిపాటి. "వంశవర్ధనము సమస్తపుణ్య ఫలదంబిది వక్తకు శ్రోతుకున్ నృపా' అని వైశం

షాయనుడు జయమే జయునకు చెప్పినమాట ఎఱ్ఱన వేమారెడ్డికి చెప్పినట్లున్నది. మూలహరివంశ పారాయణఫలముగా యువరాజైన అనపోతారెడ్డియు, ఆంధ్ర హరివంశ శ్రవణఫలముగా అనవేమారెడ్డియు జన్మించిరి కాబోలు.

అనపోతారెడ్డి 1364 లో వేయించిన కొల్లూరు శాసనములో ఆరాజు తమ్ముడు అనవేమ భూపతి ఎఱ్ఱయ ప్రగడగారికి కొంతభూమి ధారవోసినట్లున్నది. అనవేమారెడ్డి ఎఱ్ఱయపట్ల ప్రత్యేకమైన అభిమానమును చూపుటకు కారణము ఆంధ్ర హరివంశ శ్రవణఫలముగా తాను జన్మించి యుంటినన్న భావమే కావచ్చును. పూర్ణ పురుషాయుష జీవితధన్యుఁడైన తాతగారివలెనే ఎఱ్ఱయకూడ పూర్ణపురుషాయుష మనుభవించుచు 1360 తరువాతకూడ జీవించియుండెనే కాని హరివంశము వ్రాసి 1335 లో వేలూరి శివరామశాస్త్రిగారు చెప్పినట్లు మరణింపలేదు.

అయినచో 1335 నాటికే హరివంశ రచన ముగించి ఆమీద 1360 దాటువరకు ఎఱ్ఱన ఏమిచేసినట్లు? అరణ్యపర్వ శేషము వ్రాసెను. నృసింహపురాణము వ్రాసెను.

## గ్రంథముల ఆనుపూర్వి

1345 నాటి అమరావతి శాసనమువల్ల అప్పటికి మల్లారెడ్డి మరణించినట్లు తెలియుచున్నది. 1340 నాటి మంచాళ్ళ శాసనమువల్ల వేమారెడ్డి రాజధాని అద్దంకి నుండి కొండవీటికి మాఱినట్లు తెలియుచున్నది. అప్పటికే మల్లారెడ్డి మరణించి యుండెనేమో. మల్లారెడ్డి మూలముననే ఎఱ్ఱయ వేమారెడ్డి ఆస్థానమున ప్రవేశించెను. మల్లారెడ్డి అనిన ఆయనకెంత ప్రేమయో హరివంశము నందలి ఆశ్వాసాంత పద్యము లెన్నో చెప్పుచున్నవి. మనుమసిద్ధి మరణమువల్ల తిక్కన విరక్తుడైనట్లు మల్లారెడ్డి మరణమువల్ల ఎఱ్ఱయయు విరక్తుడై యుండును. రాజాస్థానము వదిలి, మిత్రుని స్మృతులను రేకెత్తించు చెదలువాడలో హృదయమునకు శాంతిలేక యెఱ్ఱయ తిరిగి నీలకంఠేశ్వరస్థానమైన గుడ్లూరునకే పోయినట్లున్నది. ఆస్తిపాస్తులు చెదలు వాడయందే యున్నను ఆయన మాత్రము గుడ్లూరునే నెలవు గావించుకొనెను, అచ్చటనే అరణ్యపర్వ శేషము వ్రాసెను.

అరణ్యపర్వశేషమే ఎఱ్ఱన తొలిరచనయని కొందఱందురు. రెండు వందల సంవత్సరములు ఎవ్వరును ముట్టసాహసింపనిది, తిక్కనవంటివాడు జీవితపరిపక్వ

దశయందుగాని చేపట్ట సాహసింపనిది అయిన భారతరచనమును ఎఱ్ఱయ తొలి రచనగా చేపట్టెననుట ప్రాచీన కవుల చిత్తవృత్తి నెఱుగక చెప్పెడిమాట. హరి వంశమునకు పూర్వమే ఆరణ్యపర్వశేషము వ్రాయబడి యుండినచో ప్రోలయ వేమారెడ్డి —

భారతపరాంశమని యిం
పారగఁజెప్పుదురు బుధుల్ హరివంశము నీ
వారమ్యకథ దెనుంగున
ధీరోత్తమ నిర్వహించి తెలుపుము మాకున్.

అని హరివంశ రచనకు ప్రోత్సహించునపుడు ఆరణ్యపర్వశేషము పూరించి నట్లే ఈ చివరి భాగమును గూడ నీవే పూరింపుమని చెప్పియుండవలసినది. ఆరణ్యపర్వశేష రచనాప్రసంగమునకు ఇది సరియైన యదను. ఇచ్చట అదిలేదు.

నృసింహపురాణమున ఎఱపోతసూరి—

'గిరిశ పదభక్తి రసత
త్పర భావము కలిమి శంభుదాసుఁడనంగాఁ
బరఁగియు గోవింద గుణా
దర సంభృత సౌమనస్య ధన్యుఁడ వెందున్,'

అనెను. శంభుదాసుడయ్యు 'గోవిందగుణాదర సంభృత సౌమనస్య ధన్యుఁడు' అనిపించుకొనుటకు ఎఱ్ఱయ గోవిందగుణ కీర్తన బంధురములైన గ్రంథము లేవేని రచియించి యుండవలెనుగదా. ఎఱపోతసూరి మఱియు నిట్లనెను,

గురుభజన పరాయణుఁడవు
సరసబహు పురాణ ధర్మశాస్త్ర కథా వి
స్తరవేదివి వినయోదయ
భరితుఁడ వతులానుభావ భవ్యుఁడవు మహిన్.

కావునఁ బ్రబంధ రచనా
ప్రావీణ్యము నీకు సహజపరిణతి సిద్ధం
బై వెలసినయది యొకకృతి
గావింప జగద్ధితంబుగా నేఁ బనుతున్.

ఇచ్చట ఈ రెండు పద్యములకు కార్యకారణభావము పొసగుటలేదు. రెండింటికి నడుమ రామాయణ హరివంశముల రచనను ప్రస్తావించు పద్యముండెనేమో. ఉండనిచో ప్రబంధ రచనా ప్రావీణ్యము నీకు సహజ పరిణతి సిద్ధంబై వెలసిన యది అను మాట యెట్లు పొసగును, సహజసిద్ధము వేఱు, సహజపరిణతి సిద్ధము వేఱు. ప్రబంధ రచనాశక్తి ప్రతిభావంతునకు సహజసిద్ధము కావచ్చును, అందలి ప్రావీణ్యము మాత్రము అభ్యాసమువల్ల పరిణమించి సిద్ధము కావలసినదే. కనుకనే యెఱ్ఱయ రామాయణ హరివంశములను రచించి ప్రబంధరచనా ప్రావీణ్య సిద్ధినంది ప్రబంధపరమేశ్వరుడుగా ఎన్నికచేయబడి వేదధర్మ ప్రియులైన సాధు జనుల హర్ష సిద్ధికొఱకు అరణ్యపర్వము పూరింప దొరకొనెను. భారతము ఆంధ్రీ కృతమైనది. దానికి శేషమైన హరివంశము ఆంధ్రీకృతమైనది. అరణ్యపర్వ శేషముకూడ ఆంధ్రీకృతమైనచో మహాభారతాంధ్రీకరణము సంపూర్ణ మగును.

మంత్రిభాస్కర హుళక్కి భాస్కరాదులు చూపినత్రోవన రామాయణము వ్రాయవచ్చును. నన్నయభట్ట తిక్కకవినాథులు చూపిన త్రోవన హరివంశము వ్రాయవచ్చును. అరణ్యపర్వశేషమును మాత్రము నన్నయ చూపిన త్రోవన కాక నన్నయ వ్రాసినట్లే వ్రాయవలసి యుండును. ఇది కత్తిమీదిసాము, ఎఱ్ఱయ ఎంతో పరిశ్రమచేసి ఆ సామునకు సిద్ధపడెను. నన్నయరీతి కొంత అలవఱచుకొని ఆయన వ్రాసినట్లే వ్రాసితినని తృప్తిపడి ఆయన నివేదించినట్లే రాజరాజునకు నివే దించెను. పర్వాంతమున రాజరాజును సంబోధించు పద్యములకు ముందే తన విష యమును వివరించు పద్యములుంచి 'ఇది నన్నయ సరససారస్వతాంశము. తత్క వితారీతియు కొంత తోప ఎఱ్ఱనార్యుడు రచించినది. కర్ణపుటపేయమైనది' అని రాజ రాజునకు నివేదించి "ఇది సకలసుకవిజనవినుత నన్నయభట్ట ప్రణీతంబయినది" అని ఆంధ్రులకు విన్నవించెను. జనమేజయునకు వైశంపాయనుడువలె రాజరాజు నకు 'పాండుతనయుల వనవాస ప్రకారంబు సవిస్తమధురంబుగా నుపన్యసించి' 'అనవరతానంద సుఖసమగ్రత' యొసగెను.

రామాయణమును ఎఱ్ఱన ప్రబంధమనెనో లేదో. హరివంశమును 'జగదర్చి తంబైన ప్రబంధంబు' అనెను. శ్రీకర కవిప్రబంధానేక అని ఆఱవ యాశ్వాసము మొదట ప్రబంధశబ్దము వాడెను. నృసింహపురాణమున ప్రబంధశబ్దమును ఆఱు పర్యాయములు వాడుటేకాక అందు రెండు పర్యాయములు మహాప్రబంధ శబ్దము కూడ వాడెను తాను 'మహాప్రబంధ కల్పనాకుతూహలాయత్తంబగు చిత్తంబుతో'

నున్నట్లు చెప్పినాడు. ఇంతవఱకు ఎఱ్ఱయచేసినవి అనువాదములు. ఇప్పుడు చేయ వలసినది మహాప్రబంధకల్పన. ఇది నైసర్గిక చాపలమనియు, కీర్తి సంగ సుఖ లీలకు కాంక్షచేయుట యనియు ఎఱ్ఱనభావించెను. ఇట్లనుటవల్ల నృసింహపురాణమును ఎఱ్ఱన ఆత్మప్రత్యయము లేని లేతవయస్సున రచించెను అందురు. రఘువంశము కాళిదాసుని కావ్యములలో చిట్టచివరిదని పండితుల యభిప్రాయము. కాని రఘు వంశారంభమున కాళిదాసు—

క్వసూర్య ప్రభవో వంశః క్వచాల్ప విషయామతిః
తితీర్షుర్దుస్తరం మోహాదుడుపేనాస్మి సాగరమ్.
మన్దః కవియశః ప్రార్థీ గమిష్యామ్యుపహాస్యతామ్,
ప్రాంశులభ్యే ఫలే లోభాదుద్బాహురివ వామనః.
రఘూణా మన్వయం వక్ష్యే తను వాగ్విభవోఽపి సన్
తద్గుణైః కర్ణమాగత్య చాపలాయ ప్రచోదితః.

అనెను. ఇది వినయమేకాని భయము కాదని పెద్దల యభిప్రాయము, ఎఱ్ఱన వాడిన మాటలు కాళిదాసు వాడినవే. ఈయనది మాత్రము వినయముకాక భయమెట్లగును? ఇది బాల్యరచన యెట్లగును? నిర్వచనోత్తర రామాయణమున 'అమలోదాత్త మనీష నే నుభయకావ్య ప్రౌఢి పాటించు శిల్పమునం బారగుఁడన్ కళావిదుఁడ' నని అహంకరించి పలికిన తిక్కన భారతమున 'నా నేర్చిన భంగిఁజెప్పి వరణీయుఁడ నయ్యెద భక్తకోటికిన్' అని ఎంతో వినయము ప్రకటించెను. హరివంశమున 'సకల భాషాకవిత్వ విశారదుఁడవు' అని వేమారెడ్డిచే చెప్పించుకొన్న ఎఱ్ఱయ నృసింహపురాణమున తాను వినయము ప్రకటించి, తాతచే 'వినయోదయ భరితుండవు' అని చెప్పించుకొనెను. ఎఱ్ఱయవినయము వయఃపారిపాకధర్మమే కాని బాల్య లక్షణము కాదు.

మల్లారెడ్డి ప్రీతికొఱకు రామాయణమును, వేమారెడ్డి ప్రీతికొఱకు హరివంశ మును రచించి ఎఱ్ఱన 'సాధుజన హర్షసిద్ధిఁగోరి' లోకారాధన బుద్ధితో ప్రతిఫల నిరపేక్షముగా ఆరణ్యపర్వ శేషము పూరించెను. మల్లారెడ్డి ఇచ్చిన ఆతతశ్రీ ఆయ నకు చాలియుండెను. ఫలాపేక్షచే రాజుల నారాధింపవలసిన యవసరము తీరిపోయెను. తన కవితాసంపత్తిచే లోకారాధనము, ఈశ్వరారాధనము చేసి తరించుటకు అనువైన చిత్తపరిపాకము ఆయనకు సిద్ధించెను.

ఎఱ్ఱన 'మహాప్రబంధ కల్పనా కుతూహలాయత్తంబగు చిత్తంబుతో' ఒక్క నాడు తదను సంధానానుబంధ సమాధి నిమీలితేక్షణుఁడై' యుండెను. భారత రచనము సంకల్పించి—

అని రచనా కౌతుకమున
మనమలరఁగ నీ ప్రబంధమండలి కధినా
థునిగా నే పురుషుని బే
ర్కొ్కను వాఁడనొ యను తలంపుగూరిన మదితో.

తిక్కనసోమయాజి యించుక నిద్రించిన సన్నివేశము వంటిదే ఈ సన్ని వేశము. తిక్కనకు వచ్చినట్లే ఎఱ్ఱయకును స్వప్నము వచ్చెను. కావ్యరచన సంక ల్పించిన వారికెల్ల, సంకల్పించినపుడెల్ల స్వప్నములురావు. లోకారాధనమును ఈశ్వరా రాధనమును ఆశయములుగా బెట్టుకొని తత్సాధన సమర్థములైన కావ్యములు నిర్మింప సంకల్పించి సమాధిగతులు కాగల పుణ్యాత్ములకే స్వప్నములువచ్చును. తిక్కనకు తండ్రియు, హరిహరనాథుడును దర్శనమిచ్చిరి. ఎఱ్ఱనకు తాతయు, నృసింహావతార కథయు దర్శనమిచ్చెను. పంచమవేదమైన భారతమును రచించుట భవ్యపురుషార్థ తరు పక్వఫలమనియు 'జనాభ్యర్చితమైన భారత మపార కృపా పరతంత్ర వృత్తిమైఁ బేర్చిన దేవదేవునకుఁ బ్రీతిఁగ నిచ్చుట సర్వసిద్ధి' అనియు తిక్కన తన ధన్యతను కొనియాడుకొనెను. ఎఱ్ఱయకూడ నృసింహపురాణము రచించి నృసింహదేవునకే అంకితము చేయుట పరమ ధన్యతగా భావించెను.

కృతికి విభుండు శ్రీ విభుఁడు, కీర్తిన పావనమైన తద్గుణ
స్తుతి కృతి, విష్ణుదాసులు యశోనిధు లూర్జిత పుణ్యు లుత్తముల్
కృతిఁ గొనియాడువారు, కృతకృత్యుఁడ నైతి మదీయ వాంఛిత
ప్రతతికిఁ బండఁ గల్పతరుపాకము శ్రీకరకావ్యరూపతన్

ఈ పద్యమందలి సన్నివేశ మెంతటి ధన్యతాహేతువో హరివంశమందలి సదృశ సన్నివేశముతో పోల్చిచూచినపుడు స్పష్టమగును.

నన్నయభట్ట తిక్కకవినాథులు చూపిన త్రోవ పావనం,
బెన్నఁ బరాశరాత్మజ మునీంద్రుని వాఙ్మయమాదిదేవుఁడౌ
వెన్నుని నివృత్త, మీవు కడు వేడుకతో వినునాయకుండ; వి
ల్లెన్నియొ సంఘటించె మదభీప్సిత సిద్ధికి రాజపుంగవా!

విష్ణుమహిమ వర్ణనాత్మకమైన ప్రబంధమును వేమయకు వినిపించుట ధన్యతయో విష్ణుదేవునికే వినిపించుట ధన్యతయో సహృదయులు భావింపగలరు హరివంశము చివఅ—

> శ్రీవేమ క్ష్మావల్లభ !
> భూవల్లభ పూజనీయ భుజవైభవ ! ల
> క్ష్మీవల్లభ ! గుణవితరణ
> పావన ! నినుఁ బొందుఁ గాత భవ్యశుభంబుల్.

అని వేమారెడ్డి ఉప్పు తినినందుకు హరివంశ సంకీర్తన ఫలమంతయు ఆయనకే ధారవోసి ఎఱ్ఱయ ఆయను ఋణము తీర్చికొనెను. సాధుజన హర్షసిద్ధిగోరి ఆరణ్యపర్వశేషము పూరించి తన్ను ప్రబంధ పరమేశ్వరుడని కొనియాడిన ఆంధ్రజాతి ఋణమును తీర్చికొనెను. తన పేరివాడని తన్ను ఎంతో ముద్దుగా చూచిన తాత 'అతులితానంద జలధి నోలాడుగాత' అనియు, తన్ను కనిపెంచి కవిగా తీర్చిన తండ్రి 'ముదావేశోజ్జ్వ లుండయ్యెడున్' అనియు నృసింహపురాణము రచించి పితృ ఋణము తీర్చుకొనెను. ఆ మహాప్రబంధమును నృసింహదేవున కంకితముచేసి దేవఋణము తీర్చికొనెను. ఈ విధముగా భవ్యచరిత్రుడైన ఎఱ్ఱన తన సాహిత్య తపస్సుచే సర్వఋణ విముక్తి సాధించి తనజీవితమును కవితను చరితార్థము చేసికొనెను.

## ఆరణ్యపర్వ శేష పూరణము

ఎఱ్ఱన రామాయణము నాంధ్రీకరించిన పద్ధతి యెట్టిదో ! 'వల్మీకభవు వచోవైఖరి రామాయణంబు నాంధ్రప్రబంధముగఁజేసె' నన్న మల్లన మాటనుబట్టి వాల్మీకి రామాయణమునకు అనువాద ప్రాయముగనే తన రామాయణమును రచెంచెనని ఊహింపవచ్చును. రామాయణము కావ్యముగనుక దాని యనువాదము పురాణేతిహాసముల యనువాదముకంటె కొంత భిన్నముగా నుండక తప్పదు. తొలి రచనముననే కావ్యానువాద పద్ధతి ననుసరించి యుండుటచే ఎఱ్ఱన అనువాదపద్ధతిపై దాని ప్రభావము కొంత పడక తప్పదు. పురాణేతిహాసముల అనువాదమునందు సాధ్యమైనంత సంక్షేపణము కావ్యానువాదమున సాధ్యముకాదు. ఆరణ్యపర్వ రచనమున ఎఱ్ఱన అనువాదపద్ధతి నన్నయపద్ధతికంటె కొంత విస్తరణాత్మకముగా ఉన్నట్లు కనబడుచున్నది.

| | | |
|---|---|---|
| నన్నయ అనువదించిన మూలము | — | 6981 శ్లోకములు |
| నన్నయ అనువాదము | — | 1299 గద్యపద్యములు |
| ఎఱ్ఱయ అనువదించిన మూలము | — | 6683 శ్లోకములు |
| ఎఱ్ఱయ యనువాదము | — | 1595 గద్యపద్యములు |

నన్నయమూలముకంటె ఎఱ్ఱయమూలము మూడువందల శ్లోకములుతక్కువ. నన్నయ యనువాదముకంటె ఎఱ్ఱన యనువాదము మూడువందల గద్యపద్యములు ఎక్కువ. మూలమునకు ఎక్కువ సన్నిహితమగుటయు, ఎడనెడ రసభావాను గుణములైన వివరణలు వర్ణనలు ఎక్కువగా చేరుటయు కారణములుగా ఎఱ్ఱయ యనువాదము నన్నయ యనువాదముకంటె కొంత భిన్నమై, తిక్కన మార్గము ననుసరించుచు, శ్రీనాథులకు త్రోవచూపుచున్నట్లున్నది.

మూలమున 739 శ్లోకములో నున్న రామోపాఖ్యానమును ఎఱ్ఱన 310 గద్య పద్యములలో రచించెను. అనగా విస్తరించెననియర్థము. అంతకు పూర్వమే వాల్మీకి రామాయణము నాంధ్రీకరించిన లక్షణములు, దానినొక చిన్న రసవత్ప్రబంధముగా రూపొందింపవలెనన్న ఆసక్తియు రామోపాఖ్యాన రచనమున స్పష్టముగా నగపడు చున్నవి.

జటాయువు నోడించి రావణుడు లంకాభిముఖుడై పోవుచుండగా సీత తన యాభరణములను మూటకట్టి జారవిడుచు సందర్భమున వ్యాసుని మూలము—

'యత్ర యత్ర తు వైదేహీ పశ్యత్యాశ్రమ మండలమ్
సరోవా సరితోవాపి తత్ర ముంచతి భూషణమ్
సా ద దర్శ గిరిప్రస్థే పంచ వానర పుంగవాన్
తత్ర వాసో మహద్దివ్య ముత్ససర్జ మనస్వినీ.'

ఈ సందర్భమున వాల్మీకి మూలము—

హ్రియమాణాతు వైదేహీ కంచిన్నాథ మపశ్యతీ
దదర్శ గిరిశృంగస్థాన్ పంచ వానర పుంగవాన్
తేషాం మధ్యే విశాలాక్షీ కౌశేయం కనకప్రభం
ఉత్తరీయం వరారోహ శుభాన్యాభరణాని చ
ముమోచ యది రామాయ శంసేయు రితి మైథిలీ.

ఇక్కడ ఎఱ్ఱయ రచన—

"జానకి దనకు దిక్కెవ్వరు లేమింజేసి నిరాశయై యొక్క శైలశృంగంబు నందుఁ గొందఱు వానరులు మెలంగుచున్నంగని తనకట్టినపట్టంబు కొంగు సించి భూషణంబులు ముడిచి తత్ప్రదేశంబున వైచె"

ఇచ్చట ఎఱ్ఱన వ్యాసుని వదలి వాల్మీకి ననుసరించుట స్పష్టముగనే ఉన్నది కదా. హనుమదాదులు సీతయునికి దెలిసికొనివచ్చి మధువనమున విహరించి సుగ్రీవ దర్శనమునకు వచ్చిన సందర్భమున వ్యాసుని మూలము—

'హనుమత్ ప్రముఖాశ్చాపి విశ్రాంతాస్తే ప్లవంగమాః
అభిజగ్ముర్హరీంద్రం తం రామలక్ష్మణ సన్నిధౌ'

ఈ సందర్భమున వాల్మీకి మూలము సుందరకాండ 62 వ సర్గము చూడ వలెను. ఇచట ఎఱ్ఱయ రచన—

తేనెలు గ్రోలిక్రోలి, కడుఁ దియ్యని కమ్మని పండు లింపుసొం
పానఁగ నానియాని, పరపందిన నీడలు మెచ్చిమెచ్చి, మం
దానిల శైత్యసౌరభ సమగ్రతకుం గడుఁజొక్కి చొక్కి, యు
ద్యానమునందు మారుతసుతప్రముఖుల్ విహరించి తృప్తులై,

ఇది వ్యాసుని మూలమునకు రమణీయమైన విస్తరణము. ఈ విస్తరణము నకు మూలము వాల్మీకి రామాయణము.

మాయాయుద్ధము విఫలము కాగా ఇంద్రజిత్తు యుద్ధరంగమునుండి మరలి పోయి తిరిగి యుద్ధము చేయవచ్చును. ఈ సందర్భమున వ్యాసుని మూలము—

"ఇంద్రజిత్ కృతకర్మాచ పిత్రే కర్మ తదాత్మనః
నివేద్య పునరాగచ్ఛత్ త్వరయాఽఽజిశిరః ప్రతి"

ఇచ్చట ఎఱ్ఱయ యనువాదము—

"ఆ రక్కసుండు తనచేసిన పౌరుషంబు ప్రతిహతం బగుటకు విస్మయం బంది మగుడి హోమకార్యంబును దొడంగంబోయిన నెఱింగి విభీషణుండు లక్ష్మణుం జూచి యిన్నిచునకు హోమసమాప్తి యయ్యెనేని నెవ్వరికిం గెలువ నశక్యంబు; వీని వెన్నడిం దగిలి తెగటార్పు మనిన నతఁడు"

ఆమూలకమైన యీ హోమకార్యప్రసంగము వాల్మీకినుండి తెచ్చుకొన్నది. రామాయణమున నీ సందర్భమున ఇంద్రజిత్తు నికుంభిళ యాగము చేయబోవును.

సీత యగ్నిప్రవేశ ప్రసంగము వ్యాసుని మూలమునలేదు. 'నేననలంబుఁ జొచ్చి వెడలెదఁ గనుఁగొనుము' అని యెఱ్ఱయ సీతచే ననిపించుట వాల్మీకిరామాయణ ప్రభావము వల్లనే.

## వర్ణనా కౌశలము

"విచిత్రాలంకారోజ్వల కవితాలాపకలాప సంతతానందమతీ" అనియు "మహాకావ్యరసప్రయోజనానందమతీ" అనియు ఎఱ్ఱయ రాజరాజును సంబోధించు నప్పుడు తన యభిరుచులనే ఆయనకు ఆరోపించుచున్నట్లు తోచును. ఎఱ్ఱయ కవితయందు జక్కన శబ్దవైచిత్రిని, శ్రీనాధుడు సూక్తివైచిత్రిని కనిపట్టియుండిరి. అలంకారసుందరములు, రసభావాది వ్యంజకములునైన యెఱ్ఱన వర్ణనలందీ లక్షణములున్నవేమో చూడవచ్చును. శబ్దవైచిత్రి యనగా అక్షరరమ్యత, సూక్తి వైచిత్రి యనగా అర్ధగతమైన ప్రౌఢతయని భావింపవచ్చును. ఆరణ్యపర్వశేష రచనయే వర్ణనతో నారంభమైనది. నన్నయ వర్ణించిన శరద్రాకాచంద్రికలలో మైమఱచి నిద్రించుచుండిన యాంధ్రజాతికి స్ఫురదరుణాంశురాగరుచి చూపి యెఱ్ఱన మెలకువ తెప్పించెను. వర్షర్తువు శరత్తుగా పరిణమించిన తీరు ఎఱ్ఱయ రమ్యముగా వర్ణించెను.

"దానాంభః పటలంబునం బృథుపయోధారావలిం దాల్చి. గ
ర్జానిర్ఘోషము బృంహితచ్ఛలనఁ బ్రచ్ఛాదించి, ప్రావృట్ పయో
దానీకంబు శరద్భయంబున నిగూఢాకారతం డిగ్గె నా
గా నొప్పారె మదోత్కట ద్విరద సంఘంబుల్ వనాంతంబునన్"

ఈపద్యమున 'దాల్చి' యన్న పదము 'దాచి' యని యుండవలయును. పృథుపయోధారలను దానాంభః పటలంబునను, గర్జానిర్ఘోషమును బృంహితమునను దాచికొని శరద్భయముచే మేఘములు ఆకాశమును వీడి యడవులలో మదపుటేనుగులై తిరుగుచున్నవి. మదపుటేనుగులు ప్రచ్ఛన్నవర్షా మేఘములుగా ఉత్ప్రేక్షింపబడినవి. "వారి ధారల, ననివారిత నిర్గళద్దాన ధారల"నని తృతీయాశ్వాసము-355 పద్య మున నన్నయ కావించిన వర్ణనమున కిది యవస్థాభేదము ననుసరించి చేయబడిన

రూపాంతర కల్పనము. అచ్చటి భ్రాంతి యిచ్చట ఉత్ప్రేక్షమైనది. స్వర్గమునుండి నన్నయ దిగివచ్చి యెఱ్ఱయ రూపమున గూఢముగా నరణ్యపర్వమున విహరించుచుండెనా యన్న మృదువైన ధ్వనియు నీ పద్యమున భావుకహృదయములను స్పృశించుచున్నది.

"విశద శారదాంబుద పరివేష్టనమునఁ
బొల్చు గగనంబు ప్రతిబింబమో యనంగ
విశద కాశవనీ పరివేష్టనమున
నతిశయిల్లె నిర్మల కమలాకరములు"

ఈ పద్యమందలి యుత్ప్రేక్షకు జన్మస్థానము "భూసతికిందివంబునకు" అన్న పద్యమందలి నన్నయ భావనయే. నన్నయ బింబము, ఎఱ్ఱయ ప్రతిబింబము.

"కలనీలకంఠ కోలా
హల లీలలు సెందె రాజ హంసకులంబున్"

అన్న భావమునకు బీజము "అరుదగు తత్పయోదసమయంబున" అన్న పద్యమున జూడవచ్చును. వర్షను శరత్తుగా నవతరింపజేయుటలో నన్నయ యెఱ్ఱయగా నవతరించినట్లుది.

సీ॥ కమనీయ కమలినీ కహ్లారదళ కేస
రాన్విత జలముల నర్ఘ్య విధియుఁ
దరళతరంగ హస్తములఁ బాద్యంబు, ను
న్మద చక్రసారస మధుపహంస
రుతులఁ బ్రియోక్తులు, రుచిరవానీర ని
వేశనచ్ఛాయల విశ్రమంబు,
మందసంచారిత మారుతంబుల నురు
తాపనోదనమును దగిలి యెపుడు

ఆ. వె. నాచరించుచును సమంచితాతిథి జన
సేవనమునఁ దనదు జీవనంబు
ఫలము నొంద నొప్పు పంపాసరోవరం
బెదురఁ గాంచి రన్నరేంద్ర సుతులు,"

ఈ పద్య మందలి పంపాసరస్సు వ్యాసుని విస్తరించి, వాల్మీకిని సంగ్రహించి, నన్నయను అనుకరించి 'గురుభజన పరాయణు'డైన యెఱ్ఱన రూపించి చిత్రించిన తపోవన గృహిణి. నన్నయ సముద్రము నుత్ప్రేక్షించిన జాడనుబట్టి యెఱ్ఱయ పంపాసరస్సును సందర్భోచితముగా రూపించె నని గుర్తింపవచ్చును. జీవన శబ్దమును శ్లేషించి సాదృశ్యము సాధింపబడినది.

"రాక్షసాః ప్రాద్రవన్ భయాత్" అను వ్యాసుని వాక్యార్థమును ఎఱ్ఱయ రాక్షసోచితమైన యుపమచే-

"ఆకులపడి నలుదెసలం
గాకులక్రియఁ జెదరి కడు వెగడుపడి రక్షో
నీకములు లంక యెనిమిది
వాకిళ్ళం దూఱెఁ బౌరవర్గము దలఁకన్"

అను పద్యమున కన్నులకు గట్టునట్లు చేసినాడు. జలధరద్విరదతతులను ప్రక్క ప్రక్కనే యుంచి భ్రమపెట్టిన నన్నయవలె ఎఱ్ఱనయు లంకను చుట్టుముట్టిన వానర సేనయందు దానిని చుట్టుముట్టియున్న ఘనసాగరవీచి రేఖను కానిపించినాడు—

"పరువడి మొత్తములై బం
ధుర ఘోషంబెసఁగఁ బొంగి తోతెంచు హరీ
శ్వర బలమునందు ఘన సా
గరవీచి వికాసరేఖ కానఁగనయ్యెన్"

వానర సేనకు సాగరమునకు సాదృశ్యము వ్యంజించు ఉక్తివైచిత్రి యిది. ఉపమా లంకారమున ఆర్థీభేదముగా దీనిని గణింపవచ్చును. ఆర్థీ ఉపమలు ఉక్తి చమ త్కారములు. శ్రీనాధునకిట్టి వానియందు మక్కువ. ఎఱ్ఱయ ప్రయోగించిన ఈ యుక్తి చూడుడు—

"అని తలంచుచు నల్లన యక్కుమారుఁ
జేరఁబోయిన నాతఁడు సితసరోజ
రేఖ దలకొనఁగా నలరించెఁ గన్ను
లవధరించెను నను లోచనాంచలముల"

నేత్రవికాసము సరోజవికాసమువలె నున్నదని చెప్పు ఉక్తివైచిత్రి యిది. ఈ ఉక్తివైచిత్రి నేత్రోన్మీలనానుభావవర్ణనమును చమత్కారము చేయుచున్నది. రసతత్పరుడైన ఎఱ్ఱన వివిధానుభావముల వర్ణన యందు నన్నయకంటె ఎక్కువ యాసక్తి ప్రదర్శించెను. ఇది తిక్కన ఫక్కి.

ఇంద్రద్యుమ్ను నెఱుంగుదువా యని నాడీజంఘాదులు ప్రశ్నింపగ అకూపారుండను కచ్ఛపము "ఒక్కింతసేపు దలఁచికొని, కన్నుగవ నశ్రుజలము లురుల, ఎలుంగు రాల్పడ వారలంగనుంగొని— అక్కట! నేనెఱుంగనె మహాగుణభూషణు నమ్మహాత్ము"ననుట చక్కని సాత్త్విక వ్యభిచారిభావానుభావ వర్ణన.

యోగనిద్రాభంగము గావించిన మధుకైటభులకు విష్ణువు వరమిత్తుననగా "కలకలనవ్వి యయ్యసురవరులు, నీవుమాకేమి యిచ్చెదు? నీక మేము వరము లిచ్చెద" మనుటయు. విష్ణువు 'నాచేమృత్యువు బొందుడిపుడు' అనగా "వారలొండొరుల మొగంబులు" చూచుట— మగని వశపచుకొను నుపాయము చెప్పుమని సత్యభామయడుగగా "మదినించుక గినుకవొడమ నడచుకొనుచుఁ గృష్ణ మృదుల హాసిని యగుచు నిర్వికారాకృతియై" సత్యభామను మందలించుట—

దుర్యోధనుడు విహారార్థము వచ్చుచున్నాడు, తొలగిపొండని పలికిన సేవకులపై గోపించి గంధర్వులు "ఒండొరువుల మొగంబులు సూచి పెలుచ" నవ్వుట— తిక్కన యమకరణములైనను చక్కని యనుభావ వర్ణనలు.

లంకలో సీతను జూచివచ్చి హనుమంతుడు శ్రీరామున కామె పంపిన చూడామణి నీయగా—

"అమ్మనోజ్ఞ రత్న మక్కువఁ గదియించి
పులక లెగయఁ గ్రొంతప్రొద్దు విభుఁడు
జానకీకుచాగ్ర సంగమ సుప్తుఁడై
నట్లయుండె ముకుళితాక్షుఁడగుచు"

అని వర్ణించుట విభావాది సామగ్రీసంయోగమున రసము సముల్లసింపజేయుట. శ్రీరామచంద్రుని కఠోరవాక్యముల విని మూర్ఛిల్లి తెలిసిన సీత వర్ణన తిక్కన యుత్తర రామాయణమున లక్ష్మణుని సందేశము విన్నప్పటి సీతవర్ణనమును బోలియున్నది.

"పరతి యల్లన మతికొంత వడికిఁదెలిసి
యలసమూర్తియై దండడి నశ్రు లురులఁ
గేలుమొగిడించి వసుమతీపాలుఁ జూచి
యెలుఁగు కుత్తుకఁ దగులంగ నిట్టులనియె"

"కాష్ఠదలనంబు సేయందొడంగి, శ్రమంపడి, యొల్లంబోయి, గొడ్డలి పుడమి పయివైచి నిరంతరనిశ్వాస వేగవివర్ణ వదనుండగుచు సావిత్రింగనుంగొని. సత్యవంతుడు—

"ఒడలు వశంబుగాదు, భ్రమనొందిన యట్లు మనంబు దూలెడిన్
గడగి శిరంబు శూలశిఖప్రకరంబుల నొంచినట్టి ద
య్యెడు, నిలువంగనోర్వ, నొకయించుక సేపు శ్రమంబుదీర నీ
యెడ శయనింతు ; నావుడు సితేక్షణ మొత్తని సంభ్రమంబుతో"

ఇది యెట్టియ మనస్తత్వనిరూపణ నైపుణిని ప్రదర్శించు స్వభావసుందర మైనవర్ణన. మాయలేడి చేష్టలను, వాలిసుగ్రీవుల ద్వంద్వయుద్ధమును ఎఱ్ఱయ ఆశ్చర్యకరమైన లోకజ్ఞతతో వర్ణించెను. ఎఱ్ఱయ నెల్లూరుమండలమున బుట్టి పెరిగినవాడు. కాటమరాజు కథకు రంగస్థలమైన ఆ సీమ పశువులకు కాణాచి. ఘోషయాత్ర పోయిన దుర్యోధనుడు చూచిన ఆలమందలు వెలిగొండలలోని పచ్చికబయళ్లలో కదుపులుగట్టియున్న ఆలమందలే. ఎఱ్ఱయ గోకదంబవర్ణన వ్యాసుని, భారవిని మించిపోయినది.

సీ. నానాసహస్ర సంఖ్యానంబులై సంత
తానంద విగత భయత్వలీల
నక్కాననమున నేదిక్కు సూచిన నతి
సంకులంబుగఁ గుందశంఖ చంద్ర
హారనీహార డిండీర పటీర ము
క్తాహారహీర సంకాశములును
గాదంబ కాలేయ కాదంబినీ నీల
జాల తమాలికా సన్నిభములు.

గీ. ప్రౌఢ బంధూక పల్లవ భాసితములు
వికచ కాంచన చంపక విస్ఫుటములు
నైన వర్ణంబులొప్ప నేత్రాభిరామ
భంగి నలరారు గోకదంబములఁ గనియె.

ఇన్నిరంగుల యావులు, ఇన్నివేలు మందలుగట్టి నేత్రాభిరామభంగి నలరారుట ఎఱ్ఱన ఎన్ని పర్యాయములు చూచి ఆ దృశ్యమును హృదయమున పదిలపఱచికొనెనో.

## ఛందస్సు

ఆరణ్యపర్వశేషమున ఎఱ్ఱయ రచించిన గద్యపద్యములు మొత్తము 1595. వాని వివరణములు.

| | | | |
|---|---|---|---|
| గద్యము | 496 | తరువోజ | 2 |
| కందము | 413 | ఉత్సాహము | 2 |
| సీసము | 102 | స్రగ్ధర | 2 |
| తేటగీతి | 109 | మహాస్రగ్ధర | 2 |
| ఆటవెలది | 91 | మాలిని | 1 |
| చంపకమాల | 135 | వనమయూరము | 1 |
| ఉత్పలమాల | 126 | లయగ్రాహి | 1 |
| శార్దూలము | 18 | మధ్యాక్కర | 1 |
| మత్తేభము | 69 | మధురాక్కర | 2 |
| మత్తకోకిల | 13 | స్రగ్విణి | 1 |
| తరలము | 8 | | |

గద్యములతో కలిపి మొత్తము 21 భేదములు. నన్నయరీతి కొంత తోచునట్లు చేయుటలో ఎఱ్ఱయ ఛందముల విషయమునను గొంతయత్నము చేసెను. ఇతరులు వాడని, తాను ఇతర గ్రంథములలో వాడని మధ్యాక్కరను, మధురాక్కరను నన్నయ వాడెను గనుక తానును వాడెను. సీసములందు, తేటగీతులందు, ఆటవెలదులందు నన్నయపాటించిన యతి, ప్రాసయతి నియములు తానును ఈ పర్వమున పాటించెను. నన్నయ వ్రాసిన 13 సీసభేదములలో 7 భేదములు

మాత్రమే వాడెను. కాని నన్నయ వాడిన సర్వప్రాసయతి సీసమున నొక విశేష నియమమును పాటించుచు రెండు సీసములు వ్రాసెను.

ఆరాజపుత్రుల, నారూఢ తేజుల,
వీరుల నున్నతోదార భుజులఁ
గనుఁగొని సుగ్రీవుఁ డనఘుఁ డగ్గిరిశృంగ
మునఁనుండి తానును దన సచివులుఁ
జింతించి, వారి వృత్తాంతము నెఱుఁగంగ
సంతతోత్సాహు, ధీమంతు, శౌర్య
వంతు నుత్తము, హిమవంతుఁడుఁబోని య
త్యంత సుస్థిరు, హనుమంతుఁ బనిచె

నతఁడు నరిగి నృపతి సుతుల తెఱంగెల్ల
నెఱిఁగి, వనచరేంద్రు నెఱుఁగఁ జెప్పి
యుగ్రతేజుఁడైన సుగ్రీవుతోఁ జెల్మి
యొనర సంఘటించె మనుజ పతికి

సీసపాదములందలి యుభయ ఖండములందును ఒకే ప్రాసాక్షరము పాటించుట యిందలి విశేషము.

ధృతరాష్ట్ర సఖుఁడైన యతిరథుండను సూతుఁ
డతివలుఁ దానును నతివిభూతి
గంగలో జలకేళి సంగతుండై యుండి
తుంగతరంగానుషంగ వశతఁ
జనుదెంచు మంజూషఁగని, కడువేడుకఁ
దన పరిజనములఁ బనిచి పట్టి
తెప్పించి ధీయుక్తి యొప్ప నేకతమున
నప్పెట్టె దెఱచి, తానప్పుడందు

వినుత హేమకవచుఁ గనకకుండలధరు
ననుపమానతేజు, ఘనుఁగుమారుఁ
గని, మనంబులోన ననయంబు విస్మయం
బొనర గ్రుచ్చి యెత్తికొని ముదమున

పై పద్యమందలి విశేషముతోపాటు దీనిలో ఎత్తుగీతి యందలి సర్వపాద ములందును ప్రాసాక్షరము పాటింపబడినది. నన్నయ రచనలో నిట్టివి లేవు. లాక్షణికులు చెప్పిన సీసభేదములలో నివి యిముడవు.

నన్నయ రచించిన 251 సీసములలో 225 సీసములకు ఎత్తు గీతులు ఆటవెలదులు. ఎర్రయరుచి దీనికి భిన్నము. ఆయన వ్రాసిన 102 సీసములలో 62 సీసములకే ఆటవెలదులు గలవు.

తేటగీతి, ఆటవెలది విషయమునగూడ నన్నయ నియమములను ఎఱ్ఱయ పాటించెను. వీనిలో మూడింట రెండు వంతులు కేవల యతిమైత్రి గలవి.

భిన్నవృత్తములను స్వీకరించుటలో నన్నయకు ఎఱ్ఱనకు ఎంతో రుచిభేదము కనబడుచున్నది. ఆరణ్యపర్వమున—

| | నన్నయవి | ఎఱ్ఱనవి |
|---|---|---|
| శార్దూలము | 2 | 18 |
| మత్తేభము | 10 | 69 |
| ఉత్పలము | 39 | 126 |
| చంపకము | 59 | 135 |
| కందము | 388 | 413 |
| గద్యము | 519 | 496 |

ఆరణ్యపర్వమున నన్నయ రచన 1299 గద్యపద్యము లనియు, ఎఱ్ఱన రచన 1595 గద్యపద్యములనియు దృష్టియందుంచుకొని చూచినచో నన్నయ కంటె ఎఱ్ఱన పద్యములందును, విశేషించి వృత్తములందును ఎక్కువ ఆసక్తి ప్రదర్శించినట్లు స్పష్టము కాగలదు. వారు రచించిన భాగములందలి వస్తుస్వభావము దీనికి కొంత కారణమైనను ప్రధానకారణము వారి యభిరుచి భేదమే.

## కవితారీతి

ఉన్నతగోత్రసంభవము నూర్జితసత్త్వము భద్రజాతి సం
పన్నము నుద్ధతాన్య పరిభావి మదోత్కటము న్నరేంద్ర పూ
జోన్నయనోచితంబు నయి యొప్పెడు నన్నయభట్ట కుంజరం
బెన్న నిరంకుశోక్తిగతి నెందును గ్రాలుట ప్రస్తుతించెదన్.

నన్నయనుగూర్చి ఎఱ్ఱన ప్రత్యేకించి చేసిన ప్రశంస యిది. నన్నయ భట్ట కుంజరముయొక్క నిరంకుశోక్తిగతి ఎఱ్ఱయను ఆకర్షించినది. 'తత్కవితా రీతియుఁ గొంతదోప' అరణ్యపర్వ శేషము రచింతునన్నపుడు 'రీతి' యనగా ఎఱ్ఱన పద సంఘటనా రూపమైన రీతినే ప్రముఖముగా ఉద్దేశించి యుండవలయును. నన్నయ యక్షర రమ్యతయు అందే అంతర్భవించును. నన్నయ పద్యరచనావిధానము అందే గతార్థమగును. ఇదియే ఎఱ్ఱయ అభిప్రాయమైనచో ఆయన తన సంకల్ప నిర్వహణ మున చరితార్థుడైనట్లే భావింపవచ్చును.

రయ విచలత్తురంగమ తరంగములన్, మదనాగనక్ర సం
చయములఁ జంచలచ్చటుల సైనిక మత్స్యములన్, మహోన్నతం
బయి కురురాజచంద్రు నుదయంబునఁ దద్దయుఁబొంగెఁ బ్రస్ఫుర
ద్భయదమనోహరప్రకట భంగులఁ దద్భటవార్ధి యుద్ధతిన్.

చామర పుండరీక విలసత్సిత చారుపతాకలం గురు
గ్రామణియాత్ర యెంతయును గాంతి వహించె నభంబు, శారదో
ద్దామ మరాళమండలసిత స్ఫుట పద్మవనీ పరిస్ఫుర
త్తామరసాకరంబున విధంబున భూచర నేత్రపర్వమై.

అతులితపుష్ప పల్లవ ఫలాన్విత భూరుహభూరి వల్లరీ
వితతముఁ జారుకైరవనవీన సరోరుహషండ మండలా
యతసరసీ మనోహరమునైన పురోపవనంబునన్ సము
న్నత విభవుండు వాసభవనంబు లొనర్పఁగఁ బంచియిమ్ములన్,

మొదటి పద్యమున సగము నన్నయ కవితయే. తక్కిన వానిలో కొంతయేకాక యుంచుమించుగా నంతయు నన్నయ కవితారీతియే. నన్నయ పద్యములే యని పించునవి ఎఱ్ఱయ రచనలో వందలు కలవు. అది ఆయన సాధనచేసి సాధించిన నైపుణి. ఇట్లని ఆయన వ్యక్తిత్వమును చాటు పద్యములు లేకపోలేదు.

అలస విలాస లాలస రసాన్వితలైన నితంబినీ జనుల్
వలసిన, భూరివిస్ఫురితవస్తు సమగ్రములైన గ్రామముల్
వలసిన, నుల్లసన్మణి సువర్ణవిభూషణ గోధనావళుల్
వలసినఁ గోరు మిచ్చెద ధ్రువంబుగ" నావుడు నాతఁడిట్లనున్.

దీప్తి లే కున్నఁ దన దైనదివ్యదీప్తి
విస్తరంబున నెప్పుడు వెలుఁగు దాని 848

వ. మఱియు ననాహితాగ్నులకు, నతీర్థసేవకులకు, ననృతవాదులకు, వేదవిరుద్ధాచారులకు రణపరాఙ్ముఖులకుఁ జొర నవిషయంబును, నతిగహ్వరంబును నైన దాని నమరావతిఁ జొచ్చి, తద్గోపురసమీపంబున ననవరతగండస్థలగళదవిరళ మదజలకుల్యాభిరామం బై, నిరంతర నిర్ఝరనీహారనగంబునుంబోలె నొప్పుచున్న యైరావతంబు జూచుచు సురసిద్ధసాధ్యగణంబుతో విద్యాధరాప్సరో గంధర్వకిన్నర గీయమానుం డగుచు జను నప్పుడు. 849

క. సకలర్తుకుసుమసౌరభ
సుకుమారోద్యానతరుల సుడియుచుఁ బ్రణయో
త్సుకుఁడై పవనుఁడు పాండవు
నకు నభిముఖుఁ డయ్యెఁ దన్మనఃప్రియ మెసఁగన్. 850

క. నరుఁడైన యాదిముని యని,
హరిసుతుఁ డని, హరిసహాయుఁ డని, హరుచేతన్
వరములు వడసినవాఁ డని
సుర లెల్లను వచ్చి పార్థుఁ జూచిరి ప్రీతిన్. 851

వ. అర్జునుం డయ్యమరావతీవిభవంబు చూచి హర్షించుచు నప్సరోగీయమాన మంగళహితగీతావహితమానసుం డగుచు, సిద్ధమునిగణాశీర్వాదంబులు సేకొనుచుం జని మాతలి నిర్దేశంబున దివ్యరథావతీర్ణుం డై. 852

క. శతమఖునకు, శుభపావన
రతశీలున, కఖిల దేవరాజర్షిసమ
న్వితునకు, వజ్రాంకితో
న్నతపృథుభుజునకుఁ గృతప్రణాముం డయ్యెన్. 853

చ. [illegible] బాహుఁడుం బ్రచలితాంగద [illegible]
[illegible]

## ఉపసంహారము

కలియుగధర్మము వర్ణించుచు ఎఱ్ఱన ఒక పద్యము వ్రాసెను.

> వివిధవ్యాఘ్ర మృగోరగాకులములై, వి స్తీర్ణశూన్యాటవీ
> నివహాభీలములై, యరాజకములై, నిర్ముక్తధర్మంబులై
> ద్రవిళాభీ రతురుష్క బర్బరపుళిందవ్యాప్తి దుష్టంబులై
> భువిలోనెల్లెడఁ బాడగున్ జనపదంబుల్ దస్యుగాంతంబునన్

కలిధర్మము అన్నిదేశము లందును వ్యాపించినది. ఆంధ్రదేశమున మాత్రము అడుగుపెట్టలేదు. వేమారెడ్డివంటి ప్రభువు, మల్లారెడ్డివంటి దండనాథుడు, ఎఱ్ఱాప్రెగ్గడవంటి భవ్యచరిత్రుడైన మహాకవి వేదధర్మమును రక్షించుచుండగా ఆంధ్ర దేశమున కలిధర్మము ఎట్లు కాలుపెట్టగలదు ?

తననాటి కవీశ్వరులచే ప్రబంధపరమేశ్వరుడని కొనియాడబడిన ఎఱ్ఱన నన్నయభట్ట తిక్కకవినాథుల కెక్కిన భక్తి పెంపున అరణ్యపర్వశేషము పూరించి, గంగాయమునలవంటి ఆమహనీయుల కవితానదీమతల్లుల నడుమ సరస్వతీనది వంటి తన కవితను అంతర్వాహినిగా చేసి ఆంధ్రమహాభారతమునకు కవితా త్రివేణీ సంగమ పవిత్రతను నమకూర్చెను. ఎఱ్ఱన ఎంత సౌమ్యమతియో ఆయన కవిత అంత సౌందర్యవతి. విఖ్యాతమాధుర్య మనోహరముగా ఆయన రచించిన అరణ్య పర్వశేషము ప్రతిపద్యరమణీయమైన పుణ్యకథాప్రబంధమండలి. దానియందములు సవిస్తరముగా నుపన్యసించుటకు ఈపీఠిక చాలదు. నాకు శక్తియును చాలదు.

వావిళ్ళ వారి ప్రతిని ఉస్మానియా విశ్వవిద్యాలయము వారి సంశోధితప్రతిని ఆధారము చేసికొని ఈ సంస్కరణమును సిద్ధము చేసితిని. ఈ పీఠికను తయారు చేయుటలో ఎందరెందరి రచనలో ఉపయోగపడినవి. వారందరికి వందనములు. ఈ ప్రతిని సిద్ధముచేయుటలో తోడ్పడిన శిష్యులకు ఆశీర్వచనములు.

అందఱికి అందుబాటులో నుండునట్లు ఆంధ్రమహాభారతమును పండ్రెండు సంపుటములుగా ప్రకటింపబూనిన ఆంధ్రప్రదేశ సాహిత్య అకాదమీ వారి ఉద్యమము ఉదారమైనది. పీఠికా సహితముగా అరణ్యపర్వమును సిద్ధముచేయు బాధ్యత నాకు అప్పగించి తాము తలపెట్టిన పుణ్యకార్యమున పాలుగొనుటకు నాకు అవకాశము కల్పించిన సాహిత్య అకాదమీ పాలకవర్గమునకు కృతజ్ఞత నివేదింతును.

ఇతి శివమ్.

23, జనవరి 1971. పాటిబండ మాధవశర్మ.

# విషయసూచిక

## ఆరణ్యపర్వము — ప్రథమాశ్వాసము



## ఆరణ్యపర్వము - ద్వితీయాశ్వాసము

## ఆరణ్యపర్వము – తృతీయాశ్వాసము

## ఆరణ్య పర్వము – షష్ఠాశ్వాసము

| విషయము | | పుట |
|---|---|---|


## ఆరణ్యపర్వము - సప్తమాశ్వాసము

| | | |
|---|---|---|

శ్రీః
గణేశశారదా గురుభ్యో నమః

# శ్రీమదాంధ్ర మహాభారతము

## ఆరణ్యపర్వము - ప్రథమాశ్వాసము

శ్రీకీర్తిశ్రీ వల్లభ
లోకజనస్తుత్య సర్వలోకాశ్రయ ర
త్నాకరపరివృతసకలధ
రాకాంత జితారి రాజరాజనరేంద్రా. 1

వ. అక్కథకుండు శౌనకాదిమహామునులకుం జెప్పె; నట్లు పాండవులు నిజాయుధంబులు ధరియించి కృష్ణాసహితులై యుత్తరము మించి యరిగిన నింద్రసేనాదులైన మూలభృత్యులు పదునాలుగు వేల రథంబులతోడ సుభద్రాభిమన్యు ప్రతి వింధ్యాదులం దోడ్కొని వారిపిఱుందన యరిగి; రంత నప్పాండవులం జూచి పౌరు లెల్లఁ బరమదుఃఖితులై. 2

క. "చనునె యధర్మద్యూతం
బున నిట్టుల పాండురాజపుత్రులఁ బ్రభులన్
వనగతులఁ జేయ దుర్యో
ధనధృతరాష్ట్రులకు విగతదయహృదయులకున్? 3

క. క్రూరతరధార్తరాష్ట్రు ని
కారము వారింప రైరి గాంగేయుఁడు న
బ్భారద్వాజుఁడుఁ గృపుఁడు ను
దారుఁడు విదురుండు; నేమి దలఁచిరో బుద్ధిన్? 4

సీ. కర్ణజయద్రథగాంధారు లాప్తులై
యుండంగ లోభి దుర్యోధనుండు
రాజు గా నీతని రాజ్యంబునం దెట్టు
లుండఁగ నేర్తు? మీయుర్వి నింక

నేది ధర్మువు? ప్రజ యెవ్వరు గాతురు ?
పరమధార్మికులైన పాండుసుతుల
యరిగినచోటికి యరుగుద"మని వారి
పిఱుఁదన చని పాపభీతమతులు

ఆ. "వీరులార ! మమ్ము విడిచి మీ కరుగంగఁ
జనునె ? మాకు నొండుశరణ మెద్ది ?
సాధులకు నసాధుసహావాసమునఁ బాప
సంప్రయోగ మగుట సందియంబె ? 5

క. తిలలును నీళ్ళును వస్త్రం
బులుఁ బుష్పసుగంధ వాసమున సౌరభముం
బోలు పెసఁగఁ దాల్చుఁ గావున
నలయక సత్సంగమమున నగు సద్గుణముల్. 6

వ సాధుసమ్మతంబులైన గుణంబుల నొప్పి జన్మవిద్యాకర్మంబులం బ్రశస్తుల రై యార్యవృత్తుల రైన మీసహావాసంబుననుండి ధర్మపరులమై కృతార్థుల మగుదుము; దుష్కృత్యంబులయం దనారంభు లయ్యును జనులు దుర్జనదర్శనస్పర్శనసంభాషణసహాసనంబులం జేసి ధర్మవిహీను లగుదురు; గావున నేము దుర్యోధను రాజ్యంబున నుండ నోపము; మా యనుగమనంబున కొడంబడవలయు"నని కృతాంజలులైన నప్పౌరులం జూచి ధర్మతనయుం డిట్లనియె 7

క. "మాయందు లేని గుణములు
మీ యనురాగమునఁ జేసి మిగిలి వెలింగెఁ;
మీ యనుగతి మాకు నభి
ప్రాయము; వనవాసదుఃఖభర మోపుదురే ? 8

తే. వలవ దుడుగుండు మీ"రని వారినెల్లఁ
గరుణఁ బాండవజ్యేష్ఠుండు గ్రమ్మఱించెఁ;
బౌరు లట్టు నివర్తింపఁబడి నిరంత
రార్తనాము లై యరిగిరి హస్తిపురికి. 9

వ. ఇట్లు పాండవులు గృతప్రస్థానులై గంగాతీరంబునం బ్రమాణాఖ్య వటంబున విడిసి గంగాస్నానంబు సేసి నాఁటిపగలును రాత్రియు నంద యుండి; రంతఁ బ్రభాత సమయంబున. 10

చ పరువడి నగ్నిహోత్రములు, బంధులు, శిష్యులుఁ దోడ రా మహీ
సురవరు లెల్లఁ బాండునృపసూనుల యొద్దకుఁ బ్రీతి నేఁగుదెం
చిరి బహువేదఘోషములఁ జేసి నిరస్తసమస్తకిల్బిషో
త్కరు లగుచున్న ధన్యులు జగత్పరిపూజ్యులు బ్రహ్మసమ్మితుల్ 11

వ. ఇట్లు దమతోడన వనవాసంబు సేయ నిశ్చయించి వచ్చిన విప్రుల నతి ప్రీతి గౌరవంబున నర్చించి తదాశీర్వాదంబుల నభినందితుం డై ధర్మ తనయుండు వారల కిట్లనియె. 12

క. "అపహృతసర్వస్వుల మై
సపత్నుల నికారమునఁ బ్రచండాటవిలో
విపులఫలశాక మూలము
లుపయోగించుచును నిష్ఠ నుండెదు మాతోన్.  13

క. రా నేల? వచ్చి నవయం
గా నేల? నివాసములకుఁ గ్రమ్మఱి చనుఁ; డు
గ్రానేకపశార్దూలభ
యానకవనవాస మర్హ మగునే మీకున్?" 14

వ. అనిన విని బ్రాహ్మణులు పరమదుఃఖితులై "మీర కాని మాకు నొండు గతి లేదు; మమ్ము ననన్యశరణ్యుల విడుచుట ధర్మంబు గాదు. 15

ఆ. ఆశ్రితులను, భక్తు లగు వారి నన్యుల
నైన విడువఁజాల రట్టె! విప్ర
వరుల, భక్తిపరుల వసుధేశ! మీయట్టి
ధార్మికులకు విడువఁ దగునె చెపుమ? 16

వ అస్మత్పోషణోపాయచింత సేయ వలదు; వన్యమూలఫలంబుల నేమ తెచ్చికొని యుపయోగించుచు జపహోమాది పుణ్యక్రియల మీకుం బ్రియంబు సేయుచునుండెద; మధర్మవర్తి యయి మీ కపకారంబు సేసిన ధార్తరాష్ట్రుల రాష్ట్రంబున నుండ నోప" మనిన వారలరాక కొడంబడి. 17

తే. "ఇష్టమృష్టాన్నములఁ దొల్లి యెల్లప్రొద్దుఁ
దృప్తు లగుచున్న వసుమతీదేవవరులఁ
గానలందు శాకాశనుల్ గాఁగ నెట్లు
సూడనోపుదు"నని ధర్మసూనుఁ డపుడు. 18

—: శౌనకుఁడు ధర్మరాజునకు ధర్మంబులు సెప్పుట :—

వ. శోకమూర్ఛితుండై మహీతలంబుపయిం బడిన నాతని నాశ్వాసించి శౌనకుండను బ్రహ్మఋషి దొల్లి యాత్మవ్యవస్థానార్థంబు జనక కృతంబు లయిన శ్లోకంబుల యర్థంబులు యుధిష్ఠిరున కిట్లనియె. 19

క. "శోకభయస్థానంబు ల
నేకంబులు గలిగినను విహీనవివేకుం
డాకులతఁ బొందునట్లు వి
వేకము గలవాఁడు బుద్ధివికలుం డగునే ? 20

క. శారీరమానసమహా
దారుణదుఃఖములఁజేసి తఱఁగి శరీరుల్
క్రూరతరబాధఁ బొందుదు;
రారెంటిని జెఱుతు రార్యు లమలినబుద్ధిన్. 21

వ. వ్యాధి శ్రమానిష్టసంస్పర్శనేష్ట వివర్జనంబులను నాల్గింటంబుట్టి శారీర దుఃఖంబు లౌషధక్రియాది ప్రతియోగంబుల నుపశమిల్లు; మఱి స్నేహ జంబు లయిన మానస దుఃఖంబులు జలంబుల నగ్ని యుపశమిల్లునట్లు విమలజ్ఞానంబునం జేసి యుపశమంబునం బొందు. 22

క. స్నేహార్ణవమగ్నుం డయి
దేహి మహాదుఃఖముల నధృతిఁ బొందును; దుః
ఖాహతుఁడు శోకతాపవి
మోహి యగున్; స్నేహమూలములు రాగాదుల్. 23

వ. కావున బంధుమిత్రధనసంచయంబులవలని స్నేహంబు విడుచునది; పద్మపత్రంబు నీరం బొందనియ ట్లెఱుకగలవారి నెట్టియెడలను స్నేహంబు వొందదు; స్నేహంబున రాగంబును రాగంబునం గామంబును గామంబునం గ్రోధంబును గ్రోధంబునం దృష్ణయు వర్తిల్లు. 24

క. అది సర్వదోషముల కా
స్పద; మది దురిత క్రియానుబంధంబులకుఁ
మొదలు; నిరంతరదుఃఖ
ప్రద మని మది దలఁచి తృష్ణఁ బాతురు సుమతుల్. 25

వ మఱియుఁ దృష్ణాతురుం డర్థలోభంబునఁ గోటరస్థం బయిన యనలం బునం జేసి దగ్ధంబగు వృక్షంబునుంబోలె వినాశంబునం బొందు; నర్థాసక్తుండైన వాఁడు శుభంబులు వడయ నోపండు; మృత్యువువలనం బ్రాణులకు భయంబు గలుగున ట్లర్థవంతులకు రాజ చోర స్వజన జలానలంబులవలన భయంబు నియతంబు. 26

తే. జలములందు మత్స్యంబులు, చదలఁ బక్షు
లామిషం బెట్లు భక్షించు నట్లు దివిరి
యెల్ల వారును జేరి యనేకవిధుల
ననుదినంబును భక్షింతు రర్థవంతు 27

క అర్థమ యనర్థమూలం;
బర్థమ మాయావిమోహనావహము; నరుం
డర్థార్జనదుఃఖమున న
పార్థీకృతజన్ముఁ డగుట పరమార్థ మిలన్. 28

వ. అట్టియర్థంబువలన దర్పకార్పణ్యమానభయోద్వేగంబులు పుట్టుఁ గావున నర్థోపార్జనచింత సేయవలదు; రూపయౌవన ధనవిభవ ప్రియ సంవాసంబు లనిత్యంబులగుట నందు బుద్ధిమంతులు విమోహింప"రనిన నమ్మునివరునకు ధర్మతనయుం డిట్లనియె. 29

సీ ఆత్మోపభోగార్థ మర్థలాభేచ్ఛ నా
కెన్నండు లేదు; మహీసురాగ్ర
గణ్యుల నత్యుగ్రకాననాంతరమున
నెవ్విధంబున భరియింతునొక్కొ
యని యిప్డు వగచెద; ననవద్యగుణయుక్తి
ననఘ! మాయట్టి గృహస్థతతికిఁ
బోష్యుల నెయ్యేడఁ బ్రోవక యుండను
విప్రుల నతిథుల వృథయ పుచ్చఁ

ఆ. జనునె ? నిజధనంబు సంవిభాగించి యీ
వలయు; సాధురతు వలయుఁ జేయ;
నఖిమతాశ్రమంబు లందు గృహస్థాశ్ర
మంబ కాదె యుత్తమంబు వినఁగ. 30

వ. మఱి యార్తునకు శయనంబును, భీతున కభయంబును, దృషితునకు జలంబును, బుభుక్షితునకు నన్నంబును, శ్రాంతునకు నాసనంబును నిచ్చుట సనాతనం బైన యుత్తమగృహస్థధర్మంబు; తృణభూమ్యుదకప్రియవచనాదరదానం బెల్లవారికి నవశ్యంబ; యాత్మార్థంబుగా నన్న పాకంబును, నసాక్షిక భోజనంబును, వృథాపశుఘాతంబును బాపహేతువు; లగ్నిహోత్రంబులు, ననడ్వాహంబులు, నతిథిబాంధవ విద్వజ్జన గురు మిత్రభామినీ నివహంబు లపూజితంబులై యెగ్గు సేయును; గావున గృహస్థుండు సర్వసంతర్పకుండు గావలయుం; గావునం బ్రతిదినంబును బక్షిశునకశ్వపచార్థంబు సాయంప్రాతస్సుల యందు వైశ్వదేవంబు సేసి యమృతాశియు, విఘసాశియుఁ గావలయు; యజ్ఞశేషం బమృతంబు నాఁ బరఁగు; నతిథిభుక్తశేషంబు విఘసంబు నాఁబడు; నట్టివృత్తి వర్తిల్లువాఁ డుత్తమగృహస్థుం" డనిన ధర్మరాజునకు శౌనకుం డిట్లనియె.

క. "హరివిషయాభిలాషము
గారణముగ నెంత యెఱుక గలవారును దు
ర్వారవికారముఁ బొందెదు
వారు నిజేంద్రియము లవి యవశ్యము లగుటన్. 32

వ. సంకల్పజంబైన కామంబునం దగిలిన మనస్సుచేతం బ్రేరితంబై శ్రోత్రాదీంద్రియంబులు శబ్దాదివిషయంబులం బరిభ్రమించుటం జేసి విషయాభిలాషవిశిఖవిద్ధులై దేహులు తేజోలుబ్ధంబులైన శలభంబులుం బోలె శోకానలంబునం బడి తమ్మెఱుంగక యవిద్యాకర్మతృష్ణలం జేసి సంసారచక్రంబునందుఁ బ్రవర్తిల్లుదు; రట్టి బ్రహ్మాది తృణపర్యంత భూతప్రవృత్తియందు రాగద్వేషవిముక్తులై యభిమానమత్సరంబులు విడిచి వేదచోదితంబైన సమ్యక్సంకల్పసంబంధం, బింద్రియనిగ్రహంబు, వ్రతవిశేషంబు, గురుసేవనం, బాహారయోగం, బధ్యయనాగమంబు,

'కర్మసన్న్యాసంబు, చిత్తనిరోధం బను నెనిమిదింటను గర్మానుష్ఠానంబు సేసిన మహాత్ములు దమ తమ తపోమహత్త్వంబునం జేసి సంసారంబు జయింతురు; నీవును శుశ్రూషా శ్రవణ గ్రహణ ధారణోహాపోహార్థ విజ్ఞాన తత్త్వజ్ఞాన సమన్వితుండవు; నీచేతం బ్రారబ్ధంబు లైన యవి సర్వంబులును సంపన్నంబు లగు. 33

క. వసు రుద్రాదిత్యాదులు
వసుధేశ! తపంబు గౌరవంబున నైశ్వ
ర్యసమృద్ధు లైరి; తపమునఁ
బ్రసిద్ధముగ నిష్టసిద్ధి వడయుము నీవున్. 34

వ. తపస్సిద్ధు లైనవారు దమ తలంచినదానిని క్రమంబునం బడయుదురు; గావున నీవు నుపశమవంతుండవై తపంబు సేసి యోగార్థసిద్ధి వడసి బ్రాహ్మణుల ననుచరించుచు నీమనోరథంబు సఫలంబు సేయు'' మనిన శౌనకు వచనంబు సేకొని భ్రాతృమధ్యగతుం డైన ధర్మతనయుండు ధౌమ్యునకు నమస్కరించి యి ట్లనియె. 35

తే. ''వనమునకు వచ్చి నవయంగ వలవ దుడుగుఁ
డనిన నుడుగక మీతోన యరుగుదెంతు
మనిరి బ్రాహ్మణుల్; వీరి కాహార మేయు
పాయమున నుగ్రవనమునఁ బడయనేర్తు? 36

వ. వీరల విడువనోప; నేమి సేయుదు?'' ననిన విని ధౌమ్యుండు పెద్దయుం బ్రొద్దు చింతించి ధర్మరాజున కి ట్లనియె. 37

ఆ. ''భూతరాశి దొల్లి పుట్టి బుభుక్షాభి
తప్త మయినఁ జూచి తద్భయంబు
నపనయింపఁ గడఁగి యదితిసుతాగ్రణి
గమలబాంధవుండు గరుణతోడ. 38

వ. ఉత్తరాయణగతుం డై యుర్వీరసంబు పరిగ్రహించి, దక్షిణాయన గతిం బర్జన్యభూతుం డై యోషధులం బడసి, రాత్రులయందుఁ జంద్ర కిరణామృతంబునం జేసి వానిం దడుపుచు వర్ధించి, యం దన్నంబు పుట్టించి ప్రజారక్షణంబు సేయుటం జేసి యన్నం బాదిత్యమయం బని

యెఱింగి తొల్లి భీమసైన్యకార్తవీర్యనహుషాదులు యోగసమాధిస్థితులై సూర్యభజనంబున నన్నంబుఁ బడసి యాపదలవలనం బ్రజల సముద్ధరించిరి గావున. 39

లయగ్రాహి.

వారిరుహమిత్త్రు, నమరోరగమునిద్యుచర
చారణగణప్రణుతచారుగుణు, లోకా
ధారు, నఖిల శ్రుతిశరీరు, హరిశంకరస
రోరుహభవప్రతిము, దారుణతమిస్రా
వారణమరీచిపరిపూరితదిగంతరుని,
భూరికరుణానిరతు, సూరుఁ, ద్రిజగద్ర
క్షారతు సహస్రకరుఁ, గోరి భజియింపుము మ
నోరథఫలంబు లగు భూరమణ నీకున్.'' 40

వ. అని ధౌమ్యుండు విశుద్ధాంతఃకరణుం డైన ధర్మరాజునకు సూర్యుం డర్యముండు, భగుండను నివి మొదలుగాఁగల నామంబుల యష్టోత్తరశతంబు నభీష్టసిద్ధిప్రదం బయిన దాని విస్పష్టార్థవర్ణోచ్చారణంబును విధియుక్తంబునుగా నుపదేశించి ''దీనిని దొల్లి యింద్రువలన నారదుండు వడసె; నారదువలన వసువను రాజు వడసె; నాతనివలన నేను బడసితి; నేను నీ కిచ్చితి; నిది దేవనిర్మితంబు; దీన నాదిత్యు నతిభక్తి నారాధింపు'' మనిన. 41

—: ధర్మరాజు సూర్యునారాధించి వరంబు గొనుట :—

సీ. హితుఁడైన తనపురోహితు నుపదేశంబు
పేర్మితోఁ జేసికొని, ధర్మసుతుఁడు
నెమ్మిఁ బుష్పోపహారమ్ముల నాదిత్యుఁ
బూజించి, భాగీరథీజలంబు
లందుండి విషయంబులం దింద్రియంబుల
నమలవ్రతానుభావమున నొడిచి,
వాయుభోజనుఁడు ప్రాణాయామపరుఁడునై
సూర్యనామంబుల సూర్యుఁ గొలిచి

ఆ. జపము సేయుచున్నఁ దపనుఁ డాతనికిఁ బ్ర
త్యక్షు మయి త్రిలోకచక్షుఁ డమర
వరుఁడు దురితహరుఁడు తరణి త్రయీమూర్తి
వనజమిత్త్రుఁ డిట్టు లనియెఁ గరుణ. 42

వ. "నీ తపమునకు మెచ్చితి; నీ పండ్రెండేండ్లును వన్యఫలమూలశాకం బులు నీ మహానసంబున ద్రుపదరాజపుత్రిచేత సాధితంబులై యక్ష యంబు లైన చతుర్విధాహారంబులగు" నని యొక్క తామ్రస్థాలి యిచ్చి వరం బిచ్చి వనజహితుం డంతర్హితుండైన. 43

చ. అడరఁగ ధర్మనందనుఁ డహర్పతిచేత వరంబు పేర్మితోఁ
బడసి మహీసురోత్తముల భవ్యులఁ బల్వుర నిర్వహించె న
ప్పుడు ద్రుపదాధిరాజసుత పొల్పుగ వండినశాకమూలముల్
గడురుచి నిష్టభోజనసుఖంబులఁ దృప్తులఁ జేయు చుండఁగన్. 44

వ. ఇట్లనేక సహస్రమహీసురవరుల ననుదినంబును నభిమతభోజనంబులం దనిపి విఘసామృతభోజనంబులం దృప్తులైన తన పతుల భుక్తశేషంబు ద్రుపదపుత్రిక యుపయోగించుచుండ గొన్నిదినంబు లంద యుండి పాండవులు బ్రాహ్మణులచేతం గృతస్వస్త్యయనులై బ్రహ్మర్షిసంఘం బులతోఁ గామ్యకవనంబున కరిగి; రంత నిట ధృతరాష్ట్రుండు విదురుం బిలిపించి "నీవు భార్గవుకంటె బుద్ధిమంతుఁడవు; పాండవకౌరవులకు సమ్మతుండవు; చెప్పు మింక నప్పాండవు లేమి సేయువా" రనిన విదురుం డి ట్లనియె. 45

మత్తకోకిలము. "దేవమూర్తులు పాండుపుత్త్రులు ధీరచిత్తులు; వారి పెం
పీ వెఱుంగనివాఁడవే? ధరణీశ! వాయుసుతుండు, గాం
డీవియుఁ భుజవిక్రమప్రకటీకృతుల్, వివిధాస్త్రవి
ద్యావిశేషులు; వైరివీరులఁ దక్కనిత్తురె పోరులన్? 46

క. మొనసి యధర్మద్యూతం
బున భేదము పుట్టుఁ బాండుపుత్త్రులకును నీ
తనయుల కని మును చెప్పిన
విన నొల్లక కొడుకుపలుకు వింటివి కడఁకన్. 47

వ. ఇంక నయినను వారి రావించి, తొల్లి నీచేతం బడయం బడిన రాజ్యంబునందుం బ్రతిష్ఠించి, కీర్తియు ధర్మంబును నిలుపుము; రాజ్యంబును త్రివర్గంబును ధర్మమూలంబులు; గావున నందవర్తిల్లు; ధర్మువు విడిచి యధర్మవర్తి యయి కర్ణశకుని దుశ్శాసనశిక్షితుం డైన దుర్యోధను దుశ్చేష్టితంబులు కొడంబడ వలదు. 48

తే. వీడు పుట్టిన పాపంపువేళఁ బెక్కు
దుర్నిమిత్తముల్ పుట్టిన నిర్ణయించి
యేను జెప్పితిఁ దొల్లియు వీనిచేత
నెట్టిఁ గౌరవులకు నెగ్గు పుట్టు ననియు. 49

వ. కులదూషకు దూషించి కులంబు రక్షించుట ధర్మువు; ధర్మరాజు నఖిల మహీరాజ్య రక్షకుం జేసి పుత్త్రపౌత్త్రమిత్త్రామాత్యబంధువర్గంబుల నెల్ల రక్షింపుము; సభామధ్యంబునందు ద్రౌపదీభీమసేనులం బ్రార్థింప దుశ్శాసనుం బంపుము. 50

చ. అతిశయితామరోత్తముఁ, డహర్పతితేజుఁ, డజాతశత్రుఁ, డూర్జితుఁ, డజితుండు నీసుతులు సేసినయెగ్గు దలంపఁ; డాతనిన్ ధృతి నభిషిక్తుఁ జేయుము ప్రతీపకులోద్వహ! యిట్లయైన నీ కృతమునఁ గౌరవాన్వయ మకిల్బిషకీర్తిఁ బ్రకాశితం బగున్." 51

వ. అని పలికిన విదురు పలుకులు విని కడు నలిగి ధృతరాష్ట్రుం డిట్లనియె. 52

క. నాదేహంబునఁ బుట్టిన
యాదిసుతున్ విడువ నెట్లు లగు? నాత్మజులం
గాదనక విఘాతించు ద
యామారులు గలరె? యిట్లు లన నీ కగునే? 53

**—: విదురుఁడు ధృతరాష్ట్రుని విడిచి పాండవులయొద్దకుఁ బోవుట :—**

వ. నీవు నాకొడుకులయున్నతి కెన్నండు సహింపవు; నీసహాయత్వంబు నేనొల్లఁ; బాండవులకడకేనియు, నొండుగడకేనియు నీ కిష్టంబైన చోటికి నరుగు" మనిన నాక్షణంబ విదురుండు మనోజవైకరథారూఢుం డై పాండవులకడకుం గామ్యకవనంబున కరిగె; నంత నతని రాక దవ్వులం గని ధర్మరాజు భీమసేనున కిట్లనియె. 54

సీ. "గాండీవమాదిగాఁ గల యాయుధావలు
లుక్కివంబున నప్పు డొడిచికొనఁగ
మఱచినవాఁ డయ్యె మందాత్ముఁ డాధార్త
రాష్ట్రుండు గాంధారరాజతనయు
వచనముల్ విని యక్షవతి నెపంబున వానిఁ
గష్టుఁ డై కొన సమకట్టి మనల
మగుడింపఁగా బుష్టమతిఁ జేసి విదురుఁ బు
త్తెంచెఁ గాకున్న నేతేరఁ డితఁడు;
ఆ. నింక జూవ మాడ నే నోప; నిది పని
గాఁగ వచ్చు నొక్కొ కడఁగి విదురుఁ!
డేమి సేయువార? మితని నియోగంబు
మనకుఁ జేయ కునికి మానుషంబె?" 55

వ. అని తమలోఁ బలుకుచున్న సమయంబున విదురుం డేతెంచిన నతనికిఁ బ్రత్యుద్గతు లై వినయప్రియసత్కారంబుల సంతుష్టుం జేసి తదాగమన నిమిత్తం బడిగిన వారికి విదురుం డి ట్లనియె. 56

క. "మతి వారికి మాకును గడు
హితుఁడవు; చెపు మయ్య యింక నెయ్యది కార్య
స్థితి? యని ధృతరాష్ట్రుం డే
కత మిష్టం బైన కార్యగతి నన్నడుగన్. 57

వ. ఏ నుభయపక్షంబులవారికి, జగంబునకు లగ్గగ హితం బైన విధంబు సెప్పిన నది సర్వజనరుచికరం బైన యాహారంబు రోగాతురునకు నరుచికరం బైన యట్ల యతనికి రుచియింప దయ్యె. 58

ఆ. కార్యగతులతెఱఁగు కలరూపు సెప్పిన,
నధికమతులు దాని నాదరింతు;
రల్పకార్యబుద్ధు లగువారలకు నది
విరసకారణంబు విషమపోలె. 59

వ. దానఁ జేసి ధృతరాష్ట్రుండు న న్నొల్లక యెగ్గులు పలికి 'నీవు విపరీత చేతస్కుండ; విందుండ వలవదు; పాండవులకడకుం బొమ్మనిన

వచ్చితి; రూపలావణ్యవతియై వృద్ధ శ్రోత్రియునిచేతం బరిణీతయైన తరుణియుంబోలె రాజ్యలక్ష్మి యద్దురాత్మునందు విరక్తయ కాని ప్రీతి పుట్టదండ్రు. 60

ఆ. ధర్మరహితు లైన ధార్తరాష్ట్రులకు భూ
రాజ్యలక్ష్మి సుస్థిరంబు గాదు;
ధర్మతనయ! నిన్నుఁ దద్రాజ్యసంపదల్
వలచి తమకుఁ దామ వచ్చి పొందు. 61

వ. నావచనంబున నెగడునది" యనిన ధర్మరాజు 'సట్ల చేయుదు' నని యున్నంత నిట ధృతరాష్ట్రుండు పాండవులయొద్ద విదురు నునికి యెఱింగి ధృతిహీనుండై తన హృదయంబును దృష్టియుం బోని విదురుం బాసి నిమిషం బేని నిర్వహింప నోపక సంజయున కిట్లనియె.

క. "నెమ్మిగలవాని, నా చి
త్తమ్మెఱిఁగెడువాని, విదురు, ధర్మప్రియు, నా
తమ్ము నిట వేగ తోడ్కొని
రమ్మరుగుము కామ్యకాఖ్య రమ్యాటవికిన్." 63

వ. అని పంచిన నప్పుడ సంజయుం డతి త్వరితగతిం గామ్యకవనంబున కరిగి. 64

మ. ధరణీదేవ సహస్ర సంఘములతో ధౌమ్యుండు, ధర్మక్షమా
భరణుల్ నల్వురు దమ్ములుఁ, విదురుఁడుం, బాంచాలియుం, బ్రీతిబం
ధురులై కొల్వఁగ నొప్పుచున్న బుధబంధున్, ధర్మరాజుం, బ్రభా
స్వర తేజుం బ్రభుఁ గాంచి సంజయుఁడు సంజాతప్రమోదాత్ముఁడై. 65

క. వనవాసము సేసియుఁ దిభు
వనరాజ్యము సేయునట్టివడువున సంతో
షనిబద్ధబుద్ధి యగు యమ
తనూజునకు భక్తి నెఱఁగి తా నిట్లనియెన్. 66

వ. "మిమ్మును, ధర్మార్థవిదుం డైన విదురునిం గౌరవేంద్రుం డెప్పుడుం దలంచు చుండు; మీ యనుమతంబునఁ దన యనుజుం దోడ్కొని తేర నన్నుఁ బుత్తెంచె" ననిన విని ధర్మరాజు విదురున కిట్లనియె. 67

తే. "సర్వజనులును ధృతరాష్ట్రి శాసనంబు
సేయుచున్నచో మనకు విశేషభక్తిఁ
జేయవలయుఁ; గావున నెడసేయ కరుగు''
మనిన విదురుండు గజపురి కరిగె నంత. 68

వ. ధృతరాష్ట్రిండును వినయవినమితోత్తమాంగుం డైన విదురు నతి స్నేహంబునం గౌఁగిలించుకొని మూర్ధాఘ్రాణంబు సేసి "నీవు నిత్య క్షమానిరతుండవు; నా బుద్ధి లేమికి క్షమియింపు" మనిన విదురుం డి ట్లనియె. 69

ఆ. "నీవు, నీ సుతుండు నెఱిఁ దప్పి పలికినఁ
బథ్య మయిన పలుక పలుకవలయు;
వీరు లయిన పాండవేయులతో నిగ్ర
హంబు సేయు టిది నయంబు గాదు.'' 70

వ. అనుచు నెప్పటియట్ల కార్యసహాయుం డై విదురుండు ధృతరాష్ట్రి నొద్ద నున్న నయ్యిద్దఱ సంగమంబునకు శంకించి దుర్యోధనుండు కర్ణ శకునిదుశ్శాసనులతో ని ట్లనియె. 71

క. ''పాండవహితుఁ డగు విదురుఁడు
వెండియుఁ జనుదెంచి కార్యవిధులందు సహా
యుం డయ్యెఁ; నతనితోడ హి
తుండయి మంతనముసేయఁ దొడఁగెఁ విభుఁడున్. 72

వ. వీర లింకఁ బాండవుల నిందులకు రావించువార లయిన నగ్నివిషజలం బులు ప్రయోగించి వారల కపాయంబు సేయుద" మనిన విని శకుని దుర్యోధనుం జూచి ''యి ట్లేల బాలిశం బైన మతిఁ దలంచితివి; విదురధృతరాష్ట్రులు విపరీతమతులై రావించినను నిత్యసత్యనిరతులైన యప్పాండవులు దమ చేసినసమయంబు సలుపక యేల వచ్చువా రగుదు'' రనిన శకుని దుర్యోధనులకుఁ గర్ణుం డి ట్లనియె. 73

ఉ. ''ఇత్తఱిఁ బన్నిపోయి, పయి నెత్తి, రణం బొనరించి, వారలఁ
మిత్తికి నంపి, ధాత్రి నిరమిత్రముఁ జేయుద; మిట్టు లైనఁ ద
ద్వృత్తులు నీక దక్కుఁ; గురువీర కడంగుము" నావుడుఁ మదో
న్మత్తుఁడు గౌరవుం డతనిమాటకు సంతస మంది చెచ్చెరఁ. 74

వ. సమరసన్నద్ధుఁ డై సమస్త బలంబును సమకట్టి వెలువడినం దన దివ్య దృష్టి నంతయు నెఱింగి కృష్ణద్వైపాయనుండు వచ్చి "యిది ధర్మం బుగా; దుడుగు" మని దుర్యోధనుని వారించి ధృతరాష్ట్రున కి ట్లనియె.

క. "పుడమియు రాజ్యముఁ గోల్పడి
యడవుల నేకతమ యున్న యప్పాండవులం
గడఁగి వధియింతు నని నీ
కొడు కరిగెడు; నిట్లు తలఁపఁ గూడునె బుద్ధిన్? 76

క. ధృతియుతులై సత్యవ్రత
రతులయి పదుమూఁడువత్సరంబులు ధర్మ
స్థితి సలిపి వార కడఁగెద
రతులపరాక్రములు మీఁద నాహవమునకున్. 77

క. వనగతు లని వారలపైఁ
జని భంగముఁ బొంది రాఁగ సమకట్టెడు నీ
తనయుఁడు; గావున నీ వా
తని వారింపు మది యనుచితం బని నెమ్మిన్. 78

క. విను మేనును, నీవును, శాం
తనవుఁడు, విదురుండు నుండి తగునె యధర్మం
బున నీయుపేక్ష? నయం
బును బాండవవిగ్రహంబు పుట్టుట లగ్గే?" 79

వ. అనిన విని ధృతరాష్ట్రుండు దుఃఖితుం డై "నాకును, గాంధారికిని, భీష్మవిదురకృప ద్రోణులకు ననిష్టంబైన దుష్టద్యూతంబు ప్రవర్తించి దుర్బుద్ధియైన దుర్యోధనుం బుత్త్రస్నేహంబున విడువ నోప" ననిన ధృతరాష్ట్రునకుఁ గృష్ణద్వైపాయనుం డిట్లనియె. 80

—: ధృతరాష్ట్రునకు వ్యాసుఁ డింద్రసురభిసంవాదంబు సెప్పుట :—

ఆ. "ఎల్ల నెయ్యములకుఁ దల్లి దండ్రులయందు
సుతులవలని నెయ్య మతిశయంబు;
ధనము లెంత గలిగినను సుతరహితుల
కెమ్మెయిని మనఃప్రియమ్ము లేదు. 81

వ. తొల్లి సకలగోమాతయయిన సురభి సురరాజుకడకుం బోయి కరుణంబుగా నేడ్చిన దానిం జూచి సురపతి విస్మితుం డై "యి ట్లేల రోదనాకులితలోచన వయి యున్నదాన; వెల్ల వారికి లగ్గ కదా" యనిన నింద్రునకు సురభి యి ట్లనియె. 83

క. నీవ్రజము రక్షింపఁగ
నా వారికి దక్కఁ ద్రిభువనంబులఁ గల భూ
తావలి కెల్లను గుశలము;
దేవేంద్ర ! జగ త్త్రియప్రదీప ! మహాత్మా !

వ. దీనిం జిత్తగింపుము; బలంబు గల బలీవర్దంబులతో బలహీనంబు లయిన వానిం బూన్చిన నవి దుర్వహభారవహనమహాలాంగలాకర్షణంబు లయం దసమర్థంబులైన నడిచియుం, బొడిచియు, ములుకోలలం గుట్టియు దుర్బలబలీవర్దంబుల జనులు బాధింపం జూచి యేను దానికి దుఃఖించెద"ననిన సురభికి సురపతి యి ట్లనియె. 84

క. "నీకు నపత్యశతంబు ల
నేకంబులు గలవు; వాని కేకాకృతి దుః
ఖాకులత సంభవింపదు;
శోకింపకు" మనిన సురభి సురపతి కనియెన్. 85

వ. "దేవా ! దీనాననంబు లయి దుర్బలంబు లయిన యపత్యంబులదుఃఖంబే నెట్లు సూడ నోపుదు" ననిన నగి యింద్రుండు దానికిం గరుణించి వర్షంబునఁ దృణవర్ధనంబు నేసి దుర్బలబలీవర్దంబులకు బలంబు గావించె నని యింద్ర సురభిసంవాదంబు వేదంబులయందు వినంబడుఁ గావున నీకుం బుత్త్రిస్నేహంబు సామాన్యంబుగా; నైనను దీనులై వనంబున నవయుచున్న యప్పాండవులకు దయాళుండ వగుము. 86

తే. నీవుఁ బాండుండు విదురుండు నెమ్మి నాకు
నొక్కరూ పైనయట్లు, నీ కుదితయశులు
నీసుతులు నూర్వురును, బాండునృపతనూజు
లేవురును నొక్కరూప కా నెఱుఁగవలయు. 87

క. సుజనుల సహవాసంబునఁ
గుజనులు సద్ధర్మమతు లగుట నిక్కము ధ
ర్మజునొద్దనుండి నీయా
త్మజుఁడు ప్రశాంతుండు ధర్మమార్గుండు నగుఁ. 88

వ. రాజర్షి యైన ధర్మరాజుతోడి సహవాసంబు సర్వజనహితంబు; గావున నాతని నుపాసించి దుర్యోధనుండు గొండొకకాలం బుండునట్లుగాఁ బనుపు; మ ట్లయిన నుభయపక్షంబులకు ల గ్గగు"ననిన ధృతరాష్ట్రుండు కృతాంజలి యయి "మునీంద్రా! దుర్యోధనుండు నాపలుకులు వినండు; కురుకులంబు రక్షించునట్టి బుద్ధి గల దేని వాని మీర శిక్షింపుం" డని మ్రొక్కిన. 89

క. "అనఘుఁడు మైత్రేయుం డను
మునినాథుఁడు వచ్చి ధర్మమున నాతనిఁ దా
ననుశాసించుఁ దిరంబుగ"
నని చెప్పుచు నప్పరాశరాత్మజుఁ డరిగెఁ. 90

వ. అంత. 91

ఉ. న్యాయవిదుండు గామ్యకవనంబున ధర్మజునొద్దనుండి మై
త్రేయుఁడు ధీయుతుం డరుగుదెంచిన నప్పుడ యమ్మునీంద్రు నిం
ద్రాయితుఁ డాంబికేయుఁ డుచితస్థితిఁ బూజితుఁ జేసె నాత్మని
శ్శ్రేయసలాలసుం డయి విశేషసపర్యలఁజేసి భక్తితోఁ. 92

వ. ఇట్లు దనచేతం బూజితుం డై సుఖవిశ్రాంతుం డైన మునివరునకు ధృతరాష్ట్రుండు ముకుళితహస్తుం డై "భట్టారకా! యెందుండి వచ్చితి" రని యడిగిన నతనికి మైత్రేయుం డి ట్లనియె. 93

చ. "అలఘు తపోభరంబున జటాజినముల్ ధరియించి, రూక్షవ
ల్కములు గట్టి, కూరలును గాయలుఁ బండులు భోజనంబుగా
నలయక కామ్యకం బను మహావిపినంబున నున్న పాండవే
యులకడ నుండి వచ్చితిఁ గురూత్తమ! నీసుతు, నిన్నుఁ జూడఁగఁ. 94

వ. ఏ నఖిలతీర్థదర్శనార్థంబు పరిభ్రమించుచుఁ గురుజాంగలంబున కరిగి యందుఁ గురుకులోత్తము లైన పాండుపుత్రులం జూచితి." 95

ఆ. అనిన నవనతాస్యుఁ డయి ధృతరాష్ట్రుఁ డి
ట్లనియె "నెట్లు సెప్పుఁ డయ్య! యందుఁ
బాండవులకు సత్యభాషణులకుఁ గుశ
లంబె? వార లిట దలంతురొక్కొ! 96

క. అమితభుజశక్తి నంతక
సము లప్పాండుసుతు లిందు సౌభ్రాత్రస్నే
హమునకు విచ్ఛేదముగా
సమయాతిక్రమము సేయ సమకట్టరుగా?" 97

వ. అనిన మైత్రేయుం డి ట్లనియె. 98

క. "చనుదెంచి మహామునివరు
లనవరతము వారలకుఁ బ్రియం బొనరఁగ దీ
వన లిగిఁ జేసి కుశలమ
మనుజేశ్వర వారు ధర్మమతియుతు లగుటన్. 99

క. వారలు సమయము దప్పిన
వారిజరిపుహితులగతు లవశ్యముఁ దప్పున్;
వారికి నకారణంబ ని
కారము నీకొడుకు సేసెఁ గడు నహితుం డై." 100

వ. అని దుర్యోధనుం జూచి "యయ్యా! నీవు బుద్ధిగల వేనిఁ బాండవులతో విరోధం బుడుగు; మట్లయిన నీకును, వారికిం, గురుకులంబునకు లగ్గగు; నాపలుకుఁ జేకొనుము. 101

సీ. వజ్రసంహనను, లవార్యపరాక్రముల్,
పాండుకుమారు, లాఖండలాభు;
లందఱు నాగశతాయుత ప్రాణు, లు
గ్రాహవకాంతు, లుత్సాహపరులు;
వారలలో బలవంతుండు, బకహిడిం
బాసురు లనువారి నాసురమునఁ
జంపి, నాగాయుతసత్త్వు జరాసంధు
నెక్కటి యోర్చిన యక్కజుండు;

తే. ఘోరవనమున వీరుఁ గిమ్మీరుఁ డను సు
రారి, నిశ్చల భీకరా కారుఁ బట్టి
పోర వధియించినట్టి సమీరజునకు
భూరిభుజునకు మార్కొనువారుఁ గలరె? 102

—: మైత్రేయుఁడు దుర్యోధనుని శపించుట :—

వ. వారికి వాసుదేవ ధృష్టద్యుమ్నులు సంబంధ సహాయులు; జరామరణ వంతు లైన మనుజులు వారిం జెనకి యెట్లు జీవింతురు? నీవు వారితో నొడంబడియుండు; మిది కార్యం"బనిన మైత్రేయు పలుకు లాదరింపక పాదాంగుష్ఠంబున నేల వ్రాయుచు బాహువెత్తి దొడలు సఱచి నగు చున్న యాదుర్యోధనుం జూచి మైత్రేయుండలిగి"యీయపరాధంబున నాహవంబగు; నందు భీముగదాఘాతంబున నీయూరు యుగళంబు భగ్నం బయ్యెడు"మని శాపం బిచ్చిన, వెఱచి ధృతరాష్ట్రుండు "మునీంద్రా! యట్లు గా కుండం బ్రసాదింపు" మనిన నమ్మునివరుం డి ట్లనియె. 103

తే. "కడఁగి సమబుద్ధి వీనికిఁ గలిగెనేనిఁ
గాదు శాపఫలం; బట్లు గాక బుద్ధి
హీనుఁడై గర్వితుం డగు నేని శాప
హవ్యవాహాఫలంబు వీఁ డనుభవించు." 104

వ. అని ప్రసన్నుం డైన మైత్రేయునకు నాంబికేయుం డి ట్లనియె. 105

వ. "కిమ్మీరుం డను రక్కసుఁ
డమ్మారుతతనయుచేత నత్యుగ్ర వనాం
తమ్మున నిహతుం డయిన వి
ధ మ్మెట్టులు? సెప్పు మద్భుతం బిది'' యనినఁ 106

వ. "నాపలుకులు నీకొడుకు వినం డయ్యె;నే నేల చెప్పెద? దీనిం బాండవ సహాయులైన విప్రులచేత విదురుం డిమ్ముగా నెఱింగినవాఁ; డతని వలన విను'' మని చెప్పి మైత్రేయుం డరిగినం గిమ్మీరవధకథాశ్రవణ పరుండై తన్నడిగిన ధృతరాష్ట్రునకు విదురుం డి ట్లనియె ''నిం దుండి చని పాండవులు మూఁ డహోరాత్రంబులు నిరంతర ప్రయాణంబు

సేసి కామ్యకవనంబుఁ జొచ్చువా రొక్కనాటి యర్ధరాత్రంబున రాక్షస ప్రచారవేళయందుఁ బరిభ్రమించుచు రాక్షసమాయ గావించుచున్న వాని, నతినిశితదంష్ట్రికరాళం బైన తన వదనగహ్వరంబుఁ దెఱచి గ్రుడ్లు మెఱవ, బభ్రుకేశంబులు దూల, బాలార్కరశ్మియుతం బయిన బలాహకంబునుం బోలె సకలప్రాణి భయజననంబుగా గర్జిల్లు చున్న వాని నిజపాదఘట్టితమహీతల ప్రచలన వేగవేల్లిత వల్లిపల్లవ బాహుపరిరంభణసుఖంబు బాదపంబుల కాపాదించుచున్న వాని, నెదురనొక్క రక్కసుం గని; రంత వాఁడును బ్రాహ్మణసంఘంబు ముందటఁ కృష్ణాజినావృతు లై వచ్చుపాండవుల దవ్వులం గని మార్గనిరోధి యై మహాపర్వతంబునుం బోలె నున్న నదృష్టపూర్వ ప్రమాణం బైన వాని దేహంబుఁ జూచి నిమీలిత నయన యయి దుశ్శాసనకరాకృష్టవికీర్ణ వేణీభరంబు వెనువెంట నొలయం బాంచాలి పంచపర్వతంబులనడిమి నదియుంబోలెఁ బతులనడుమ భయవ్యాకుల చిత్త యైన, నింద్రియంబులు విషయరతిం బరిగ్రహించునట్లు లేవురు నక్కోమలిం బట్టుకొని భయపడకుండ నాశ్వాసించు చున్నంత. 107

క. రక్షోఘ్నమంత్రముల నా
రాక్షసమాయా పరిస్ఫురణఁ జెఱిచెఁ గ్రియా
దక్షుఁడు ధౌమ్యుఁడు పాండవు
లీక్షించుచు నుండఁగా నహీనప్రతిభన్. 108

వ. అంత. 109

క. ప్రతివిహితమాయు, నత్యా
యతభుజయుతుఁ, గోపఘూర్ణితారుణ విస్ఫా
రితనేత్రు, నసురఁ జూచి భ
రతకులవర్ధనుఁడు ధర్మ రా జి ట్లనియెన్. 110

వ. "నీ వెవ్వరివాఁడ? వెవ్వండ? వివ్వనంబున నేల యున్న వాఁడ?" వనిన వాఁ డి ట్లనియె. 111

క. "ఏను బకాసురు ననుజుఁడఁ;
గినాఖుఁడ; మానవులకుఁ గిమ్మిరుఁ డనం

గా నెగడుదు; నీకామ్యక
కాననమున సర్వసత్త్వఖాదనబుద్ధిన్. 112

క. పాయక యుండుదు; రాక్షస
మాయల సమరంబు సేసి మనుజుల విగతో
పాయులఁ జంపుచు భక్షణ
సేయుదు; నమరాదులకు నజేయుఁడఁ బోరన్. 113

వ. నాకు వెఱచి యెల్లవారును దూరంబున దీనిం బరిహరింతురు; మీ రెవ్వ? రిందుల కేల వచ్చితిరి? మిమ్ము వధియించి యిపుడు భక్షించెద'' ననిన వానికి యుధిష్ఠిరుండి ట్లనియె. 114

ఆ. "ఏను ధర్మసుతుఁడ; నీతఁడు భీముండు;
వాఁడు విజయుఁ; డల్ల వారు గవలు;
పాండవులము సమయపడి వనవాసంబు
సేయ వచ్చితిమి విశేషయుక్తి.'' 115

సీ. అనవుడు రాక్షసుం డట్టహాసంబుతో
"నెట్టుట్టు! భీముండె యీతఁ? డేమి
పుణ్యమో! వీని నెప్పుడు సంపఁగాంతునో
యని యున్నచోఁ, దాన యరుగుదెంచె;
నధికు మాయన్న బకాసురు, నాయిష్ట
సఖు హిడింబాసురుఁ జంపి యున్న
ఖలు మ్రింగి జీర్ణంబు గావింతు వాతాపిఁ
దడయక మ్రింగిన తవసియట్ల"

ఆ. యనిన రక్కసునకు నలిగిన యగ్రజు
నలుక యెఱిఁగి వీరుఁ డర్జునుండు
మొనసి గాండివంబు మోపెట్టె సునిశిత
ఖడ్గపాణు లైరి కవలు నంత. 116

—: కిమ్మీరుఁ డను రాక్షసుఁడు భీముచేఁ జచ్చుట :—

ఆ. ఘోరపరాక్రముల్, ప్రబలకోపపరుల్, పృథుసారభూరిభూ
మీరుహపాణు, లుద్ధతు, లమిత్రవిఘాతులు, వీరబృందబృం

దారకు లార్చు చొండొరులఁ దాఁకిరి దారుణభంగిఁ బొంగి కి
మ్మీరసమీరసూనులు సమీరవిధూతపయోధు లట్లవై. 117

తరలము.
పొరిని వారలచేతి యున్నత భూరుహాయుధముల్ పర
స్పరకఠోరశిరస్స్థలంబుల పై వడిం బడి మత్తకుం
జరశిరఃపతితంబు లైన లసన్మృణాళములట్లు జ
ర్జరిత మయ్యెఁ దదారవప్రతిశబ్ద మొప్ప నభంబునన్. 118

వ. ఇట్లొక్క ముహూర్తంబు వృక్షయుద్ధంబు సేసి, యాసన్న మహీరు
హంబులు సమసిన, నయ్యిద్దఱు శిలాయుద్ధంబునకుఁ దొడంగి చేయు
నెడం బవనజక్షిప్త నిష్ఠురశిలాహతహృదయుం డై భానుం బట్టుకొను
స్వర్భానుండునుంబోలెఁ గిమ్మీరుండు భీముం బట్టుకొనిన, భీముండు
వాని హీనబలుం గా నెఱింగి; కృతాంతదండానుకారంబు లయిన తన
బాహుదండంబుల నమ్మనుజకంటకు కటి కంఠ ప్రదేశంబులు పట్టు
కొని, నేలం బెట్టి, దేహయష్టి విఱిచి, బకుం జంపినవిధంబునఁ
గిమ్మీరు విగతప్రాణుం జేసి. 119

తే. "బకహిడింబులు హతులైనఁ బనివిపనివి
యఱచి శోకింపఁ గానక యమపురమున
కరిగి తక్కట రాక్షస" యనుచుఁ దెరువు
వాయఁ బావని తత్కళేబరము వైచె. 120

వ. ఇట్లు ధర్మరాజు వచనంబునఁ గిమ్మీరు నక్రమంబున వధియించి తద్వన
వాసులకు రాక్షసభయం బుడిపిన మహావీరు నమ్మారుతాత్మజు ధర్మా
ర్జుననకులసహదేవులును ధౌమ్యాదిమహీసురవరులు ప్రశంసించి" రని
విదురుండు గిమ్మీరువధ సెప్పిన విని ధృతరాష్ట్రునకు హృదయదశనం
బయ్యె; నిట పాండవులు గామ్యకవనంబున నుండునంత.

—: యాదవపాంచాలాదులు పాండవులకడ కేతెంచుట :—

సీ. వసుమతీ రాజ్యంబువలన నిరస్తులై
మునివృత్తి నత్యుగ్రవనములోన

నవయుచుఁ బాండుభూనాథనందను లున్న
వా రని విని యతిక్రూరమతుల
ధృతరాష్ట్రసుతుల నిందించుచుఁ బాంచాల
యాదవ వృష్ణిభోజాదు లెల్ల
నచ్యుత ప్రముఖు లై యప్పాండవులకడ
కేతెంచి శోకపరీతు లగుచు
ఆ. నున్న నధికధర్మ యుక్తుఁ డుపేంద్రుండు
నికృతిఁ జేసి పాపనియతబుద్ధిఁ
బాండవులకు నట్లపాయంబు సేసిన
ధార్తరాష్ట్రులకును దద్ద యలిగి. 122

క. "అనిఁ గర్ణశకుని దుర్యో
ధన దుశ్శాసన నవాస్త్రధారాపాతం
బునఁ దృప్తిఁబొందు వసుధాం
గన రాక్షసకాక గృధ్రగణములతోడన్. 123

క. అవినీతుల, వధ్యులఁ, గౌ
రవపాంసులఁ జంపి ధర్మరాజునకుఁ గురు
ప్రవరున కొనరింతము యీ
యవనీరాజ్యాభిషేక మవిజితశక్తిన్." 124

వ. అని యుగాంతకాలకుపితకృతాంతాకృతి నున్న జగన్నాథు జనార్ద
నుం బ్రశాంతచిత్తుం జేసి యర్జునుం డతని నిట్లని కీర్తించె. 125

ఆ. "పూజ్యుఁడవు, పురాణపురుషుండ, పీశుండ,
వప్రమేయుఁడవు; చరాచరంబు
లయిన భూతరాసు లచ్యుత ! నీయంద
పుట్టు, నిలుచు, లయముఁ బొందు చుండు. 126

వ. నీవు దొల్లి గంధమాదనంబునం గందమూలఫలాశనుండ వై పది
వేలేండ్లు తపంబు సేసి, పుష్కరంబున నేకాదశసహస్రవర్షంబులు జలం
బుల యాహారంబుగా నుండి, ప్రభాసం బను తీర్థంబున దివ్యసహస్ర
వర్షంబు లేక పాదస్థితుండ వయి యుండి, బదరీవనంబునం బవనంబు

భక్షించుచు నూర్ధ్వబాహుండ వయి యేక పాదంబున ననేకసహస్ర వర్షంబులు నిలిచి, సరస్వతీసత్త్రింబున నవకృష్ణోత్తరాసంగుండవై నియమకృశీకృతశరీరంబుతోఁ బండ్రెండువర్షంబు లశేషవ్రతంబులు సలిపిన తపోనిధానంబవు: నిఖిలలోకచైత్రుండ వయి చైత్రరథంబున నుత్తమక్రతువు లనేకంబులు సేసి, యొక్కొక్క క్రతువునకు నూఱేసి లక్షలు సువర్ణంబులు దక్షిణలిచ్చిన యజ్ఞపురుషుండవు, తపోయజ్ఞంబులు రెంటను సమృద్ధతేజుండవయి దైత్యదానవేంద్రుల వధియించి యింద్రున కింద్రత్వం బేకాధిష్ఠితంబు సేసిన లోకప్రభుండ; వదితికిం గశ్యపునకు నుదయించి యింద్రానుజుండ వై త్రివిక్రమంబునం ద్రిజగంబుల నభివ్యాపించిన విశ్వరూపధరుండవు. 127

క. నరకశిశుపాలు రాదిగ
ధరణీకంటకుల నధికతరదర్పులఁ బ
ల్వుర వధియింపఁగ మహి నవ
తరించిన మహాత్ముఁడవు నుతస్థిరశక్తిఁ. 128

క. అనృతము, మదమును, మత్సర
మును, గ్రోధము నను వికారములు వొరయునె ని
న్ననుపగుణముల నీ కొరు
లెన వోల్పఁగఁ గలరె? సురమునీంద్ర ప్రణుతా.” 129

వ. అని కృతాంజలి యయిన ధనంజయుం జూచి దనుజభంజనుం డిట్లనియె. 130

తే. “నరుఁడు నారాయణుండు నాఁ బరగు నాది
మునుల మిద్దఱ; మందు నీ వనఘ! నరుఁడ;
వేను నారాయణుండ; ననూనశక్తి
యుతుల మై మర్త్య యోనిఁ బుట్టితిమి పేర్మి.

తరువోజ. నిరతంబుగా నేను నీ వను భేద
నియమంబు లే; దైక్యనిష్ఠయ మనకు
నిరుపరకును; నీకు నిష్టుండ నాకు
నిష్టుండు; మఱి నీ కనిష్టుండ నాకుఁ

గర మనిష్టం; బట్లు గా నమ్ము”మనుచు
ఘనభుజుల్ భువనోపకారైకమతులు
హరియు నర్జునుఁడుఁ బ్రియంబుతోఁ దగిలి
యన్యోన్యహితభాషు లగుచుండునంత.

—: ద్రౌపది శ్రీకృష్ణునితోఁ దన పరిభవంబు సెప్పి దుఃఖించుట :—

వ. అఖిల రాజలోకపరివృతుం డయి యున్న నారాయణునొద్దకు వచ్చి ద్రుపదరాజ పుత్త్రి ముకుళితకరాంబుజ యయి “నిన్ను నాదిప్రజా సర్గంబునఁ బ్రజాపతి వని యసితుం డయిన దేవలుండును, సత్యంబు వలన యజ్ఞం బుద్ధరించుటం జేసి నిత్యసత్యమయుండ వయిన యజ్ఞ పురుషుండ వని కశ్యపుండును, శిరంబున దివంబును, పాదంబుల మేదినియును, లోచనంబుల సూర్యుండును, నవయవంబుల లోకంబులు నభివ్యాపించుటం జేసి సర్వమయుండ వని నారదుండును, నక్షయజ్ఞాననిధి వని సర్వమునిముఖ్యులును జెప్పిరి. 133

మధ్యాక్కర.

అని ననివృత్తు లై పుణ్యచరితు లై, యాత్మప్రబోధ
వినిహితచిత్తులై, సర్వధర్మార్థ విదు లయి తృప్తిఁ
దనరెడు రాజర్షి వరులకును, యోగధరులకు సాధు
జనులకు గతి నీవ నిత్యకారుణ్య! సర్వశరణ్య! 134

వ. నీయంతఃకరణ ప్రవృత్తి కగోచరం బెద్దియు లే; దయినను నా పడిన పరాభవం బెఱింగించెద. 135

సీ. పార్థివప్రభుఁ డైన పాండుమహీపతి
కోడల నయి, యుద్ధకుశలు లయిన
పాండుతనూజుల భార్యనై పూజ్యుఁడ
వైన నీయనుజనై, యధికశక్తిఁ
బరఁగు ధృష్టద్యుమ్ను భగినినై, ధృతరాష్ట్రు
పట్టిచే సభఁ దల పట్టి యీడ్వఁ
బడి పాపకర్ముచేఁ బరిధాన మొలువంగఁ
బడి, దారుణం బైన పరిభవంబు

ఆ. పడితి; నట్టి నన్నుఁ బాండవుల్ సూచుచు
నుండి రోరులువోలె నుక్కుదక్కి;
యాపగాతనూజుఁ డాదిగాఁ గల వృద్ధ
బంధుజనులు సూచి పలుక రయిరి. 136

క. శరణనినవారిఁ గరుణా
కరు లయి రక్షించు పురుషకారాన్వితులే
శర ణని యఱచిన నాలింపర
భీమార్జునుల బాహుబల మేమిటికిన్? 137

వ. భ్రాతృపుత్త్రబంధుజనంబులు నాకుం గలిగియు లేనివా రయి; రట్టి యెడం గర్ణుండు నన్నుం జూచి నగియె. 138

ఆ. కర్ణునగవు లోక గర్హితుండగు దుస్స
సేను చెయిదికంటె శిఖియవోలె
నడరి నామనంబు నతిదారుణక్రియ
నేర్చు చున్నయది మహీధరుండ! 139

వ. తొల్లి వేదాధ్యయనంబు సేయుచు బాలకేళీవినోదంబున నున్న కాలంబునఁ బ్రమాణకోటియందు సుప్తుం డయిన భీమసేను నంటఁ గట్టి గంగమడువునం ద్రోపించియు, విషంబుఁ బెట్టియు, విషసర్పంబులం గఱపించియు, జననీసహితులైన యేవురను వారణావతంబున లక్కయిల్లు సొనిపి యందు దహనంబుఁ బ్రయోగింపం బంచియు, ననేకంబు లైన యపకారంబులు సేసి, యిప్పుడు దుర్యోధనుం డధర్మద్యూతంబున రాజ్యంబు నపహరించి, రాజలోకసమక్షంబునం దమ్ము నిరాకృతులం జేసినను బరాక్రమపరాఙ్ముఖు లైన పాండవులు నాపరిభవంబు నెట్లు దలఁగెద" రని బాష్పధారాస్నపితపయోధర యయి పాణిపల్లవంబుల నయనసమ్మార్జనంబు సేయుచున్న పాంచాలిం జూచి వాసుదేవుండి ట్లనియె. 140

చ. "తనుకుచు నున్న నీ హృదయతాపనిమిత్తమునన్ సురేంద్రనం
దను పటుబాణపాతహతిఁ దద్ధృతరాష్ట్రబలంబు మృత్యుసా
దనమున కేఁగుఁ జు; మ్మిదియ తథ్యము; నావచనంబు దప్ప ది
వ్యనిధు లేదు నింకిన, దివంబును రాత్రియు సంచలించినన్. 141

వ. అనిన నర్జునుండు ద్రౌపదిం జూచి యి ట్లనియె. 142

ఉ. "ఈ పురుషోత్తముండు మన కిందఱకుం గుశలంబు సేయుచుం
బాపకలంకపంకములఁ బాయఁగఁ జేయుటఁ జేసి దుర్మదో
ద్దీపితశత్రుసంహతి హతిం బరమార్థమ పొందు; నేల సం
తాపము నీకుఁ జేయఁగఁ ద్రిధామజయోన్నతి గల్గి యుండఁగన్?"

వ. అనిన సక్రోధుండై ధృష్టద్యుమ్నుం డి ట్లనియె. 144

క. "వినయవిహీనుల దుర్యో
ధనదుశ్శాసనులఁ బవనతనయుఁడు, రాధా
తనయుని నరుఁ, డేఁ గుంభజు,
ననిఁ జంపుదు మేల వగవ నంబుజనేత్రా." 145

వ. అని యందఱు ద్రుపదరాజపుత్రి నాశ్వాసించి; రంత నచ్యుతుండు
ధర్మరాజున కి ట్లనియె. 146

తే. "ద్వారవతినుండియే యుయుధానువలన
ధారుణీశ! యింతయు విని తత్క్షణంబ
యరుగుదెంచి యాపన్నుఁడ వైన నిన్నుఁ
జూచి దుఃఖోపహత మనస్కుండ నైతి. 147

వ. అయ్యవసరంబున నేను మీ యొద్ద నుండమిం జేసి యిట్టి దుర్వ్యస
నంబు సంభవిల్లెం; గామజంబు లైన స్త్రీ ద్యూతమృగయాపానంబు
లను నాలుగు దుర్వ్యసనంబులం బ్రవర్తిల్లకుండఁ బ్రతిషేధింపవలయు;
నందును విశేషంబుగా ననర్థమూలంబయిన ద్యూతంబుఁ బరిహరింపని
నాఁడు పాపం బగు నని హేతుదృష్టాంతంబులు సూపి కృపద్రోణ
విదురగాంగేయులం దోడుసేసికొని యాంబికేయు నొడంబఱిచి దుష్ట
ద్యూతంబు సర్వప్రకారంబుల వారింతు. 148

క. వలచి హితంబునఁ బథ్యముఁ
బలికినఁ జేకొనని ధర్మబాహ్యుల నవివే
కుల నిగ్రహింతు; మీకె
గ్గులు మత్సాన్నిధ్యమున నగునె యెయ్యెడలన్? 149

—: కృష్ణుఁడు ధర్మరాజునకు సౌంభకాఖ్యానంబు సెప్పుట :—

వ. ఏను సముద్రతీరంబున సాల్వుతోడం బదినెలలు యుద్ధంబు సేసి వాని వధియించు పొంటె నక్కడ నుసలితి; నది గారణంబుగా మీకుదుర్వ్య సనావసరంబున నలబ్ధసన్నిధానుండ నయితి" ననిన నది యెట్లని యుధిష్ఠిరుం డడిగిన నాతనికి సౌంభకాఖ్యానంబు సవిస్తరంబుగాఁ గృష్ణుం డిట్లని చెప్పె; "నీ యజ్ఞంబున నర్ఘ్య నిమిత్తంబున నసహిష్ణుం డయిన శిశుపాలుండు నాచేత నిహతుం డగుట విని, వాని తమ్ముండు సాల్వుం డనువాఁడు తద్వధప్రవర్తిత క్రోధుం డయి కామగమనం బయిన తన సౌంభకం బను నగరంబుతో సన్నద్ధుం డయి వచ్చి ద్వారవతీపురంబు నవరోధించి. 150

చ. "ప్రతినరపాలకాలు, శిశుపాలు, బలాధికుఁ జంపి దర్పసం
హితుఁ డగు చున్న వృష్ణికులుఁ డెక్కడ నెక్కడ? నాతనిం జయో
న్నతి వెలయంగఁ జంపెద రణంబున"నంచు నలంఘ్యవిక్రమో
ర్జితుఁ డయి దానిచుట్టు విడిసెం జతురంగమహాబలంబుతోన్. 151

క. మే లగు తత్పుర బాహ్యావి
శాలోద్యానముల తాల సాల సరళ హిం
తాల తమాలావలి ని
ర్మూలితముగఁ జేసెఁ దచ్చమూసామజముల్. 152

వ. మఱి తృణజలధాన్యసమిత్సమృద్ధంబయి శతఘ్నీప్రముఖానేకయంత్రంబుల, నలంఘ్యపరిఖాప్రాకారంబులను, నపారబలరక్షితఘనకవాటచతుర్గోపురంబులను, లబ్ధ ప్రభూతవేతన ప్రహృష్టపుష్టధృష్టవీరసుభటనంకులంబులను, నపరిమిత గజతురంగశతాంగంబులను, ప్రదీప్తాలాతశాతశర చక్ర తోమర పరశు పాశాంకుశ కూటంబులను, వీర యోధారూఢవిశాలాట్టాలకంబులను నొప్పి పరుల కసాధ్యం బయిన ద్వారవతి భేదింప నేరక దాని వెలిం బ్రపా చైత్య దేవాయతన వల్మీకంబులు వర్జించి, సమతలప్రదేశంబున నిబిడంబుగా శిబిరసన్నివేశంబు సేసి, నిత్యంబు నుపద్రవంబు సేయుచున్న సౌంభకవిజృంభణంబునకు సహింపక సమరసంరంభంబున సర్వాయుధసన్నద్ధు లయి. 153

క. ఉద్యద్బలులు గుమారులు
విద్యాధరసములు పురము వెలువడిరి రణో
ద్యోద్యములు చారుదేష్ణుఁడుఁ
బ్రద్యుమ్నుఁడు, సాంబుఁడును విపక్షజిఘాంసన్.

మణిభూషణము: రామవిక్రముఁ డజేయుఁ, డరాతిగజావళీ
సామజాహితుఁడు, సాంబుఁడు సాల్వచమూపతిన్
క్షేమవృద్ధి యనువాని నకృత్రిమసాహసో
ద్దాముఁ దాఁకె శరధారల ధారుణిఁ గప్పుచున్. 155

క. జాంబవతేయు బృహద్వ్రీ
ఖంబులకున్ బెదర కెదిరి ఘనుఁ డేసె రణా
గ్రంబున నాతనిపై నవి
లంబితుఁ డై క్షేమవృద్ధి లక్షశరంబుల్. 156

వ. వాని యేయు నేర్పునకు సహింపక సాంబుండు జాంబూనదపుంఖంబు లయిన విశిఖంబులం దదీయరథాశ్వమర్మంబుల నేసిన నవి మర్మభేద వేదనలం దలరి యతి వేగంబున రణంబు వెలువడ రథం బీడ్చుకొని సారథికి వశంబు గాక వఱచె; నట్లు సాల్వచమూపతి సమరవిముఖుం డయిన. 157

స్వాగతము: వేగవంతుఁ డను వీరుఁడు సాంబున్
వేగవంతుఁ డయి వీఁకను దాఁకెన్
వేగబాణపదవీతతులన్ ది
గ్భాగముల్ విశిఖపంజరముల్ గాన్. 158

ఆ. సాంబుఁ డాయు మనుచుఁ జారుదేష్ణుం డగ్గి
వేగవంతుఁ దాఁకి వీఁకతోడ
వాని మస్తకంబు వ్రయ్యంగ వడి గదం
బొడిచె రుధిరవారిపూర మొలుక. 159

వ. ఇట్లు చారుదేష్ణు విష్ఫురగదాఘాతంబున వేగవంతుండు విగతజీవుం డయి నిర్ఘాతపాతభిన్నోన్నతగిరిశిఖరంబునుంబోలె నేలఁ ద్రెళ్ళినం జూచి వివింధ్యుం డనువాఁ డవిచింత్యవిక్రముండయి. 160

తే. చారుదేష్ణుపైఁ గడువాఁడి శరము లేసె;
నతఁడు కార్ముకహస్తుఁడై యాక్షణంబ
వానిపై నభిమంత్రించి వహ్నిబాణ
మేసె నుగ్రస్ఫులింగంబు లెసఁగఁ జదల. 161

క. అనలాస్త్ర మట్లు వక్షముఁ
గొనిన విచింత్యుండు గూలెఁ గుతలం బద్రువన్;
మను వానిఁ జూచి హాహా
స్వనము లెసఁగ సాల్వసేన సంక్షోభించెన్. 162

వ. సాల్వుండు నిజసేనాసంక్షోభం బుడిచి, సర్వాయుధసనాథం బయిన రథం బెక్కి; యాదవకుమారవాహినిపయి నెత్తి, యేయుచు వ్రేయుచుం బొడుచుచుఁ బ్రతిబలంబు నెల్ల నాయుధమయంబుగాఁ జేయుచున్న వాని కలిగి. 163

సీ. హంసవర్ణోత్తమహయములఁ బూనిన
రథ మెక్కి, కాంచనరమ్యయష్టి
సంభృతమకరధ్వజం బొప్ప బద్ధ గో
ధాంగుళిత్రాణుఁడై, యతులశాత
సాయకావళిఁ జేసి సాల్వుఁ బిల్చుచు వాని
మీఁదఁ బ్రద్యుమ్నుఁ డమేయబాణ
వర్షంబు గురిసిన, వాఁడును వానిపైఁ
గడువాఁడిబాణముల్ గడఁగి యేసె;

ఆ. నధికవీరు లయిన యయ్యిద్దఱకు నస్త్ర
కోవిదులకుఁ బోరు ఘోర మయ్యెఁ;
దద్ద భయము వొంది తద్ద్వారకాపురి,
సౌంభకమున జనులు సంభ్రమింప. 164

క. అనిమొన సాల్వుఁడు ప్రద్యు
మ్ననిశాతశరాలివిద్ధమర్ముం డయి పె
ల్చన మూర్ఛవోయి పడియెం
దనరథముపయిన్ ధరిత్రి దల్లడపడఁగన్. 165

ఉ. అంతన మూర్ఛదేఱి కలుషానలదీప్తముఖుండు సాంభకుం
డంతకదండదారుణము లైన శరంబుల రౌక్మిణేయు ది
గ్దంతిబలాఢ్యు నేయుడు నతండును మూర్ఛితుఁ డయ్యె; వాని సం
భ్రాంతిఁ దదీయసారథి యపాస్తరణాంతరుఁ జేసెఁ జెచ్చెరన్. 166

వ. ఇట్లు మూర్ఛితుం డయిన ప్రద్యుమ్నుం దోడ్కొని చని రణంబునకు దూరంబుగా నరదంబు నిలిపికొని దారుకసుతుం డున్నంత నొక్కింత ప్రొద్దునకు మూర్ఛ దేఱి ప్రద్యుమ్నుండు సూతున కిట్లనియె. 167

క. "ఘోరాహవరంగమునకు
దూరముగా నన్ను నిట్టు దోడ్కొని తేరన్
దారుకసుత! నీ కుచితమె ?
వీరారంభంబు సూచి వెఱచితె? చెపుమా." 168

వ. అని మఱియు సారథిం జూచి విహ్వల మానసుం డయి యి ట్లనియె.

క. "సమరవిముఖత్వమును రణ
విముఖులఁ జంపుటయు, శరణు వేఁడిన రక్షిం
పమియును, యాదవవంశో
త్తములకుఁ గలవైనఁ గలవె దారుకతనయా! 170

క. విక్రమము విడిచి సమరా
పక్రాంతుఁడ నయిన నన్ను బలదేవుఁడునుం
జక్రధరుండుఁ గుమారులు
నక్రూరాదులును నేమి యని నగరె సభన్." 171

వ. చెట్ట సేసి; తింక నయినఁ జెచ్చెర సాంబచారుదేష్ణు లున్న చోటికి సాల్వాభి ముఖంబుగా రథంబు వఱపు"మనిన సారథి యి ట్లనియె.

క. "రథి కిమ్మ గానియెడ సా
రథి ధృతి మెయిఁ గావ వలయు, రథియును దత్సా
రథిఁ గావ వలయు; రథిసా
రథులు పరస్పరశరీరరక్షకు లగుటన్. 173

ఆ. సాల్వబాణవిగత సంజ్ఞుఁడ వైన ని
న్నిట్లు దెచ్చితిని సహింప వలయు;
నా రథాశ్వముల, ఘనస్యందనము నిదె
చూడు మనుచు సూతసూనుఁ డపుడు. 174

వ. సవ్యాపసవ్యచిత్రమండలగతుల నాక్షణంబ సాల్వునకు నప్రదక్షిణం బుగా రథంబు వఱపిన, దాని సహింపక సాల్వుండు మూఁడమ్ముల సారథి నేసి మఱియు రాక్షసమాయ ననేకశరంబులు ప్రద్యుమ్ను పై నేసిన. 175

క. అమ్మాయాశరములు భ
గ్నమ్ములు గాఁ జేసి, తన్ముఖమ్మునఁ, దద్వ
క్షమ్మున నొక్కట బ్రహ్మా
స్త్రమ్మును బ్రద్యుమ్నుఁ డేసె దారుణభంగిన్. 176

వ. ఇట్లు బ్రహ్మాస్త్రపీడితుం డయి సాల్వుండు మూర్ఛవోయి రథంబు పయిం బడిన, వాని వెండియు నొక్క దివ్యబాణంబున నేయ సమ కట్టిన, నంతరిక్షంబున హాహారవంబు లెసఁగె; నంత దేవగణప్రేరితు లయిన నారద మారుతులు ప్రద్యుమ్ను పాలికి వచ్చి యి ట్లనిరి.177

తే. "వీఁడు నీచేత వధ్యుండు గాఁడు; మిన్న
కేయ కుండుము; వీని నారాయణుండు
మొనసి వధియించు నని పల్కె వనజగర్భుఁ"
డనినఁ బ్రద్యుమ్నుఁ డేయక యనఘుఁ డుండె. 178

—: సాల్వుఁడు ప్రద్యుమ్నునిచే బాధితుం డై మరలి పోవుట :—

వ. అంత సాల్వుండును నివృత్తుండయి ద్వారకాపురియవరోధం బుడిగి తన సౌంభకం బెక్కి క్రమ్మఱి చనియె; నంత నీ యజ్ఞంబు నిర్వ ర్తితం బయిన నే నరిగి బలభగ్నికృతపాదపవనంబులదాని, ననభిజ్ఞాత ద్వార దేశంబులదాని, నస్వాధ్యాయస్వాహాకార మహీసురాగారం బయినదాని, నపేతభూషణయోషిజ్జనంబుల దాని ద్వారవతిం జూచి యాహుకాత్మజువలన నంతవృత్తాంతంబును నెఱింగి, సాల్వుం జంపి కాని యిప్పురంబు సొర నొల్ల నని నిశ్చయించి, దీని నప్రమాదులరై

రక్షించుకొని యుండు మని బలదేవాదులం బంచి, యప్పుడ ప్రయాణభేరి నడవం బంచి, కృతస్వస్తివచనపురోహితప్రముఖ బ్రాహ్మణవరులకు నమస్కరించి శైబ్యసుగ్రీవంబు లను వాహంబులం బూనిన దివ్యరథం బెక్కిన. 179

ఆ. పాంచజన్యరవముఁ, బంచమహాశబ్ద
రవముఁ జెలఁగె దిశలు సెవుడువడఁగ;
నొలసి జనులదీవనలు మించె; రమ్యమై
గరుడకేతనంబు గ్రాలెఁ జదల. 180

వ. అట్లసంఖ్యాతచతురంగసైన్యంబులతో నరిగి గిరి వన సరోవర సరిద్దేశంబులు గడచి మార్తికావతదేశంబున కరుగునంతకు ముందర సాల్వుండు సౌంభకారూఢుం డయి సముద్ర కుక్షి దేశంబునకుం బోయిన. 181

క. ఏనును వానిపిఱుందన
మానక చని తచ్చమూసమాజముతోడన్
భూనాథ! రణము సేసితి
నానానిశితాస్త్రవర్షణ వ్యాప్తముగన్. 182

క. వీరు లగుసాల్వయోధుల
నారాచావళులు గప్పె నారథముపయిన్,
సారథితురంగములపయి,
జారుధ్వజయష్టిపయి ననంఖ్యాతముగన్ 183

వ. వాని నెల్ల నస్మదీయగోచరంబులు గాకుండ ననేకాయుతశరంబులేసి సాల్వసైన్యంబుతో మహాయుద్ధంబు సేసిన. 184

మ. అవనీనాథ! తదాహవాంతరమునం దస్మత్కరాకృష్టశార్
ఙ్గవినిర్ముక్తనిశాతసాయకశతాగ్రచ్ఛిన్నమై దైత్యదా
నవదేహప్రకరంబు వాతవిధుతార్ణఃపూర్ణసంఘూర్ణితా
ర్ణవకుక్షిం బడియెం గపిప్రవరసైన్యక్షిప్తశైలాకృతిన్. 185

చ. ఘనతరదైత్యదానవనికాయకళేబరపాతఘట్టనం
దనరి యుగాంత్యకాలచలితంబునుబోలెఁ బయోధి మ్రోసె; న

వ్వనధిరవంబుకంటె ననివారిత మై చెలఁగెన్ మదీయవా
హిని భటసింహనాద హయ హేషిత సింధురబృంహితధ్వనుల్. 186

వ. అట్టిమదీయసేనోత్సాహంబును, నిజసేనాక్షీణతయుం జూచి సహిం
పక సాల్వుండు వెండియు సౌంభకారూఢుం డయి నాతో మాయా
యుద్ధంబు సేయ సమకట్టి. 187

సీ. పరశు పాశాంకుశ కరవాల శూల ము
ద్గరములు నామీఁదఁ దెరలఁ గురిసె;
నేనును గడఁగి యద్దానవుశస్త్రముల్
వాయంగఁ జేసితి; మాయఁ జేసి
వెఱవక సాల్వుండు వెండియు నామీఁదఁ
బరుషశిలావృష్టి గురిసె; వరుస
నమరఁ దమఃప్రకాశములతో దుర్దిన
సుదినశీతోష్ణముల్ గదియఁ జేసి;
ఆ. దితిసుతాధముండు శతసూర్యశతచంద్ర
శతసహస్రవిష్ణుతతులు వెలుఁగ
గగనతలము సేసెఁ బగ లిది రే యిది
యని యెఱుంగనయితి మనములోన. 188

క. మనుజేంద్ర! సర్వమాయా
పనోదనం బయిన యగ్నిబాణంబున న
ద్దనుజవినిర్మితమాయా
వినివర్తనఁ జేసితిని సవిస్మయమతి నై. 189

వ. అట్టియవసరంబున ద్వారవతినుండి యాహుకప్రేషితుం డయి యొక్క
రుం డతి త్వరితగతిం బఱతెంచి సాల్వుచేత నక్కడ వసుదేవుండు
పట్టువడియె; నీ వెవ్వని తోడం గయ్యంబు సేసెదు? క్రమ్మరి చని
పురంబు రక్షించుకొను'' మనిన విని యదరిపడి "మహాబలపరాక్రము
లయిన బలదేవాదులు రక్షించుకొని యుండ వసుదేవుఁ డేల పట్టు
వడు? నిదిపోల"దని సంశయించుచు విమనస్కుండనయి యుండునంత.

సీ. పుణ్యకర్మంబులు వొలిసిన నుర్వికి
నేతెంచునట్టి యయాతివోలె
భూషణదీప్తులు వొలియంగ వివృతకే
శాంబరుం డయి సౌంభకంబువలనఁ
బఱతెంచు వసుదేవుఁ బాపనిశాచర
బలపీడ్యమాను దప్పులన కాంచి
యత్యంతమోహశోకాంధుండ నయిన నా
హాస్తంబువలన విస్రస్తమయ్యె

ఆ. శార్ఙ్గ; మప్రియావసన్న దేహుండ నై
యుడిగి రథముమీఁదఁ బడితి నేను;
దానిఁ జూచి భయము దగిలి మత్సైన్యంబు
దల్లడిల్లి యులిసెఁ బెల్లురేఁగి. 191

వ. అంత నెంతయుం బ్రొద్దునకుఁ దెలిసి సాల్వు సౌంభకంబున వసుదేవుం గానక, దాని మాయఁగా నెఱింగి పదంపడి మాయావి యయిన సాల్వుం జూచి, వాని పయి నలిగి యే నేసిన నయ్యసురయు సౌంభకంబు నదృశ్యం బగుటయు. 192

క. అసురులయాక్రోశధ్వను
లెసఁగెం బదిదిశల; నంత నేనును దద్రా
శుసులఁ గతాసులఁ జేసితిఁ
బ్రసభంబున శబ్దభేదిబాణప్రతతిన్ 193

వ. అంత సాల్వుండును దనసౌంభకంబుఁ బ్రాగ్జ్యోతిషంబుఁ జేసి తానును దానవుండయి పర్వతవర్షంబు నాపయిం గురిసిన. 194

ఆ. పరుషవిషమభూరిపాషాణభీషణ
గిరులు వచ్చి నన్నుఁ దెరలఁ గప్ప
వజ్రబాణ మేసి వాని నన్నింటిని
బాచి యున్న నన్నుఁ జూచి యపుడు. 195

క. దారుకుఁ డిట్లనియె "మహా
వీరు నుపేక్షింపఁ దగునె వీనిని మాయా

ప్రారంభు? నుపేక్షింప ర
పారపరాక్రములు పోర; ప్రాకృతులైనన్" 196

వ. అనిన వానిపలుకులు విని యలిగి యనలజ్వాలాకరాళం బయి, ప్రతికూల రాక్షస యక్ష గంధర్వ దైత్య దానవభస్మసాత్కరణం బయిన చక్రంబు నభిమంత్రించి సౌంభకంబుపయి వైచిన నది యుగాంత కాలపరివేషభీషణం బయిన రవిమండలంబునుంబోలె గగనంబునం బఱచి సౌంభకమధ్యంబునం బడిన 197

చ. తడయక ఘోరదర్శనసుదర్శనపావకుచే దహింపఁగాఁ
బడి పరమేశ్వరోగ్రశరపావకదగ్ధపురత్రయాభ మై
యెడరి ధరిత్రిమీఁదఁ బడియెం జెడి సౌంభక; మంత సాల్వుఁడుం
బడియె మదీయచక్రపటుపాతరయంబున రెండువ్రయ్యలై." 198

—: పాండవులు ద్వైతవనంబునకు వచ్చి యుండుట :—

వ. అని యిట్లు సాల్వునిం దన చంపిన విధంబు సెప్పి చక్రధరుండు పాండవుల వీడ్కొని సుభద్రాభిమన్యులం గాంచనరథం బెక్కించుకొని తోడ్కొని ద్వారవతి కరిగె; ధృష్టద్యుమ్నుండును బ్రతివింధ్యాదులయిన ద్రౌపదేయులం దోడ్కొని ద్రుపదుపురంబునకుం జనియె; నిట పాండవులును రథంబు లెక్కి యాయుధంబులు ధరియించి యింద్రసేనాదిమూలభృత్యు లిరువదుండ్రు ముందట రా, ననేక సహస్ర బ్రాహ్మణవరులతో ద్వైతవనంబున కరిగి; రంత ధర్మరాజు తమ్ములకి ట్లనియె. 199

మధ్యాక్కర. "ఇది మహోగ్రాటవి; సింహ శరభోరగేంద్ర శార్దూల
మదగజాకీర్ణంబు; దీనిలోన నేమఱ కుండ వలయు;
నదియునుంగాక పరప్రయోగమాయలు గల; వెఱఁగి
మది నుండునది" యన్న నన్న కి ట్లను మఘవనందనుఁడు. 200

వ. బ్రహ్మవిదులును, దపోవృద్ధులైన బ్రహ్మణులును,నఖిలలోకద్వారంబుల నప్రతిహతు లయిన నారదద్వైపాయనాది మునివరులు నీచేత నుపాసితు లయి నీకుశలంబ కోరుచుండుదురు; భవత్ప్రతాపం బెల్ల వారిని రక్షించు; నివ్వనంబు సకల కాల కుసుమఫలభరిత వనస్పతి

శాఖాశిఖారూఢ మయూర కీర కోకిలాలాప మధురంబును, బక బలాక కోక కారండవ సారస రమ్య మధుకర సౌమ్య సరోవరసంకులంబును, విమలశీతలజలప్రవాహనదీశోభితంబును, మహర్షిగణసేవితంబును నై యొప్పుచున్నయది; యిం దుండుద "మని లలిత లతా వితానాదిరమణీయంబు లయిన పృథుమూలంబుల నేవురు వేఱువేఱ నివాసంబులు సేసి నియతాత్ము లయి యిష్టంబున దేవపితృకార్యంబులు సేయుచుం దమ్ముఁ జూడ వచ్చిన మహామునులకు బ్రాహ్మణులకు మనఃప్రియంబు లయిన యాహారంబులు వెట్టుచు ద్వైతవనంబున నుండునంత. 201

క. పాండవులకడకు ధర్మవి
దుండు, తపోదహనదగ్ధదురితౌఘుఁడు మా
ర్కండేయుం డను మునినా
థుం డంతేవాసిగణముతోఁ జనుదెంచెన్. 202

వ. ఇట్లు వచ్చి వారలచేత నర్చితుం డయి వనవాసక్లేశదుఃఖితు లయిన పాండవులను ద్రౌపదిం జూచి యమ్మార్కండేయుం డి ట్లనియె.

సీ. "పితృనిదేశమ్మునఁ బృథివీశ్వరత్వంబు
విడిచి సానుజుఁ డై పవిత్రచరిత
జానకిఁ దోడ్కొని చని వనంబున నున్న
రఘుకులనందను రాముఁ దొల్లి
జూచితి; నిపుడు భూసురవంశపోషకు
సాధుజనస్తుత్యు సత్యధర్ము
నిత్యు ధర్మజు రమణీయకీర్తిప్రియు
శమవంతుఁ జూచితి; సగర భరత

ఆ. నల యయాతి వైన్య నాభాగు లాదిగ
నాదిరాజు లెల్ల నధికధర్మ
సత్యయుక్తిఁ జేసి సకలలోకంబులు
వడసి భాగధేయభాగు లయిరి. 204

వ. పాపసాఒలప్రయుక్తుం డయిన ధార్తరాష్ట్రునట్లు ధర్మువు దప్పిన వా రెవ్వరును లేరు; మీరు ధర్మనిత్యులగు సత్యవ్రతులరు గావున మీ

కిష్టసిద్ధి యగు" నని మార్కండేయుం డరిగిన నపరసంధ్యోపాసనాసీనుం డయిన ధర్మరాజును, సాయం హోమార్థప్రజ్వలితజ్వలనంబు లయిన యనేక సహస్రబ్రాహ్మణాగ్నిహోత్రంబులం జూచి బకదాల్భ్యుం డను మహాముని యి ట్లనియె, 205

ఉ. భూమిసురోత్తముల్, ప్రకృతిపుణ్య విధాయులు, వీరు ఋగ్యజు
స్సామపరాయణుల్, పరమసాధుచరిత్రులు మీకు సంతత
ప్రేమను నగ్ర శుభోన్నతులు వెంచుచు నుండుటఁజేసి సద్గుణో
ద్దామ యరణ్యవాస మిది దద్దయు నొప్పెడు మాకుఁ జూడఁగన్ 206

వ. బ్రాహ్మణానుగ్రహంబునంజేసి తొల్లి వైరోచనాదు లనేక కాలంబు లక్షయలక్ష్మీ విభవులయి సముద్రనేమి భూచక్రంబు రక్షించిరి; యనిల సహాయుండయిన యగ్నిదేవుం డరణ్యంబులు దహించునట్లు బ్రాహ్మణసహాయుండయిన మహీశుండు శత్రువర్గంబు నిశ్శేషంబుసేయు; వినీతుండయి విప్రులచేత ననుశాసితుండయిన రాజునకు నలబ్ధలాభాది త్రితయంబు సంపన్నం బగు; బ్రాహ్మణరహితుండయి ధర్మహీనుం డయిన రాజును బ్రజ వలవలదు; ప్రజానురాగంబు లేనివానికి రాజ్యంబు సుస్థిరంబు గానేరదు; మీరు బ్రాహ్మణ ప్రియులరు; ధర్మనిత్యుల; రెప్పుడును మీ కభ్యుదయం బగు" నని బకదాల్భ్యుం డరిగినఁ బాండవులుం దమ యిష్టంబున నుండి దుఃఖోపశమనంబు లయిన కథలు సెప్పుకొనుచున్న యవసరంబున ద్రౌపది ధర్మరాజున కిట్లనియె. 207

—: ద్రౌపదీ ధర్మరాజుల సంవాదము :—

ఆ. "వృద్ధు గొడుకుపలుకు విని క్రూరుఁ డై పాప
బుద్ధిఁజేసి మిమ్ము భూతలంబు
వెలువరించి రాజ్యవిభవంబు గొని యిప్పు
డలుక సెడి సుచిత్తుఁ డయ్యె నొక్కొ ! 208

ఆ. అద్దురాత్ముహృదయ మది యయఃపాషాణ
నిష్ఠురంబు; ధర్మనిధుల మిమ్ము
నట్లు గొడుకు లెగ్గు లాడంగఁ బోయిన
వల దనండ కలహవాంఛఁజేసి. 209

సీ. విమలహర్మ్యంబుల విహరించువారలం
బ్రియ మహార్హాసనశయనరతులఁ
జందనాగురులిప్తచారుసర్వాంగుల
నతనరనాథసేవితుల; మిమ్ము
వనమునఁ గ్రుమ్మరువారిఁ గాఁ, గుశబృసీ
శయనాభిరతులఁగా, నియతరూక్ష
భూరేణుధూసరీభూతవిగ్రహులఁ గా
ద్రుతవన్యమృగనిషేవితులఁ గాఁగ
ఆ. నిట్లు సూచి చూచి యే నెట్లు చిత్తోప
శాంతి సేయుదాన? సకలభోగ
విషయవిరతిఁ జేసి విధియును ధృతరాష్ట్రు
నట్లు మీకు నహితుఁ డయ్యె నొక్కొ! 210

క. భవదాజ్ఞానిగళంబునఁ
దవిలి పరాక్రమము విడిచి ధరణీశ్వర! నీ
యవరజు లిడుమలఁ బడి కడుఁ
జివికిరి చెఱఁ బడిన సింహశిశువులభంగిన్. 211

ఆ. పరనరేంద్రమకుటపద్మ రాగద్యుతి
నరుణ మగు భవత్పదాబ్జయుగము
పరుషధాతుశిలలపై నిప్పు డరుగుట
నరుణ మయ్యెఁ బర్వతాంతరముల. 212

క. అనవరతసౌఖ్యసంపదఁ
బెను పొందుచు నుండు మీకు శీకరకాంతా
రనివాసాయాసంబుల
ననఘా! యిబ్బంగి నవయ నలమట వొడమెన్. 213

వ. నిత్యంబునుం బదివేవురు బ్రాహ్మణులు బ్రహ్మవిదులు బసిండితళిగల నిష్టాన్నంబులు గుడిచి తృప్తు లయినం దద్భుక్తశేషం బుపయోగించుచుండు నీకు వన్యమూల ఫలాశనంబు లుపయోగించుచు నన్యులయందుఁ గ్రోధంబు విడిచి యునికి యుచితంబు గాదు. 214

సీ. పదివేలగజముల బలమున విలసిల్లు
నలిసుతుండు గానడవిలోనఁ
గ్రుమ్మరి, కాయలుఁ గూరలుఁ దిని పేద
వడినఁ జూచియు, దీర్ఘబాహుయుగళుఁ
డయ్యును బాహుసహస్రంబు గలిగిన
యర్జునుకంటె బలాఢ్యుఁ డగుచు
నేకవేగంబున నేనమ్ము లొక్కయ
మ్మేసినవిధమున నేయ నేర్చు

ఆ. నర్జునుండు వనమృగావలిఁ గలిసి యి
ట్లున్నఁ జూచియును, సుఖోచితాత్మ
లైన కవలు దీను లై యున్నఁ జూచియు
నుపశమంబుఁ దాల్చి యుండఁదగునె ? 215

వ. క్షమయును దేజంబును నయ్యయికాలంబులఁ బ్రయోగింప నేరని రాజునకుం బ్రజానురాగప్రతాపంబులు లేవను నీయర్థం బితిహాసంబున వినంబడు; క్షమాతేజంబులలోన నెయ్యది విశేషంబు దానిన నిర్ణయించి చెప్పు మని బలీంద్రుండు దొల్లి తన పితామహుం డయిన ప్రహ్లాదు నడిగిన నాతండు బలీంద్రున కిట్లనియె. 216

ఆ. "క్షమయ తాల్చి యుండఁ జన దెల్లప్రొద్దుఁ; దే
జంబ తాల్చి యుండఁ జనదు పతికి;
సంతతక్షముండు, సంతతతేజుండు
నగుట దోష మందు రనఘమతులు. 217

వ. అదియెట్లనిన నిత్యక్షమాన్వితుం డయిన వానికి భృత్యులు వెఱవక యవమానంబు సేయుదు; రర్థంబులయం దధికృతు లయిన వారలు ధనంబు లపహరించి దర్పంబు సూపుదురు; మఱి నిత్యతేజోధికుండైన వాఁడతిక్రూర దండంబున సర్వజన సంతాపంబు సేయుచు గృహగతం బైన సర్పంబునుంబోలె నెప్పుడు నుద్వేగకరుండగుం; గావునఁ గాలోచితంబులుగా క్షమాతేజంబులు గల్పించునది; యథాకాల కల్పితక్షమాతేజుండైన వానికి నుభయలోకసిద్ధి యగు; నని బలీంద్ర ప్రహ్లాద సంవాదంబు సెప్పి వెండియు ద్రౌపది యిట్లనియె. 218

తే. అది నపరాధ మొక్కటి యైన, నదియు
నల్పమైనను క్షమియించునదియ గాక;
చెనసి యపరాధములు పెక్కు సేయుచున్న
పాపకౌరవ్యులకు సహింపంగ నేల ? 219

క. ఇది తేజంబున కవసర
ముదితక్రోధుండ వగుమ యొక్కించుక; దు
ర్మదు లగు సుయోధనాదుల
నదయుల వధియింతు రుగ్రులై నీతమ్ముల్." 220

వ. అనిన ధర్మరా జిట్లనియె. 221

సీ. "క్రోధంబు పాపంబు; క్రోధంబునన చేసి
యగుఁ జువ్వె ధర్మకామార్థహాని;
గడుఁ గ్రోధి గర్జంబు గానండు; క్రుద్ధుండు
గురునైన నిందించుఁ; గ్రుద్ధుఁ డైన
వాఁ డవధ్యులనైన వధియించు; మఱి యాత్మ
ఘాతంబు సేయంగఁ గడఁగుఁ గ్రుద్ధుఁ;
డస్మాదృశులకు ధర్మానుబంధుల కిట్టి
క్రోధంబు దాల్చుట గుణమె చెపుమ?

ఆ. యెఱుక గలమహాత్ముఁ డెఱుక యన్జలముల
నార్చుఁ గ్రోధ మను మహానలంబు;
క్రోధవర్జితుండు గుఱుకొని తేజంబు
దాల్చు దేశకాలతత్త్వ మెఱిఁగి. 222

క. క్షమ గలవానికిఁ బృథ్వీ
సమునకు నిత్యంబు విజయసంసిద్ధి యగున్;
క్షమియైన వాని భుజవి
క్రమము గడుఁ వెలయు సర్వకార్యక్షమమై. 223

వ. తేజఃప్రభవంబు లైన యమర్ష దాక్షిణ్య శౌర్య శీఘ్రత్వంబు లను నాలుగు గుణంబులు క్షమావంతునంద వీర్యవంతంబు లగు; దొల్లి కశ్యపగీత లైన గాథలయం దీయర్థంబు వినంబడు; వినుము; వేదం

బులు, శౌచంబును, సత్యంబును, విద్యయు, ధర్మువు, సచరాచరం
బయిన జగ మంతయు క్షమయంద నిలిచినవి; తపస్స్వాధ్యాయ
యజ్ఞ కర్తలయు, బ్రహ్మవిదులయుం బడయు పుణ్యగతులు క్షమా
వంతులు వడయుదు; రదియునుంగాక కృష్ణద్వైపాయన భీష్మ విదుర
కృప ద్రోణసంజయ ప్రభృతులు నా యుపశమంబ కీర్తింతు; రుపశ
మహీనుం డయిన దుర్యోధనుకారణంబున ధార్తరాష్ట్రుల కెల్లం
బ్రళయం బగు"ననిన ద్రౌపది వెండియు ని ట్లనియె 224

మధ్యాక్కర. క్షమయంద చిత్తంబు నిల్పి నిర్గతకల్మషబుద్ధి
క్రమమున ధర్మువునంద వర్తిల్లు కరుణాత్మ నిన్ను
నమర ధర్మంబు రక్షించుఁ బ్రీతితో నని శత్రులందు
సమబుద్ధి సేయంగఁజను నె? నీకు నజాతశత్రుండ! 225

ఆ. ధర్మదూరు లైన ధార్తరాష్ట్రులయందు
ధర్మ మేమి సేయు? ధరణినాథ!
నికృతిపరులయందు నికృతి సేయనివారు
వారి నికృతిఁ జేసి వధ్యు లండ్రు. 226

క. ఆర్యులకు విహీనతయు, న
నార్యుల కున్నతియుఁ జేసి యవినీతుఁడ వై
కార్యము దప్పితి; నీకు న
నార్యులు చుట్టములె? యార్యు లరులె? విధాతా! 227

వ. అని విధాతృని ధర్మువు నాక్షేపించు ద్రౌపదిం జూచి ధర్మరా
జిట్లనియె; నాస్తికులయట్లు ధర్మాభిశంకిని వై దైవదూషణంబు సేసె
దు; శిష్టచరితం బయిన ధర్మంబు నధిక్షేపించు చున్న దుర్మతికిం
బ్రాయశ్చిత్తంబు లేదు; ధర్మువు దప్పక నిత్యులై జీవించు చున్న
మైత్రేయ మార్కండేయ వ్యాస వసిష్ఠ నారదప్రభృతులం బరమ
యోగధరులం బ్రత్యక్షంబ చూచెదము; వీరెల్ల నన్ను ధర్మపరుం డని
మన్నింతు; రన్యు లన్యాయంబు సేసి రనియు నే నేల ధర్మువు
దప్పుదు? 228

క. ధీరమతియుక్తిఁ జేసి వి
చారింపఁగ నిక్కవంబు సర్వజనస్వ
ర్గారోహణసోపానం
బారఁగ ధర్మంబ చూవె యతిరమ్యం బై. 229

వ. తపస్స్వాధ్యాయబ్రహ్మచర్యదానధర్మ యజ్ఞంబు లను పుణ్యకర్మంబు లఫలంబులగు నేని వీని నేల ఋషిగణంబులు సేవింతురు? నీ జన్మంబును, ధృష్టద్యుమ్ను జన్మంబును బుణ్యకర్మఫలసద్భావంబునకు నిదర్శనంబులు గావె? మఱి పుణ్యఫలంబులు గలయట్ల పాపఫలంబులును గలవు; తొల్లి బ్రహ్మ దన పుత్రులకుం గర్మఫలసద్భావంబు సెప్పె; నందుఁ గశ్యపుండు ధర్మప్రబోధనంబునం జేసి పుణ్యఫలప్రాప్తుం డయ్యె; విధాతృనియోగంబునం బుణ్యపాపఫలంబు సంప్రాప్తంబగు; విధాతృ ననుగ్రహంబునన కాదె పుణ్యకర్మంబులు ప్రవర్తించి మర్త్యు లమర్త్యత్వంబును బొందుదు" రనిన విని ద్రౌపది యి ట్లనియె. 230

ఆ. "కర్మఫలము లేదు; కర్మఫలాప్తికిఁ
గారణంబు విధియుఁ గా దనంగ
నంత యెఱుక లేనె? యార్తనై విధిచెయ్ది
కలసి పలికితిం బ్రియంబు దప్పి. 231

ఆ. వేదశాస్త్రములును విధివిధానములును
నప్రమాణ మను దురాత్మకులకుఁ
బుణ్యగతులు లేమి భూనాథ! యెఱుఁగని
దానఁ గాను ధర్మతత్త్వయుక్తి. 232

వ. తొల్లి నీతిమంతు లయిన బ్రాహ్మణులు మదీయజనకునకుం జెప్పంగ వింటి; నెఱుక గలవారికిం గర్మంబు గర్తవ్యంబు; గర్మరహితు లయి స్థావరంబులయట్లు జనులు జీవింప నేర; రల్పఫలంబుఁ నైనను గర్మంబుఁ బ్రవర్తించు చున్నవారిం జూచెదము; దైవమానుషంబులు గర్మఫలప్రాపికి నిమిత్తంబులు; పురుషుండు మనంబున నర్థసిద్ధి నిశ్చయించి కర్మంబునందుఁ గృతోత్సాహుండు గావలయు; నట్టివానికి దైవంబు సహాయం బయి కర్మసిద్ధి గావించు. 233

మధ్యాక్కర: తిలలందుఁ దైలంబు, గాష్ఠములయందుఁ దిరముగా నగ్ని
గలుగు టెఱిఁగి యుపాయపూర్వమునఁ గడఁగి తత్సిద్ధి
యలయక యుత్సాహవంతుఁడు వడయున ట్లనుత్సాహ
మొలసి దైవపరుఁ డీది వడయంగను నోపునె యెందు!

మధ్యాక్కర: కడు నిమ్నగా దున్ని బీజములు సల్లి కర్షకుం డున్నఁ
దడయక వర్షంబు గురిసి కావించుఁ దత్ఫలసిద్ధి;
నడుమఁ బర్జన్యుఁ డనుగ్రహింపనినాఁ డేమి సేయుఁ?
గడఁగి చేయం గలదానిఁ జేయును గాక కర్షకుఁడు. 235

వ. కర్మఫలంబులు దైవమానుషసిద్ధంబు లయిననుం బురుషోత్సాహసము పార్జితంబులయిన నవి సుస్థిరంబు లయి సురక్షితంబు లయి పర్తిల్లు; ననీహమానుం డయి దైవపరుం డయినవాఁడు నీరిలోని యామ పాత్రంబునుంబోలె నవసన్నుం డగుం; గావునఁ గర్మఫలసిద్ధి నిశ్చయించి యుత్సాహవంతుండ వయి నీయనుజుల పరాక్రమం బునం బరుల జయించి మనయందలి యర్థకృశత్వం బపనయింపు'' మనిన యాజ్ఞసేని వచనంబుల కనుగుణంబుగా భీమసేనుండు ధర్మ రాజున కి ట్లనియె. 236

—: భీమసేన ధర్మరాజుల సంవాదము :—

మ. పితృపైతామహ మైన రాజ్య మరినిర్భేద్యంబు, గాండీవిచే
నతిగుప్తంబు, బలారి కైనను నహార్యం; బిట్టిదానిన్ సుదు
ర్మతి నన్యాయ్యము నేసి నీకుఁ జనునే మర్త్యేశ! యుగ్రాటవిన్
వ్రతముల్ సల్పుచు ధర్మలేశచరణవ్యాసక్తి నిట్లుండఁగన్? 237

క. ఆమిషము సింహములచే
గోమాయువు గొన్నయట్లు కువలయ రాజ్య
శ్రీ మనచేఁ గొని కౌరవుఁ
డే మని తలఁచునొకో బుద్ధి నిష్టులుఁ దానున్. 238

క. దుర్మతులను దుర్జనులను
ధర్మస్థితి నోర్వఁ దగునె? ధరణీశ్వర! దు
ష్కర్ములగు ధార్తరాష్ట్రుల
పేర్మి యడంగింపఁ గడఁగు పృథుభుజశక్తిన్. 239

వ. ధర్మకామప్రభవం బయి సర్వార్థసాధనం బయిన యర్థంబు విడిచి మిత్రుల కప్రియంబు, నమిత్రులకు హర్షంబునుంగా మునివృత్తిం జేకొని ధర్మువు ధర్మువనుచు ధర్మువునందు చిత్తంబు నిలిపి దుర్బలు నట్లుండఁ దగునె? 240

ఆ. బాహుబలము మెఱసి పరులసంపదలు సే
కొనఁగ లావు లేని కుత్సితుండు
నియతదుఃఖవృత్తి నిర్వేదపరుఁ డగుఁ
గాక! నీకుఁ దగునె? కౌరవేంద్ర! 241

చ. నరనుత! నీయనుజ్ఞఁ గొని, నాఁడ విరోధుల నెల్లఁ బోరిలో
సరభసవృత్తి నుక్కడఁగఁ జంపితిమేని మహోగ్రకాననాం
తరముల నుండ కుండ, నతిదారుణదుర్మృగసంగమంబునం
బొరయక యుండఁగా మనకుఁ బోలు నమందమనఃప్రియంబుగన్.

క. సమయాతిక్రమభీతిని
క్షమాయుతుల మైన మనలఁ గౌరవులు పరా
క్రమహీనులుగాఁ దలఁతురు
సమరోత్సాహంబు విడిచి జడమతి నున్నన్. 243

తే. తగిలి నిత్యంబు నేకాంతధర్మనిరతుఁ
డగుట యుక్తమె పురుషున? కట్టివాని
వెలయ నర్థ కామంబులు విడుచుఁ బ్రాణ
విగతు సుఖదుఃఖములు రెండు విడుచు నట్లు. 244

సీ. ధర్మకామంబులు దఱుఁగంగ నర్థార్థి
యగువాఁడు పతితుఁ గీడొ, నర్థసేవ
నర్థార్థముగఁ జేయు నతఁ డుగ్రవనములో
గోరచు సేయు నక్కుమతిఁ బోలు;
నర్థధర్మములకు హానిగాఁ గామార్థి
యగునాతఁ డల్పజలాశయమున
జలచరం బెట్టు లజ్జలములతోఁ జెడు
నట్లు కామంబుతో హానిఁ బొందు;

ఆ. నర్థధర్మములు మహోద్ధి మేఘములట్టు
లుభయమును బరస్పరోదయమ్ము;
లిట్లు గాఁ ద్రివర్గ మెఱిఁగి సామ్యమున సే
వించువాఁడు సర్వవిత్తముండు 245

వ. భవదాచరితం బైన యీధర్మం బర్థకామంబులక కాదు, నీకును, నీబాంధవులకును బాధాకరంబు; దాన యజ్ఞ సత్పూజలు గావింప నర్థహీనున కశక్యంబు; జగంబులు ధర్మమయంబులు; ధర్మువునకు మిక్కిలి యొండెద్దియు లే; దయినను నర్థార్థంబు గాని ధర్మువు క్షత్త్రియుల కయుక్తంబు. 246

ఉ. శత్త్రుల నాజి నోర్చుటయు, సర్వక్షయంబులఁ బొంద కుండగా ధాత్త్రిఁ బరిగ్రహించి యుచితస్థితిఁ గాచుటయుం, బ్రియంబుతోఁ బాత్త్రుల కర్థ మీగియును, బ్రాహ్మణపూజయుఁ జువ్వె యుత్తమ క్షత్త్రియధర్మముల్, సుగతికారణముల్, విపులార్థమూలముల్. 247

వ. కేవలధర్మాచరణంబు శత్రుజయంబునకు సాధనంబు గాదు; నికృతి పరులయందు నికృతి వలయుఁ; బూర్వభ్రాత లైన యసురుల నమరులు నికృతిన కాదె నిర్జించిరి; కావున నీవు సమయధర్మ రక్షణ వ్రతం బుడిగి శత్రువుల జయింప నుద్యోగింపుము. 248

క. జయశీలి వైన నీకుం
బ్రియ మొనరింపంగ నున్న పృథుయశులు ముదా
శ్రయు లగుదురు సృంజయకే
కయయదుపాంచాలు రాదిగాఁ గల సుహృదుల్, 249

తే. మిత్త్రసంపన్నుఁడై న నమిత్త్రు మిత్త్ర
బలముతోడ భేదించి, దోర్బలముఁ జలముఁ
గలిగి, దేశబలంబును గాలబలముఁ
గలుగువాని కసాధ్యంబు గలదె? యెందు. 250

తే. బలము గలవానిఁ బలువురు బలవిహీను
లొక్కటై కూడి నిర్జింతు రుత్సహించి;
మధువుఁ గొన నుత్సహించిన మనుజుఁ బట్టి
కుట్టి నిర్జించు మధుకరకులమునట్లు. 251

వ. క్షుద్రాన్నంబునందలి దుగ్ధంబునుంబోలె దుర్యోధను రాజ్యంబు దూష్యం బగుటఁ బౌరజానపదబ్రాహ్మణవరులు నీ కనురక్తులయి భవద్రాజ్యంబ వలచి యుండుదురు; దీని నేల యెడ సేసెదు? సర్వాయుధసనాథం బైన రథం బెక్కి గజపురంబున కభిముఖుండ వై విజయప్రయాణంబు సేయుము. 252

మ. ప్రణుతక్షాత్త్రగుణంబు, విక్రమము, దర్పం బేర్పడం బ్రక్రమ
క్షణదానం బొనరింపు మీక్షణమ; విఖ్యాతంబుగా సంగరాం
గణమధ్యంబునఁ జేయు మర్జునభృహద్గాండీవనిర్ముక్తమా
ర్గణధారావళి ధార్తరాష్ట్రకదళీకాంతారవిచ్ఛేదమున్. 253

క. బహురథగజవాహనభట
సహితులు బలవంతు లని విచారింపకు నీ
యహితులు; మద్బాహుగదా
నిహతికి మార్కొనఁగఁ బోర నిలువంగలరే? 254

క. అరివరుల నోర్చి సాగర
పరివృతభూచక్ర మెల్లఁ బాలింపు; ప్రజా
పరిపాలనంబుకంటెను
ధరణీశ! విశేష మొండు ధర్మువు గలదే? 255

వ. రాజ్యపదస్థుం డైన క్షత్త్రియుండు భూరిదక్షిణంబు లైన యజ్ఞం బుల దేవబ్రాహ్మణులం దృప్తులం జేసి, బ్రాహ్మణులకు నగ్రహారం బులు గోసహస్రంబులు నిచ్చి, దురితంబులవలనం బాసి, తమోవిము క్తుం డైన చంద్రుండునుంబోలె వెలుంగు" ననిన భీమసేనునకు ధర్మ రాజి ట్లనియె. 256

ఉ. "నీవచనంబు ధర్మ్యము, వినీతము నీతియుతంబు నిష్టసి
ద్ధ్యావహ, మత్యుదార మిది; యైనను నిష్టు దలంపఁగా విచా
రావసరాప్తికిన్ విషయ మైనది; కార్యఫలంబు లెల్ల స
ద్భావమునన్ విచారసులభంబుల యండ్రు విచారపారగుల్. 257

క. వనమునఁ బండ్రెం డేండ్లును
జనపదమున నెఱుఁగ కుండ సరి నొకవర్షం

బును జలుప బూని సత్యము
దనరఁగఁ జేసితిఁ బ్రతిజ్ఞ దగ వృద్ధసభన్. 258

చ. అలఘుగుణంబులం దధికుఁ డైన మహాత్ముఁడు రాగకోపమా
యలఁ బడి, యతమావివశుఁ డై, యచిరాంశులతావిలాసచం
చల మగులక్ష్మి కాసపడి, సత్యము ధర్మువుఁ దప్పి, సత్సభా
వలిఁ దగువారియొద్దఁ దగువాఁ డయి సద్విధి నుండ నేర్చునే? 259

వ. ఏ నెట్లును సత్యసమయం బతిక్రమింప నోప; శుభోదయ కాలంబుఁ
బ్రతీక్షించి యుండుము; రాజ్యంబులుఁ బుత్రులును, ధనంబును, యశం
బును, సత్యంబునకు సమంబులు గా''వనిన భీమసేనుం డిట్లనియె. 260

ఆ. అంతకుండు జనుల కాసన్నుఁ డై యుండ
నిమిషమాత్ర మేని నిశ్చయింపఁ
దగని జీవనంబు దద్ద సుస్థిరముగాఁ
జేసి కార్య మెడయుఁ జేయఁ దగునె ? 261

వ. శరీరికి మరణంబు నియతంబు; సుహృజ్జనులు ముందర వైరంబు
దీర్పనివాని జన్మంబు నిరర్థకంబు; సకల రాజసమూహంబునం బిరులచేత
నట్లు మన పడిన పరిభవంబునకుం బ్రతీకారంబు సేయకున్నవారు రేయు
నుం బగలును నా హృదయంబు శోకించుచున్నది; నాకంటె నర్జున
నకుల సహదేవులుం, గుంతీదేవియు సంతాపంబున నెంతయు సం
తప్తు లగుచున్నవారు. 262

క. వీరల దుఃఖము దీర్పక
క్రూరనికారు లగు రిపులకును ముదముగ ను
గ్రారణ్యములో ధర్మువుఁ
గారుణ్యముఁ దాల్చి యునికి గార్యమె నీకున్ ! 263

వ. ఇది బ్రాహ్మణధర్మంబు గాని క్షత్త్రియధర్మంబు గాదు; మను ప్రణీ
తంబు లైన రాజధర్మంబులు నిట్టివి యగునవి లేవు; శత్రుసంహా
రంబు సేయమినాఁ డత్యంతహాని యగు; నట్లుం గాక. 264

తే. వనమునందుఁ బండ్రెండుసంవత్సరంబు
లుండ నేర్చితి మేనియు, నూరు తెలియంగ

కుండ నజ్ఞాతచర్యయం దొక్కదివస
మైన నుండఁగ నేర; మెట్లనిన వినుము. 265

వ. ఆబాలవృద్ధప్రసిద్ధుండ వై పార్థివసూర్యుండ వైన నిన్నును, సింహ సంహననుల వైన నీతమ్ములను నెఱుఁగని వారు లేరు; మన గూఢ భావంబు మేరువు నిగూఢభావంబునుంబోలె నఘటమానం; బిట్లేని నివ్వన వాసక్లేశం బెన్నఁడును మనకుఁ బాయ నేరదు; మన మిప్పు డివ్వనమునఁ బదుమూఁడుమాసంబులు సలిపితిమి; సంవత్సర ప్రతిని ధిగా మాసంబులు సేసికొనుట యెందునుం గలయదియ; దీన ధర్మ విరోధంబు లేదు; విజయారంభంబున కిది యవసరం"బనిన భీమసేను పలుకులు విని నిశ్వాస వ్యాకులితముఖుం డై పెద్దయుం ప్రొద్దు చింతించి ధర్మ రా జి ట్లనియె. 266

క. "క్రమమునఁ బాండిత్య పరా
క్రమ గర్వములందుఁ గడుఁ బ్రగల్భుండవు; మ
ధ్యమ ! నీ చెప్పినయది కా
ర్యమ యయినను ధీరబుద్ధి వై విను మనఘా ! 267

వ. "అల్పోపాయం బైన కార్యంబు సాహసారబ్ధం బైనను దోషంబు లే; దిది మహాకార్యంబు; సాహసక్రియాసాధ్యంబు గాదు; సువిచారితం బై సిద్ధిం బొందు; విచారపూర్వారబ్ధకార్యంబునకు దైవంబును ననుకూలం బగుం; గావున నిమ్మెగా విచారింపవలయును. 268

సీ. శూరులు ధృతరాష్ట్రసుతులు దుర్యోధనా
దులు దురాధర్షు లందొఱును మనకు
నాతతాయులు; మఱి యంగభూవిభుఁడును
భూరిశ్రవుఁడు శలభూమిపతియు
నాదిగాఁ గల వీరు లవిజేయవిక్రము
లొలసి తత్సుహృదు లై యున్న వారు;
మనచేత జితు లైన మనుజేశు లెల్లను
జని సుయోధనుచేత సత్కరింపఁ

ఆ. బడి, కడంగి వాని ప్రస్తవంబున నాజి
వేచి ప్రాణములను విడువ నున్న
వారు; వార లెల్ల వసుధఁ బ్రసిద్ధులు
వినఁగ నస్త్రశస్త్రవిద్యలందు. 269

క. వినవయ్య కర్ణుగర్వం
బని నాతఁ డభేద్యకవచుఁ డగుటయు, విలునే
ర్పును, నతనిబాహువిక్రమ
మును దలఁచిననాఁడు గన్ను మూయదు నాకుఁ, 270

వ. మఱియు భీష్మద్రోణకృపాచార్యులు సము లయ్యును వారియొద్దన యున్న వారు; వార లపారదివ్యాస్త్రవిశారదులు; వారల నోర్చి కాని దుర్యోధను నిర్జింపం బోల"దని విచారించు సమయంబున. 271

—: కృష్ణద్వైపాయనుఁడు ధర్మరాజునొద్దకు వచ్చుట :—

క. వారలపుణ్యోదయమున
వారిజభవనిభుఁడు లోకవంద్యుఁడు వచ్చెం
బారాశర్యుఁడు, ధర్మశ
రీరుఁడు గృష్ణాజినోత్తరీయుఁడు ప్రీతిఁ. 272

వ. ఇట్లు వచ్చి పరమభక్తిపరులైన పాండవులచేతం బూజితుం డై కృష్ణద్వైపాయనుండు ధర్మరాజున కిట్లనియె. 273

క. వీరు లగు భీష్మకుంభజ
శారద్వతకర్ణు లమితసత్త్వులు; వారిం
బోర వధియించు టెంతయు
భారం బని యున్న నీదు భర మెఱిఁగి మదిన్. 274

ఆ. దాని నపనయింపగా నిప్డు వచ్చితి;
నధిక యోగలబ్ధ మతిరహస్య
మీవిశేషవిద్య సేవింపఁగాఁ బార్థుఁ
బనుపు; మితఁడు దీనఁ బడయు సిద్ధి. 275

వ. అని ధర్మతనయు నేకాంతప్రదేశంబునకుం దోడ్కొని చని సత్యవతీసుతుండు విధిదృష్టవిధానంబునం బ్రతిస్మృతి యను విద్య నుపదేశించి

క. పారాశర్యుఁడుఁ, బర్వత
నారదులను బొందు రాజనందనుల, గుణో
దారుల, ననఘులఁ, దీర్ఘ
ప్రారంభులఁ గాన వచ్చి పరమ ప్రీతిన్. 307

క. వారలచేఁ బూజితులై
భూరితపోధనులు, లోకపూజ్యులు ధర్మ
ప్రారంభనిత్యమతులకు,
వారల కిట్లనిరి సత్యవచనులు గరుణన్. 308

వ. "శారీరనియమంబులు మానుషవ్రతంబు లనంబడు; మనోబుద్ధిశౌచంబులు దేవవ్రతంబు లనంబడు; నట్టిసౌమ్యవ్రతవిశేషంబులు సలుపుచు బుజుమార్గులరై తీర్థంబులు సేవించునది; తీర్థాభిగమనంబున మహాభిష నాభాగ భరత భగీరథ ముచుకుంద మాంధాతృ సగర సార్వభౌమాష్టక రోమపాదులయట్ల శత్రు జయంబును, సర్వలోకసుఖంబులుఁ బడయుదు" రని చెప్పి మునివరులు మువ్వురరిగి; రంత నజాతశత్రుండు రోమశున కిట్లనియె. 309

క. "ధరణి నధార్మికు లగు కా
పురుషుల కభివర్ధనంబుఁ బుణ్యచరిత్రం
బరఁగెడు ధార్మికులకు దు
ర్ధర మగు నవివర్ధనంబుఁ దగునె? మునీంద్రా! 310

వ. మఱియు నచేతనంబులయ్యును గిరిసరిత్సరోవరంబులు పుణ్యతీర్థంబులై జగత్పావనంబులై జనులకు దురితాపహారంబు లయిన కారణం బేమి?'' యని యడిగిన నతనికి రోమశుం డిట్లనియె.

**—: రోమశుండు ధర్మరాజునకు ధర్మవిశేషంబులు సెప్పుట :—**

చ. వసుధ నధర్మవర్తు లగువారల వర్ధన మెన్నఁడున్ సమం
జస మయి నిల్వ నేరదు; భృశంబుగ నాశము పొందు; దుర్మద
వ్యసను లధర్మవర్తనఁ బ్రవర్ధితు లయ్యును, నేము చూడ రా
క్షసులును, దైత్యదానవులుఁ గ్రాఁగరె తొల్లి సహస్ర సంఖ్యలన్.

క. దేవతలు ధర్మవర్తులు
గావున నభివృద్ధిఁ బొంది ఘనమగు నిత్య
శ్రీవిభవాన్వితు లయి ధర
ణీవల్లభ! యున్నవారు నిరుపమకీర్తిన్. 313

క. ధర్మసుత! ధార్తరాష్ట్రు ల
ధార్మికులై పెరిఁగిరేనిఁ దడయక విధిచే
నిర్మూలితు లగుదురు దు
ష్కర్మంబున నసురులట్ల కడు నస్థిరులై. 314

వ. అది యెట్లనిన నధర్మవర్తులయందు దర్పంబు వుట్టు; దర్పంబువలన మానంబు వుట్టు; మానంబువలనఁ గ్రోధంబు వుట్టుఁ; గ్రోధంబువలనం జేసి లజ్జయు, వృత్తంబునుం జెడు; నష్టలజ్జావృత్తు లయినవారి నుపశమంబును, లక్ష్మియు విడుచు. 315

క. మీ రమర సదృశులరు, ధ
ర్మారంభవిశిష్టమతుల రగుటను సుచిర
శ్మారమ్యు లగుదు; రాజి జి
తారాతుల రగుదు రుద్ధతాహవములలోన్. 316

వ. ధర్మవర్తులైన దేవతలు, ఋషులు నాశ్రయించుటం జేసి తీర్థంబులు పవిత్రంబులై సర్వకామప్రదంబులై వర్తిల్లుచుండుఁ, దీర్థసేవను, దానంబులను, బ్రాహ్మణుల దీవనలను జనులు సర్వదుఃఖవిముక్తులయి శ్రేయఃప్రాప్తులగుదురు" రని చెప్పిన నమ్మునివరువలన నొండుధర్మస్థితులు వించుఁ బాండవు లరిగి నైమిశంబు, నశ్వతీర్థంబును, గంగాఘోషంబును, గన్యాతీర్థంబును, గోమతియును, బాహుదయును, మహానదియును, దేవయజనం బయిన ప్రయాగయు, గంగాయమునాసంగమంబును నాఁడి యందు బ్రాహ్మణులకు గోహిరణ్యాదానంబులు సేసి, ప్రయాగం గొన్నిదినంబు లుండి, వేదవిదు లయిన బ్రాహ్మణుల వలన వేదార్థంబు లెఱుంగుచుఁ జని, యనేక పుణ్యనదీసముద్భవం బయిన గయపర్వతంబును రామసరంబును, బ్రహ్మసరంబును, శైవస్వతతీర్థంబునుం జూచి, గయయందు నక్షయవటంబున నాక్షేయం బైన

విధానంబునం జాతుర్మాస్యక్రతువులు సేసి, ఋషులవలనం బుణ్యకథలు వినుచున్న యవసరంబున శమఠుం డను మహాముని ధర్మరాజున కి ట్లనియె. 317

సీ. "అనఘుం డమూర్తరయః ప్రియపుత్రుండు
గయుఁ డను రాజర్షి క్రతువు లిందు
బ్రహ్మసరంబునఁ బరఁగంగ మును చేసె;
నాతని యజ్ఞంబులందు సకల
జనభుక్తశేషాన్నశైలంబు లిరువది
యే నగుసంఖ్య దా నెఱుఁగ నయ్యెఁ;
దత్కృత క్రతుబహుదక్షిణా సంఖ్యయు
నుడుసికతాసంఖ్యయును నెఱుంగఁ

ఆ. గాదు జనుల; కట్టి గయునామమున గయ
యనఁగఁ బుణ్యతీర్థ మయ్యె నిదియుఁ;
బితృహితార్థ మిందుఁ బిండప్రదానంబు
సేయఁ గనిన నిష్టసిద్ధి గలుగు." 318

వ. అని చెప్పిన శమఠువలన గయామాహాత్మ్యంబు విని యగస్త్యాశ్రమంబున కరిగి; రంత ధర్మరాజు రోమశున కి ట్లనియె. 319

మధ్యాక్కర "వాతాపి యనువాని నెట్లు సంపె సద్వంద్యుఁ డగస్త్యుఁ?
డాతతతేజోధికుండు నా కిందు నమ్మునినాథుఁ;
బ్రీతిని దచ్చరితంబు వినఁగ నభీష్ట మిం"దనిన
నాతని కి ట్లని చెప్పె రోమశుం డమ్ముని పేర్మి. 320

క. "వీతభయుఁ డిల్వలుండును
వాతాపియు ననఁగఁ బరఁగు వరదైత్యులు వి
ఖ్యాతబలులు వసియింతు ర
రాతిహరుల్ మణిమతీపురంబున నొప్పన్. 321

వ. అం దగ్రజుం డయిన యిల్వలుం డొక్క బ్రాహ్మణు నతిభక్తి నర్చించి నాకు సకల కామసిద్ధికరం బగు మంత్రం బుపదేశింపు"మని ప్రార్థించి విఫలప్రార్థనుం డై యరిగి, తన తమ్ముఁ, గామరూపధరు, వాతాపి

నపుడు మేషరూపంబు సేసి వధియించి, వానిమాంసం బిమ్ముగా
వండించి, దాని నావిప్రునకుఁ గుడువం బెట్టించి. 322

తే. విప్రుకడుపులో నున్న యవ్వీరు ననుజుఁ
బిలిచె వాతాపి రమ్మని ప్రియముతోడ;
జీవితుం డయి వాఁడు సెచ్చెరను విప్రు
కడుపు వ్రచ్చుచు వెలువడి క్రాఁచె విప్రు. 323

వ. అది మొదలుగా నిల్వలుండు దనకడకు నతిథు లై వచ్చు విప్రుల
నిప్పాట నంతకు పురంబున కతిథులం జేయు చున్నంత నట యగ
స్త్యుండు బ్రహ్మచర్యాశ్రమంబునం బెద్దకాలం బుగ్రతపంబు సేయుచు
వనంబునఁ బరిభ్రమించువాఁడొక్క సల్లకీపల్లవంబున నధోముఖు లయి
వ్రేలుచున్న తన పితరులం జూచి "యివ్విధంబున మీ రున్న కారణం
బేమి?" యని యడిగినఁ బితరు లి ట్లనిరి. 324

తే. "అయ్య! యేము నీపితరుల; మధికనిష్ఠ
బ్రహ్మచారి వై నీవు తపంబు సేయు
చున్నవాఁడవు సంతతి నొల్లి; కదియ
కారణంబుగ మా కూర్ధ్వగతియు లేదు 325

వ. ఇంక నైనను నీవు వివాహంబై సంతానంబు వడసిన మాకుఁ బుణ్య
గతి వడయనగు"ననిన "నట్ల చేయుదు"నని యగస్త్యుండు దన తప
శ్శక్తిం జేసి పుత్రకాముండైన విదర్భరాజున కొక్క కూతుం బుట్టిం
చిన నది లోపాముద్ర యను నామంబుతో జలంబులయందు నళిని
యుంబోలె, వినీతునందు లక్ష్మియుంబోలె,నుద్యుక్తునందు విద్యయుం
బోలెఁ బెరిఁగి యౌవనంబు దాల్చి, రూపవతియై వయో రూపంబుల
ననురూప లయిన కన్యకాశతంబుతో నొప్పుచున్నంత. 326

క. తరుణి నగస్త్యభయంబున
వరియింపఁగ నోడి రాజవరులు మనోజా
తురు లగు చుండిరి; తగియెడు
వరు రోయుచు నుండె సుతకు వైదర్భుండున్. 327

వ. అంత నగస్త్యుండు విదర్భరాజుపాలికి వచ్చి "నాకు లోపాముద్ర నిచ్చునది" యనిన విదర్భేశ్వరుండు తన తనూజ నమ్మునికి నీనోపక మనంబున ననుతాపించి యక్కన్యకం జూచి యాత్మగతంబున. 328

ఉ. నారలు గట్టి, కూర లశనంబుగ, నుగ్రవనంబులోఁ దపో
భారమునం గృశుం డయిన బ్రాహ్మణుఁ డీలలితాంగిఁ బెండ్లి యై
నారలు గట్టి, కూర లశనంబుగ, నుగ్రవనంబులోఁ దపో
భారను దాల్చి యుండు మని పంపక మిన్నక యుండ నిచ్చునే ?

ఆ. ఎఱిఁగి యెఱిఁగి దీని నెట్లీఁగ నగు? భోగ
యోగ్య యైనయది పయోజనేత్ర;
యీనినాఁడు శాప మిచ్చుఁ గా కిమ్ముని
యేల సైఁచు? నింక నెట్టులొక్కొ?" 330

వ. అని వైదర్భుండు దానునుం బత్నియు వగచు చున్న వారిపాలికి వచ్చి లోపాముద్ర యి ట్లనియె. 331

క. "ఇమ్మునివరునకు నన్నుఁ బ్రి
యమ్మున నిచ్చునది; మీకు నతిచింతాభా
ర మ్మేల?" యనిన నిరువురు
నమ్ముదితకు సంతసిల్లి యధికవిభూతిన్. 332

—: అగస్త్యుండు లోపాముద్రను వివాహం బగుట :—

వ. విధ్యుక్తంబుగా నక్కోమలి నగస్త్యునకు వివాహంబుఁ జేసిన నగస్త్యుండు లోపాముద్రం బరిగ్రహించి దాని దివ్యాంబరాభరణంబు లపనయించి, వల్కలాజిన ధారిణిం జేసి, ధర్మ చారిణిం దోడ్కొని చని, గంగాద్వారంబునం దపంబు సేయుచు నొక్కనాఁడు. 333

క. నీచతరనాభిఁ, జపలవి
లోచనఁ, బృథుజఘనచక్ర, లోపాముద్రం
జూచి మునీంద్రుఁడు మన్మథ
గోచరుఁడై దానిఁ బ్రీతిఁ గూడఁగఁ దిని రెన్. 334

వ. అదియును మునివరు నభిప్రాయం బెఱింగి, లజ్జించి, ముకుళిత కరాంబుజ యై యి ట్లనియె. 335

క. "పతి పత్నిఁ బ్రజార్థముగా
ధృతిఁ బడయుట యొందుఁ గలయదియ; యైనను న
న్నతిరుచిరాంబరభూషా
న్వితఁ జేసి మనఃప్రియంబు నిర్మింపు దయన్. 336

క. మునినాథ ! నీవు నను లే
పనమాల్యవిభూషణప్రసన్నుఁడ వై నా
కొనరింపు మపత్యోత్పా
దన మీఋతువాసరములు దప్పక యుండన్." 337

వ. అనిన నాకుఁ దపోధనంబ కాని యొండు ధనంబు లేదు; నీకోరిన విధం బెట్లు సేయ నేర్తు? దపంబునం జేసి సర్వంబునుం బడయ నగు నం జేని నేను దపోవ్యయంబు సేయ నోప" నని యగస్త్యుండు వసు భిక్షార్థి యై శ్రుతపర్వుం డను రాజుపాలికిఁ బోయి వానిచేతం బూజి తుం డయి "యేను ధనార్థి నై వచ్చితి; నీపోష్య జన పోషణంబునకు విఘాతంబు గాకుండ మిగులు ధనంబు గలదేని నా కిమ్మని" యడిగిన నతం డాయవ్యయంబులు సమంబు లగుటం జేసి మిగులు లేమి యెఱింగించిన, వాఁడును దానును బ్రధ్నశ్వుం డను రాజుపాలికిం బోయిన, నతండును నయ్యిరువురం బరమభక్తిం బూజించి తదాగ మనప్రయోజనం బెఱింగి, తనయందుల నాయవ్యయంబులు సమంబు లగుట యెఱింగించిన. 338

క. ఇరువురఁ దోడ్కొని తానును
నరిగెం ద్రసదస్యుఁ డను జనాధిపుకడకుం;
గర మర్థితోడ నం దఱుఁ
బురుకుత్సతనూజుఁ డతండు పూజించి తగన్. 339

వ. వారల చెప్పినట్ల తన నిర్వాహంబు సెప్పి త్రసదస్యుం డగస్త్యున కి ట్లనియె. 340

క. ఇమ్మణిమతీపురంబునఁ
దిమ్ముండును దాను నతిముదంబున నుండుఁ
జెమ్మిని నిల్వలుఁ డనువాఁ;
డిమ్మహి ధనవంతుఁ డతఁడ యెవ్వరికంటెన్. 341

వ. అతండు మన యభిమతంబు దీర్ప నోపు'' నని రాజర్షులు మువ్వురు మహర్షిం దోడ్కొని యిల్వలు పాలికిం జనిన నయ్యిల్వలుండును వారి నాతిథ్యవిధానంబుల నర్చించి వాతాపి నెప్పటియట్ల సంస్కరించి యగస్త్యుని కశనంబుగా సమర్పించిన. 342

తే. దాని నెఱింగి యమ్మువ్వురు ధరణిపతులు
మునివరేణ్యున కప్పుడు మ్రొక్కియనిరి
''విప్రవరులకు భక్ష్యమై వీని తమ్ము
డుదరములనుండి విప్రుల నొగిన చంపు 343

చ. వలవదు నీనియింటఁ గుడువన్ మనకున్ ; ధన మిచ్చు నేని ని
మ్ములఁ గొని పోద మిప్పు'' డని ము న్నెఱింగించిన నమ్మునీంద్రుఁ డ
త్యలఘుఁడు వారిమాటకు భయంపడ కెంతయుఁ బ్రీతితోడ న
గ్గలముగఁ జేసె భోజనము గంతముదాఁక నకుంఠవీర్యుఁ డై. 344

ఆ. ఇల్వలుండు ననుజు నెప్పటిక్రియఁ బిల్వ
నెఱిఁగి దాని నమ్మునీశ్వరుండు
గడుపుఁ దడివికొనుచుఁ గఱ్ఱనఁ ద్రేఁచిన
నసుర జీర్ణమయ్యె నాక్షణంబ. 345

వ. ఇల్వలుండును మునివరుశక్తికి భయంపడి విషణ్ణుం డయ్యును బ్రసన్నుండపోలెఁ దన వంచన యేర్పడకుండం గృతప్రణాముం డై తదాగమనప్రయోజనం బడిగిన వానికి నగస్త్యుం డి ట్లనియె. 346

సీ. ఈరాజవరులతో నేను ధనార్థి నై
వచ్చితి నీకు ద్రవ్యంబు గలుగు
టెఱిఁగి'' నావుడు '' నటులేని మీ కభిమత
మెంత యంతయ ధన మిత్తు'' ననినఁ
''బదివేలు మొదవులుఁ, బదివేలగద్దియల్
పసిఁడియు నిమ్మహిపతుల కిమ్మ
యొక్కొక్కనికి ; మఱియొక్కని కిచ్చిన
దానికి రెట్టిగోధనము, నొక్క

ఆ. హేమమయరథంబు నిమ్మ నా'' కనిన ని
ల్వలుఁడు దక్షిణంబ తలఁచి యిచ్చె
నయ్యగస్త్యు చెప్పినంతధనంబు ము
వ్వురు మహీపతులకుఁ గరము నెమ్మి. 347

వ. మఱియు విరావ సురావము లను నశ్వంబులం బూన్చిన సౌవర్ణ రథంబును, నిరువది వేల మొదవులు, నిరువదివేల గద్దెల పసిండియు మునివరున కిచ్చినం దద్రథంబున. 348

క. మునివరనృపతులఁ, దద్గో
ధనకాంచనతతులఁ, దత్పతాకినులను నో
లిన తాల్చి యగస్త్యాశ్రమ
మునకుం దక్షిణమ దివ్యములు పడిఁ బఱచెఁ. 349

వ. రాజర్షులు నగస్త్యు వీడ్కొని చని; రంత నగస్త్యుండు లోపాముద్ర కభిమతం బొనరించి. 350

మధ్యాక్కర. పదుగురఁ బోలెడు సుతుల నూర్వురఁ బడయంగ వలతొ ?
పదుగుర నూర్వుర కెనయగు సుతులఁ బడయంగ వలతొ?
వదలక వేవురు సుతులఁ బడయఁగ వలతొ ? వేవురకుఁ
గదియంగ నుత్తము నొక్కరు వలతొ? కమలాయతాక్షి!"

వ. అనిన ముదితహృదయ యై లోపాముద్ర మునీంద్రున కిట్లనియె.

క. "వేవురఁ బోలెడువాని మ
హావీర్యగుణాఢ్యు నొక్కయాత్మజుఁ బడయం
గా వలతు ; నపేతగుణుల్
వేవురుసుతు లయ్యు నెందు విఫలము కాదే ?" 353

వ. అనిన ''నీకోరినట్ల గుణవంతుం డయిన కొడుకు నీకు జన్మించు'' నని దానికి గర్భాధానంబు సేసి, యగస్త్యుండు దపోవనంబున కరిగె ; నిట లోపాముద్రయు నేడేండ్లు గర్భంబు దాల్చె; నంత నకొక్కమలికి.

క. తనయుఁడు, దృఢస్యుఁ డనఁగా
ననపద్యుఁడు, వేదములు రహస్యంబులతో

నొనరఁగ జపంబు సేయుచు
నినతేజుఁడు పుట్టె భువన మెల్ల వెలుంగన్. 355

వ. వానికిం దేజస్వి యను ఋషి పుట్టి యపారం బైన యిధ్మభారంబు వహించుటం జేసి యిధ్మవాహుం డనం బరఁగె; ని ట్లగస్త్యుండు పుత్రవంతుం డయి తన పితరుల బుణ్యలోకగతులం జేసె; నని వైశంపాయనకథితకథాక్రమం బతి రమ్యంబు గాను. 356

క. కలికాలభరత ! లక్ష్మీ
లలనాస్పదవీరగుణవిలాస ! విరోధి
ప్రళయాంతక ! నిఖిలమహీ
వలయోద్వహబాహు ! విష్ణువర్ధనమూర్తీ! 357

పృథ్వీవృత్తము :—
సమస్తభువనాశ్రయా ! వినయసత్యనిత్యోదయా !
సమీహిత గుణక్రియా ! స్థిరవిశాలకీర్తిప్రియా !
నమన్నృపకిరీటచుంబిచరణద్వయా ! సంతత
క్షమాభరణ ! రాజరాజ ! పరగండభేరుండకా ! 358

గద్యము. ఇది సకలసుకవిజనవినుత నన్నయభట్టప్రణీతం బైన శ్రీమహాభారతంబునం దారణ్యపర్వంబున బృహదశ్వదర్శనంబును, నలోపాఖ్యానంబును, నారదాగమనంబును, సకలతీర్థకీర్తనంబును, రోమశుం డర్జును కుశలవార్తఁ జెప్పుటయు, రోమశ మహామునియుపదేశంబున ధర్మజుతీర్థాభిగమనంబును, నగస్త్యుండు లోపాముద్రం బరిగ్రహించుటయు, వాతాపిభక్షణంబును నన్నది ద్వితీయాశ్వాసము.



శ్రీః

గణేశశారదా గురుభ్యో నమః

# శ్రీమదాంధ్ర మహాభారతము

## ఆరణ్యపర్వము - తృతీయాశ్వాసము

శ్రీ మందిర ; బుధజనచిం
తామణి ! కోదండపార్థ ! ధర్మవిచారో
ద్దామ ! నలనృగభగీరథ
రామచరిత్రాభిరామ ! రాజనరేంద్రా ! 1

### —: అగస్త్యు చరిత్రము :—

వ. అక్కథకుండు శౌనకాదిమహామునులకుం జెప్పె ; నట్లు ధర్మతనయుం
డగస్త్యు మాహాత్మ్యంబు విని వెండియుఁ దచ్చరిత్రంబు రోమశు నడిగిన
నమ్ముని యిట్లనియె. 2

సీ. "కృతయుగంబునఁ గాలకేయగణంబుతో
వృత్రుఁ డన్నసుర గర్వించి, యమర
పతిఁ దొట్టి వేల్పుల బాధించు చున్నఁ, ద
ద్భయమున నమరులు బ్రహ్మకడకుఁ
జని "పోరిలో వృత్రుఁ జంప నుపాయ మె
య్యది యొ మా కానతిమ్మన నజుండు
దివిరి సరస్వతీతీరంబునందు ని
శ్చింతుఁ డై తప మొప్పఁ జేయు చున్న

ఆ. యా దధీచికడకు నరిగి వేఁడుండు ; ని
జాస్థు లిచ్చు మీకు నమ్మహాత్ముఁ ;

డవి జయించు వజ్ర మాదిగా నిఖలది
వ్యాయుధంబు లై సురారివరుల. 3

వ. అందు వజ్రంబున నింద్రుండు వృత్రు వధియించు'' ననిన నమరు
లెల్లం గమలాసనుశాసనంబున దధీచిపాలికిం జని కృతప్రణాము లై
యి ట్లనిరి. 4

క. "భువనజనస్తుత ! నిజగౌ
రవ మెసఁగఁగ నమరపతిపురస్కృతు లగు ని
ద్దివిజుల కెల్ల హితంబుగ
భవదస్థిచయంబు లిమ్ము పరమమునీంద్రా !'' 5

వ. అనిన విని దధీచి సంతసిల్లి కృతార్థుండ నైతి నని దేవహితార్థంబుగా
నిజప్రాణం బులు విడిచె; నమరు లెల్ల నమ్మహామునియస్థు లాయు
ధంబులుగాఁ బరిగ్రహించి రందు. 6

ఆ. త్వష్ట యంత నూఱుధారల రమ్యమై
యనలకణకరాళ మైన వజ్ర
మొనరఁ జేసి "దీన నోర్వుము దైత్యుల"
ననుచు నిచ్చె దాని నమరపతికి. 7

వ. అవ్వజ్రంబున నింద్రుండు వృత్రు వధియించె నంత. 8

చ. అనుపమదివ్యశస్త్రధరు లైన యమర్త్యుల కాహవంబులో
మొనయక కాలకేయులు సముద్రముఁ జొచ్చి, దివంబు లెల్ల న
వ్వనధి నడంగి యుండి, బలవంతులు వెల్వడి రాత్రు లెల్ల భూ
జనులకు బాధ సేయుచు భృశంబుగ నుండిరి క్రూరచిత్తులై. 9

వ. మఱియు విద్యాతపోయుక్తు లై, ధర్మచరితు లైన వారికారణంబున
జగంబు లపాయంబు నొందక సుఖం బున్న యవి; గావున నట్టివారిన
రోసి వధియించి జగంబుల కపాయంబు సేయుద మని యసురులు
వసిష్ఠాశ్రమంబున నూటతొంబదియేడ్వురను, చ్యవనాశ్రమంబున
నూర్వురను, భరద్వాజాశ్రమంబున నిరువదుండ్రనుం గాఁ బలువురు
బ్రాహ్మణుల బ్రహ్మమయుల వధియించి భక్షించి యిప్పాట ననవర
తంబు నఖిలమునిగణాశ్రమంబుల కుపద్రవంబు సేయుచున్న. 10

—: దేవతలు వైకుంఠమునకుఁ బోయి విష్ణుని స్తుతియించుట :—

క. యాగాదిపుణ్యకర్మ
త్యాగము మర్త్యమున నైనఁ, దా రధికభయో
ద్వేగంబునఁ బురుహూతపు
రోగము లై యగ్ని యమ వరుణ ధనదాదుల్. 11

క. చని వైకుంఠంబునఁ ద్రిభు
వనపతి, వైకుంఠు, గరుడవాహను, విష్ణున్
దనుజవిభంజనుఁ గని యి
ట్లని రెంతయు భక్తితోఁ గృతాంజలు లగుచున్. 12

వ. "దేవా! నీవు వరాహరూపధరుండవై మహీతలం బెత్తి, నరసింహ రూపంబు దాల్చి యాదిదైత్యు హిరణ్యకశిపు వధించి, వామనుండవై బలిం గట్టి, యజ్ఞమూర్తివై యజ్ఞవిఘ్నకరుండైన జంభుం డను దానవుం జంపి, యండజజరాయుజస్వేదజోద్భిజ్జంబు లనం బరఁగిన చతుర్విధప్రజల రక్షించు చున్న జగద్రక్షకుండవు; గావున నీకు విన్న పంబు సేసెద; మిప్పుడు జగంబుల కైన యుపద్రవంబు చిత్తగింపుము

సీ. కాలకేయులు మహాకాయులు పగ లెల్ల
జలదుర్గబలమున జలధి నుండి,
రే లెల్లఁ జని నలి రేఁగి మునీశ్వరా
శ్రమముల సద్ధర్మచారు లైన
బ్రాహ్మణప్రవరులఁ బాయక వధియింతు;
రెట్టి పాపాత్ములు నెయ్యుగముల
బ్రాహ్మణహింస యాపాదింతురే? యది
వీరలవలనన వినఁగఁబడియెఁ;

ఆ. బరమసాధు లైన బ్రాహ్మణులకు బాధ
యగుడు మహికి బాధ యగు; ధరిత్రి
కైన బాధఁజేసి యఖిలలోకంబులుఁ
గరము బాధ నొందుఁ గమలనాథ! 14

వ. ఎట్లనిన వేదంబులు ధరియించి విప్రులు వేదచోదితంబు లైన పుణ్య కర్మంబులు విధియించుటం జేసి హవ్యకవ్యంబుల దేవతలుం బితరులుం దృప్తులైన, వారివలన నెల్ల లోకంబులకు సుఖం బగుం గావున బ్రాహ్మణోపద్రవంబు పరిహరించి లోకంబులు రక్షింపు'' మనిన దేవతలకు విష్ణుదేవుం డిట్లనియె 15

మత్తకోకిలము కాలకల్పుల, నుగ్రతేజులఁ గాలకేయుల, భూరిర
త్నాలయస్థుల, వీర్యవంతుల నర్ణవంబు సమస్తస
త్త్వాలి దోఁపఁగ వట్టినన్ విషయం బగున్ వధియింపఁగాఁ;
బోల దొండువిధంబునం బరిపూర్ణ వార్ధి జలోన్నతిన్. 16

క. వరుణజలంబుల మిత్రా
వరుణతనూజుండు వీర్యవంతుం డై చె
చ్చెరఁ ద్రావ నోపు నిందఱు
నరుగుఁడు, ప్రార్థింపుఁ డమ్మహాత్ము నగస్త్యున్." 17

వ. అనిన నమరు లెల్ల నగస్త్యుపాలికిం జని యమ్మునివరు స్తుతియించి యిట్లనిరి. 18

క. ''అమరహితంబుగ జగదహి
తము దలుగుము పేర్మితో; బుధస్తుతగుణ! విం
ధ్యము దొల్లి పెరిఁగి జగదహి
తము సేసిన నీవ కావె తలిగితి దానిన్ ?'' 19

వ. అని దేవతలెల్ల నగస్త్యుఁ గీర్తించి'' రనిన విని ధర్మజుం "డిది యెట్లు ? వింధ్యం బేల పెరిఁగె ? దానిం బెరుఁగకుండ నగస్త్యుం డెవ్విధంబున వారించె ?'' నని యడిగిన నాతనికి రోమశుం డిట్లనియె.

—: అగస్త్యుఁడు వింధ్యంబు పెరుఁగకుండ వారించుట :—

ఉ. ''నెమ్మి నినుండు మేరుధరణీధరనాథుఁ బ్రదక్షిణంబుగాఁ
ద్రిమ్మరుచున్నఁ జూచి, పటుదీధితికిం గర మల్గి, వింధ్యశై
ల మ్మనియెన్ ''దినేంద్ర! యచలప్రభు నన్నుఁ బ్రదక్షిణంబు ని
త్యమ్మును జేయ కేల మతి దప్పితి ? మేరువుఁ గొల్వ నేటికిన్ ?''

వ. అని గర్వించి పలికిన నప్పర్వతంబునకు భానుం డి ట్లనియె. 22

క. "అనవతరము విధియోగం
బున నేఁ ద్రిమ్మరుదు నమరభూధరముఁ బ్రియ
మ్మున; నాత్మేచ్ఛ యొనర్పఁగఁ
జన" దనవుడు నలిగి వింధ్యశైలం బంతన్. 23

క. ఇనశశితారాదులకుం
జన రాకుండంగఁ బెరిఁగి జలధరపథ మె
ల్లను గప్పి యుండె విధ్యం
బనుపమ ముత్తుంగమై సురాద్రిస్పర్ధన్. 24

క. రవిశశిగతు లుడుగుడు 'నిది
దివ మిది రాత్రి' యని వసుమతీజనులకు, న
ద్దివిజమునివరుల కెఱుగఁగఁ
నవగాఢం బయ్యె; నంధ మయ్యె జగంబుల్. 25

వ. ఇట్లు పెరిఁగిన వింధ్యంబునొద్దకు వచ్చి వేల్పు లెల్ల దానివర్ధనంబు వారింప నోపక యగస్త్యుపాలికిం జని వింధ్యంబు పెక్కువ యెఱింగించి యి ట్లనిరి. 26

క. "భువనవ్యవహారమునకు
వ్యవధానం బయ్యె వింధ్యవర్ధనమున, న
ద్దివసకరరజనికరగతు
లవిహతమగునట్లు సేయు మమర మునీంద్రా!" 27

వ. అని దేవతలు ప్రార్థించిన నగస్త్యుఁడు లోపాముద్రాసహితుండై విధ్యంబు సమీపంబునకు వచ్చి దానిచేతం బూజితుం డై యి ట్లనియె.

క. "చనియెద దక్షిణదిశ కే;
నొనరఁగఁ బెరు మిమ్ము నాకు నుర్వీధర! నీ"
వనవుడు నట్టుల చేయుదు
నని పెరుఁగుట యుడిగి వింధ్య మతివినయముతోన్. 29

వ. "భట్టారా! విజయంచేయుఁ" డని భూమిసమాన మై యున్న దాని కగస్త్యుం డిట్లనియె. 30

క. "నా మగుడి వచ్చునంతకు
భూమీధర! యీ ప్రకారమున నుండుము; నా
తో మైత్రిఁ జేయు" మని లో
పాముద్రాధీశ్వరుండు పలికి ముదమునన్. 31

వ. దాని నోడంబఱిచి, దక్షిణదిశకుం జని, లోకంబులకు హితంబుగా నంద యుండె; వింధ్యంబు నగస్త్యుండు మగుడి వచ్చునంతకుఁ జెఱుఁగ నోడి యున్న" దని యగస్త్య మాహాత్మ్యంబు ధర్మజునకుం జెప్పి వెండియు రోమశుం డి ట్లనియె. 32

ఆ. "అమరు లెల్లఁ దన్ను నట్లు కీర్తించుచు
నున్న జూచి, మనిగణోత్తముండు
వారి నడిగె "నేమి వచ్చితి? రెఱిఁగింపుఁ
డని దయాళుఁ డై ప్రియంబుతోడ. 33

వ అనిన. 34

చ. అమరులు గాలకేయకృత మైన జగద్భయ మెల్లఁ జెప్పి "యు
త్తమమునినాథ! తత్ప్రతివిధానము సేసి జగంబు గావఁ జి
త్తము గలదేని, విభ్రమదదభ్రతరంగమహార్ణవంబుఁ బా
నము దగఁ జేసి, చేయుము ఘనంబుగ మాకు మనఃప్రమోదముల్. 35

క. ఆతోయధి నీచేత ని
పీతం బగుడుం, గడంగి భీమాసురసం
ఘాతంబు దక్షణంబ ని
పాతింతుము దివ్యశస్త్రపటుఘాతములన్. 36

—: అగస్త్యుండు సముద్రోదకంబు పానంబు సేయుట :—

వ. అనిన నగస్త్యుం డట్ల చేయుదు నని యమరవరు కెల్ల సంతోషంబుగా నప్పుడు.

సీ. రంగదుత్తుంగ తరంగహస్తంబుల
నాడెడునది వోలె, నతులవేగ
వాతవిధూత మై వఱలెడునది వోలెఁ,
బర్వతకందరోపాంతతతులఁ

దొడఁ ద్రెవ్వెడునది వోలె, ధ్రువ ఫేనవితతుల
నగియెడునది వోలె, నాగనక్ర
మకరకులక్షుభ్యమాణ మై తద్బాధ
కోపనియది వోలె నుచ్చభీమ

ఆ. నినద మగుచు నున్న నీరధియొద్దకు
సమరగణముతో మహామునీంద్ర
గరుడ ఖచర సిద్ధ గంధర్వ పన్నగ
యక్షగణముతోడ నరుగుదెంచి. 38

ఉ. అందఱుఁ జూచుచుండఁగ మహాబ్ధిజలంబులఁ ద్రావె విష్టపా
నందకరుం డగస్త్యుఁ డఘనాశనుఁ; డట్లు పయోధి రిక్తమై
నం దిమి కూర్మ కర్కటక నక్ర భుజంగచయంబుతో భయం
బందుచుఁ గాలకేయులు బయల్పడి తోఁచిరి దానిలోపలన్. 39

వ. అంత. 40

క. గీర్వాణప్రభుఁ డాదిగ
గీర్వాణగణంబు గాలకేయులతోడన్
గర్వించి రణము సేసి ర
ఖర్వపరాక్రములు గడిమిఁ గడు నుద్ధతులై. 41

క. అనిమిషదివ్యాయుధహతి
ననిఁ గొందఱు వడిరి; గొంద ఱధికవిభీతిం
జని పాతాళముఁ జొచ్చిరి
దనుజులు దైత్యులును వీర్యదర్పచ్యుతులై. 42

వ. ఇట్లు కాలకేయులం దొట్టి యసురుల నెల్ల నిశ్శేషంబుఁ జేసి జగంబుల
యుపద్రవం బుడిపి దేవత లగస్త్యునిం గీర్తించి యి ట్లనిరి. 43

క. "మునినాథ! నీయనుగ్రహ
మున నుడిగెను బాధ నిఖిలభువనంబుల, కి
వ్వననిధిఁ బయఃపూర్ణముగా
నొనరింపుము; నీవ కాని యొరు లోప రిలన్. 44

వ. ఇది యనేక సత్త్వాశ్రయంబు గావున రిక్తంబై యుండఁ దగ'' దనిన నగస్త్యుం డి ట్లనియె. 45

సీ. '' మున్న జీర్ణం బయ్యె మున్నీటి నీరు నా
కడుపున; నే నింక బడయ నేర;
జలరాశి నిండంగ జల మొండు '' నావుడు
నమరులు మునులును గమలగర్భుఁ
గానంగఁ జని '' దేవ ! మీనాకరం బేమి
తెఱఁగున నిండు ? మా కెఱుఁగఁ జెపుము ''
యని విన్నపంబు సేసినఁ బెద్దప్రొద్దు చిం
తించి, వారలకు విరించి యనియె

ఆ. '' వనధిఁ బెద్ద కాలమున భగీరథుఁ డను
వాఁడు నించుఁ; గాని వసుధ నొరులు
పూని దీని నింపఁగా నోప '' రనవుడు
నమరవరులు మునులు సరిగి రనిన. 46

క. వనరాశి యేమికారణ
మున నెట్లు భగీరథుండు భూరిజలౌఘం
బున నించె ? దీనిఁ జెప్పుము ''
యని యడిగిన ధర్మజునకు నమ్ముని సెప్పెన్. 47

—: భగీరథుండు జలముచే సముద్రము నించుట :—

వ. '' తొల్లి యిక్ష్వాకువంశంబున సగరుం డను రాజు హైహయుల నిర్జించి, నిఖలమహీరాజ్యంబు సేయుచు నపుత్రకుండై వైదర్భియు, శైబ్యయు నను నిద్దఱు భార్యలతోడం గైలాసంబున కరిగి యందు.

క. దక్షమఖక్షయకరు, నిట
లాక్షుజ హుతభక్ష్యభక్షితానంగు, విరూ
పాక్షు, మహోక్షధ్వజుఁ బ్ర
త్యక్షము గావించె నుగ్రతపమున పేర్మిన్. 49

తే. హరుఁడు వానికిఁ బ్రత్యక్షమయి వరంబు
వేఁడు మనవుడుఁ ''త్రైలోక్యవిభుఁడ! నాకు

దయ నొనర్పుము సంతానదాన'' మనుచు
వేఁడెఁ బుత్రార్థియై కడు వేడ్కతోడ. 50

వ. ఈశ్వరుండు వానికి వైదర్భియం దఱువదివేవురు గొడుకులును, శైబ్యయం దొక్కకొడుకుం గా వరం బిచ్చి, యయ్యఱువదివేవురు నతిదర్పితు లై యేకకాలంబునఁ గాలగోచరు లగుదు రనియు, నయ్యొక్క కొడుకు వంశకర్త యగు ననియుం జెప్పి యదృశ్యుం డైన. 51

క. కొడుకులఁ బలువురఁ బడసియుఁ
బడయనియట్టి దయి, ధర్మపత్నులుఁ దానుం
గడుసంతసపడ కరిగెను
దడయక సగరుండు మగుడి తనపురమునకున్. 52

వ. అంతఁ గొంతకాలంబునకు నయ్యిద్దఱు గర్భిణు లైన, నందు వైదర్భికి నొక్క యలాబూఫలంబును, శైబ్యకు నసమంజసుం డను కొడుకునుం బుట్టిన. 53

ఆ ''వరదుఁ డైన యీశువరమున నిది యొక్క
వపరు పుట్టె, నెట్టివరమొ !'' యనుచు
దానిఁ బాఱవైవఁ దా రున్న నాకాశ
వాణి యిట్టు లనియె వసుమతీశ ! 54

తే. ''సాహసం బట్టు సేయంగఁ జనునె ? దీని
బీజములు ఘృతఘటములఁ బెట్టి రక్ష
సేయు, మఱువదివేవు రూర్జితులు సుతులు
మేలువరమునఁ బుట్టుదు రిందు నీకు''. 55

వ. అనినం దద్వచనానురూపంబు సేసి రక్షించు చున్న, రెన్నెలలకు.

క. సుతషష్టి సహస్రక ము
ద్గత మై వర్ధిల్లి, గగనగతిఁ బఱచి, శత
క్రతులోకముఁ దొట్టి మదో
ద్ధతిఁ జేసె సమస్తలోకతతులకు బాధల్. 57

క. సగరసుతు లట్లు జగముల
కొగి బాధలు సేయు చున్న నోడి, మరుత్ప
న్నగవరు లరిగిరి నాలుగు
మొగములు గల వేల్పుకడకు మునిసంఘముతోన్. 58

ఆ. వారిజాసనుండు వారలు వచ్చిన
విధ మెఱింగి "మీకు వెఱవ నేల?
సగరసుతులు దగ్ధు లగుదురు; దర్పితు
లైనవారి పేర్మి యధ్రువంబు." 59

వ. అని కమలభవుం డానతిచ్చిన సరిగి యమరవరు లాదిగా నఖిలలోక నివాసు లెల్ల సగరసుతపరిక్షయం బపేక్షించి యుండునంత. 60

సీ. అశ్వమేధంబు సేయంగ దీక్షితుఁ డయ్యె
సగరుండు; వాని యశ్వంబు సగర
తనయులచే రక్షితం బై వసుంధర
యెల్లఁ గ్రుమ్మరి. తోయహీన మైన
జలధిలోపల నదృశ్యం బైనఁ, గానక
సగరున కెఱిఁగించి సగరసుతులు
జనకుశాసనమునఁ జని, భూతలమునందుఁ
దడయక రోసి, పాతాళతలము
ఆ. నందు రోయఁ గడఁగి, యఱువదివేవురు
నొక్క మొగిన ద్రొచ్చి రుదధిలోన
జలధిపంకమగ్నసత్త్వముల్ నిశిత కు
ద్దాలహతి విదారితములు గాఁగ. 61

వ. ఇట్లు ద్రొచ్చిద్రొచ్చి సగరసుతులు సముద్రపూర్వోత్తరదేశంబునం గపిలుం డను మహామునియాశ్రమ సమీపమునందుఁ దమ గుఱ్ఱంబుఁ గని సంతోసిల్లి. 62

ఆ. "అశ్వమేధమునకు నర్చితం బైన యీ
యశ్వరాజు నిట్టు లపహరించి
ముచ్చుగాఁ డిక యీసముద్ర దేశంబున
నోట మెడఁద లేక యున్నవాఁడు." 63

—: సగరసుతులు కపిలమహాముని కోపాగ్నిచే భస్మ మగుట :—

వ. అని కపిలుం బరిభవించిన నమ్మునివరుం డలిగి యనలశిఖలు దూల నతిఘోరదృష్టిం జూచిన నప్పుడు సగరసుతు లందఱు భస్మంబైన.

క. వీరు లగు సగరతనయుల
దారుణదాహంబుఁ జూచి తడయక చని యం
భోరుహగర్భతనూజుఁడు
నారదుఁ డంతయును సగరునకు నెఱిగించెన్. 65

క. దాని విని సగరుఁ డురుశో
కానలదందహ్యమానుఁ డయ్యును నయ్యా
శానువచనంబు దలఁచి ధ
రానాథుఁడు శోకభరపరాఙ్ముఖుం డై. 66

వ. అసమంజసపుత్త్రు నంశుమంతుం దన మనుమనిం జూచి "యయ్యా! నీయయ్య లఱువదివేవురు నొక్కటఁ గపిలకోపానలకబళితశరీరు లయిరి; భవజ్జనకుం డతిక్రూరహృదయుం డై పౌరబాలకుల నకారణంబ వధియించి మహానదిలో వైచుచున్న నెఱిఁగి పౌరజనాక్రోశంబునం దనుక్రోశపరుండ నై నాని విడిచితి. 67

క. కొడుకులకు వగవ; మును నా
కడఁగిన హయమేధమఖము గడచనమికిఁ నేఁ
గడు దుఃఖితుండ నయ్యెదఁ
దడయక నీ విపుడు దీనిఁ దలఁగుము కడఁకన్." 68

వ. అనిన నంశుమంతుం డాతఁడంబ చని, సగరసుతఖాతద్వారంబున సముద్రంబుసొచ్చి, యందు సూర్యసహస్రద్యుతియై వెలుంగుచున్న కపిల మహామునికి నమస్కరించి, నిజాగమనప్రయోజనం బెఱింగించినఁ గపిలుండును వానికిం గరుణించి యాజ్ఞికం బైన యశ్వంబు నిచ్చి యి ట్లనియె. 69

క. "ఘనభుజ! నీకారణమునఁ
జనఁ గాంతురు పుణ్యగతికి సాగరులు ముదం

బున; సగరునకును దొరకును
నొనరఁగ సుతవంతు లైన యుత్తముల గతుల్. 70

వ. మఱియు నీచేత నుపనీతం బైన యీయశ్వంబున నశ్వమేధంబు సేసి సగరుండు గృతార్థుం డగు; నీ పౌత్రుం డైన భగీరథుచేతఁ దేరఁబడియెడు గంగాజలౌఘంబులంజేసి సంసిక్తు లై, సగరసుతులు స్వర్గగతు లగుదురు; సముద్రంబు సంపూర్ణంబగు" ననిన నంశుమంతుండు సంతుష్టుం డై కపిలప్రసాదంబున నశ్వంబుఁ దెచ్చి సగరున కిచ్చి, కపిలు వచనంబు నెఱింగించిన సగరుండును బుత్రశోకం బుడిగి యశ్వమేధంబు సేసి, సముద్రుం దనకుం బుత్రుఁగాఁ గల్పించిన నది మొదలు సముద్రంబు సాగరంబు నాఁ బరఁగె; నిట్లు సగరుండు పెద్దకాలంబు రాజ్యంబు సేసి నిజరాజ్యభారం బంశుమంతునందు సమర్పించి చనిన.

తే. తన పితామహునట్టుల ధరణి యేలి
యంశుమంతుండు నిజపుత్రుఁ డగు దిలీపు
నందు రాజ్యభారముఁ బూన్చి యఖిలలోక
పూజితుండు దపోవనంబునకుఁ జనియె. 72

వ. దిలీపుండును దన పితామహు లైన సాగరు లధోగతులు గాకుండ గంగావతరణంబునందు యత్నంబు సేసి యశక్తుం డయ్యె. 73

చ. ప్రథితయశుఁ, సుతుం బడసె భారసహిష్ణు, మహారథుఁ, భగీ
రథుఁ డను చక్రవర్తి, నపరాజితతేజు, నిజాన్వవాయదు
ష్పృథవినివర్తకున్, సకలపార్థివజైత్రు, మదోద్ధతాసుహృ
న్మథను, సుగాపగానయసమర్థతపోగుణయుక్తు నుత్తముఁ. 74

వ. ఆ భగీరథు నసాగరభూభారధురంధరుం జేసి దిలీపుండు దపోవనంబున కరిగిన. 75

తే. కపిలుకోపాగ్నిఁ జేసి సాగరులు గ్రాఁగి
రనియు, గతిఁ గానకున్న వా రనియుఁ, నెఱిఁగి
వారలకు హిత మొనరింప వగచి, గంగఁ
దేరఁ గడఁగె వీరుండు భగీరథుండు 76

వ. ఇట్లు భగీరథుండు గంగావతరణంబునందుఁ గృతనిశ్చయుండై యరిగి, బహువిధాకారధాతుమంతంబు లైన యుత్తుంగశృంగంబులను, జలధర

వినమ్రప్రబల బలాహకవ్యూహసంఛాదితశ్యామాయమానంబు లైన తుహినస్థలంబులను, సిద్ధవిద్యాధర గంధర్వ గీర్వాణమిథునసంసేవ్యమానంబు లైన నానారత్నకందరంబులను, శుక పిక పారావత శుక్లాపాంగ సారంగ శతపత్రపుత్రప్రియ దాత్యూహవ్యూహాశబ్దశబ్దాయమానంబు లైన తరువనరేఖలను, సింహ శరభ శర్దూల శుండాల గోలాంగూల కోలాహలాన్వితంబు లైన గుహాగహ్వారంబులనుం జేసి రమణీయభయానకం బైన హిమవత్పర్వతంబున. 77

చ. సతతకృతోపవాసముల, శాకఫలోదకమూలపారణ
వ్రతముల, దేవపూజల, నపారజపంబులఁ జేసి నిష్ఠతో
నతులతపంబు సేసె నమరాపగ నుర్వికిఁ దెచ్చువేడ్కతో
ధృతియుతుఁ డై దిలీపకులదీపుఁడు దివ్యసహస్రవర్షముల్. 78

వ. ఆ భగీరథు తపంబునకు మెచ్చి గంగాదేవి ప్రత్యక్షం బై నీయిష్టంబు వెప్పు మనినం గృతాంజలి యై యి ట్లనియె. 79

సీ. "తపనతేజుం డైన కపిలుకోపంబున
గతజీవు లై పుణ్యగతులయందు
విహతు లై మత్పితామహు లున్నవారు; నీ
దగు పుణ్యజలముల సగరసుతులు
సిక్తులై స్వర్గానుభుక్తిఁ బ్రాపింతురు,
గావున దేవి! యిద్దేవపథము
నం దుండి వసుమతీ కొందంగఁ జను దేర
వలయు" నావుడు "మహీతలయమునకు

ఆ. నేను వచ్చునపుడు నా నిరంతరజలౌ
ఘంబు దాల్ప నీలకంఠుఁ డోపుఁ
గాని యొరులు దాల్పఁగా నోప; రయ్యుమా
నాథుకరుణఁ బడయు నన్నుఁ దాల్ప." 80

వ. అనిన గంగాదేవివచనంబునఁ గైలాసంబున కరిగి భగీరథుండు భగవంతు, నంతకాంతకు, నీశ్వరుగుఱించి పెద్దకాలంబు దపంబు సేసిన నీశ్వరుండు వానికి సన్నిహితుం డయి "నీవు భూలోకంబునకు గంగా

వతరణంబు సేయు; మేను గంగ ధరియించెద" ననిన భగీరథుండు
వెండియు గంగ నారాధించిన నాతనికిం గరుణించి. 81

మ. ఇలకుఁ గంగ తరంగసంగతులతో నేతెంచె, నాశాంతరం
బులు, నాకాశముఁ గప్పుచుం; దగ మహాభూతప్రపంచంబుతోఁ
జెలువై యుండఁగ దాని నీశ్వరుఁడు దాల్చెఁ సంగతోత్తుంగపిం
గళజూటాగ్రమునందుఁ బద్మదళసంకాశంబుగా లీలతోఁ. 82

సీ. సురమునిసిద్ధ ఖేచరవరుల్ వచ్చి య
చ్చెరు వంది చూడఁగ హరుశిరంబు
నం దుండి భువనైకవందిత సురసరి
ధరణీతలంబున కరుగుదెంచి,
కలహంసగతియు, నిర్మలఫేనహాసంబు,
నాకీర్ణమీనవిలోకనములు,
నాలోలపవనవాచాలితకల్లోల
లసితమృదూక్తులు నెసఁగుచుండఁ

గీ. బ్రీతితో భగీరథుఁ డను దూతచేత
నీత యై మహామునివరపీతరిక్త
మగు సరిత్పతిఁ గూడి యా సగరజులకు
హితముగా దాని నించె నాలితజలముల 83

క. సాగరులకు సద్గతి గా
సాగరమున కట్లు సలిలసంపూర్ణము గా
భూగత యై భాగీరథి
భాగీరథకీర్తి భువనపత్తుంల నించెఁ." 84

వ. అని యిట్లు గంగావతరణంబును, భగీరథుమాహాత్మ్యంబును రోమ
శుండు సెప్పిన విని ధర్మజుం డనుజసహితుం డై యరిగి నందయు
నపరనందయును నను మహానదులయందుఁ గృతస్నానుం డై, హేమ
కూటంబున నుపలంబులవలస వెలుపడు దహనంబున నాహూతంబు
లై వచ్చు మేఘుంబులను జూచి విస్మయం బంది, దాని విధం బడిగిన
వానికి రోమశుం డిట్లనియె "ఋషభకూటంబున ఋషభుం డను
ముని యతికోపనుం డై యెవ్వరు వలికిన నపుడె యుగ్రానలాకారుం

డై యుపలంబులవలన వెలువడి మేఘంబులం బిలిచి వారల వారించు; దానంజేసి తపోదానధర్మశమదమరహితు లైన జనుల కది దురారోహంబు; దేవతలు, దేవదర్శనులైన ఋషులు నమ్మునిం జూడ వత్తు రిందు దేవఋషులు యజ్ఞంబు సేసిన యజ్ఞభూములందుఁ గుశాకారంబు లైన దూర్వాంకురంబులు, యూపాకారంబులైన వృక్షంబులుఁ గానంబడు; ననిన నా పుణ్యతీర్థంబున స్నానంబుసేసి యరుగుచున్న ధర్మరాజునకు రోమశుం డిట్లనియె. 85

క. "ఇది విశ్వామిత్రునియా
స్పద; మిది కౌశికి యనంగఁ బరఁగినయది; య
ల్లది ఋశ్యశృంగుఁడనుముని
గ్రహ" మనవుడు ధర్మతనయుఁ డమ్ముని కనియెన్. 86

—: రోమశుఁడు ధర్మజునకు ఋశ్యశృంగు చరిత్రము సెప్పుట :—

వ. ఋశ్యశృంగుం డను ముని జన్మంబును దచ్చరితంబును వినవలయు నది యె "ట్లని యడిగిన రోమశుం డిట్లనియెఁ; "దొల్లి కశ్యపపుత్రుండగు విభాండకుం డను మునివరుం డఖండితబ్రహ్మచర్యంబునం దపంబు సేయుచు నొక్కనాఁ డొక్క మడువున నీళ్లాడుచున్న యవసరంబున.

క. సురుచిరసురూపగుణసుం
దరి యూర్వశి యను లతాంగి తద్దర్శనగో
చర యగుడు, నపుడ రేతః
స్ఖలనం బమ్మునికి నయ్యెఁ గామకృతమునన్. 88

వ. అయ్యమోఘవీర్యంబుతో మిశ్రం బయిన జలంబు నొక్క దుప్పిమెంటి మృగంబు ద్రావి గర్భంబు దాల్చిన, నందు ఋశ్యశృంగుం డను కుమారుండు జన్మించి, తండ్రినిజదాశ్రమంబునుంగాని యొండెఱుంగక ఘోరతపంబు సేయుచున్నంత. 89

తే. బలియుఁ డంగాధిపతి రోమపాదుఁ డనఁగ
ధరణిఁ బరఁగిన పేరుండు దన పురోహి
తాపరాధకృతమున బ్రాహ్మణులచేత
విడువఁబడినఁ దన్మహిఁ గనావృష్టియయ్యె. 90

వ. దానికి వెఱచి యాతండు బ్రాహ్మణులఁ బరమభక్తి నుపాసించి "యీ యనావృష్టి దోషం బేమి కారణంబున నయ్యె? దీనికిం దగిన ప్రతికారం బెద్ది?" యని యడిగిన వానికిం బ్రసన్నులై బ్రాహ్మణు లి ట్లనిరి 91

క. "కడు దర్పితుఁ డని నిన్నుఁ
విడిచిరి బ్రాహ్మణులు; వారు విడుచుడు నమరుల్
విడిచిరి; దానన వర్షము
దడసె భవద్దేశమునకు ధరణీనాథా! 92

ఉ. శాంతుఁడు ఋష్యశృంగుఁ డను సన్ముని యున్న యెడఁ ధరిత్రికిఁ
సంతతవర్షణం బగు; భృశం బగు నట్టివరంబు దొల్లి వృ
త్రాంతకుచే దయం బడసె నమ్ముని; గావున ఋశ్యశృంగు వే
దాంతసువేది రాఁ బనుపు మంగమహీశ్వర! నీదునేర్పునన్." 93

వ. అనిన విని రోమపాదుండు దన చేసిన బ్రాహ్మణావమానంబునకుం దగిన ప్రాయశ్చిత్తంబుఁ జేసి, బ్రాహ్మణవచనంబున నపుడ బుద్ధి మంతులతో విచారించి, విదగ్ధ వేశ్యాంగనలం బిలువం బంచి, "మీ నేర్పువిధంబుల ఋశ్యశృంగుం బ్రబోధించి యిట తోడ్కొని రం" డని పంచిన. 94

క. ఆ వేశ్యాజను లధికర
సావహాభుష్యములు, విలసదనులేపనమా
ల్యావళులుఁ గొనుచు నరిగిరి
నావాశ్రమమునకు నమరనారులలీలన్. 95

వ. అట విభాండకుండును యథాకాలం బగ్నిహోత్రంబు వేల్వం దన పుత్రు ఋశ్యశృంగు సమర్పించి, వన్యఫలాహరణార్థంబు వనంబున కరిగిన యవసరంబున నం దొక్క జరద్వేశ్య దన కూఁతు, నభినవయౌవనవిలాసవిభాసిన నమ్మునిపుత్రు పాలికిం బుచ్చిన, దానిం జూచి ఋశ్యశృంగుండు సంభ్రమంబున. 96

**—: ఋశ్యశృంగుఁడు వేశ్యను మునికుమారునిఁగా భావించుట :—**

మధ్యాక్కర. ఎందుండి వచ్చితి ఋషికుమారక? యెన్నండు నిట్టి
సుందరాకారు మునిసుతు నేఁ దొల్లి చూచి యెఱుంగ;

నిం దుండు మీవని కృష్ణమృగచర్మకృతకుశాసనము
నం దుండఁగాఁ బనిచె ఋషి యనుబుద్ధి నత్తన్విఁ బ్రీతి

వ. మఱియు నర్ఘ్యపాద్యాదివిధులను, వన్యస్వాదుఫలదానంబులఁ దాని కతిథిపూజ సేయ నున్న నది యమ్మునివరున కి ట్లనియె 98

క. "మాయాశ్రమ మిందులకుఁ
న్యాయనిధీ! మూఁడు యోజనంబులు గల; దేఁ
బోయెద; నీవును విజయం
చేయుము యందులకుఁ; జెలిమి సేయుము నాతోన్. 99

వ. అట్లేని నీచేత సత్కారంబు గొందు" ననిన ఋశ్యశృంగుం "డట్లు సేయుదు" నని దాని నాతిథ్యవిధానంబునం బూజించి, తనకు దాని యిచ్చిన దివ్యగంధమాల్యంబులును, సరసభక్ష్యపానంబులును, విచిత్ర వస్త్రంబులుం బరిగ్రహించిన నదియును. 100

క. మునిముందటఁ గందుకన
ర్తనమృదుగీతములయందుఁ దన కౌశల మె
ల్లను జూపి, విరచితాలిం
గన యై మునిపతికి ముదము గావించె మదిన్. 101

వ ఇట్లు ఋశ్యశృంగుం బ్రబోధించి వేశ్యాపుత్రి యరిగిన, దానిపోయిన వలను సూచుచు ఋశ్యశృంగుం డగ్నిహోత్రంబు వేల్వక మఱచి, విపరీతబుద్ధి యై యున్న, నంత నడవినుండి వన్యఫలంబులు గొనివచ్చి విభాండకుండు గొడుకుం జూచి "యి ట్లేల చింతాపరుండ వై యగ్నిహోత్రంబు వేల్వక, కాలాతిక్రమణంబు సేసె" దనినఁ దండ్రికి ఋశ్యశృంగుం డి ట్లనియె. 102

సీ "కాంచనవర్ణుండు, గడురూపవంతుండు,
గమ్మనిజడలతో ఘనము లగుచు
సనయంబు వ్రట్టువ లగు రెండుపిండంబు
లురమున విలసిల్లు చుండ, నఱుత
వెలుఁగుచు జపమాల వ్రేలంగ, నన్నువ
నడుమును వడకంగ, నడచునపుడు

కలహంసకూజితకలనాద మెసఁగ నా
పాలికి నేఁ డొక్క బ్రహ్మచారి
ఆ. వచ్చి, పోయె ; వాని వదనంబువలన వె
ల్వడు సుగంధి మధుర భాషితంబు
పొలుచు వినఁగ సమదపుంస్కోకిలాలాప
చారు వగుచు హృదయసమ్మదముగ. 103

క. ఆ ఋషికుమారు కట్టిన
చీరలు నతిమృదులములు, విచిత్రములు, మనో
హారము వానిబృహత్కటి
భారమునం దొక్క కనకపట్టము వెలుఁగున్. 104

క. పవన సమీరితమధుపం
భవవివిధప్రసవసౌరభముఁ బోలి ముని
ప్రవరుని తనువునయం దు
ద్భవ మై రమ్య మయి సౌరభము విలసిల్లున్. 105

వ. మఱియు నక్కుమారుం డొక్క యెఱ్ఱని ఫలంబు దన దక్షిణ పాణి
తలంబున నందంద చఱచుచు నది నేలంబడి యెగయం బోయిన వల
నికి వ్రాలుచు, వాతా వధూతం బైన బాలవృక్షంబునుంబోలె నొప్పు
చున్న, నమ్ముని పుత్రునందు నా హృదయంబు దద్దయుం దగిలిన
యది. 106

ఉ. నన్నును గౌఁగిలించుకొని, నావదనంబునకున్ నిజాస్య మా
సన్నముఁ జేసి, యొక్క మృదుశబ్దము సేసె మనోహరంబుగా;
నెన్నఁడు నట్టిశబ్దము మునీశ్వర ! మున్ విని యే నెఱుంగ; న
య్యన్నువ బ్రహ్మచారిముఖ మంబురుహంబునమంబు నూడఁగన్.

వ. నాయిచ్చిన వన్యస్వాదుఫలంబు లాదరించి యారగింప కమ్ముని
కుమారుం డమృతోపమానంబు లైన ఫలంబులు, నతిమధురంబు లైన
పానీయంబులు నాకు నిచ్చిన నుపయోగించితి; నట్టి రసవిశేషంబు
లేను మున్నెన్నఁడు రుచియించుటలేదు; మఱియును. 108

క. తనచేతి పుష్పములఁ జ
ల్లిన నంతటఁ జెదరి యవి యళిప్రకరనిభే
వన మొప్ప నున్నయవి; యి
వ్వనకుసుమము లట్లు గావు వరగంధంబుల్. 109

వ. నాకు నమ్మునిపుత్త్రు నాశ్రమంబునందు వానితో నొక్కటఁ దపంబు సేయుచుండ నిష్టం" బనినఁ గొడుకు పలుకులు విని విభాండకుండు విస్మితుం డై "తపస్వుల తపంబులకు విఘ్నంబులు సేయ ననేక రూపులయి రాక్షసులు వనంబునం గ్రుమ్మరు చుండుదురు; తజ్జనదత్తంబు లయిన పానీయంబు లపేయంబు; లతిసుగంధులయిన కుసుమంబులు మునులకు వర్జనీయంబు'' లని కొడుకుం బ్రబోధించి యెప్పటియట్ల వన్యఫలంబులు దేర నరిగిన. 110

క. చనుదెంచి తరుణి మునినం
దనుచిత్తంబునకు వైకృతముఁ జేసె; విలా
సినుల సహాలాప సహా
సన సహాయానములు బంధసమములు గావే? 111

వ. ఇట్లు ఋశ్యశృంగుండు విలాసినీమోహితుం డయి తండ్రి కెఱింగింపక, స్వచరితం బయిన తన యాశ్రమంబు విడిచి, మనుష్యయోగంబునం దగిలి యక్కోమలి పిఱుందన చని, యంగదేశంబు సొచ్చి, యందు రోమపాదునాదేశంబున రాజాశ్రయం బను భవనంబున నుండునంత.

మత్తకోకిలము. అమ్మునీశు నివాసశక్తిఁ దదంగదేశమునందు మే
ఘమ్ము లెల్లవలంకులం గడుఁ గ్రమ్మి, సర్వజన ప్రమో
దమ్ముగాఁ బ్రభవద్బృహజ్జలధార లొప్పఁగ వృష్టిఁ జే
సె మ్మహానదులున్ మహాసరసీవరంబులు నిండఁగాన్. 113

వ. ఇట్లు ఋశ్యశృంగు నాగతంబున నంగవిషయంబున నవగ్రహదోషంబు నిరస్తంబైన సంతసిల్లి రోమపాదుండు తన కూఁతు శాంత యను దాని నత్యంతకాంతిమతి నమ్మునివరునకు వివాహంబు సేసి. 114

క. అనుభోగ యోగ్యములుగా
ధనరాసులు, భూషణములుఁ దాసీనివహం
బును, గాంచనమయశయ్యా
సనములు ముని కిచ్చె హృదయసంతోషముగాన్. 115

—: విభాండకుఁడు ఋశ్యశృంగుని వెదకుచు వచ్చుట :—

వ. మఱియు గోసహస్రంబు లనేకంబు లిచ్చి, గోకులసంకులంబుగా ఘోషంబులు దేశంబుల నెల్ల నిలిపి, నిత్యసత్కారంబుల ఋశ్యశృంగునకుఁ బ్రియంబు సేయుచుండె; నంత నట విభాండకుండు దన యాశ్రమంబునఁ గొడుకుం గానక, యెల్ల దేశంబులు రోయుచు నంగదేశంబునకు వచ్చి, గోగణసంకీర్ణం బైన యొక్క ఘోషంబునందు గోపసత్కృతుండై యొక్క దివసంబు వసియించి, యిది యెవరి ఘోషంబని గోపాలకుల నడిగిన వార లి ట్లనిరి. 116

క. "యతినాథ! వినవె యిది నీ
సుతుఘోషం; బిదియ కాదు చూడ ననేకా
యుతఘోషంబులు గల వు
న్నతగుణునకు ఋశ్యశృంగునకు నిద్ధరణిన్." 117

వ. అనిన విని విభాండకుండు సంతసిల్లి ఋశ్యశృంగు తోడ్తోపట్ల విశ్రమించుచు రోమపాదుపురంబునకు వచ్చి యందు శాంతాసహితుండైన ఋశ్యశృంగుం జూచి, సంతుష్ట హృదయుండై, తన కొడుకుం గోడలిం దోడ్కొని నిజాశ్రమంబున కరిగె; నందు వసిష్ఠున కరుంధతియు, నగస్త్యునకు లోపాముద్రయు, ముద్గలునకు నాలాయిని యైన యింద్రసేనయుంబోలెఁ దనకుఁ బరమభక్తి యుక్తయై శాంత పరిచర్య సేయుచుండ ఋశ్యశృంగుండు సుఖం బుండె" నని చెప్పిన నాకౌశిక హ్రదంబున నందఱు నభిషిక్తులై, యేనూఱుమహానదుల సమాగమస్థానం బయిన గంగా సాగరసంగమంబుఁ జూచుచు సముద్రతీరంబునం జని, కళింగదేశంబున వైతరణి యను మహానదిం గని; రంత రోమశుండు ధర్మరాజున కి ట్లనియె. 118

క. "మునిదేవవరులు యజ్ఞము
లొనరించిరి తొల్లి దీని యుత్తరతీరం
బున; నిది పుణ్యాస్పద మై
తనరును యజ్ఞావభృథశతస్నానములఁ. 119

వ. మఱియు సకల యజ్ఞంబులయందును బ్రశస్తం బయిన పశుభాగంబు పశుపతికి దేవతలును ఋషులు నిందుఁ గల్పించి; రితీర్థం బాడినవారు దేవయానగతు లగుదు" రనినం గృష్ణాసహితుం డై ధర్మతనయుండు దమ్ములుం దానును వైతరణిస్నానంబు సేసి రోమశుం జూచి "మునీంద్రా! నాకు భవత్ప్రసాదంబున నఖిలలోకంబులుం గానన య్యె; వైఖానసుల వేదాధ్యయనశబ్దంబులు విననయ్యె" ననిన విస్మితుం డై రోమశుండు "వైఖానసుల నివాస బిందులకుం ముప్పదివేల యోజనంబులు గలదు; వారల యధ్యయన శబ్దంబులు వింటివి గావున నీవు దివ్యుండ" వంచు నరిగి యనవరతఫలాలంకృతం బైన యొక్క వనంబు గని యి ట్లనియె "నిందుఁ దొల్లి స్వాయంభువుం డైన విశ్వకర్మ యజ్ఞంబు సేసి. 120

క. దక్షుఁ డయి యజ్ఞదక్షిణ
దక్షిణభూభాగ మెల్లఁ దా నిచ్చె నశే
షక్షితిధరవనములతో
నక్షయ గతిఁ గశ్యపునకు నార్త్విజ్యమునఁ. 121

వ. దాని కలిగి భూదేవి కశ్యపునకుం బట్టిక. రసాతలంబునకుం బోయినఁ దత్ప్రసాదార్థి యై కశ్యపుం డుగ్రతపంబు సేసినం బ్రసన్న యై భూమిదేవి నీరిలో నుండి వెలుపడి, వేదిరూపంబునం గశ్యపునకుఁ నిజరూపంబు సూపె; నవ్వేది యిది సుమ్ము; దీని నెక్కినవారు వీర్యవంతు లగుదుఁ రీమంత్రంబున దీని నెక్కుండు; పెఱనాఁ డిది దా వీక సముద్రంబు సొచ్చు" నని "యగ్నిర్మిత్రో యోని" యను నివి యాదిగాఁగల మంత్రంబు లుపదేశించిన. 122

క. అనుజులుఁ దానును మునిశా
సనమున నవ్వేది యెక్కి సమధిక వీర్యం

బున నొప్పె బ్రాహ్మణుల దీ
వన లెసఁగఁగ ధర్మసుతుఁడు వాసవలీలన్. 123

క. ధరణీసురవరమునిగణ
పరివృతు లై యరిగి కనిరి పాండవులు వియ
చ్చర సేవితబంధురసుం
దరకందర మగు మహేంద్రధరణీధరమున్. 124

వ. అందుల మహాతపోధనులకు నమస్కార సత్కారంబుల మనఃప్రియంబు
సేసి ధర్మరా జి ట్లనియె. 125

తే. "పరమమునులార! యిగ్గిరిఁ బరశురాముఁ
శుభచరిత్రుని మీ రెప్డు సూతు రట్టె!
యమ్మహాభాగు మీ చూచునవసరంబు
నందు మాకును జూడంగ నమరునొక్కొ?''

వ. అనిన నమ్ముని సంఘంబులోన రామానుచరుం డయిన యకృతవ్రణుం
డను ముని ధర్మరాజున కి ట్లనియె. 127

తే. "ధర్మతనయ! మీరాక ముందర యెఱుంగు
జామదగ్న్యుండు నిర్మలజ్ఞానదృష్టి;
ననఘ! యెల్లి చతుర్దశి నమ్మహాత్ముఁ
జూతు రిమ్మును; లీవును జూడు మిచట." 128

వ. అనిన ధర్మతనయుండు మహేంద్రంబున నారాత్రి వసియించి యకృ
తవ్రణు నిట్లని యడిగె. 129

క. ''భువన స్తుత్యుం డగు భా
ర్గవుచరితము వినఁగ నాకుఁ గడుఁ గౌతుకగౌ
రవ మైనది; దాని ముని
ప్రవర! యెఱింగింపు కర్ణపథరమ్యముగాన్''. 130

—: అకృతవ్రణుఁడు ధర్మరాజునకుఁ బరశురాముని మహిమ సెప్పుట :—

వ. అని యడిగిన ధర్మరాజునకు నకృతవ్రణుం డి ట్లని చెప్పెఁ ''దొల్లి
కన్యాకుబ్జంబున గాధి యను రాజుకూఁతు సత్యవతి యనుదాని భృగు

పుత్రుం డగు ఋచీకుండను మహాముని వివాహార్థియై గాధి నడిగిన, నమ్మునివరునకు వాఁ డి ట్లనియె. 131

సీ. "ఒక్క కర్ణంబు నీలోత్పలశ్యామ మై
తను వెల్ల శశిహంసధవళ మైన
యిట్టిగుఱ్ఱములు వే యిక్కన్య కుంకు; వి
ట్లీ నోపు దేని మునీంద్ర! దీని
నమరంగఁ బెండిలి యగు; మిది మాకుల
ధర్మంబు" నావుడుఁ దరుణిఁ బెండ్లి
యగు వేడ్క భార్గవుఁ డప్పుడ వరుణేంద్రు
పాలికిఁ జని, వానిఁ బడసి తెచ్చె;

ఆ. నవనినాథ! గంగయందుఁ, గన్యాకుబ్జ,
పురవరంబునందుఁ బుట్టె నట్టి
హయసహస్ర మమల మై; నాఁటఁగోలెను,
నశ్వతీర్థ మనఁగ నయ్యె నదియు. 132

వ. ఋచీకుండును గాధికి నిచ్చాసమంబు లైన హయంబుల నిచ్చి, వాని కూఁతు సత్యవతిం బాణిగ్రహణవిధిం బరిగ్రహించిఁ సుఖంబున్నఁ గన్యాకుబ్జంబునకు భృగుండు వచ్చి, వారలచేతం బూజితుం డై, కొడుకునుం గోడలిం జూచి సంతసిల్లి, యొక్కనాఁడు కోడలి కి ట్లనియె. 133

క. "లలితాంగి! యేను నీ గుణ
ముల కతిహృష్టుండ నైతి; ముద మొనరఁగ ని
మ్ముల నిచ్చెద వేఁడుము నీ
వలచువరం" బనిన సత్యవతి యి ట్లనియెన్. 134

వ. "దేవా! నీ ప్రసాదంబున నా కొక్క కొడుకును, మజ్జనని కొక్క కొడుకు నుదయింప వలయు" నని మ్రొక్కినం గరుణించి భృగుండు నీ కోరినయట్ల యగు; శుచిస్నాతలయి నీవు మేడిమ్రానిం గౌఁగి లింపుము, నీ జనని నశ్వత్థంబుఁ గౌఁగిలింపు మను" మనిన నయ్యిద్దఱుఁ దదాలింగనవిపర్యాసంబు సేసిన నెఱింగి భృగుండు గోడలి కి ట్లనియె.

ఉ. "పుత్రుఁడు నీకు బ్రహ్మకులపూజ్యుఁడు పుట్టియు, వాఁడు దారుణ
క్షత్త్రిచరిత్రుఁ డై పరఁగు సత్త్వమునన్; మఱి నీ సవిత్రికిన్
క్షత్త్రియుఁ డుద్భవిల్లియు నఘక్షయ కారణుఁడున్, మహాతపః
పాత్రుఁడు నై ధృతిం బడయు బ్రాహ్మణభావము భూరితేజమున్."

వ. అనిన సత్యవతి గృతాంజలి యై క్షత్రియభావంబు దనపుత్రునకుం గాక
పౌత్రున కగునట్లుగా శ్వశురువలన వరంబు వడసి కతిపయ కాలంబు
నకు గర్భిణి యై. 137

క. ఆదిమునిచరితుఁ బడసెఁ బ్ర
సాదసమన్వితు, సుపుత్రు, జమదగ్నిఁ జతు
ర్వేదంబులయందు, ధను
ర్వేదమునందును, నతి ప్రవీణు మహాత్మున్. 138

వ. ఆ జమదగ్ని ప్రసేనజితుం డను రాజుకూఁతు రేణుక యనుదాని
వివాహంబయి, దానియందు రుమణ్వ త్సుషేణ వసు విశ్వావసు
రాము లను వారి నైదుగురు కొడుకులం బడసి, వనంబున నుగ్రతపంబు
సేయుచు నొక్క నాఁడు వన్యఫలంబులు దేరం గొడుకులు వోయిన,
రేణుక వారి పిఱుందన పోయి యొక్క సరోవరంబునందు సభార్యుం
డయి జలక్రీడ లాడుచున్న వాని, మార్తికావతపతియగు చిత్రరథుం
డను రాజుం జూచి, కామమోహిత యై వ్యభిచరించిన దాని
దుశ్చరితం బెఱింగి కోపోన్మాదపరవశుం డై. 139

క. తనయుల నలువురఁ గ్రమమునఁ
బనిచెన్ జమదగ్ని దనదు భార్య వధింపన్;
జననీఘాతము పాతక
మని వారలు పలుక కుండి రవ్యవసితు లై. 140

క. కడు నలిగి యమ్మునీంద్రుఁడు
గొడుకులకును శాప మిచ్చె "ఘోరాటవిలో
జడమతి మృగపక్షులయ
ట్లుడుగక యజ్ఞానవృత్తి నుండుం" డనుచున్. 141

వ. మఱియు నిశితపరశుహస్తు రాముం జూచి "దీని వధియింపు" మని జమదగ్ని పంచిన వాఁడు గురువచనంబున దల్లిం దత్క్షణంబున వధియించిన. 142

క. శమితనిజక్రోధుం డై
జమదగ్ని తనూజు సాహసమునకుఁ దన వా
క్యము లంఘింపమికిఁ బ్రస
న్నమనస్కుం డై తనూజునకు ని ట్లనియెన్. 143

వ. "నా వచనంబున నతిదుష్కరం బైన కార్యంబు సేసితి ; నీ కిష్టం బైన వాని నెల్లను వేఁడు మిచ్చెద" ననిన రాముండు సంతుష్టహృదయుం డై "మదీయజనని జీవించి యుండను, నాకుఁ దద్వధదోషనిష్కృతియు, సహోదరులు శాపవిముక్తు లయి యెప్పటియట్ల యుండను, సమరంబుల నా కప్రతిహతశక్తియు, దీర్ఘాయువుం గాఁ బ్రసాదింపుం" డని తండ్రివలనం దన యభిమతంబులు వడసి యుండు నంతఁ గొండొకకాలంబున. 144

చ. అమితబలుండు, హైహయుఁ డహర్పతితేజుఁ డజేయబాహువి
క్రముఁడు, సహస్రబాహుఁ డనఁగా విదితుం డగు వాఁడు తద్వనాం
తమున మృగవ్యఖిన్నుఁ డయి తా జమదగ్నిమహామునీంద్రు నా
శ్రమమున కేఁగుదెంచె బహుసైన్యముతో నధికశ్రమార్తుఁ డై. 145

వ. అందు మునివరు చేతం బూజితుం డయ్యును, వాఁడు దన రాజ్యమదంబున మెచ్చక, యయ్యాశ్రమవాసుల కవమానంబు సేసి, యందుల వృక్షంబు లెల్ల విఱిచి, జమదగ్ని హోమధేనువును దరుణవత్సంబుతోఁ గట్టి కొనిపోయిన నప్పు డవ్వనంబుననుండి సమిత్కుశఫలంబులు గొనివచ్చిన రామునకు జమదగ్ని యి ట్లనియె. 146

క. "వినవయ్య ! కార్తవీర్యుఁడు
మన ధేనువుఁ బట్టుకొని సమర్థుం డయి పె
ల్చన పోయె ; నేమి సేయుద
మనవుడు రాముండు విని మహాక్రోధమునన్. 147

క. గురువచన బోధితుం డై
సరభసగతి వానిపిఱుఁదఁ జని, తద్బలముల్
శరవృష్టి ముంచి చంపె న
పరిమితలయకాలమేఘపటలముపోలెన్. 148

వ. మఱియును. 149

—: పరశురాముఁడు కార్తవీర్యుని జంపుట :—

చ. బలిమి నశేషలోకపరిభావిమహోద్భుతశౌర్యసంపదం
బొలుచు సహస్రబాహుశరముల్ గులిశాతినిశాతబాణధా
రల నతివీరుఁ డై తునిమి, రాముఁ డరాతులకుల్ భయంబుగాఁ
గలహములోన వాని నతిగర్వితుఁ జంపెఁ బరాక్రమోన్నతిన్. 150

వ. అంతం గార్తవీర్యుని పుత్రులు బద్ధవైరు లై రామరహితం బయిన జమదగ్న్యాశ్రమంబునకు వచ్చి యందు 151

మ. మునులం దిట్టుచుఁ, బుష్పవృక్షతతు లున్మూలించుచుం, గ్రూరు లై
యనవద్యున్ జమదగ్నిఁ బట్టి బలిమిన్ హారామ హారామ యం
చును నాక్రోశము సేయుచుండఁగ, మునుల్ శోకింప, ధర్మాత్ము న
మ్మునిముఖ్యున్ వధియించి రాగ్రహమునన్ మోహాంధులై
హైహయుల్. 152

చ. వఱలఁగ రాముఁ డంత ననవద్యుఁడు వచ్చి బహుప్రలాప యై
యఱచుచు నున్న తల్లిని, గృతాంతవశస్థితుఁ డైనతండ్రి, న
త్తఱిఁ గని తీవ్రశోకపరితాపహతుం డయి, తత్ప్రకార మం
దెఱిఁగి ముహూర్తమేనియు సహింపఁగ నోపక కోపదీప్తుఁ డై. 153

చ. "అనఘు, ననాతతాయిఁ, గరుణాత్ముఁ, బ్రశాంతుని, దాంతు నిమ్మహా
మునివరుఁ జూచి చూచి యధముల్ వధియించిరి; దీనఁజేసి దు
ర్జను లగుచున్న క్షత్త్రియులఁ జంపుదు" నంచుఁ బ్రతిజ్ఞ సేసె భూ
వినుతుఁడు జామదగ్న్యుఁ డతివీరుఁడు లోకభయంకరాకృతిన్. 154

వ. ఇట్లు కృతప్రతిజ్ఞుం డై క్షత్త్రియుల నెల్ల వధియించి, దిగ్దంతిదంతార్గళాఘాట మహీచక్రంబు సాధించి, విహిత వివిధాధ్వరుం డై కశ్యపునకు నార్త్విజ్య దక్షిణగా నఖిలభూవలయంబు నిచ్చి, నిస్సంగుం డై మహేంద్రపర్వతంబునం దపోనిత్యుం డై యున్నవాఁ"

డని పరశురాము చరితంబు సెప్పిన విని ధర్మజుం డనుజ బ్రాహ్మణ సహితుం డై మునిగణోపదేశంబునం జతుర్దశినాఁడు పరశురాముం జూచి పరమభక్తిం బూజించి, తత్ప్రీతిపూజితుం డై దక్షిణదిక్కునకుం జని. 155

క. భూవినుతం బై త్రిభువన
పావనమై త్ర్యంబకప్రభవ మైన జలౌ
ఘావళిఁ బవిత్ర మగు గో
దావరిఁ బుణ్యనదిఁ గనియె దక్షిణగంగన్. 156

శా. గోదేవక్షితిదేవభక్తి పరుఁడై, గోదావరీస్నాతుఁ డై,
గోదానంబులు, హేమదానములుఁ, బెక్కుల్ రత్నదానంబులుఁ
భూదేవోత్తమపూజ సేయుచు జగత్పూజ్యుండు ధర్మాత్మజుం
డాదిత్యాభుఁ డనేకతీర్థశతసేవాసక్తపుణ్యాత్ముఁ డై. 157

వ. ద్రవిళదేశంబున నగస్త్యతీర్థం బాడి, యందుఁ దొల్లి యర్జునుచేసిన గోసహస్రదానాదివివిధదానంబులు విని, వానిం బ్రశంసించుచుం జని, శూర్పాకారం బను తీర్థంబునం బర్వతోత్సేధం బయిన పరశురామవేదిం గని, సముద్రతీరంబునకుం జని, ప్రభాసతీర్థంబునం బండ్రెండు దినంబులు పంచాగ్నిమధ్యంబునం బవనాంబు భక్షకుం డై ధర్మజుండు దపంబు సేసిన. 158

ఆ. దాని నెఱిఁగి రామ దామోదరులు వృష్ణి
వరులతోడఁ బ్రీతి నరుగుదెంచి
కనిరి సకలతీర్థగమన పథక్లేశ
కృశులఁ, బాండుసుతుల, విశదయశుల. 159

క. చీరాజినధారుల నవి
కారతపోయుతులఁ జూచి కడు దుఃఖితు లై,
వారిజదళాక్షి ద్రౌపది
నూరార్చి రుదారహితమృదూక్తుల నొప్పన్. 160

వ. వారికి ధర్మతనయుండు దమ వనవాసతీర్థగమనాయాసంబును,
నర్జును దివ్యాస్త్రలాభంబును, నింద్రునొద్ద నాతని యునికియుం
జెప్పిన విని రాముండు గృష్ణాదులైన వృష్ణివరుల కి ట్లనియె. 161

సీ. "మతిహీనుఁ డై తన సుతుని పల్కులు విని
ధృతరాష్ట్రుఁ డీపాండుసుతులఁ, బాప
భీరుల, నపగతధారుణీరాజ్యులఁ
జేసి యుగ్రారణ్యవాసగతులఁ
గావించె; నిది ధర్మమే? విచారవిహీనుఁ
డయ్యె; భీష్మాదులు నెయ్య మమర
వారింపఁగా దీని నేరర; దృఢసత్య
రతులకు, దేవనిర్మితుల కహిత

ఆ. మాచరించుచున్న నీచ దుర్యోధనా
దులకు వర్ధనమును, నలఘు లైన
పాండునందనులకు దండితారుల కవ
ర్ధనము నిట్లు సేయఁ బనునె విధికి? 162

క. ధరణీతలంబు నిర్ధా
ర్తరాష్ట్రముగఁ జేసి• యనఘ ధర్మైకధురం
ధరు ధర్మతనూజు వసుం
ధర కధిపతిఁ జేయకుండఁ దగునే మనకున్? 163

వ. అనిన బలదేవునకు సాత్యకి యిట్లనియె. 164

చ. "అనుపమశౌర్యవంతుల, రనంతబలాఢ్యుల రీవు, నీజనా
ర్దనుఁడును, సాంబసారణులు, దర్పకవీరుఁడు నుండఁ బాండునం
దనులు సుయోధనాదులకృతంబున నిట్టు లనాథులట్ల యి
వ్వనమున నుండఁగాఁ దగునె వన్యఫలాశనహీనవృత్తితోన్? 165

తరలము. అహితచిత్తవిదారణక్రియలందుఁ బ్రౌఢము లై, జగ
త్కుహర మంతయు మ్రోయుచుండఁగ ఘోరయాదవసైన్యస
న్నహనదుందుభినాదముల్ గగనంబు దిక్కులు నిండ, దు
స్సహము లయ్యెడు ధార్తరాష్ట్రులసైన్యవీరభటాలికిన్. 166

మ. ఘన మై నీపృథుబాహులాంగలముఖాఘాతంబుతోడఁ జనా
ర్దనశార్ఙ్గచ్యుతసాయకావలియుఁ, గందర్పేషుజాలంబు, నీ
యనిరుద్ధోగ్రశిలీముఖాలియు మదియాస్త్రౌఘమున్ ధార్తరా
ష్ట్రనికాయోత్తమకాయఖండనపటిష్ఠం బయ్యెడుం బోరిలోన్.

వ. కేకయసృంజయపాంచాలవృష్ణిభోజాంధకవీరులుం గృష్ణానుమతులయి యుద్ధంబున ధృతరాష్ట్రపుత్త్రులను భీష్మద్రోణకర్ణాదులను వధియింతురు; ధర్మరాజు దమ్ములుం దాను సమయాబ్దంబులు సలిపి రాజ్యాభిషిక్తుండగునంతకు నతిరథు నభిమన్యు నఖిలరాజ్యదక్షుకుం జేసి యుండుద''మనిన సాత్యకి పలుకుల కనుకూలుండయి వాసుదేవుండు ధర్మరాజున కి ట్లనియె. 168

ఉ. ''ఈతనిపల్కినట్ల ధరణీశ్వర ! నీరిపులన్ మహాబలో
పేతులఁ బోరఁ జంపుదు రభేద్యులు వీరలు; మీకు భూరిధా
త్రీతలరాజ్య మెల్ల నగుఁ దెల్లము'' నావుడు ధర్మనందనుం
డాతతకీర్తి యి ట్లనియె నమ్మురవైరికి, సీరపాణికిన్. 169

ఉ. "మీరయ మాకుఁ గల్గఁగ నమిత్రుల నోర్చుట యేమిపెద్ద ? ధ
ర్మోదయనిత్యబుద్ధులను నుత్తమకీర్తుల నొప్పు ద్రోణభీ
ష్మాదుల సన్నిధానమున నమ్మెయిఁ బల్కినపల్కు దప్పఁగాఁ
గా''దని ధర్మనందనుఁడు గ్రమ్మఱిచెన్ యదువీరకోపముల్. 170

వ. యాదవులు పాండవుల వీడ్కొనిపోయి; రిట పాండవులు సోమమిశ్రితతోయ యైన పయోష్ణియందుఁ గృతస్నాను లయియున్న, నందు ధర్మరాజునకు రోమశుం డి ట్లనియె. 171

క. "మనుజేంద్ర! దీనితీరం
బున భృగుఁ డనురాజు యజ్ఞములఁ జేసిన నం
దనిమిషపతి తృప్తుం డై
దనుజుల నోర్చెనట ఘోరతరశస్త్రములన్ 172

వ. మఱియు నిందఁ దొల్లి యా ధూర్తరయసుం డైన గయుండు హిరణ్మయంబు లయిన చషాలస్థాలీయూపచమసపాత్రీ స్రుక్స్రువంబులును, దేవస్థాపితంబు లయిన యూపంబులు నొప్ప నే డశ్వమేధం

బులు సేసి, యసంఖ్యాతంబు లైన ధనంబుల ఋత్విజులను సదస్యులనుం బూజించి, సువర్ణమయగోదానంబు లనేకంబులు బ్రాహ్మణుల కిచ్చి, యక్షయంబు లయిన యింద్రలోకసుఖంబులం బడసెఁ; బయోష్ణి యందుఁ గృతస్నాను లైనవారు దేవసాయుజ్యంబుఁ బడయుదు"రని చెప్పుచుం జని నర్మదాస్నానంబుఁజేసి వైదూర్యపర్వతంబుఁ గని రోమశుండు ధర్మరాజున కిట్లనియె "నిది త్రేతాద్వాపరసంధి ; యీ సరోవరతీరంబు శర్యాతియజ్ఞప్రదేశంబు; మఱియు నిందు భృగుపుత్రుం డయిన చ్యవనుండు శర్యాతి యను రాజుకూఁతు సుకన్య యనుదాని వివాహం బయి వాని యజ్ఞంతబున నింద్రు నాదరింపక యాశ్వినుల సోమపీథులం జేసె" ననిన "నది యె"ట్లని యడిగిన ధర్మజునకు సౌకన్యాఖ్యానంబు సవిస్తరంబుగా రోమశుం డిట్లనియె. 173

—: రోమశుఁడు ధర్మజునకు సౌకన్యాఖ్యానంబు చెప్పుట :—

క. "ఇక్కొలని సమీపంబునఁ
బెక్కగు వేలేండ్లు తపము భృగుసుతుఁడు గరం
బక్కజముగ నొనరించెను
వెక్కసమగు నియమ నిరతి వీరాసనుఁ డై. 174

క. అమ్మునిదేహము వల్మీ
కమ్మునఁ గప్పంగఁబడి, నికటవల్లీగు
ల్మమ్ములు పైఁ బ్రాఁకిన నన
యమ్మును నేర్పడక యుండె నవ్వనభూమిన్. 175

వ. అంతం బెద్దకాలంబునకు శర్యాతియను రాజు దన చతుస్సహస్ర దేవీనివహంబుతోడఁ దత్సరోవరంబున విహరింప నరిగిన, నాతని కూఁతురు సుకన్య యనునది యిష్టసఖులతోఁ గ్రుమ్మరుచున్న నవ్వల్మీకంబునందు. 176

క. విద్యుల్లతాంగి భార్గవు
నుద్యన్నయనములు మెఱచుచున్నను విలస
త్ఖద్యోతద్యుతులొకొ ! యని
సద్యస్సంజాతబుద్ధిసంభ్రమ యగుచున్. 177

వ. అప్పు డప్పుట్ట గ్రొప్పించిన నలిగి నిమీలితనయనుం డై చ్యవనుండు శర్యాతి సైన్యంబుల కెల్ల మూత్రపురీషనిరోధంబుఁ జేసిన, నది తన సైన్యాపరాధంబున నయ్యెఁ గా వగచి వాఁ డెల్లవారి నడిగి తత్కారణం బెఱుంగ నేరక చింతాపరుం డై యున్నఁ దండ్రికడకు వచ్చి సుకన్య యి ట్లనియె. 178

తే. "మిన్న మిడుఁగుఱులట్లు లై మెఱసి రెండు
మెఱుఁగు లొకపుట్టలో నున్న నెఱుఁగ కేను
బుట్ట గ్రొప్పించి యా రెంటి పొడవుఁ గాన
కుడిగి వచ్చితి విస్మయపడి మనమున. 179

వ. ఈ సైన్యనిరోధంబున కిది నిమిత్తం బగునో" యనిన శర్యాతి యప్పు డా పుట్ట యొద్దకు వచ్చి యందుఁ దపఃక్లేశంబునఁ గృశత్వగస్థిభూతశరీరు, నతివృద్ధు భార్గవుం గని నమస్కరించి యి ట్లనియె.

క. "అమితం బగు మీతపము మ
హిమ యెఱుఁగక యిట్లు చేసె నిది; దీని సహిం
పుము దయ; మత్సైన్యనిరో
ధము వాపుమ, యెఱుక గలరె తరుణులు ధరణిన్ ?" 181

వ. అనిన భార్గవుండు కరుణించి యతిశయరూపయౌవనగర్విత యైన యా కన్యకం బరిగ్రహించి కాని సహింప ననిన శర్యాతి తన కూఁతు నమ్మునివరున కిచ్చి నిజసైన్య నిరోధంబుఁ బాచికొని చనిన. 182

ఆ. పతికిఁ బరమభక్తిఁ బరిచర్య సేయుచు
నొనరఁగా సుకన్య యుండునంత
నాలతాంగికడకు నాశ్విను లేతెంచి,
తమ్మెఱుంగఁ జెప్పి దాని కనిరి. 183

వ. "అవ్వా నీ వెవ్వని కూఁతుర ? వెవ్వని భార్య ?" వని యడిగిన "నేను శర్యాతి కూఁతుర; భార్గవుం డయిన చ్యవమని భార్య" నని చెప్పిన విని వారలు నగి, "యక్కటా ! యిట్టి రూపవిభవంబులు వడసి. కామభోగబాహ్యుఁ డయిన వృద్ధు భార్గవుని వరియించి, నీ జవ్వనం బెల్ల వృథ చేసి; తింక నైన నను నీ వయోరూపంబులకుం

దగిన వరు వరియింపు; మేము వానిఁ దెచ్చెద" మనిన నప్పలుకులు
సహింపక సుకన్య యాశ్వినుల కిట్లనియె. 184

ఆ. చ్యవనునందు నాకు సంతతప్రీతియై
యుండ నిట్లు పలుకు టుచిత మగునె ?''
యని నిజేశ్వరునకు నప్పుడ వారల
పలుకు లెఱుఁగ జెప్పెఁ బంకజాక్షి. 185

వ. చ్యవనుండు దాని పతివ్రతాత్వంబునకు సంతోసిల్లి వారల పలుకుల
కొడంబడు మని పంచిన, నది పతిచేత ననుజ్ఞాత యై చని, నాకు
నవయౌవనపరుం గావింపుండనిన, నాశ్విను లప్పు డక్కొలను సొచ్చిరి;
భార్గవుండును వారితోడ సరః ప్రవేశంబు సేసె; ని ట్లమ్మువ్వురు
నవయౌవను లయి సుకన్యకడకు వచ్చి నిలిచి ''మాయందు నీ వలచు
వానిని వరియింపు'' మనిన నది తన పతి యైన భార్గవుని వరియించె;
నంత నయ్యాశ్వినుల కతిప్రీతుం డయి చ్యవనుం డి ట్లనియె. 186

—: చ్యవనుఁ డాశ్వినుల సోమపీథులఁ జేయుట :—

తే. ఏను మీకారణంబున నిపుడు లబ్ధ
యౌవనుండ నై ధన్యుండ నైతి; మిమ్ము
సోమపీథులఁ జేసెద సురలరాజు
సూచు చుండగఁ శర్యాతి సుక్రతువున.'' 187

వ. అని చెప్పిన నాశ్వినులు సంతసిల్లి యరిగి, రిట శర్యాతి భార్గవు జరా
భారపరిత్యాగంబు విని విస్మితుం డై యల్లునిం గూఁతుం జూడ
వచ్చిన నాతని సత్కృతుం జేసి భార్గవుం డి ట్లనియె. 188

క. "విదితముగ నిన్నుఁ జేయిం
చెదఁ గ్రతువు ధరాధినాథ ! చేయుముఁ నీ క
భ్యుదయం బగు; సంభారస
ముదయము సమకట్టు'' మనిన మునివచనమునన్.  189

క. అనఘుఁడు శర్యాతి మఖం
బొనరించె విధిప్రయోగయుతముగ: నం దా

శ్వినులకు సోమం బీఁ బో
యిన భృగుపుత్రునకు నలిగి యింద్రుం డనియెన్. 190

క. "వీ రర్హులు సోమార్హు లు
గా రమరుల వెజ్జు: లిది యకర్తవ్యము; బృం
దారకులు గానివారికి
వారింపక సోమ మిచ్చువారుం గలరే?" 191

వ. అనిన నింద్రవచనం బాదరింపక చ్యవనుం డాశ్వినుల సోమపీథులం
జేసిన దాని సహింపక యింద్రుం డలిగి. 192

క. జృంభించి వజ్ర మెత్తిన
జంభాంతకు వజ్రయుతభుజాస్తంభము సం
స్తంభించి, యతని, భటుసం
రంభంబునఁ జంపఁ గడఁగి రౌద్రాకృతితోన్. 193

క. చ్యవనుఁడు వేల్చిన నందు
ద్భవ మయ్యె నపారఘోరబలయుతుఁడు, మహా
జవుఁడు, మదుం డను రాక్షసుఁ
డవనిచరద్యుచరభీకరాకారుం డై. 194

వ. ఇట్లుద్భవించి దశ సహస్రయోజనాయామంబు లైన బాహుదండం
బులయు, శతయోజనాయామంబు లైన చతుర్దంష్ట్రలయు, దశ
యోజనాయామంబు లైన దశనంబులయు, శశిరవిమండల సదృశంబు
లైన నయనంబులయుఁ, గాలాగ్ని సన్నిభం బైన వక్త్రంబును,
దిగ్వ్యాపభోభాగసంకటం బైన శరీరంబునుం దోడ భూమి నొక్క
హనువును, దివంబున నొక్క హనువుగా వదనగహ్వరంబు దెఱచి
జగజ్జన సంత్రాసనవ్యగ్రసంచలనం బైన దీర్ఘజిహ్వా నధరోష్ఠపుటంబు
నాకుచు, నత్యుగ్ర నాదంబున దిక్కులు వ్రచ్చుచు, వచ్చు మహారాక్ష
సుం జూచి సురేంద్రుండు వెఱచి భార్గవ స్తంభితభుజుండు గావున
వాని నెద్దియుం జేయనేరక చ్యవను నొద్దకు వచ్చి, కృతాంజలి యై
"మునీంద్రా! నీ తపోవీర్యమహారంభంబు మిథ్యయగునే? యాశ్వి
నులు నేఁడు మొదలుగా సోమార్హు లగుదురు; నీవు నాకుఁ బ్రస
న్నుండ వై క్షమింపు" మనిన. 195

క. మునినాథు నలుకతోడన
యనిమిషపతివజ్రయుతమహాభుజసంస్తం
భన మడిగె; నంత భృగునం
దను వీడ్కొని యింద్రుఁ డరిగెఁ దనపురమునకున్. 196

వ. అమ్మదరాక్షసుండు నాఁడణంబ చ్యవను నుపదేశంబున మద్య స్త్రీ
మృగయాక్షుఁబుల నాశ్రయించె; నాశ్వినులు సోమపీథు లై దివంబున
కరిగి; రిట భార్గవుం డైన చ్యవనుఁడు తన తపోమహత్త్వంబునందుఁ
బ్రకాశింపఁ జేయుటంజేసి నాఁటం గోలె నది యార్చికపర్వతంబు నా
బరఁగె" నని రోమశుండు సెప్పిన నందులఁ బుణ్యసరోవరంబునం
గృతస్నాను లై పాండవు లరిగి యంత శంతను శునక నర నారా
యణ విధాతృతపోవనస్థానం బై, దేవర్షి నివాసం బైన సైంధవార
ణ్యంబునం జంద్రసరోవరంబునందు రోమశనియుక్తులై చరువులు చేసి,
యతిథులం బూజించి చని యమునానదిం గని; రంత వారలకు రోమ
శుం డి ట్లనియె. 197

—: మాంధాతృ చరిత్రము :—

క. "ఇది యమున యను మహానది
త్రిదశనదీనిభము; దీని తీరమున జగ
ద్విదితుఁడు మాంధాతృఁడు సం
పదఁ గ్రతువులఁ జేసెఁ దొల్లి బహువత్సరముల్." 198

వ. అనిన "మాంధాతృ జన్మంబును, వానిచరితంబును వినవలతుం జెప్పు''
మని యడిగిన ధర్మరాజునకు రోమశుం డి ట్లనియె. 199

ఉ. "పీకున నశ్వమేధములు వే యొనరించిన ధర్మశీలుఁ, డి
క్ష్వాకుకులోద్భవుండు. బలవంతుఁ, డనంతయశుం, డవార్యవీ
ర్యాకరుఁ, డుత్తముండు, యువనాశ్వుఁ డపత్యము లేమిఁ జేసి దుః
ఖాకులుఁ డై ప్రధానవరులందు సమర్పిత రాజ్యభారుఁ డై. 200

వ. భృగునాశ్రమంబునకుం జని పుత్రకాముం డై పెద్దకాలం బమ్మౌని
నుపాసించిన నయ్యువనాశ్వునకుం గరుణించి భృగుండు పుత్ర కా
మేష్టిఁ జేసి యందు మంత్ర పూతజలపూరితంబై పుత్రోదయకారణం
బైన కలశంబు వడసి, దాని రక్షించి యుండ ఋత్విజులం బంచిన.

ఆ. రాత్రి జాగరణభరశ్రాంతు లై వారు
నిద్రఁ బొంది; రంత నీరు వట్టి
ధారుణీశ్వరుండు తన్మంత్రకలశోద
కంబు లెల్లఁ ద్రావెఁ గడుపు నిండ. 202

వ. దాని నెఱింగి భృగుండు యువనాశ్వుం జూచి "నీకుఁ బుత్రార్థంబుగా మదీయ తపోవీర్యలబ్ధం బైన యిమ్మంత్రజలంబు నీ భార్య కీనున్నచో, నీ వధిక పిపాసాపరుండవయి యుపయోగించి యకర్తవ్యంబుఁ జేసితి; దైవకృతం బెవ్వరికిఁ దప్పింప నశక్యంబు? దీనం జేసి నీకు గర్భం బై యింద్రసదృశుం డైన పుత్రుం డుద్భవించు" ననిన విని యువనాశ్వుండు తన పురంబునకుఁ జని యున్నంత నూఱేండ్లకు యువనాశ్వు వామభాగంబు భేదిందుకొని బాలార్కతేజుం డైన బాలకుండు వెలువడిన, నక్కొడుకుం జూడ నింద్రుండు వచ్చి వానివదనంబున నిజప్రదేశినిఁ బెట్టి, "యమృతమయం బగు దీనిం ద్రావు" మనిన యింద్రువచనంబున నమరు లెల్ల నక్కుమారునకు మాంధాతృం డను నామంబుఁ జేసి; రట్లు సురేంద్ర సంవర్ధితుం డై. 203

తే. ధ్యానమాత్రనచేసి వేదములు, సర్వ
శాస్త్రములు, ధనుర్వేదము, సకలదివ్య
సాయక ప్రయోగంబులుఁ జట్ట వచ్చి
పొందె మాంధాతృఁ ద్రిభువన పూజ్యు నొప్ప. 204

వ. మఱియు నమ్మాంధాతృండు మహేంద్రుచేత మహామహీరాజ్యంబున కభిషిక్తుం డై చక్రవర్తి యై శక్రునర్ధాసనం బెక్కి యాజగవం బను ధనువును, దివ్యాస్త్రంబులు నభేద్యకవచంబును ధరియించి నిఖిలలోక జైత్రుం డై సంపూర్ణదక్షిణ క్రతువు లనేకంబులు చేసి, పద్మసంఖ్యలు గోదానంబుల బ్రాహ్మణులం దనిపి, నిజ శాసనంబునఁ బ్రజల నెల్ల నిలిపి. 205

మధ్యాక్కర. భూమి కనావృష్టి యైనఁ గడు నల్గి పురుహూతుతోడ
భీమసంగ్రామంబుఁ జేసె; దన దివ్యపృథుసాయకముల
సామజావలి నేయునట్లు మేఘసంచయముల నేసి,
భూమికిఁ గురియించె వర్షములు సస్యముల్ వృద్ధిఁ బొంద. 206

వ. ఇది యమ్మాంధాతృదేవయజనస్థానంబు; మఱి యిక్కురుక్షేత్రంబు నందు సరస్వతీ తీరంబున సోమకుం డనువాఁడు యజ్ఞంబుఁజేసి పుత్ర శతంబుఁ బడసె" ననిన నది యెట్లని ధర్మజుం డడిగిన రోమశుం డిట్లనియె. 207

—: సోమకుం డను రాజర్షి చరిత్రము :—

క. "సోమకుఁ డనురాజర్షి మ
హామఖ మొనరించి జంతుఁ డను నొక్కసుతుఁ
భూమీశ! పడసె; నాతని
భామలు నూర్వురును గొడుకుఁ బరమప్రీతిన్. 208

క. తమ తమ పుత్త్రుఁడ కాఁ జి
త్తములం జేకొని దయం బృథగ్భావము లే
క ముదంబునఁ బెంచిరి లో
కమున జనుల్ చోద్య మందఁగాఁ గడువేడ్కన్. 209

వ. ఒక్కనాఁ డబ్బాలకు కురువు చీము గుట్టినఁ దద్వేదన సహింప నోపక యేడ్చు చున్న వానికడకుఁ దల్లు లందఱుఁ బఱతెంచి యేడ్చిన నయ్యాక్రందన ధ్వని విని సంభ్రమించి సోమకుం డంతఃపురంబునకుం జని కొడుకు నూఱార్చి సభాస్థితుం డై మంత్రులకు ఋత్విజునకు ని ట్లనియె. 210

ఆ. "కోరి యొక్కకొడుకుఁ గొడుకుఁగా నే నెట్లు
నమ్మి యుండనేర్తు? నాకు సతులు
శతము గలిగియుండ సంతాన మల్ప మై
యునికి మీకుఁ జూడ నుచిత మగునె?" 211

వ. అనిన వానికి ఋత్విజుం డిట్లనియె 212

తే. ధరణినాథ! నీ భార్యా శతంబునందుఁ
బరఁగ నూర్వురు పుత్త్రులఁ బడయ నీకు
నభిమతం బేనిఁ, దగుఁ దగ దనక నీవు
కడఁగి మా చేయఁబంచిన క్రతువు సేయు. 213

వ. ఈ జంతుం బశువుగా వధించి తద్వపాహవ్యంబుల హవ్యవాహునిం దనిపిన దాన నీ నూర్వురు భార్యలకు నూర్వురు కొడుకులు పుట్టుదు; రం దగ్రజుం డైన జంతుండు సౌవర్ణలక్షణలక్షితసవ్యపార్శ్వుం డై యుదయించు" నని చెప్పి ఋత్విజుండు సోమకునిచేత ననుజ్ఞాతుం డై.

క. తనయుఁ బశువఁ జిచి తద్వపఁ
గొని వేల్చినఁ జూచి యార్తకురరీనాదం
బున నేడ్చిరి కడు నడలుగఁ
దనుమధ్యలు నూర్వురును సుతస్నేహమునన్. 215

క. ఇమ్మెగఁ దద్ధూమాఘ్రా
ణమ్మున గర్భములు దాల్చి నాతులు నవమా
సమ్ములు నిండుడుఁ గనిరి ము
దమ్మున జంతు ప్రముఖసుతప్రకరమ్ముల్. 216

వ. అందు జంతునకు నందఱు నెప్పటియట్ల తల్లులు సమస్నేహలై యుం డం, బుత్రులు నూర్వురుం బెరిఁగి సమర్థులై యున్నఁ బెద్దకాలంబు నకు ఋత్విజుండు పరలోకగతుం డై ఘోరనరకానలంబున నెరియుచు నుండె; నంత సోమకుండును దేహత్యాగంబు సేసి యమరలోకంబున కరుగువాఁడు ముందట నరకానల పచ్యమానుం డయ్యెడు ఋత్విజుం జూచి "యిట్లేల తీవ్రదుఃఖోపహతుండ వైతి ?" వని యడిగిన వాఁ డిట్లనియె. 217

ఆ. "అవనినాథ! నీకు నార్త్విజ్య మొనరించి
చూవె యిట్టి నరకపాపకమునఁ
బడినవాఁడ; నీకు బహుపుణ్యలోకముల్
గలవు; నన్నుఁ గావలయుఁ గరుణ." 218

వ. అనిన సోమకుండు ధర్మరాజు పాలికిం జని తచ్ఛాసనంబునం బుణ్య లోకంబులకుం బోవుచుండి యిట్లనియె. 219

క. "నా కారణమున ఋత్విజుఁ
డే కాంతమ నరకగతికి నేఁగెను; వానిం
దోకొని పోయెద" నని శుభ
లోకంబున కరిగెఁ ద్రిదశలోకస్తుతుఁ డై. 220

వ. ఇట్లు యజ్ఞపుత్రుండైన సోమకుండు దన తపోయజ్ఞఫలంబున ఋత్విజు
నరక విముక్తుం జేసి పుణ్యలోకగతుం డయ్యె; నిందుఁ దొల్లి ప్రజాపతి
సహస్ర వార్షికం బైన యిష్టాకృతం బను సత్రయాగంబుఁ జేసె;
నాభాగుం డైన యంబరీషుం డిందు యజ్ఞంబులం జేసి పరమసిద్ధిం
జనియె; నిది నహుషుయజ్ఞదేశం; బిందు దశపద్మ సంఖ్యాధనంబుల
నాతండు సదస్యులం బూజించె; నిది సార్వభౌమ యజ్ఞస్థానం; బిది
యయాతి యజ్ఞాయతనంబు; వాని సవనంబున కింద్రుండు వచ్చె; నిది
రామహ్రదం; బిది నరనారాయణాశ్రమం; బిది ప్లక్షావతరణం బను
యమునాతీర్థం; బిందు దేవతలును ఋషులును సారస్వతయాగంబుఁ
జేసి; రిది దేవర్షి యైన సంవర్తుచేత రక్షితం; బిందు భరతుం డనేక
యాగంబులు సేసి స్వర్లోకంబులుం జూచె; నీవు నిందుఁ గృతస్నానుండ
వై సర్వలోకంబులుం జూడు" మనిన ననుజసహితుం డై ధర్మతన
యుం డత్తీర్థంబున స్నానంబుఁ జేసి రోమశున కిట్లనియె. 221

శా. దేవర్షిద్యుచరాహిలోకములు, నాదిత్యాశ్వినీలోకముల్,
దేవాధీశ్వరుఁ జూచితిన్; మఱియు నద్దేవేంద్రునొద్దన్ సగాం
డీవోద్దామమహాభుజార్గళుఁ, గిరీటిన్, సవ్యసాచిన్, జయ
శ్రీవిభ్రాజితుఁ, బార్థుఁ జూచితి; జగత్సేవ్యా! మునీంద్రోత్తమా!"

వ. అనిన రోమశుండు వెండియు ధర్మరాజున కిట్లనియె. 223

క. "ఇది దక్షు మఖస్థానం;
బిదియు సరస్వతి యనంగ నిలఁ బరఁగ మహా
నది; యిందుఁ ద్రిదశతతితోఁ
ద్రిదశజ్యేష్ఠుండు సేసెఁ దివిరి మఖంబుల్. 224

వ. ఇది పంచయోజన ప్రమాణంబైన ప్రజాపతి యజ్ఞవేది; యిందు
దేహత్యాగంబు సేసి మర్త్యులమర్త్యత్వంబుం బొందుదురు; తొల్లి
సరస్వతి నిషధదేశంబున భూమి సొచ్చి యిచ్చమసోద్భేదంబునందుఁ
గానంబడియె; నిది సింధుతీర్థం, బిందు లోపాముద్ర నగస్త్యుండు ప్రతి
గ్రహించె. 225

తే. ఇదియు విష్ణుపదంబు; దా నిది విపాశ;
యిదియుఁ గాశ్మీరమండలం; బిది వితస్త;
మిదియు మానసద్వార; మిందిందువంశ!
పరశురాముండు మును హంసపథముఁ జేసె. 226

—: శిబి యను రాజర్షి చరిత్రంబు రోమశుఁడు ధర్మజునకుఁ జెప్పుట :—

వ. ఇక్కోలనం జైత్రమాసంబునందు మహామునులచేతం బూజితుం డై యుమాసహితుం డీశ్వరుండు వారికిం బ్రత్యక్షుం బగుటయు, నరుంధతీ సహితుండై వసిష్ఠుం డిందుల వసియించె; నిది భృగుతుంగం బను పర్వతం; బిందు నుశీనరపతి శిబియనువాఁడు దొల్లి యజ్ఞంబు సేయుచున్న నింద్రాగ్నులు వానిమహాగుణంబు లెఱుంగ వేఁడి యింద్రుండు శ్యేనం బైన, నగ్ని కపోతం బై శ్యేనభయంబునఁ బఱతెంచి శిబి మఱువు సొచ్చిన, దాని నెగిచికొని వచ్చి శ్యేనంబు శిబి కి ట్లనియె.

ఆ. "నిన్ను సత్య ధర్మనిర్మలుఁ గా విందు
నట్టి నీకుఁ బాడి యయ్య! యిప్పు
డతిబుభుక్షితుండ నై యున్న నాకు నా
హారవిఘ్ను మిట్టు లాచరింప ? 228

వ. సర్వభూతంబులు నాహారంబు ననుజీవించి వర్ధిల్లు; నిదినాకు భక్ష్యంబు గాని నాఁడు బుభుక్షావేదనంజేసి ప్రాణవియోగం బగు; నట్లయిన నా పుత్రులు భార్యయు జీవింప నేర; రొక్క కపోతంబు రక్షించి పెక్కు జీవంబులకు హింస సేయుట ధర్మవిరోధంబు. 229

క, ధర్మజ్ఞు లైన పురుషులు
ధర్మమునకు బాధ సేయు ధర్మము నైనన్
ధర్మముగా మదిఁ దలఁపరు
ధర్మము సర్వంబునకు హితంబుగ వలయున్. 230

వ. ఇక్కపోతంబు నాకు వేదవిహితం బైన యాహారంబు; "శ్యేనాః కపోతాన్ ఖాదయన్తి" యను వేదవచనంబు గలదు; గావున దీని నాహారంబు గా నిమ్మనిన దానికి శిబి యి ట్లనియె. 231

తే. "ప్రాణభయమున వచ్చి యిప్పుడీ నన్ను
నాశ్రయించె; నాశ్రితు నెట్టి యధముఁడయిన
విడువఁ డనినను నే నెట్లు విడుతుఁ దీని ?
నాశ్రితత్యాగ మిది ధర్మువగునె? చెపుమ 232

వ. నీవు పక్షివయ్యును ధర్మ మెఱింగినట్లు పలికితి; శరణాగతపరిత్యాగంబు సేయుటకంటె మిక్కిలి యధర్మం బొం డెద్ది? నీయాఁకలి దీనన కాని యొంట నుపశమింపదే ? నీయత్నం బాహారార్థంబేని యిప్పు డివ్వనంబున మృగమహిషవరాహఖగ మాంసంబులు దీనికంటె మిక్కిలిగాఁ బెట్టెద; నిక్కపోతంబువలని యాగ్రహం బుడుగుము; దీని నే నెట్లును విడువ"నినిన శ్యేనం బిట్లనియె. 233

ఆ. "నాకు విహితభక్షణం బిది; యిప్పుడీఁ
బూని కావ నీకు బుద్ధియేని
యవనినాథ! దీనియంత నీ మాంసంబు
తూఁచి నాకుఁ బెట్టు తొలఁగ కిపుడ.'' 234

చ. అనిన ''ననుగ్రహించితి మహావిహగోత్తమ !" యంచు సంతసం
బున శిబి తక్షణంబ యసిపుత్రిక నాత్మశరీరకర్తనం
బనఘుఁడు సేసి చేసి తనయంగములం గల మాంస మెల్లఁ బె
ట్టినను గపోతభాగమ కడిందిగ డిందుచు నుండె నత్తులన్. 235

క. దానికి నచ్చెరువడి ధర
ణీనాథుఁడు తనువునందు నెత్తురు దొరుఁగం
దాన తుల యెక్కె నంతన్
వానిగుణోన్నతికి మెచ్చి వాసవదహనుల్. 236

వ. శ్యేనకపోతరూపంబులు విడిచి, నిజరూపంబులఁ జూపి, ''నీ ధైర్యశౌర్యాది గుణంబు లనన్యసాధారణంబులు; గావున నీకీర్తి నిత్యంబై శబ్దబ్రహ్మంబు గల యంతకాలంబును వర్తిల్లుచు నుండెడు" మని శిబికి వరం బిచ్చి యింద్రాగ్నులు చని; రిది యమ్మహాపురుషు పుణ్యస్థానంబు; మఱియు ననవరత ఫలవృక్షంబులు గల యిది యౌద్దాలకియైన శ్వేతకేతు తపోవనం; బిందు సరస్వతి మనుష్య స్త్రీరూపధారిణి

నై యె శ్వేతకేతుని సేవించె; మాతులభాగినేయు లైన యష్టావక్ర శ్వేతకేతు లింత యుగ్రతపంబుఁ జేసి'' రనిన నం దష్టావక్రుమాహా త్మ్యంబు విన వలతునని యడిగిన యుధిష్ఠిరునకు రోమశుం డిట్లనియెఁ ''దొల్లి యేకపాదుం డను మునివరుండు తన విద్యావిభవంబున సుజాత యనుదాని వివాహం బై వనంబున ఘోరతపంబు చేయుచు ననవరతంబును శిష్యుల వేదంబులు చదివించుచున్నఁ బెద్దకాలంబునకు సుజాత గర్భిణి యైనఁ దద్గర్భంబున నున్న యర్భకుం డొక్కనాఁడు తండ్రి కిట్లనియె. 237

—: రోమశుఁడు ధర్మజునకు నష్టావక్రు చరితంబు చెప్పుట :—

క. "ఎడబడక యహోరాత్రులు
వడిఁ గొని చదివింప నిట్లు వలయునె? శిష్యుల్
గడు నిద్ర లేమి నెంతయు
జడమతు లై చదువు దప్పఁ జదువుచు నుండన్." 238

వ. అని యుపాలంభించి పలికిన, నలిగి యేకపాదుండు "నీ వధ్యయనం బునకు వక్రంబుగాఁ బలికితివి గావున నెనిమిదివంకలు గల శరీరం బుతో జన్మింపు'' మని కొడుకునకు శాపం బిచ్చిన. 239

ఆ. అగ్నికల్పుఁడై మహాత్ముఁడు కడుపునఁ
బెరుఁగుచుండె; నంత సరసిజాక్షి
ప్రసవకాలమైనఁ బతి కొక్కనాఁ డిట్టు
లనియెఁ బ్రసవభారమునకు వెఱచి. 240

క. ''ధరణిఁ గడుఁ బేదవారును
బురిటికి ఘృతతైలధాన్యములఁ జెచ్చెర ముం
దర సంగ్రహింతు; రవి మన
కరుదుగ నతిదుర్లభంబు లర్థము లేమిన్. 241

వ. ఏమి సేయుదు? నెవ్విధంబున నీ ప్రసవక్లేశంబువలనఁ బాయుదు?'' ననిన నేకపాదుండు ధనార్థియయి జనకరాజుపాలికిఁ జని, వాని యజ్ఞంబునందు వరుణపుత్రుం డైన వందితో వివాదంబు సేసి, యోటువడి, జలమగ్నుం డై యున్న నిట సుజాత ప్రసూతి యై యష్టావక్రుం గనియెఁ; దత్కాలంబున నుద్దాలకు భార్య శ్వేతకేతుం

గనియె; నిట్లు మాతులభాగినేయు లిద్దఱు సవయస్కులై పెరిఁగి పండ్రెండేం డ్లొక్కట నుద్దాలకుతోఁ జదివి, యధ్యయనశూరులై రందు 242

తే. తండ్రి యనుచు నుద్దాలకుఁ, దనకు గరము
ప్రీతితో శ్వేతకేతుని భ్రాత యనుచు
ననఘచరితుఁ డష్టావక్రుఁ డనుదినంబు
నొం డెఱుంగక సుఖలీల నుండునంత. 243

వ. ఒక్కనాఁ డుద్దాలకు కురు వెక్కియున్న యష్టావక్రుం జూచి శ్వేతకేతుండు సహింపక "నీ వేల మాయయ్య కురు వెక్కి యుండె? దీపు వోయి మీయయ్య కురు వెక్కు" మని చేయిపట్టి యీడ్చిన నేడ్చుచుం దల్లికడకుం జని యష్టావక్రుం డి ట్లనియె. 244

క. "మాయయ్య యెవ్వ? రెక్కడఁ
బోయిరి? సెప్పు"మని తెల్లముగ నడిగి తప
శ్శ్రీయుతుఁడు దండ్రికడకుం
బోయెం దనమామ నెయ్యమునఁ దోడ్కొనుచున్. 245

వ. ఇ ట్లష్టావక్రుండు దానును, శ్వేతకేతుండును జనకరాజు యజ్ఞంబునకుం జని యందు దౌవారికనివారితు లై "మూకాంధ బధిర పంగు స్త్రీ బ్రాహ్మణ సుప్రవేశం బగుచున్న యీ రాజద్వారంబున మమ్ము, విద్వాంసుల, బ్రాహ్మణుల నేల వారించి" తనిన దౌవారికుం డి ట్లనియె. 246

క. "అలఘు లగు వృద్ధవిద్వాం
సులకు, మహాయాజ్ఞికులకు, ఘోర నర్హం బై
పిలసిల్లు యజ్ఞసభ సొర
వలవదు; చనుఁ డీరు చిఱుతవారల" ననినన్. 247

క. అలయక యేండ్లు గడుం బె
క్కులు జీవించుట, నగ గలుగుటయుం దగు వృ
ద్ధులలక్షణమే? జ్ఞానము
గలఁ డేనిన్ బాలుఁ డయినఁ గడు వృద్ధు మహిన్. 248

వ. కృతాధ్యయనశీలుం డై యాచారపరుం డైన వాఁడు బాలుం డయ్యును సర్వజన సంభావ నీయుం డగు; బాలు రని మమ్ము నవమానింప వలవ; దేము జనకరాజసదనంబున దర్పితు లైన వేద వాదులతో వాదంబు సేయ సమకట్టి వచ్చినవార" మనిన దౌవారి కుండు వారి నప్పుడు జనకరాజానుమతుండై లబ్ధప్రవేశులం జేసె; నంత. 249

సీ. జనకభూపాలుని సంప్రశ్నముల కెల్ల
నేర్పడ నుత్తరం బిచ్చిఁ, వాని
సభయందు భూసురసంఘమధ్యంబున
వరుణపుత్రుం డైన వందితోడ
వాదంబు చేసి, గర్వంబున నాతని
నోడిచి, తద్విజితు లై యుదధి నున్న
ధరణీసురులఁ దనదండ్రి నిగ్రహ
ముక్తులఁ జేసి, సన్ముకికుమారుఁ
తే. డధిక తేజుఁ డష్టావక్రుఁ డఖిలలోక
పూజితుం డైన జనకుచేఁ బూజ లంది,
యేకపాదుఁ దోడ్కొని పేర్మి నేఁగుదెంచె
బుధనుతుండు నిజాశ్రమంబునకు నొప్ప. 250

వ. అని చెప్పుచు నరిగి "యిది సమంగ యను పుణ్యనది; యిందు భర తుండు రాజ్యాభి షిక్తుఁ డయ్యెఁ, దొల్లి యింద్రుండు లక్ష్మీప్రాప్తుం డై దీని జలోపస్పర్శనంబునఁ బాపవిముక్తుఁడయ్యెఁ; నిది మైనాక కుక్షి; యిం దదితి పుత్రార్థిని యై తపంబు సేసె; నిది ఋషి దైవతం బైన కనఖలనగం; బిది గంగానది; యిందు సనత్కుమా రుండు సిద్ధిం బొందె; నిది యుష్ణగంగ; యిందుఁ గృతస్నాను లైనం గృతార్థు లగుదు; రిది రైభ్యాశ్రమం; బిది భరద్వాజాశ్రమం; బిందు భరద్వాజసుతుండు యవక్రీతుఁడు తపోవిద్యాగర్వంబున నప గతజీవుం డయ్యె" ననిన "నది యె'' ట్లని ధర్మ తనయుం డడిగిన రోమశుం డి ట్లనియె 251

—: రోమశుఁడు ధర్మరాజునకు యవక్రీతుచరిత్రంబు చెప్పుట :—

క. "అలఘులు రైభ్యభరద్వా
జులు దమలో సుహృదులై విశుద్ధతపోని
శ్చలితమతు లివ్వనంబున
నొలసి తపం బొప్పఁ జేయుచుండిరి నెమ్మిన్. 252

వ. అందు రైభ్యుండు కృతాధ్యయనశూరు లైన యర్థావసు పరావసు లను తన యిద్దఱు పుత్రులతో విద్వత్పూజితుం డై యున్న, వానిం జూచి సహింప నోపక భరద్వాజసుతుఁడు, యవక్రీతుండు తపోబలంబున నఖిలవేదశాస్త్రాగమంబులు పడయుదు నని సమిద్ధం బైన యగ్ని యందు సంధార్యంబు సంధించుచు నుగ్రతపంబు సేయుచున్న, దాని సహింపనోపక యింద్రుండు వానియొద్దకు వచ్చి నీవేమి యుద్దేశించి యుగ్రతపంబుఁ జేసెద" వనిన శక్రునకు యవక్రీతుం డి ట్లనియె.

ఆ. "చదువకయును నాకు సర్వవేదంబులు,
సర్వశాస్త్రములును సంభవిల్ల
వలయు నని తలంచి వదలక నిష్ఠతో
నుగ్రతపముఁ జేయుచున్నవాఁడ." 254

వ. అనిన వాని కింద్రుం డి ట్లనియె. 255

క. "గురుముఖమునఁ బడయక దు
ష్కరతపమునఁజేసి వడయఁగాఁబడు విద్యల్
పరమార్థము మదమును మ
త్సరమును గావించు నెట్టి సాధుల కైనన్. 256

వ. ఇది విద్యోపార్జనంబున కుపాయంబు గా" దని వారించి వాసవుఁ డరిగిన నుడుగక యవక్రీతుం డెప్పటియట్ల తపంబుఁ జేయుచున్నఁ, దదీయతపస్సంతప్తమానసుం డై వృద్ధశ్రవుండు వృద్ధ విప్రరూపంబు ధరియించి, యశక్తుం డై శోషించిన శరీరంబుడోడ సికతాముష్టి పరంపర నపారగంభీరగంగా ప్రవాహమునందు సేతుబంధంబు చేయు చున్న, నవ్విప్రుఁ జూచి యవక్రీతుండు నగుచు నిట్లనియె. 257

క. "శతవర్ష వృద్ధుఁడవు, నీ
వతిక్లేశుఁడ, వశక్య మైన యర్థమునం దా
సక్తి రమేల నేసి కడు దు
స్స్థితి వై? తిం కెన్నఁ డిది సమాప్తిం బొందున్?" 258

వ. అనిన విని యింద్రుఁడు వానిం జూచి "యేను నీయట్ల యఘట
మానం బైన యర్థంబునందు యత్నంబుఁ జేసెద"నని నిజరూపంబుఁ
జూపి. "యిట్లు నిరర్థక ప్రయాసం బేల చేసె? దుడుగు'' మనిన "నే
నెట్లు నుడుగ; నా యభిమతంబు సఫలంబు సేయవలయు'' నని యవ
క్రీతుండు శక్రువలన దన యభిమతంబు వడసి, తత్ప్రకారంబుఁ
దండ్రికిం జెప్పిన విని భరద్వాజుఁడు కొడుకు గర్వంబు సహింపక
చేసీత లైన గాథల యర్థంబు వానికి ని ట్లని చెప్పె. 259

సీ. "బాలధి యను ముని ప్రవరుండు పుత్రశో
కాపన్నుఁ డై ఘోర మగుతపంబుఁ
జేసి వేల్పులదయఁ జిరజీవిగాఁ బుత్రుఁ
బడసె మేధావి నాఁ బరఁగు వాని;
వాఁడు నాయుష్యగర్వమున మునీంద్రుల
నెవ్వరి మెచ్చక యేఁగి యొక్క
ధనుషాక్షుఁ డను తపోధనునొద్ద గర్వించి
పలికిన నలిగి, తపస్వి వాని

ఆ. నంతకాంతికమున కరుగంగఁ జేసె; గ
ర్వంబు చెట్ట; యెట్టివారి నైనఁ
గాఁచుఁ దత్క్షణంబ గర్వంబు; గర్వంబు
నొడిచి యున్న వాఁడ యుత్తముండు. 260

వ. కావున నీవు గర్వంబు విడిచి యకోపనుండ వై, పరమశాంతు లైన
రైభ్యకొడుకులతోడ నిర్మత్సరుండ వయి యుండు" మనిన
"నట్ల సేయుదు; నాకు రైభ్యుండు భవత్సమానుండ" యని యవక్రీ
తుండు తన విద్యావిభవంబు ముని సభల విస్తరించుచు నొక్క నాఁడు
రైభ్యాశ్రమంబునకుం జని యందు. 261

ఉ. కోమలకీరషట్పదరణత్కోకిలనాదమనోహరంబు, ను
ద్దామవసంతపుష్ప భరితక్షితిజప్రకరంబు నైన యా
రామమునందుఁ జూచె మునిరాజకుమారుఁడు రైభ్యు కోడలిం,
దామరసాక్షిఁ, గృష్ణ యను దానిఁ, బరావసుభార్యఁ బ్రీతితోన్.

ఆ. దానిఁ జూచి మదన తప్తుఁడై, తన యభి
ప్రాయ మెఱుఁగఁ జెప్పెఁ బంకజాక్షి;
కదియు శాపభీతి నప్పటి కొడఁబడి
నట్లు పలికి వెలుచ నరుగుదెంచి. 263

క. తమ మామకుఁ దద్వృత్తాం
తము నంతను దెలియఁ జెప్పి, తరుణి విలోలా
క్షములందు బాష్పసలిలో
ద్గమముగఁ బల వాంచి యుండెఁ గడుఁ గోపమునన్. 264

వ. రైభ్యుండు నయ్యవక్రీతున కలిగి నిజకోపానలశిఖాయమానైక జటావలంబనకరుం డై హుతాశనునందు వేల్చి యయ్యగ్నికుండంబు నందు. 265

క. లలితాంగిఁ బడసెఁ దన కో
డలిరూపముకంటెఁ గడు బెడంగగు రూపో
జ్జ్వలకాంతి గలుగుదానిం
బోలఁతుక నొక్కరుం దతితపోవీర్యమునన్. 266

వ. మఱియు నొక్క జట యపలంబించి వేల్చిన నందు వికృతదంష్ట్రాకరాళం బైన ముఖంబుతో శూలహస్తుం డైన యొక్క రాక్షసుండు పుట్టె; నయ్యిద్దఱు ముకుళీకృతహస్తు లై "మాకుం బని యేమి ?" యని యడిగిన "సఖనీతుం డైన యవక్రీతు వధియింపుం" డని పంచిన. 267

క. ఆ తరుణి మున్ను చని మద
నాతురుఁ డై వికృతచిత్తుఁ డై యున్నయవ
క్రీతు కరకమండలువుం
బ్రీతిఁ బ్రబోధించి కొనియె బెడఁగుగ నంతన్. 268

క. అపహృతకమండలుం డై
యపవిత్రుం డగుటఁ జేసి యధికతపోవీ
ర్యపరిక్షయ మగుడును నా
తపస్విసుతు రాక్షసుండు దడయక చాఁకెన్. 269

వ. వానికి వెఱచి పఱచి యవక్రీతుండు మహానదులు, గొలంకులు సొచ్చిన
నవి శుష్కంబు లైనఁ దన జనకు నగ్నిహోత్రంబుఁ జొచ్చునంత.

ఆ. మునికుమారు నెగిచికొని వచ్చి విశితశూ
లాయుధమునఁ బొడిచి, యాసురమున
రక్కసుండు చంపి యక్కాంతయును దాను
నరిగె రైభ్యుకడకు నాక్షణంబ. 271

వ. రైభ్యుండును వానికి భార్యగాఁ గృత్తి నిచ్చె; నంత నిట భరద్వా
జుండు వనంబున నుండి వచ్చి, తన కెప్పుడుం బ్రత్యుత్థానంబుఁ
జేయు నగ్ను లప్పు డడంగియున్న నచ్చెరువడి, గృహపాలకుం డైన
శూద్రువలన నంతవృత్తాంతం బెఱింగి, నిహతుం డైన పుత్రుం జూచి
దుఃఖితుం డై. 272

ఆ. రైభ్యుఁ డధికకోపరతుఁ డంటి; నమ్ముని
యాశ్రమంబుదెసకు నరుగ వలవ
దంటి; వినఁగ నొల్ల వైతి నా పలుకులు;
గర్వితునకు బుద్ధి గాన నగునె?" 273

వ. అని ప్రలాపించుచు భరద్వాజుండు వాని దహించి, పుత్రశోకదహనంబు
సహింపనోపక తద్దహనంబున దేహత్యాగంబుఁ జేసె; నంత బృహ
ద్ద్యుమ్నుం డను రాజు సత్రయాగంబుఁ జేయుచుండి రైభ్యుపుత్రుల
నర్థావసు పరావసులం దనకు ఋత్విజులంగా వరియించిన నయ్యిరు
వురుఁ దండ్రిచే ననుజ్ఞాతు లై వానియజ్ఞంబు నడుపుచుండి, యొక్క
నాఁడు పరావసుండు నిజాశ్రమంబునకు వచ్చువాఁడు వేగుఁబోక
చీఁకటి నడవిలో నేకతంబ తనకు నెదురుగా వచ్చు రైభ్యు నెఱుంగక,
మృగంబ కా వగచి, నిజప్రాణభయంబున వధియించి, పదంపడి
యెఱింగి, పరమదుఃఖితుండై ప్రేతకార్యంబులు దీర్చి, బృహద్ద్యుమ్ను

సత్త్రంబునకు వచ్చి, తన చేసిన పితృఘాతం బగ్రజునకుం జెప్పి యి ట్లనియె. 274

తే. "నీవు దీని నొక్కరుఁడవు నిర్వహింప
నోప; వే నొక్కరుండ నయ్యును గడంగి
నడప నోపుదుఁ; గావున నాతదర్థ
మాచరింపుము బ్రహ్మహత్యావ్రతంబు." 275

వ. అనిన నర్థావసుం డట్లు సేయుదు నని బ్రహ్మహత్యావ్రతంబులు సలుపుచుండెఁ; బరావసుండును నొక్కరుండ సత్త్రయాగంబు జరుపుచుండె; నంత నర్థావసుండు బ్రహ్మహత్యాప్రాయశ్చిత్తంబులఁ జేసి యా సత్త్రయాగంబునకు వచ్చిన వానిం జూచి పరావసుండు బృహద్ద్యుమ్నున కి ట్లనియె. 276

క. "ఇమ్ముని నీయజ్ఞాయత
నమ్మునఁ బ్రవేశింపఁ దగఁడు; నరనాయక! యు
గ్రమ్ముగ సలిపెడు శుభకా
ర్యమ్ములకుం బాసి బ్రహ్మహత్యావ్రతముల్." 277

వ. అనవుడు బృహద్ద్యుమ్నప్రేరితు లయిన జనులచేత నుత్సార్యమాణుం డయి యర్థావసుం డనియెఁ "బరావసుండు గాని యేను బ్రహ్మఘాతకుండఁ గాను; వానికై వ్రతంబు సలిపి తత్పాతకవిముక్తుఁ జేసితి" నని చెప్పిన యర్థావసు యథార్థకథనంబునకు మెచ్చి యగ్నిపురోగము లైన దేవతలు వాని కిట్లనిరి. 278

—: దేవత లర్థావసునకు మెచ్చి కోరిన వరంబు లెల్ల నిచ్చుట :—

తే. "తమ్ముచేసిన దురితముల్ తలఁగఁ బూని
ధర్మబుద్ధి వై వ్రతములు పేర్మిఁ జలిపి
తనఘ! నీకు నభీష్టంబు లైన వరము
లడుగు మిచ్చెద; మీ మెచ్చు గడవఁదగునె?" 279

వ. అనినఁ దన తండ్రియు, భరద్వాజుండును, యవక్రీతుండు నెప్పటి యట్ల జీవించి యుండను, నిజజనకుండు పరావసుచేత నిహతుం

డగుట విస్మరింపను వలయు" నని ప్రార్థించి దేవతలవరంబున నర్వా
వసుండు రైభ్య భరద్వాజయవక్రీతుల సంజీవితులం జేసిన, నద్దేవతలకు
యవక్రీతుం డిట్లనియె. 230

తే. "ఏను బహువేదశాస్త్రమ్ము లెఱిఁగి వ్రతము
ఎల్లఁ జేయుచు రైభ్యుచే నిట్లు హతుఁడ
నైతి; నా కంటె రైభ్యున కధికశక్తి
యైన తెఱఁ గెట్టు" లనిన ని ట్లనిరి సురలు. 231

క. "గురుశుశ్రూష యొనర్చుచుఁ
బరమక్లేశమునఁ జేసి పడసిన విద్యల్
స్ఫురియించుఁగాక; గురుముఖ
విరహితముగఁ బడసినవియు వెలయునె యెందున్? 232

వ. నీవు గురుముఖంబునం బడయక యొండు విధంబునం బడయుటం
జేసి నీ యధ్యయన శ్రుతంబులు నిర్వీర్యంబు లయ్యె; గురు సంతోష
కరుం డై రైభ్యుండు బ్రహ్మజ్ఞానం బుపార్జించెం; గావున నాతం
డిట్టి శక్తి వడసె" నని దేవతలు దివంబున కరిగి; రిది యవక్రీతు
నివాసం; బిందు వసియించినవారు దురితవిముక్తు లగుదు; రిది
కాల శైలం; బిది సప్తవిధం బైన గంగ; యిది మనుష్యుల కగో
చరం, బందయుండి సమాధిశౌచప్రయత్నపరు లై చూడుం; డిది
మందరనగం; బిందు నానా ప్రహరణ పాణు లై యష్టాశీతిసహస్ర
గంధర్వులు. కిన్నరకింపురుషసుపర్వులు సురేంద్రుం గొలిచి పోయెద;
రిందుల కాఱుమూఁడు యోజనంబులు గలదు కైలాసపర్వతం;
బందుఁ గుబేరుం డుండు" నని రోమశుండు సెప్పినం బాండవులు
కృతసమాధి శీలురై వాని నెల్లంజూచి; రంత నంతకసుతుండు భీముని
కిట్లనియె. 233

సీ. "దుర్గమం బైన యీ దుర్గమార్గంబున
నడవంగ నేర; మున్నత రథముల,
నింద్రసేనాదుల, నీ ధౌమ్యవిప్రుల,
ద్రుపదతనూజను దోడికొనుచు

సహదేవుఁడును నీవుఁ జట్టనఁ గ్రమ్మఱుఁ;
దేనును, నకులుఁడు నేఁగి రోమ
శాదేశమునఁ జేసి యఖిలతీర్థంబులు
నాడివచ్చెదము; మా యరుగుదెంచు

ఆ. నంత కెంతయును బ్రయత్నంబుతోఁ గృష్ణఁ
గాచియుండుఁ" డనిన ఘనుఁడు భీముఁ
డనియె "నిట్టి రాక్షసాకీర్ణవనములో
నిన్నుఁ బాయ నగునె నిమిషమేని? 284

చ. అనఘచరిత్రు, నర్జును, మహాభుజు నొక్కనిఁ బాసి వంతఁ బొం
దినయెడ, నిట్టిచోట సహదేవుఁడు, నేనును, గృష్ణయున్ జగ
జ్జనుత! నిన్నుఁ బాసిన ననహ్యతరం బగు తీవ్ర తాపవే
దన యగు నీకు మాకు, నుచితంబె పరస్పరభేద మెన్నఁడున్ ? 285

క. కడు డస్సి నడవ నోపని
యెడ నీ కమలాయతాక్షి, సకవలను నే
దడయక నఱకట నిడికొని
కడఁకం గొనివత్తు విషమగహనాంతములన్. 286

వ. ఈ రథంబులతోఁ బోవ నిమ్మగాదేని వీని నింద్రసేనాదుల కెందేనిం
బెట్టి పోదమనిన రోమశుం డి ట్లనియె. 287

క. "అతులతపోవీర్యబలో
న్నతిఁ బోదము గంధమాదనంబునకు; సమా
గతు నందుఁ గాంతు మర్జును,
నతివీరు, నుదారు, సురగణార్చితుఁ, బార్థున్". 288

వ. అనిన నందఱు సంతసిల్లి యరుగువారు ముందర ననేకపహయరథ
సనాథం బై, యపారకిరాతబలసంకులం బైన దానిఁ, బుళిందాధిపతి
యైన సుబాహుపురంబుఁ గని యందు వానిచేతం బూజితు లై తమ
రథసూతహయనివహంబుల నింద్రసేనాదిభృత్యులను సుబాహు
నొద్దం బెట్టి పాదచారు లై పాంచాలిని, బ్రాహ్మణులను గఱించి
కొని, గంధమాదనంబున కభిముఖు లై యరగి; రంత ధర్మతన
యుండు భీమునికి ట్లనియె. 289

సీ. "అలిగి వజ్రాయుధు నైనను బోరిలో
నోర్వంగ నోపు నత్యుగ్రశీరు,
జవమునఁ బవనుఁ, దేజంబున నాదిత్యుఁ
బోలినవాని, నంభోజనేత్రు,
నాయతబాహుఁ. గృతాస్త్రు, సింహస్కంధు,
సర్వధనుర్ధరాచార్యు, విజయు,
నిత్యధర్మాన్వితు, నీతమ్ముఁ, నర్జును
శుభగుణసుందరుఁ జూచునంత

ఆ. కధికతాపతప్త మైనది నాచిత్త;
మొనర నతనితోడ నొక్క టునికి
యెన్నఁ డొక్కొ మనకు నిందఱ కగు! నాతఁ
డేల మసలెనొక్కొ యిన్ని యేండ్లు ?" 290

మ. అనుచుం బార్థవిలోకనంబు మదిలో నర్థింపఁగా ధర్మజుం
డనవద్యుల్ గడు వేడ్కతో నరిగి తా రప్పాండవుల్ గంధమా
దనశైలేంద్రముఁ గాంచి రున్నతబృహద్ధాతుస్థలీసంహతిన్
ఘనసంధ్యాగమశంక సన్మునులకుం గావించుదానిన్ మహిన్. 291

క. నానావర్ణశిలావిహ
గానేకమృగాభిరామ మై, భూనారీ
నానాభరణవిభూషిత
పీనోన్నత కుచముఁ బోలె వెలిఁగెడుదానిన్. 292

—: పాండవులు గంధమాదనపర్వతంబునకుం బోవుట :—

క. లలితాచ్ఛస్ఫటికశిలా
తలములపైఁ బాఱు విమలతరనిర్ఝరిణీ
జలపూరము లను తారో
ల్లలదురుహారాలి నుజ్జ్వలం బగుదానిన్. 293

ఉ. వారలు గంధమాదన మవార్యబలాఢ్యులు సొచ్చుచో మహా
మారుత మప్డు వీచె నహిమద్యుతిమార్గము, దిఙ్ముఖంబులన్
భూరుహపత్రమిశ్ర మయి భూరిపరాగము గప్పఁగా ధరి
త్రీరుహ శాఖలున్ విఱిగి త్రెళ్ళఁగ, గుల్మలతాలి సొల్పడన్. 294

చ. కడు వడి గాడ్పుచే విఱుఁగఁగాఁ బడి త్రెళ్ళు మహీరుహాళి చ
ప్పుడు విని యందఱుం బెదరి భూమిపయిన్ గగనం బుదగ్రతం
బడియెనొ, శైలశృంగములు భగ్నము లయ్యెనొ, యంచు ధూళి నె
క్కుడఁ జన నేర కొండొరులఁ గానక యుండిరి సంచలాత్ములై. 295

వ. ఇట్లు మహారేణుపటలం బంధకారంబునుంబోలె నీరంధ్రంబై కప్పినఁ, బతిత తరువిటప లతాగుల్మంబులు కరతలంబులం బాయం ద్రోచుచు, విశాల దృఢతరుమూలంబు లాశ్రయించి, యగ్నిహోత్రంబులతో ధౌమ్యధర్మజసహదేవు లొక్కచోట, నుద్యద్గదాకార్ముకుండైన భీమసేనుండును ద్రౌపదియు నొక్కచోట రోమశుండును, నకులుండును, బ్రాహ్మణులు నొక్కచోటనుగా నందఱు వేఱువేఱ యుండి; రంత. 296

చ. కురిసెఁ బ్రచండవృష్టి; ఘనఘోషము లెల్ల కెలంకులన్ భయం
కరములు గాఁ గరాళ కరకాతతు లొప్ప, దటిల్లతాళి వి
స్ఫురితముగాఁ, బ్రపూర్ణ జలపూరములన్ గిరికుంజభూరిని
ర్ఝరతటినీ విశాలకటసాలచయంబు విమూలితంబుగన్. 297

వ. అట్లు గాడ్పుతోడివాన పెద్దయుంబ్రొద్దు కురిసి యుడిగిన నందఱు నొక్కచోటికివచ్చి యెప్పటియట్ల యరుగునెడ, నతివిషమశిలాసంకట పథంబున నడవనేరక ద్రౌపది దొడరి పడి మూర్ఛిత యైనం, బవనతనయుం డక్కోమలి నెత్తికొని యజినాస్తరణంబుపయిం బెట్టి కదళీదళంబుల వీచుచున్నం, గవలు దాని పల్లవ తామ్రపాదతలంబు లాయుధాభ్యాసవశంబునం గిణీభూతంబు లయిన తమ కరతలంబులం జేసి మెత్తన యొత్తుచుండి; రట్టి యవసరంబున ద్రౌపదిం జూచి దుఃఖితుండయి ధర్మతనయుం డిట్లనియె. 298

అక్కర. "అరుణసరోరుహదళమృదువులైన యిత్తన్వి రమ్య
చరణతలంబులు గొడిగరాలపైఁ జనుచున్కిఁ జేసి
పరుసంబులై, కడు నెఱ్ఱనైనవి; పద్మాయతాక్షి
పరఁగ నాకారణంబునను నీ దుఃఖభారంబు దాల్చె. 299

సీ. సముచితంబగు మృదుశయనతలంబున
శయనించు నిత్తన్వి సదమలాంగి
వరుసంపుటూలపైఁ బడి తీవ్రవేదనఁ
బొందినయది; "మహాపురుషు లైన
పాండవులకుఁ బ్రియభార్య యై, నా పుత్రి
సుఖ ముండు'' నని మది సోమకుండు
పాయక సంతోషపడి యుండుఁగా కున్నె''
యని విలాపించు నయ్యమతనూజు

ఆ. నుచితవచనరచన నూరార్చి రప్పుడు
ధౌమ్యుఁడొట్టి సకలధరణిసురులు;
మూర్ఛ దేఱె నంత ముదిత ద్రౌపది శీత
మందపవనసేవ్యమాన యగుచు 300

వ. అంత దాని నాశ్వాసించి ధర్మరాజు భీమున కి ట్లనియె. 301

క. ''ఈ రాజపుత్త్రిఁ దోడ్కొని
దారుణపాషాణ దుష్పథంబులఁ జనఁగా
నేర; మిది నడువ నోపదు;
భూరిభుజా !'' యనిన ననిలపుత్త్రుం డంతన్. 302

క. అగ్రజు ననుమతమున న
త్యుగ్రనిశాచరసమేతు, నుడుమార్గగు, వీ
రాగ్రణి, ఘటోత్కచుం దన
యగ్రసుతుం దలఁచె ధీరు హైడింబేయున్. 303

క. అతఁడును రాక్షససైన్యా
న్వితుఁ డై తత్క్షణము వచ్చి నిర్జరవరస
మ్మితులకుఁ బ్రణమిల్లెం దన
పితృవరులకుఁ బ్రాహ్మణులకుఁ బెద్దయు భక్తిన్. 304

వ. ఇట్లు మ్రొక్కి "పని యే'' మని ముకుళితహస్తుండయి తన ముందర
నున్న కొడుకుఁ గౌఁగిలించుకొని భీముఁడు వాని కి ట్లనియె. 305

తే. "అబల యిది భవన్మాత నిత్యాధ్వగమన
ఖిన్నయైనది గజరాజ ఖేలగమన;
దీని నీ వెత్తికొని చనుదెమ్ము మా స
మీపమున" నని సుతు నియమించె నపుడు. 306

వ. వాఁడును బితృవచనచోదితుం డయి "యిమ్మార్గం బతిపరుషశిలా విషమంబు; పాదచారుల కగమ్యంబు, గావున మిమ్మిందఱ నెత్తికొని యాశ్రమంబున నరిగెద నని ధౌమ్యపాండవద్రౌపదులం దా నెత్తుకొని, బ్రాహ్మణుల నెత్తికొనం దన రాక్షస బలంబులం బంచె; రోమశుండు సిద్ధగతి నరిగె; నిట్లందఱు గగనమార్గంబునం జని గంగా తీరంబున నరనారాయణాశ్రమం బైన బదరీవనంబుఁ గని రాక్షస స్కంధావతీర్ణు లై యందు. 307

క. లలితమధుస్రవ ఫలములు
విలసితమృదుపత్రతతులు, వృత్తస్కంధం
బులు, నవిచలితచ్ఛాయలు
గల బదరీతరులఁ జూచి కడు విస్మితు లై. 308

వ. సురసిద్ధమునిసేవితం బయిన భాగీరథిం జూచి యందుఁ గృతస్నాను లయి, నియమవ్రతంబులు సలుపుచు సమాధియోగంబున మైనాక శైలంబును, హిరణ్యశృంగంబునుఁ బిందుసరస్సునుం జూచి, బదరీ వనంబునం దాఱుదివసంబులు నివాసంబు సేసి యుండునంత నొక్క నాఁడు. 309

చ. అలఘులు గంధమాదనమహాధరణీధరసానురత్న వే
దులఁ, బవమాన నందనుఁడు, ద్రోవదియున్ విహరించుచున్న చో,
లలితసహస్రపత్రకమలంబు సమీరవిధూత మై మహీ
తలమువయిఁ బడిం బడియెఁ దద్దయుఁ బొల్పుగ వారిముందటన్.

వ. ఆ సౌగంధికకమలంబుఁ జూచి, దాని యపూర్వరమణీయత్వంబునకు, ననన్యకుసుమ సాధారణం బయిన సౌరభ్యంబునకు నోటువడి, ద్రుపద రాజపుత్రి ముదితచిత్తయై "యక్కటా! యిది యొక్క పుష్ప యయ్యు నపూర్వం బై మనోనయనానందకరం బైనది; యిట్టి

కుసుమంబులు కడుం బెక్కులు గావలవదె ? యవి కురంగటం గల వేని తెచ్చి యిచ్చి నాకు మనఃప్రియంబుఁ జేయు'' మని యప్పుడ యప్పువ్వు ధర్మరాజు కడకుం గొనిపోయె; నిట భీముండు దాని యభిమతంబుఁ జేయం గడంగి రుక్మపృష్ఠం బైన ధనుశ్శ్రేష్ఠంబును, నాశీవిషోపమానంబు లైన బాణంబులు ధరియించి యక్కమలంబు దెచ్చిన గాడ్పున కభిముఖుం డయి గంధమాదనంబున వివిధరత్న బంధురకందరకదళీషండదర్శనంబులను, మందారమందిరసుగంధిగంధ వహాస్పర్శనంబులను, నలికులకోకిలాలాపశ్రవణంబులను, సర్వర్తు కుసుమసురుచిరగంధాఘ్రాణంబులను, నతిమధురఫలాస్వాదనంబులను బద్ధప్రమోదహృదయుం డగుచుఁ దన కెదిరి వచ్చు మృగంబులం దాఁకి, గజంబు నెత్తి గజంబుపై వైచుచు, సింహంబు నెత్తి సింహంబుపై వైచుచు, నల్పమృగంబులం గరతల ప్రహారంబులం బ్రహరించుచు. 311

—: భీముఁడు సౌగంధికహరణార్థంబు పోవుట :—

సీ. గమనవేగంబున ద్రుమలతాజాలసం
చాలన సేయుచు, శైలగుహల
నడఁగి యదృశ్యులై కడువేడ్కతోఁ దన్నుఁ
జూచు ఖేచరసిద్ధసురభుజంగ
గరుడగంధర్వకిన్నరకామినులచేత
మానుగా నభివీక్ష్యమాణుఁ డగుచు,
మ్రాఁకులు విఱుచుచు, వీఁకతో దీవలఁ
బెఱుకుచుఁ, బదహతిఁ బృథునగేంద్ర
ఆ. మద్రువ నున్నతంబు లయినెడ లెక్కుచు,
మదగజంబువోలె మధ్యముండు
పవన వైనతేయపటుజవయుక్తుఁ డై
యరిగె గంధమాదనాంతరమున. 312

వ. ఇట్లరుగువాఁడు నిజసింహనాదశ్రవణపరిత్రస్తంబు లై యెగసి పఱచు పక్షుల యార్ద్రపక్షంబులఁ జూచి, ముందట నాసన్నంబునం గొలను కలుగవలయు నని యుపలక్షించి, యతిత్వరితగతిం జని

చని, పవనవశ సంచలిత తట మహావన తమాల తాల హింతాల విశాలకదళీదళ వీజ్యమాన శీతలజలపరిపూర్ణం బైన యొక్క సరోవరంబునఁ గని, యందుఁ గృతావగాహుం డై, నవనలినదళమృణాల వలయా లంకృతుం డగుచు దాని వెలువడి యనేక యోజనవిస్తారాయామరమణీయం బైన కదళీషండంబుఁ జొచ్చి యందు శంఖ ధ్మానంబుఁ జేసిన. 313

క. ఆ శంఖరవంబు మహో
ద్రాశనినిర్ఘోషభీమ మై దిక్కులు నా
కాశంబు నిండె; నంత గు
హాశయుఁ డై యున్న హనుమ యను కపి పెలుచన్. 314

క. దాని విని బెదరి లేచి "మ
హానాదం బిది మనఃప్రియం బయ్యె మదీ
యానుజు శంఖధ్మానము
దానగు" నని యెఱిఁగి హృష్టతనురుహుఁ డగుచున్. 315

వ. భీమునకు మార్గనిరోధంబుగా మహావృక్షంబు లురులం ద్రోచి యేకాయనపథంబున కడ్డంబ శయనించి, లాంగూలలీలాచాలనంబుఁ జేసిన.

క. గోలాంగూలోత్తము లాం
గూలస్ఫోటనరవంబు ఘోరం బై వా
చాలతఁ జేసె నశేషమృ
గాలి భయం బంద గిరిగుహాంతర మురులన్. 317

వ. అయ్యపూర్వధ్వని విని భీముండు విస్మితుం డయి చని కదళీషండ మధ్యంబున నొక్క విశాలశిలాతలంబుపయి శయనించినవాని.

సీ. హ్రస్వపీన గ్రీవు, నచలితాయతహను,
నతిచపలస్వభావాభిరాముఁ,
దనుమధ్యకటిచక్రు, దహనకణాకార
తామ్రోష్ఠు, నతికృశదళనకరజుఁ,

బృథులవిద్యుత్పుంజపింగాక్షు, నుత్తుంగ
దృఢవక్షు, నాజానుదీర్ఘ బాహు,
నూర్ధ్వలాంగూల మత్యున్నతధ్వజలీలఁ
గ్రాలుచు నుండ నేకాంతయోగ

ఆ. నిద్ర నున్న ధర్మనిర్మలు, హనుమంతుఁ
జూచి పాండురాజసుతుఁడు వాని
నిద్రఁ దెలుపఁ గడఁగి నిజసత్త్వ మేర్పడ
సింహనాద మొప్పఁ జేసె డాసి. 319

వ. హనుమంతుఁడును మెల్ల మెల్లన మేల్కాని జృంభసంభృతజలార్ద్ర సంచలవిలోచనుం డగుచు ననాదరంబున నాతనిం జూచి యిట్లనియె.

తే. " అతిజరారోగభరమున నలసి యొలసి
యొదిఁగి సుఖనిద్రమై నిట్టు లున్నవానిఁ
గడుమదంబున నేమియుఁ గరుణలేక
యేల బోధించితయ్య! నీ వెఱిఁగి యెఱిఁగి? 321

వ. తర్యగ్జాతులు ధర్మ మెఱుంగవుగాక; సర్వభూతదయాస్వరూపం బైన ధర్మ మెఱింగెడువాడు మనుష్యులుకారె? యిట్టి మనుష్య జన్మంబు వడసి వృద్ధోపసేవ సేయవుగా కేమి; ధర్మ మెఱుంగక నిర్దయుండవై మాబోఁటి పేదమృగంబులకు భయంబుగ గర్జిలితి; వీ వెవ్వండవు ? మనుష్య గోచరంబుగాని యివ్వనంబున కేల వచ్చితి? సిద్ధగతి లేనివారి కిట వోవ నశక్యం; బమృతకల్పంబు లైన యీఫల మూలంబు లుపయోగించి క్రమ్మఱుము; నీయందు బద్ధస్నేహుండఁ గాన బుద్ధి సెప్పితి; నా పలుకులు చేకొను" మనిన భీముం డి ట్లనియె.

తే. "క్షత్త్రియప్రవరుండ, విఖ్యాతబలుండఁ,
బాండుతనయుండ, గొంతిగర్భంబునందు
వాయువరమునఁ బుట్టినవాఁడ నన్ను
భీముఁ డండ్రు భూజనులు కపిప్రముఖుండ! 323

వ. ఏ నిక్కడఁ గార్యార్థినై పోయెద; నాకుం దెరు వి; మ్మనినాఁడు దొల్లి శతయోజనవిస్తారంబయిన సముద్రంబు లంఘించి లంకకు బోయిన హనుమంతునట్ల నిన్ను, నీ పర్వతంబు లంఘించి పోదు'' ననిన హనుమంతుఁ ''డతం డేమి కారణంబున సముద్ర లంఘనంబుఁ జేసె? నెఱుంగు దేనిం జెప్పు'' మనిన వానికి భీముం డిట్లనియె. 324

క. ''అలఘుం డిక్ష్వాకు మహా
కుల వీరుఁడు రాఘవుండు గురువచనంబున్
సలుప వనవాసి యై తన
లలనం గోల్పడియె నట్టె లంకేశ్వరుచేన్. 325

క. సీతాన్వేషణపరు లై
నీతిఁ గపి ప్రవరు లరిగి నియతంబుగ సం
పాతియను పక్షిచేత మ
హీతనయసువార్త లెల్ల నెఱిఁగి కడంకన్. 326

క. వారలు వారిధి గడవఁగ
నేరక తా రున్న యెడ ననిలసత్త్వమునన్
వారిధి లంఘించె మహా
వీరుఁడు హనుమంతుఁ డనఁగ విందుఁ గపీంద్రా! 327

వ. ఏను హనుమంతునంతియ బలపరాక్రమంబులు గలవాఁడ; నా పౌరుషంబుఁ జూపుదునే?'' యనిన నవ్యక్తహాసముఖుం డగుచు ''నన్నా! యేను ముదిసినవాఁడ; లేవనోపం; బోయెద వేని నా తోఁకం బాయం ద్రోచి పొ'' మ్మనిన మెచ్చక తన వామకరంబున నెత్తం బోయి వశంబుగాక. 328

ఉ. ఏపున రెండుచేతులను నిమ్ముగఁ బట్టి యమర్చి యెత్తఁగా
నోపక మొగ్గతిల్లఁబడి యుద్గతఘర్మజలార్ద్రదేహుఁడై,
కాపురుషుండుఁబోలె నిజగర్వము దక్కి యడంగి యుండెఁ, జిం
తాపరుఁ డై వృకోదరుఁడు దద్దయు లజ్జ నధోముఖంబుతోన్. 329

వ. ఇట్లక్కపివరు లాంగూలంబుఁ గదల్ప నోపక భీముండు కృతప్రణాముం డయి ''ని న్నెఱుంగక నా పలికిన దురుక్తంబులు సహింపవలయు;

నీవు కపిరూపధరుండవైన సిద్ధుండవో, గంధర్వుండవో, దేవవరుండవో?
నా కెఱింగింపు" మనిన హనుమంతుండు భీముం జూచి నగుచు,
"నేను గేసరిక్షేత్రంబున వాయుభట్టారకునకుం బుట్టినవాఁడ; నీ
చెప్పిన హనుమంతుఁడ; నీవు నాయనుజుండవు; దొల్లి రఘుకులేశ్వరుం
డయిన రామదేవుండు రావణుం డను రాక్షసుచేత నపహృతభార్యుం
డై సుగ్రీవాది వానరుల నసంఖ్యాత సంఖ్యులవారిం దనకు సహా
యులం జేసికొని, సేతుబంధనంబున సముద్రంబు లంఘించి, సమ
రంబున రావణు వధియించి, యందు నాకెలసబునకు మెచ్చి.

మధ్యాక్కర "నర సుర స్తుత్యమై యెంతకాలంబు నా కీర్తి నిలుచు,
నిరతంబుగా నంతకాలమున్ నీవు నిత్యుండ వగుచుఁ
బరఁగు"మనివరముఁ దగ దయంజేసి ప్రభుఁ డుర్వి యెల్ల
నరి పదునొక్కండువేల యేం డ్లేలి చనియెఁ దా దివికి."

వ. అనిన విని భీముండు వాని నప్పుడు హనుమంతుంగా నెఱింగి సంత
సిల్లి, వెండియు నమస్కరించి, "భవద్దర్శనంబునం గృతార్థుండ నయితి"
నని యిట్లనియె. 332

ఆ. "బలిముఖుండ, దయయుఁ గలవేని దొల్లి య
ర్ణవము గడచి చనిన నాఁటి నీదు
రూపుఁ జూడ వలతుఁ; జూపు నా" కనవుడు
వాని కిట్టు లనియె వానరుండు. 333

క. "అక్కాలంబునరూపం
బిక్కాలమునందుఁ జూప నెట్లగుఁ? గాలం
బొక్కవిధంబున నుండక,
పెక్కు ప్రకారముల నుండు భిన్నావస్థన్. 334

వ. దానంజేసి కృత త్రేతా ద్వాపర కలియుగంబుల సంఖ్యలు వేలువేలు
లై, యందుల చరాచరభూతంబులు భిన్నప్రకారంబు లై వర్తిల్లు"
ననిన "నయ్యేయుగంబుల యాచార ప్రవర్తనంబులు నా కేర్పడం
జెప్పు" మనిన భీమునకు హనుమంతుం డిట్లనియె.

—: భీమునకు హనుమంతుండు చతుర్యుగాచారవర్తనంబులను దెలుపుట :—

తే. "కృతముకాని కర్తవ్యంబు గృతయుగంబు
నందు లేదు; చతుష్పాద మగుచు ధర్మ
మనఘ! వర్తిల్లు; నచ్యుతు డయ్యుగమున
శుక్లవర్ణుఁడై ప్రజలఁ గాచుచు వెలుంగు. 336

వ. అది సనాతనధర్మసనాథం; బందుల బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్రు లేక వేద క్రియాయోగ్యులై, యకామఫలసంయోగంబునఁ బుణ్య లోకంబులు వడయుదు; రందు ననూయాభిచార దర్ప పైశున విగ్రహ క్రోధ మద మత్సర భయ సంతాపవ్యాధి ప్రజాక్షయేంద్రి యక్షయంబులు లేవు; మఱియుఁ ద్రేతాయుగంబునందుఁ ద్రి పాదం బై ధర్మువు వర్తిల్లు; నందు జనులు నిత్యసత్య వ్రతశీలురై, యజ్ఞ తపోదానాదిక్రియల వర్తింతు; రందు రక్తవర్ణుండయి విష్ణుభట్టార కుండు ప్రజాభరణంబుఁ జేయు. 337

తే. ద్వాపరంబున రెండుపాదములఁ జేసి
నడచు ధర్మువు; వేదముల్ నాల్గుదెఱఁగు
లై ప్రవర్తిల్లు; వేదశాస్త్రార్థచోది
తంబు లై ధర్మకామముల్ ధరణిఁ బరఁగు. 338

తే. సత్యశమహీను లగుదురు జనులు; గామ
కాములై చేయుదురు బహు క్రతువు లోలి;
నందుఁ ద్రైలోక్యవందితుం డచ్యుతుండు
కృష్ణవర్ణుఁడై జగము రక్షించు మఱియు. 339

క. కలియుగమునందు ధర్మము
బల మఱి వర్తిల్లు నేకపాదంబున; నం
దలఘుఁడు కృష్ణుఁడు జగతీ
వలయము రక్షించుఁ బీతవర్ణుం డగుచున్. 340

వ. అందుల జనులు తమోగుణయుక్తులై, కామక్రోధాదిదోషవశంబునం ధర్మ వెలుంగక యధర్మవర్తు లగుదు; రందుఁ జేసిన తపోదానాది కర్మంబులు స్వల్పంబులయ్యును బహుఫలంబు లగు"నని యుగవర్తన

ప్రకారంబులఁ జెప్పి "నీ కిష్టావాప్తి యయ్యెడు, మరుగు" మనిన భీముండిట్లనియె 341

—: హనుమంతుఁడు భీమునకుఁ దన పూర్వరూపంబుఁ జూపుట :—

క. "నీ నాఁటితనువుఁ జూచియ
కాని యవశ్యంబు పోవఁ; గావునఁ గపినా
థా! నాకుఁ జూపు" మనవుడు
వానికిఁ దనరూపుఁ జూపె వానరుఁ డంతన్. 342

చ. అతులితమై, ద్వితీయకనకాద్రి యొకో యిది నా, నిజాంగ మూ
ర్జితముగఁ బెంచి, పుచ్ఛమునఁజేసి దిగంతము లందు చున్న యు
న్నతుఁ, గపినాథుఁ జూచి కురునందనుఁ డప్డు నిమీలితాక్షుఁడై
మతి నతివిస్మితుం డగుచు మారుతి కిట్లనియెన్ భయంబునన్. 343

క. "అతిభీషణ మిది యత్య
ద్భుత; మోహో! చాలు, భూనభోమధ్యవ్యా
పితనుయ్యె; భవద్దేహో
యతత్వ ముపసంహరింపు'' మనవుడుఁ గపియున్. 344

క. తన యెప్పటి రూపముఁ జే
కొని, ''దీనికి నినుమడుం గగుం బ్రీతిబలముం
గనినప్పుడు నాకూపం
బనుపమముగ'' ననిన హనుమ కనిలజుఁ డనియెన్. 345

ఉ. ఉన్నతిఁ బూని నీవు బలియుం డగు రావణు నశ్రమంబునం
బన్నుగఁ జంప నోపు పటుబాహుబలాఢ్యుఁడ; విట్టి యున్నతున్
నిన్ను సహాయుఁగాఁ బడసి నిర్మలనీతిపరుండు రాఘవుం
డన్నరభోజనాన్వయుల నాజి వధించుట యేమి చోద్య మే?'' 346

వ. అనిన వాని కతిప్రీతిమంతుం డై హనుమంతుం డిట్లనియె "నయ్యా! నీవు సౌగంధిక సరోవరంబునకుం బోయెదవే నందు సాహసంబు సేయవలవ; దది యక్ష రాక్షస రక్షితం బై, దేవతోపభోగ యోగ్యం బై యుండు; దేవతలు బలిహోమ నమస్కారంబులఁ జేసి భక్తి సాధ్యులుగాని, సాహసక్రియాసాధ్యులుగారు; నీవు నిజధర్మనిష్ఠితుండ

వై పరమధర్మంబు లెఱుంగునది; యెందేని హీనబుద్ధులు విమోహింతు, రట్టి ధర్మాధర్మవిభాగంబు లెఱుంగు విద్వాంసుల నుపాసించి శుభాచారుండవు గావలయు; నాచారంబున ధర్మంబు వుట్టు; ధర్మంబు వలన వేదప్రతిష్ఠ యగు; వేదంబులం జేసి యజ్ఞంబులు ప్రవర్తిల్లు; నట్టి యజ్ఞంబులవలన దేవతలు తృప్తులగుదురు. 347

ఆ. కార్యసిద్ధిపొంటెఁ గాలంబు దేశంబు
నెఱిఁగి బుద్ధిమంతు లెల్ల ప్రొద్దు
సాహసంబు విడిచి సామాద్యుపాయప్ర
యుక్తి చేయుదురు యథోచితముగ. 348

వ. మఱియు సర్వకార్యంబులు మంత్రమూలంబులు గావున విద్వాంసులై ప్రబుద్ధులైనవారలతో మంత్రంబుఁ జేయునది; బాలకులయు, నధికశ్రీదర్పితులయు, లుబ్ధులయు, లఘుజనంబులయుఁదోడ మంత్రంబు సేయవలదు

తే. జనులు నిగ్రహానుగ్రహశక్తుఁ డైన
రాజుశాసనమునఁ జేసి రమణతోడ
నోలిఁ దమతమ మర్యాద లొక్కనాఁడు
దప్పనోడుదు రిమ్మహీతలమునందు. 350

వ. నీవు నిగ్రహానుగ్రహసమర్థుండవు; గావున నీ కెల్లవారును వశ్యులగుదురు; నిన్నుఁ జూచుటం జేసి నా నయనంబులు సఫలంబు లయ్యెఁ; నీ కెద్ది యిష్టంబు దానిం జేసెద. 351

మత్తకోకిలము: మీకు నెగ్గొనరించి యున్న యమిత్రులన్, హతబుద్ధులం,
జీకురాజుతనూజులం, గురుసింహ ! నీకుఁ బ్రియంబుగా
నేకమాత్రన పోరిలో వధియించి, నాగపురంబు నా
నాకులాద్రిశిలావలీగహనంబు సేయుదు'' నావుడున్.

మత్తకోకిలము: "ఇంతయుం గపినాథ ! నీ కిది యేమిపెద్ద ? మహాహవా
భ్యంతరంబున నుద్ధతప్రతిపక్షవీరుల నేము ని
ర్జింతు; మెవ్వరు మాకు మీదయఁ జేసి మార్కొనునంత య
త్యంతవీరులు లేరు భూవిదితప్రతాపబలోన్నతిన్." 353

వ. అనిన విని భీమసేనునకు హనుమంతుం డి ట్లనియె "నన్ను రణాంత
రంబునం దలంచునది; నీయందు సౌహార్దంబున నాహవంబులో
నతిరథుం డయిన యర్జును రథధ్వజంబునం దుండి మీ బలపరాక్ర
మంబులం జూతు" నని భీముని కౌఁగలించుకొని వానికి సౌగంధిక
సరోవరమార్గంబుఁ జూపి, హనుమంతుండంతర్హితుండైనఁ దదాలింగన
విగతశ్రముండును, విపులజవశక్తియుక్తుండును నై భీమసేనుండు.

సీ. వారిధారల, ననివారితనిర్గళ
ద్దానధారలఁ, దటిద్దామములను,
దశనధామంబుల, నశనిఘోషంబుల
ఘోరబృంహితబృహద్ఘోషణముల,
నివి ఘనబృందంబు, లివి గజయూథంబు
లని విచారింపంగ నక్కజంబు
లై, లలితోత్తుంగశైలశృంగంబులఁ
ద్రిమ్మరు జలధర ద్విరద తతుల

ఆ. విస్మయంబుతోడ వీక్షించుచుం జని
రజతగిరిసమీపరమ్యభూమి
నక్కుబేరు వనమునందు సౌగంధిక
కమలవనముఁ గనియె ఘనభుజుండు. 355

క. అందుల హేమాంబుజమక
రందరసామోదమృదుతరశ్వసనుం డా
నందంబుఁ జేసెఁ దనప్రియ
నందనునకు భీమసేనునకు నభిముఖుఁ డై. 356

వ. అంత.

క. వీరుం డై సౌగంధిక
వారిజములు గొనఁగ నిట్లు వచ్చినవానిన్
భూరిపరాక్రము భీము ను
దారగదాహస్తుఁ జూచి తా రుద్ధతు లై. 358

వ. దాని రక్షించి యున్న పదివేవురు రాక్షసు లాక్షణంబ విచిత్రాయుధ
పరిచ్ఛదులై పఱతెంచి "నీ వొక్క దివ్యపురుషుం డాయుధంబులు

ధరియించినవాఁ, డజినంబులు గట్టినవాఁ, డధిక తేజస్వి తపస్వి వేష ధరుం డిందులకు వచ్చినవాఁ'' డని యచ్చెరు వందుచు భీమసేనుం డాయ వచ్చి యిట్లనిరి. 359

తరలము. "ఇది కుబేరువనంబు; దీనికి నెవ్వరుం జనుదేర నో
డుదురు; నీ విట వచ్చి యేల కడుం బ్రమాదముఁ జేసి తిం?
దుదితతేజుఁడు క్రీడ లాడుచు నుండు నింతులుఁ దాను స
మ్మదముతోడఁ గుబేరుఁ డీరుచిమత్సరోజవనంబునన్. 360

వ. దీనితీరంబున దేవర్షి గణంబులు దేవతార్చనంబులఁ జేయుదు; రిందుల జలంబు లమృతోపమానంబులు; మఱి వైడూర్యనాళంబు లై, యపూర్వసౌరభంబు లైన కనకకమలంబులు గలుగుటంజేసి యక్ష రాక్షసాక్షోహిణీరక్షితం బగు దీని మహిమం బెఱుంగక యింత దూరంబు వచ్చిన వీరుం డెవ్వండ? వేమికారణంబున వచ్చి?" తనిన వారికి భీముం డి ట్లనియె. 361

మత్తకోకిలము. "ఏను బాండుసుతుండ, భీముఁడ, నిద్ధతేజుఁడ, ధర్మ రా
జానుజన్ముఁడ ద్రౌపదీహృదయప్రియం బొనరింపఁగాఁ
బూని యిక్కమలాకరంబునఁ బుష్పముల్ గొన వచ్చితిన్;
వీనిఁ గొందు నవశ్యమున్ సురవీరు లడ్డము వచ్చినన్.''

వ. అనిన వార లి ట్లని ''రయ్యా! నీవు దివ్యపురుషుండ; వీసౌగంధిక కమలంబులు గొనియెదేని కుబేరున కెఱింగించి, తదాదేశంబునఁ గొనుము; నీవు ధర్మజానుజుండవు గావున నీకు ధర్మపథంబు తప్పం జన" దనిన రాక్షసులఁ గటాక్షరూక్షేక్షణంబుల నిరీక్షించి భీమసేనుం డి ట్లనియె. 363

క. ''గిరినిర్ఝరములఁ బుట్టిన
సరోవరం బిదియు సర్వసామాన్యము గా
కరుదుగ నొక్కనియది యే?
పరఁగఁ గుబేరుండు దీనిఁ బడసెనె మొదలన్? 364

తే. ఉత్తమక్షత్త్రియుం డేల యొరుల నడిగి
వేఁడువాఁ డగుఁ; దన భుజావిక్రమమున

నన్యధనము లుపార్జించి. యర్థిజనుల
కిచ్చి, కీర్తి దిక్కుల వెలయించుఁగాక 365

—: భీముఁడు యక్షరాక్షసులతో యుద్ధంబు సేయుట :—

వ. నాకు మిమ్మును మీ కుబేరుం బ్రార్థించి కాని యిక్కొలని పువ్వులు గొనంగా దొకో" యని భీముండు రాక్షసుల నాదరింపక సౌగంధిక వనంబు సొచ్చి, కనక కమలంబులు గొని, యుత్తమ వీర్యవంతంబు లైన తత్సలిలంబు లుపయోగించి యనంతబలసంపన్నుండై యున్న నాతని జూచి రాక్షసు లలిగి యుద్యతాయుధహస్తు లై తాఁకిన భీముండును భీకరాకారుండై 366

చ. తనగదఁ జేసి రాక్షసుల దారుణశస్త్రచయంబు నశ్రమం
బున నతివీరుఁ డై విఱిచి, పోర నిశాచరులన్ బడల్పడఁగ
ఘనభుజదండచండహతిఁ గ్రాఁచిన నుక్కఱి రక్కసుల్ కుబే
రున కెఱిఁగింపఁ బాఱిరి సరోషవృకోదరభీమకర్మముల్. 367

వ. కుబేరుండును బాంచాలీప్రియకరం బైన పవనతనయు పరాక్రమారంభంబు విని మెచ్చి దాని నుపేక్షించె, నట్లు భీమసేనుండు రాక్షససేన నోడించి సౌగంధికకమలంబులు గొని తత్తీరకుసుమితలతాపాదపవనంబున విహరించుచున్నంత నట 368

క. వడిఁ బడియెఁ బిడుగు లుడుగక;
వడఁకె మహీతలము; పాంసువర్షము గురిసెన్;
గడు నెఱ్ఱ నయ్యె దిశ; లే
ర్పడ కుండె నినుండు తిమిరపటలావృతుఁ డై. 369

వ. ఇట్టి మహోత్పాతంబు లుపలక్షించి విస్మితుం డై ధర్మ తనయుం "డివి భీమాహవ పిశునంబు లై కానంబడియె, నేమఱ కుండ వలయు" నని నాలుగు దిక్కులుం జూచి భీమసేనుం గానక తన సమీపంబున నున్న పాంచాలి కి ట్లనియె. 370

క. "ప్రియసాహసుండు భీముఁడు
భయవిరహితుఁ డెందుఁ బోయె? బహురాక్షససం

శ్రయ మిగ్గిరి గంధర్వా
న్వయసేవ్యం; బేకచరుఁడు వాఁ డెయ్యెడలన్. 371

ఆ. భూరిభుజుఁడు దానె పోయెనో, నీ వెట
యేని పుచ్చితో నిజేచ్ఛ నతని''
నని యజాతశత్రుఁ డడిగినఁ బలికిఁ బాం
చాలి యిట్టు లనియె సంభ్రమమున. 372

మధ్యాక్కర. "ధరణీశ ! నీకు నా యిచ్చిన పసిఁడితామరపువ్వు
గురువాయువశమున వచ్చినను దానిఁ గొని యిట్టిపువ్వు
లకుదు గాన కుఱంగటం గలిగెనేని యర్థిఁ దెమ్మనిన
నరిగె నీశానుదిక్కునకు నీ తమ్ముఁ డతివేగమునను" 373

వ. అనిన "నట్లేని యందఱము వానిపోయినవలనం బోవుద'' మని యెప్పటియట్ల రాక్షస స్కంధారూఢుఁ డై గగనగతి నరిగి సౌగంధిక తీరంబున. 374

చ. అతులబలాఢ్యు, నుద్యతగదాయుధహస్తు, బటు ప్రతాపవ
ర్ధితయశుఁ, బాండునందనుఁ దదీయమహోగ్రగదావిఘాతదా
రితపృథుయక్షరాక్షసశరీరచయంబులఁ, జూచి విస్మయ
స్మితముఖు లై రి బ్రాహ్మణసమేతులు ధర్మసుతాదు లచ్చటన్. 375

వ. భీమసేనుండు ధౌమ్య ధర్మజ రోమశులకు మ్రొక్కి, తనకు మ్రొక్కిన కవలఁ గౌఁగిలించుకొని, వైడూర్యనాళంబు లైన కనకకమలంబులు ద్రౌపది కిచ్చి యున్నంత నాతనికి ధర్మ రా జి ట్లనియె. 376

ఆ. "చనునె నీకు నిట్టి సాహసక్రియఁ జేయ?
నెల్లవారికంటె నెఱుక గలవు;
గురుభుజుండ! నాకుఁ గూర్తేని చేయకు
మయ్య యిట్టిచెయ్వు లనఘ ! యింక." 377

వ. అని కఱపి యి ట్లందఱుం గుబేరోద్యానవనంబున విహరించుచున్నంతఁ దద్రక్షకు లైన యక్షులు వచ్చి. 378

క. దేవర్షి యైన రోమశు,
దేవేంద్ర సమాను నయ్యుధిష్ఠిరు, ధరణీ

దేవోత్తములం గని విన
యావనతులు భక్తి నిట్టు లని రందఱకున్. 379

వ. "మీ రిందు మసల వల; దిది యక్షరాక్షసప్రచారఘోరం" బనిన నం
దుండ నొల్లక పాండవులు తత్సమీపంబున నివాసంబుఁ జేసికొని,
రాక్షస బలంబుతో ఘటోత్కచుఁ బోవం బనిచి యుండునంత జటా
సురుం డను రాక్షసుండు బ్రాహ్మణ రూపధరుం డై "యేను వేద
విదుండ; ధను ర్వేదవిదుం డైన పరశురాముని శిష్యుండ" ననుచుం
బాండవుల సేవించు చున్నంత నొక్కనాఁడు. 380

ఆ. మృగవిరోధిబలుఁడు మృగయావినోదార్థ
మడవి కనిలతనయుఁ డరిగినట్టి
యవసరమున, నజ్జటాసురుఁ డాసురా
కారవికృతరూపకంబుఁ దాల్చి. 381

క. చనుదెంచి ద్రౌపదిని, యమ
తనూజు, నకులుం దదాయుధంబులతోఁ జె
ల్చన యెత్తికొని మహాజవ
మునఁ బఱచె మహీసురోత్తములు భయ మందన్. 382

వ. అంత సహదేవుండు భీమునిం బిలుచుచు వనంబున కరిగె; నిట ధర్మ
తనయుం డధర్మవర్తి యైన యసుర కి ట్లనియె. 383

క. "దేవాసురాదు లిందుప
జీవింతురు మనుజులకు విశేషసుఖంబుల్
గావించుచు; నమ్మనుజులఁ
గావం గలవార మేము గౌరవయుక్తిన్. 384

వ. ఇట్టి మా కపకారంబు సేయుట నీకు లగ్గు గాదు; నీవు ధర్మ వెఱుం
గవు; విశ్వసించిన వారికిం, గుడువం బెట్టినవారికి నెగ్గు సేయుట
కడు బాపంబు గావున. 385

మధ్యాక్కర:
మాయావి! మా యాయుధములు మా కిచ్చి మాతోఁ రణమ్ము
సేయు; మివ్విధమునఁ బోవఁ దగ" దంచుఁ జిక్కనై యసుర

నాయతబాహుఁడు గరము భరముగా నదిమె ధర్మజుఁడు,
మాయావి యగు వాని గమనంబు మందమై యుండ.

వ. ఇట్లు ధర్మజు నిబిడపీడన వేదనాభరంబున విగతవేగుం డై యరుగు
జటాసురున కడ్డంబు వచ్చి సహదేవుం డి ట్లనియె. 387

క. "న న్నెఱుఁగవె పాండవుఁడఁ బ్ర
సన్న యశోవీర్యయుతుఁడ, సహదేవుఁడ ? న
త్యున్నతి యేర్పడ నిప్పుడ
నిన్నోర్చెదఁ జక్క నెదిరి నిలువుము పోరన్." 388

—: భీముఁడు జటాసురునితో యుద్ధంబు సేయుట :—

వ. అనుచున్న యవసరంబున ననిలసుతుం డనిలవేగంబున నరుగుదెంచి
జటాసురుచేత నిగృహీతు లై గగనగతిం జను ధర్మజ నకుల ద్రౌప
దులను, మహీతలగతుం డైన సహదేవుం జూచి యయ్యసుర
కి ట్లనియె. 389

తే. "అతిథివై వచ్చి నీవు మాయందుఁ గుడిచి
యసురవై యిట్ల యెగ్గు సేయంగనగునె ?
యెందుఁ గుడిచినచోటికి నెగ్గు సేయ
రెట్టి దుర్జనులైనను నెఱుక విడిచి. 390

వ. నీవు బుద్ధిగలవేని వీరిని విడిచి నీ ప్రాణంబులు రక్షించుకొను; మట్లు
గాని నాఁడు బక హిడింబ కిమ్మీరులం జంపిన ట్లక్రమంబునం జంపుదు"
ననన విని జటాసురుండు వారల విడిచి భీమసేనున కభిముఖుం డై.

క. "రయమున నీచే ను.ను హతు
లయిన సురారాతులకు రణాంతరమున నీ
దయిన రుధిరమున నుదక
క్రియఁ జేసెద బక హిడింబ కిమ్మీరులకున్." 392

క. అనుచుఁ గడు నలిగి మారుత
తనయు మహాబాహు నసుర దాఁకె; మరున్నం
దనునకు నెడ సొచ్చి మాద్రీ
తనయులు తత్క్షణమ వానిఁ దాఁకిరి వీకన్. 393

సీ. వారల నిద్దఱ వారించి భీముండు
దాఁకె జటాసురు వీఁకతోడ;
భీమాసురులకు సంగ్రామంబు గడు ఘోర
మయ్యె; నిర్మూలంబు లయ్యె వారి
యూరుఘట్టనముల ధారణీరుహములు;
పదఘట్టనములఁ గ్రక్కదలె ధరణి;
భూరుహపాణులై పోరి యాసన్నభూ
రుహములు వొలిసిన, బృహదుదగ్ర

ఆ. శిలలఁ గొంతసేపు చెలఁగి పోరాడి రొం
డొరులు పెనఁగి పట్టి పరుషభంగి;
నుగ్రులైన వాలి సుగ్రీవు లట్టుల
యుద్ధ మొప్పఁ జేసి రిద్ధబలులు. 394

క. భీమాసురవీరుల ము
ష్టాముష్టిరణచ్ఛటచ్ఛటాశబ్దం బు
ద్దామం బై తద్విపినమ
హామృగపతులకు నతిభయావహ మయ్యెన్. 395

ఆ. అంత భీమసేనుఁ డంతకాకారుఁ డై
వాని బలవిహీనుఁ గా నెఱింగి
తడయ కపుడు వాని మెడ గ్రుంగఁ బిడికిటఁ
బొడిచె; నసురముడిఁగి పడియెఁ బుడమి. 396

వ. ఇట్లు నిర్ఘాతనిపాతభిన్నోన్నత నీలగిరిశృగంబునుంబోలె నేలం బడిన జటాసురు కళేబరం బెత్తి యొక్క విశాలపరుషపాషాణంబుపై జర్జరితంబుగా వైచి వానింగాలగోచరుంగాఁ జేసిన వాయుపుత్త్రు పరాక్రమంబు ధౌమ్యరోమశాదిమహీసురవరులు వర్ణించి" రని వైశంపాయనకథితం బైన కథ రమ్యంబుగ. 397

క. భూపకులతిలక! నృపవి
ద్యాపారగ! నిత్యసత్యధనధన్య! దయా
లాపచతురాస్య! ధర్మ
వ్యాపారవిచార! విష్ణువర్ధననృపతీ. 398

వసంతతిలకము. శ్రీరమ్య! రాజకులశేఖర! రాజరాజా!
భూరిప్రతాపపరిభూతవిరోధివర్గా!
హారామృతాబ్జహరహాసతుషారకుంద
స్ఫారద్యశఃప్రసరపాండుకృతత్రిలోకా! 399

గద్యము. ఇది సకలసుకవిజనవినుత నన్నయభట్టప్రణీతంబైన శ్రీమహాభారతంబునం దారణ్యపర్వంబునం దధీచికథయును, నగస్త్యమాహాత్మ్యంబును, భగీరథుప్రయత్నంబునుం, గంగావతరణంబును, ఋశ్యశృంగుచరిత్రంబును, బరశురాము చరిత్రంబును, గార్తవీర్యు వధయును, రామకృష్ణాదుల యాగమనంబును, సౌకన్యాఖ్యానంబును, చ్యవనుండు శర్యాతి యజ్ఞంబున నాశ్వినుల సోమపీథులం జేసి వారిచేత జవ్వనంబు వడయుటయు, మాంధాతృజన్మంబును, సోమకుండు యజ్ఞంబుఁ జేసి పుత్రశతంబు వడయుటయు, జంతూపాఖ్యానంబును, శ్యేనకపోతంబులై యింద్రాగ్నులు శిబిమాంసంబు గొనుటయు, నష్టావక్రు మాహాత్మ్యంబును, రైభ్య యవక్రీతుల సంవాదంబును, భీముండు సౌగంధికహరణార్థం బరుగుటయు, హనుమద్దర్శనంబును, రామాయణ కథయును, భీముండు గంధమాదనంబునం దుండు కొలనికిం బోయి యక్షరాక్షసుల వధించుటయు, గంధమాదనంబున నందఱుం గూడుటయు, జటాసుర వధయు నన్నది తృతీయాశ్వాసము. 400



శ్రీః

గణేశశారదా గురుభ్యో నమః

# శ్రీమదాంధ్ర మహాభారతము

## ఆరణ్యపర్వము - చతుర్థాశ్వాసము

శ్రీరాజ రాజ! కులని
స్తార! సుధాహార హీరసన్నిభకీర్తీ!
శ్రీరమణ! రాజవిద్యా
పారగ! కోదండపార్థ! పార్థివతిలకా! 1

వ. అక్కథకుండు శౌనకాది మహామునులకుం జెప్పె; నట్లు పాండవులు నరనారాయణాశ్రమంబునఁ గొన్ని దినంబు లుండ నొక్క నాఁడు ధర్మతనయుండు దమ్ములకి ట్లనియె. 2

మధ్యాక్కర. "ఏ నేఁడు లగుదెంచె నర్జునుం డేఁగి; యింత కేతెంచుఁ
బూని దివ్యాస్త్రముల్ వడసి; యమ్మహాభుజు, భూరిసత్త్వ,
నానతరిపువర్గుఁ జూడఁ గాంతు మిం" దంచు బ్రాహ్మణుల
తో నేఁగె నుత్తరము మించి ధర్మనిత్యుఁడు ధర్మజుండు.

వ. ఇట్లు గంధమాదన పుణ్యతీర్థావలోకనపరు లయి పాండవు లరిగి, యందు గోదాన హిరణ్యదానాది మహాదానంబుల విప్రులం దృప్తులం జేసి, పదునేడగు దివసంబున వృషపర్వుం డను రాజర్షియాశ్రమంబు గని, యందతిప్రీతి నాతనిచేతఁ బూజితులయి, యేడుదివసంబులు వసియించి, బ్రాహ్మణుల నెల్ల నందుండ నియమించి, వృషపర్వోపదిష్టమార్గంబున ధౌమ్యరోమశప్రభృతికతిపయ బ్రాహ్మణులతోఁ జని యష్టమదివసంబున. 4

క. విమలస్ఫాటికహాటక
రమణీయదరీనిరంతరశ్వేతనగేం
ద్రము, మూల్యవంతమును ను
త్తమచరితులు సూచు చరిగి తద్విపినమునన్. 5

క. చలదళిపుంస్కోకిలకుల
కలరవముఖరితలతాంత క్రమఫలాళీ
లలితమహీరుహమాలా
మిలితోద్దేశముల విశ్రమించుచు లీలన్. 6

వ. అందు విహరించుచుండ నొక్కనాఁడు శ్వేతకి యను పుణ్యనదివలన మారుతానీతంబు లై తమ ముందటం బడిన పంచవర్ణసురభికుసుమంబులం జూచి, యందఱు విస్మయం బంది; రంత నే కాంతంబ యొక్క శశికాంత శిలాతలంబు పయి నున్న భీమసేనునకు ద్రుపదరాజ పుత్త్రి యి ట్లనియె. 7

క. "ప్రకటమగుఁ దొంటి సౌగం
ధికకనకాబ్జమునకంటె దివ్యసుగంధా
ధిక కుసుమము, లివి దద్దయు
సుకుమారము; లిట్టివానిఁ జూచి యెఱుంగన్. 8

వ. ఇక్కుసుమంబులు నాకుఁ దెచ్చి యిచ్చి, మనఃప్రియంబు సేయు" మనిన విని భీముండు తత్క్షణంబ చని చక్రవాళనగసమున్నతం బయిన గిరి శృంగం బెక్కి యందు వివిధరత్నరశ్మి రమ్యవేశ్మపరివృతం బయిన వైశ్రవణు నివాసంబు గని శంఖధ్వానంబు సేసిన. 9

క. దాని విని యక్షరాక్షస
సేనలు పఱతెంచి భీమసేను మహాసే
నానీసన్నిభుఁ దాఁకిరి
నానాయుధధరులు దారుణధ్వను లెసఁగన్. 10

క. వాయుసుత ప్రేరితశిత
సాయకముఖదళితరాక్షసప్రకరబృహ
త్కాయాగ్రగళితశోణిత
తోయములన్ ధరణిధరనదులు గడు నిండెన్. 11

ఉ. ఉక్కఱి యిట్లు మధ్యము మహోగ్రశరంబుల ధాక కోర్వ కా
రక్కసు లెల్ల నాహవపరాఙ్ముఖు లైనఁ, గడంగి భీముఁ డా
నెక్కటి దాఁకె, దిక్కరి సహింపక సింహముదాకునట్టు లం
దక్కజుఁ డుద్యతాయతగదాయుధుఁ డై మణిమంతుఁ డల్కతోన్.

క. ఆరాక్షసు, నతివీరుఁ, గు
బేరసఖుం బవనసుతుఁ డభేద్యుఁడు నిజదు
ర్వారతర శాతసాయక
ధారావర్షమునఁ గప్పె దారుణభంగిన్. 13

క. గదద్రిప్పి భీముమీఁదను
వదలక మణిమంతుఁ డలిగి వైచిన, నది వి
ద్యుద్దినప్రభానిభం బై
పదిదిశలును వెలుఁగ భీముపయిఁ బఱతెంచెన్. 14

వ. అమ్మహాసాధనంబునకు మనంబున బెగడక. 15

క. దానిఁ దన నిశితబాణవి
తానంబున జర్జరీకృతముఁ జేసె మరు
త్సూనుఁడు, గుహ్యక రాక్షస
సేనల కెల్లను భయంబు సేయుచు సలుకన్. 16

క. ఘనుఁ డమ్మణిమంతుఁడు కాం
చనదండోద్భాసి యైన శక్తి మరున్నం
దనుమీఁద వైచె; నది యా
తని భుజపార్శ్వమ్ము దాఁకి ధారుణిఁ బడియెన్. 17

చ. గదఁ గొని భీముఁ డంత లయకాలకృతాంతుఁడపోలె నేల గ్ర
క్కదల నదల్చి, నిల్చిన, నకంపితుఁ డై మణిమంతుఁ, డాజిదు
ర్మదుఁడు త్రిశూల మెత్తికొని మధ్యముపై ననలస్ఫులింగముల్
సెదరఁగ వైచె; దానిఁ జఱచెన్ ఘనుఁ డై గదఁ జేసి భీముఁడున్.

వ. ఇట్లు తన శక్తి శూలంబుల శక్తి నిహతంబైనఁ బరిత్యక్తమదుం డై
మణిమంతుం డంతరిక్షంబున కెగసిన. 18

క. "పోవకు పోవకు" మనుచు మ
హావీరుఁడు గద యమర్చి యమ్మణిమంతుణ్.
లావఱఁగ వైచె నగ్గద
తోఁ; వాఁడును బడియెఁ బ్రతిహతుం డై నేలన్. 20

క. ఘోర మణిమంతుఁ డిట్లు స
మీరణసుతు చేతఁ బ్రాప్తమృతుఁ డై పడినన్.
వారక పఱచిరి భయమున
నారాక్షసు లార్తనాదు లై తూర్పునకుణ్. 21

వ. అట ధర్మరాజు భీమసేను పోయినవలను ద్రౌపదిచే నెఱింగి యార్ష్టి షేణుం డను మునివరు నాశ్రమంబున ధౌమ్యద్రౌపదీప్రభృతులం బెట్టి. రోమశనకులసహదేవయుతుం డయి తద్గిరిశృంగం బెక్కి, కుబేర సదనసమీపంబున నిజగదాఘాతపాతిత మణిమంతాది రాక్షసదారుణ రణమధ్యంబున నున్న మధ్యమునొద్దకుం జనియె; నంత. 22

క. హతశేషు లైన రాక్షసు
లతిరయమునఁ బాఱి చెప్పి రప్పుడ యలకా
పతికి సవిస్తరముగ నిజ
మతిఁ బవనజువిక్రమంబు, మణిమద్వధయున్. 23

వ. దాని విని కుబేరుండు విస్మితహృదయుం డయి యాత్మగతంబున.

క. "తలరక మును సౌగంధిక
ములు గొని, యిప్పుడును దర్పమున నిందుల పు
వ్వులుకొని, మణిమత్ప్రభృతులఁ
బలువుర వధియించె నెట్టి బలియుఁడో" యనుచున్. 25

వ. సుర గరుడ గంధర్వ యక్ష రాక్షస సహితుం డయి యక్షప్రభుం డరుగుదెంచి, పాండవులం గని, వారిలో గదా కృపాణ బాణాసన ధరుండయి రణకాంక్షనున్న మహావీరు మారుతాత్మజుం జూచి, పరమ ప్రీతచిత్తుండయి యున్న. 26

ఆ. అక్కుబేరునకు మహామతుల్ పాండవుల్
మ్రొక్కి; రంత ధర్మమూర్తి యైన
ధర్మతనయుఁ జూచి తద్దయు దయతోడ
నిట్టు లనియెఁ గిన్నరేశ్వరుండు. 27

వ. "అయ్యా! నీ యనుజుండు మత్ప్రియసఖుం డయిన మణిమంతు వధియించి నా కపకారంబు సేసెనని లజ్జింప వలవ; దది యగస్త్య శాపనిమిత్తంబున నయ్యె" నని భీమసేను డాయం బిలిచి, నీ చేసిన సాహసంబు నా కుపకారంబు గావున నిన్ను మెచ్చితి" ననిన నక్కు బేరునకుం గృతాంజలి యయి ధర్మతనయుం డి ట్లనియె. 28

ఆ. "ఇట్టిశాప మమ్మునీంద్రుండు దా నేల
యిచ్చె? దాని నాకు నెఱుగఁ జెప్పు"
మనిన విస్తరించి యమరాజసుతునకు
నక్కుబేరుఁ డిట్టు లనుచుఁ జెప్పె. 29

వ. "తొల్లి కుశవతి యను పుణ్యనదీతీరంబున నమరులెల్ల సత్రయాగంబు సేయుచుండి నన్ను రావించిన, నేనును బుష్పకవిమానారూఢుండ నై త్రిశతమహాపద్మ సంఖ్యల యక్షరాక్షసబలంబులతో గగనగతి నందులకుఁ బోవునెడ, నూర్ధ్వబాహుండయి యమునాతీరంబున నుగ్రతపంబు సేయుచున్న యగస్త్యమహామునిమీఁద నా ప్రియసఖుం డయిన మణిమంతుం డెఱుంగక నిష్ఠీవనంబు సేసిన నలిగి చూచి, యమ్మునివరుండు నా కిట్లనియె. 30

ఆ. "నీవు సూచుచుండ నీయిష్టుఁ డిమ్మణి
మంతుఁ డిపుడు తనదు మదము పేర్మి
నన్ను నరయ కుమిసె నామీఁద; నిట్టి దు
ర్మదుఁడు వొలియు నొక్క మనుజుచేత. 31

వ. మఱియు నీ యక్షరాక్షసబలంబులును వానిచేతన నిహతంబులగు; నీ దురితంబు దద్దర్శనం బునం బాయు'' ననియెం గావున నిట్టి శాపవ లంబునకు నీ యనుజుండు నిమిత్తం బయ్యె'' నని చెప్పి వెండియు ని ట్లనియె "నయ్యా! ధృతియును, దాక్ష్యంబును, దేశంబును, గాలంబును

బరాక్రమంబు నను పంచవిధంబులైన లోకతంత్ర విధానంబు తెలిసిం
గిన సత్క్షత్త్రియుండు ధర్మవిదుండయి ధరణీచక్రంబు నిర్వక్రంబుగా
రక్షించి పుణ్యలోకంబు వడయుఁ; దత్కర్మవిశేషంబు లెఱుంగక
వృథారంభుండయి సాహసంబున వర్తిల్లు వానికిం బాతకం బగుట
నిశ్చయంబు. 32

క. కావున నీ తమ్ముఁ, డరు
ద్దేవాత్మజు సాహసైకధృతిఁ గాకుండన్
భూవల్లభ ! శిక్షింపుము
నీవిమలజ్ఞానధర్మనిష్ఠితబుద్ధిన్. 33

వ. నిన్నును, నీ తమ్ములను ధర్మానిలశక్రాశ్వినులు రక్షించినట్ల యే
నెప్పుడు రక్షింతు; నా నియోగంబున మత్పరిచారకులు మీకు నిత్యం
బును నన్నపానాదులు దెచ్చి యిచ్చుచుండ నార్ష్టిషేణాశ్రమంబున
నొక్క పక్షంబు వసియించునది. 34

సీ. మానితయశుఁడు, భీమానుజుం, డర్జునుం
డమరులచేత దివ్యాస్త్రతతులు
వడసి దేవేశ్వరుకడ నున్నవాఁ; డాతఁ
డుపకారి య య్యె దేవోత్తమునకు;
సప్తాశ్వమేధసంప్రాప్తపుణ్యుఁడు, ధర్మ
మతి, భవత్పితృపితామహుఁడు, ఘనుఁడు,
శంతనుఁ డతనిచే సంతర్పితుం డయి
గుఱుకొని మీదైన కుశల మడిగె;

ఆ. నరుగుదెంచు నింత కయ్యర్జునుండు; మీ
కభిమతార్థసిద్ధి యగుఁ బ్రసిద్ధ"
మని యెఱుంగఁ జెప్పి యలకాధినాథుండు
యక్షగణముతోడ నరిగె నంత. 35

వ. ఇట్లు ధర్మరాజు కుబేరాదేశంబున నార్ష్టిషేణాశ్రమంబున నుండునంత
నాతనికి నొకనాఁడు ధౌమ్యుండు నిజాంగుళి నుత్తరదిగ్భాగంబు
సూపుచు ని ట్లనియె. 36

క. "అదె మందరనగ; మక్కడ
యదె మేరునగేంద్ర; మమ్మహాశైలమునె
న్మిదిదిక్కుల వసియింతురు
త్రిదశేంద్రుం దొట్టి యష్టదిక్పాలవరుల్. 37

చ. కనకగిరిం బ్రదక్షిణముగా శశిభాస్కరతారకాగణం
బనవరతంబుఁ ద్రిమ్మరు మహామునిసప్తకమండలంబుతోఁ;
ననఘ! తదీయతుంగశిఖరాగ్రమునందుఁ బయోరుహాసన
త్రినయనవిష్ణు లుండుదురు దేవగణంబులు గొల్చు చుండఁగన్." 38

వ. అని చెప్పుచుండఁ బాండవు లం దొక్క మాసంబు నివాసంబు సేసి;
రంత. 39

ఉ. అంబర మాత్మదీప్తినివహంబున నొప్పఁగ, మాతలిప్రయు
క్తంబగు దివ్యకాంచనరథంబు, లసచ్చపలాంశుపుంజర
మ్యం బగుదాని నెక్కి, ధృతిమందరుఁ డింద్రసుతుండు నాకలో
కంబుననుండి వచ్చెఁ బ్రవికాసితతేజుఁ డినప్రకాశుఁ డై. 40

వ. ఇట్లు చనుదెంచి ధనంజయుండు రోమశధౌమ్యధర్మజభీమసేనుల పాదంబులకుం బరమభక్తిఁ మ్రొక్కి, తనకు వినయవినమితోత్తమాంగు లయిన కవల నెత్తికొని, ద్రౌపదీహృదయనయనారవిందంబుల కానందంబు సేయుచున్నంత నందఱు సంతోసిల్లి మాతలి నతిప్రీతిఁ బూజించిన నతండును దదీయరథంబు గొని దివంబున కరిగె; నట్టియవసరంబున.

క. దిననాథుఁ డస్తగిరిఁ బొం
దినఁ, జీఁకటి, బాచి, యాత్మ తేజమున దిగం
గనల విభూషించుచు రజ
నినాథకలహంస గగననిమ్నగ నొప్పెన్. 42

వ. ఆరాత్రి యర్జునుం డనుజుల నందఱ నొద్దఁ బెట్టుకొని యిష్టపూర్వ కథలు సెప్పుచు శయనించె; నంతఁ బ్రభాతంబ సిద్ధమునిగణంబులయు, రోమశధౌమ్యులయుఁ, దమ్ములయుఁ దోడ ధర్మతనయుండు సుఖోపవిష్టుం డై యున్నంత. 43

—: ఇంద్రుండు పాండవులయొద్దకు వచ్చుట :—

సీ. బోరన సురదుందుభుల నినాదంబులు,
గిన్నరగంధర్వగీతరవము
లెసఁగ, సహస్రసూర్యేందుమండలములు
వోలె విమానము వొలిచి వెలుఁగఁ,
బాండవాలోకనపరుఁడై సహస్రాక్షుఁ
డమరగణంబుతో నమ్మహాద్రి
కేతెంచెఁ బ్రీతి; నయ్యింద్రున కందఱు
నంత నభ్యుద్గతు లైరి; పాండ

ఆ. వాగ్రజుండు దాను ననుజులు నింద్రు పా
దాంబుజముల కెఱఁగి యధికభక్తి
శాస్త్రదృష్టవివిధసత్కారవిధులఁ బూ
జించె నమరఖచరసిద్ధపూజ్యు. 44

వ. ఇంద్రుఁడును వారల నందఱ హితమధురవచనంబుల నభినందించుచుఁ దదంతికస్థితు, నధికతపోయుక్తు, ధనంజయుం జూపి ధర్మజున కిట్లనియె. 45

క. "ఘనుఁ డీపార్థుఁడు నావల
నన దివ్యాస్త్రప్రయోగనయనిపుణుం డై
దనుజుల నివాతకవచుల
ననిఁ జంపి, సురాలికిం బ్రియం బొనరించెన్. 46

క. ఈతఁడు పరాక్రమమున న
రాతుల వధియించి యి ద్ధరారాజ్యము వి
ఖ్యాతముగ నిచ్చు నీకు; మ
హాతేజుఁ డజయ్యవీర్యుఁ డని నెవ్వరికిన్." 47

క. అని చెప్పి యనిమిషప్రభుఁ
డనిమిషనివహంబుతోడ నమరావతికిం
జనియె నిజాలోకమున
కనఘులు పాండవులు హర్ష మందుచు నుండన్. 48.

మధ్యాక్కర. ఘనముగ ధనదేంద్ర పాండుసుతసమాగమ మొక్క యేఁడు
దనరంగ బ్రహ్మచర్యవ్రతస్థులై తగిలి నిత్యంబు
వినిన పుణ్యాత్ములును, జదివినవారు విభుత నూఱేండ్లు
నొనర జీవింతు రత్యంతసత్కాంతియుక్తులై ధరణి. 49

వ. ఇట్లు సురేంద్రుం డరిగిన ధర్మతనయుం డర్జును జూచి పరమానంద
నిర్భర హృదయుం డై యిట్లనియె, 50

సీ. "హరుఁ డాదిగాఁ గల్గు నమరగణంబుచేఁ
బడసి దివ్యాస్త్రముల్, పరమ మైన
యుపకార మమరుల కొనరించె నీ పార్థుఁ
డని నాకుఁ జెప్పె వృత్రాంతకుండు;
దివ్యాస్త్రలాభమ్ము, దేవేంద్రునకుఁ బ్రీతి
గా వేల్పులకు నుపకారివైన
విధమును మా కిప్డు విన వేడ్క యైనది"
యని తన్ను నడిగిన నగ్రజునకుఁ

ఆ. నగ్రజన్మపూజ్యు లగు ధౌమ్యరోమశ
ప్రభృతివరులయొద్దఁ బాండవేయుఁ
డసదృశప్రభావుఁ, డతివీరుఁ డర్జునుఁ
డాత్మచరిత మిట్టులనుచుఁ జెప్పె. 51

వ. "ఏను భవదధిష్ఠితవిద్యాప్రభావంబున తపోనియుక్తుండ నై హిమ
వంతంబునకుం జని, యందు నాముందట వృద్ధబ్రాహ్మణుం డై
యున్న వృద్ధశ్రవుం గని, తదుపదేశంబున నీశ్వరు గుఱించి యుగ్ర
తపంబు సేసిన, నీశ్వరుండు గిరాతరూపధరుండై నాతోడ నతిఘోర
యుద్ధంబు సేసి నాకుఁ బ్రసన్నుండై, నిజరూపంబుఁ జూపి పాశుపతా
స్త్రంబుఁ బ్రసాదించె; ననంతరంబ యింద్రాదిదేవతలవలన నైంద్రా
గ్నేయ యామ్య రాక్షస వారుణ వాయువ్య కౌబేర గాంధర్వ
పైశాచ బ్రాహ్మ్యంబులనం బరఁగు దివ్యాస్త్రంబులు వడసి, మహేం
ద్రానుగ్రహంబున మాతలి ప్రయుక్తంబైన దివ్యరథం బెక్కి, యీ
శరీరంబుతోడన యమరావతి కరిగి, యం దమరేంద్రు నాచార్యుఁగా

వరించి, తత్ప్రసాదంబునఁ దివ్యాస్త్రంబుల ప్రయోగంబును, నుప
సంహారంబును, నివర్తనంబునుఁ, బ్రాయశ్చిత్తంబును, బ్రతిఘాతంబు
లును నేర్చిన నాకు సంతోసిల్లి సురేంద్రుం డి ట్లనియె. 52

క. "నీ వఖిలశస్త్రవిదుఁడవు
గావున ని న్నాజి నోర్వఁగా నోప రొరుల్;
దేవతలకు బ్రాహ్మణులకుఁ
గావింపు హితంబు దీనఁ గడు సిద్ధి యగుఁన్; 53

క. నాకు గురుదక్షిణార్థము
నాకహితార్థంబుగా జనస్తుత బుద్ధిం
జేకొని నా పనిచిని పనిఁ
బ్రాకటముగఁ జేయు మహితభంజనశక్తిన్. 54

తే. జలధికుక్షిలోనుండి ధీరులు నివాత
కవచు లన మూఁడుకోట్లదానవులు బలిమిఁ
ద్రిదశులకు బాధ సేయుచుండుదురు; వారు
నిహతులగుదురు నీచేత మహితకీర్తి!" 55

వ. అని తన తొడిగిన యుద్దివ్యభూషణంబుల, నిమ్మణికిరీటంబున నన్ను
విభూషితుం జేసి, స్పర్శరూపం బైన యీ యభేద్యకవచంబు నిచ్చి,
యజగరసన్నిభం బయిన యిగ్గొనయంబు గాండీవంబు దాన
యోజించి, పదివేల హంస మయూర వర్ణమానసీయహయంబుల
బూనిన రథంబు, మాతలి ప్రయుక్తం బైన దాని నెక్కం బనిచి,
నివాత కవచవధార్థ బరుగు మని నియోగించిన నింద్రు వీడ్కొని
చనుచున్న నాతో దేవత లి ట్లనిరి. 56

ఉ. "ఈరథ మెక్కి తొల్లి యమరేంద్రుఁ డనేకసహస్రసంఖ్య దే
వారుల, వృత్ర శంబర బలాదుల, నుద్ధతులన్ జయించె; వీ
రారివిభేది! నీవును బలాఢ్యుఁడ వై వధియింపు ముగ్రమా
యారతులన్, నివాతకవచాసురులన్ సమరాంతరంబునన్." 57

వ. అని నాకు దేవదత్తం బను శంఖం బిచ్చిన నేనును మాతలి ప్రయు
క్తంబైన రథం బెక్కి యతిత్వరితగతి నరిగి. 58

—: అర్జునుఁడు నివాతకవచు లను రాక్షసుల జయించిన కథ :—

క. ఫేనవదూర్మి చయంబుల,
నానావిధమీనకూర్మనక్రంబుల, శై
లానుకృతి నొప్పుచున్న మ
హానీరధిఁ గంటి నేను నమ్మాతలియుఁన్. 59

వ. ఆ సముద్రోదరంబున విశాలాట్టాలక ప్రతోళికా ప్రతాన విచిత్ర పతాకా వివిధ సాలాలంకృతం బయిన పురంబుఁ గని, తద్ద్వారంబున శంఖధ్వానంబు సేసిన, నది సకల దిఙ్మహీధర గుహాకుహరాంతరంబు లం బ్రతిశబ్దజననం బయిన, దాని విని యలిగి యద్దానవులు నానా విధాయుధసన్నద్ధు లయి నిజకాయకాళిమాంధత మోభూతభూభువను లగుచు వచ్చి నా రథంబుఁ బరివేష్టించి. 60

క. ఉరుశస్త్రవృష్టి నాపైఁ
గురిసినఁ, దక్షణమె యొక్కొకొనిపయి నేనున్
వరుసం బదేసి బాణము
లరుదుగ నేసితి మహాభయంకర భంగిన్. 61

క. దనుజులు మదీయరథమా
ర్గనిరోధముగాఁ బ్రచండకాండప్రకరం
బునఁ గప్పిరి రోదోంతర,
మనిమిషులును ఋషులుఁ జూచి యద్భుతమందన్. 62

క. కడుభయమున మాతలి చే
డ్పడి రథచోదనమునం దపాటవుఁ డైనన్
వడి నేన రథము గడపుచుఁ
దడయక యేసితిఁ గడంగి దానవులపయిన్. 63

వ. మాతలి నన్నుఁ జూచి సంతోసిల్లె నంత. 64

చ. అతులరణాంతరంబున నిరంతరమత్పటు బాణ పాతితో
చ్ఛ్రితదనుజాంగనిర్గళదసృగ్జలధారలు సూడ నొప్పె, నా
తతగిరిశృంగసంగదళిత ప్రచలజ్జలవాహజాలసం
తతగళదంబుధారలవిధంబున నంబర మెల్లఁ గప్పుచున్. 65

వ. అంత నయ్యసురులు మాయాయుద్ధంబు సేయ సమకట్టి నామీఁద
వర్షాస్త్రంబు లేసిన. 66

క. బలరిపుఁడు నాకు నిచ్చిన
యలఘునిశాతముఖశోషణాస్త్రంబు విని
ర్గళదవిరళజలధారా
వలి నెల్లం దత్క్షణంబ వట్టఁగఁ జేసెన్. 67

సీ. అద్దానవులు దారుణాశ్మవర్షంబు పైఁ
గురిసిన, నవి నన్నుఁ దెరలఁ గప్పె;
నేనును గులిశాస్త్ర మేసి పాషాణముల్
నుఱుము గావించితి నుఱక; వెండి
యసురులు నామీఁద ననలాస్త్రజాలంబు
లేసిన, గాడ్పుతోఁ బ్రోసి యగ్ని
కణములు నాపయిం గవిసె; నేనును శైల
సలిలాస్త్రముల వానిబల మడంచి
ఆ. యున్నఁ, దిమిరబాణ ముగ్రంబుగా వార
లేసిఁ రంత దిక్కు లెల్లఁ గప్పె;
నంధకారమగ్నుఁ డై చలియించి మా
తలి ప్రతోద మెడలి ధరణిఁ బడియె. 68

క. తురగములు పఱవ నేరక
వరరథవహనంబునందు వంధ్యము లయ్యెన్;
సురసారథి ననుఁ గానక
"హరినందన యెందుఁ బోయి" తనెఁ గడు భీతిన్. 69

క. అమృతనిమిత్తంబున ము
న్నమ రాసురయుద్ధ మయ్యె; నది యింత భయ
భ్రమజనకము గా; దిది యు
గ్రము దనుజు లావార్యవీర్యగర్వితు లగుటన్. 70

తే. బ్రహ్మచేత నిర్మింపఁగఁబడిన భువన
సంప్లవం బిది" నావుడు "సంగరమున

సంచలింపక నా భుజశక్తిఁ జూచు
చుండు'' మనవుడు మాతలి చోద్యమందె 71

ఉ. వాసరనాయకుం దలఁచి వజ్రివరంబున సూర్యబాణ మే
నేసితి నింద్రుఁదొట్టి సుర లెంతయు సంతస మందఁగా, జగ
త్త్రాసి తమిస్ర రాశి నిహతంబుగ, దిక్కులు తెల్లగా, మహో
గ్రాసురు లాహవంబున భయంపడ, మాతలి మెచ్చి యార్వఁగాన్.

క. గాండీవముక్తదారుణ
కాండవిఖండీకృతాపఘనులై దనుజుల్
ఖండనముఖమునఁ జేడ్వడి
కొండలు వడినట్టు వడిరి కుతలం బదురువన్. 73

వ. ఇట్లు నివాతకవచులు మదీయ దివ్యాస్త్రనిహతులై మహీతలంబు పయిం బడిన, నట యసురకాంతల యాక్రందన ధ్వను లాకసం బదురువ నొక్కటఁ బురంబున నెగసె; నంత నద్దానవపురంబుఁ బురందరు పురంబుకంటె నతి సుందరం బైన దానిం జూచి మాతలి కే నిట్లంటి. 74

క. "నిరుపమరత్న నిరంతర
వరగృహముల నొప్పి సుఖనివాసం బగు ని
ప్పురి నుండ నొల్ల కొండొక
పురి నుండఁగ నేల వలసెఁ బురుహూతునకున్?'' 75

వ. అనిన నాకు మాతలి యి ట్లనియె. 76

సీ. "అసురులవలన భయం బైనయపుడు వే
ల్పులకు సేమంబుగా బలవిరోధి
యీప్రోలు జలధిలో నిమ్ముగ నిర్మించె;
దనుజులు పదపడి వనజగర్భు
వలనఁ దపోవీర్యవంతులై, యిందుండ
నమరులచేతఁ గయ్యమున నజితు
లై యుండఁ బడసిన, నమరేంద్రుఁ డెఱిఁగి త
ద్విజయార్థముగఁ బంచె విజయ! నిన్ను;

ఆ. సమరులకు నసాధ్యు లైనట్టి వీరల
నీవ యోర్చి "తనుచు నెమ్మితోడ
నన్ను సంస్తుతించి నరనాథ! మాతలి
గడఁగి యపుడు రథముఁ గ్రమ్మఱించె. 77

వ. ఇట్లు నివాతకవచులం జంపి క్రమ్మఱి వచ్చునెడ, నా ముందట నొక్క తపోవనంబును, నతి విచిత్రంబైన పురంబునుం గని "యిది యెవ్వరిపురం" బని యడిగిన నాకు మాతలి యిట్లనియె. 78

క. "వినవె పులోమయుఁ, గాలక
యును ననఁగా నిరువు రసురయువతులు గమలా
సను నారాధించిరి తప
మున దివ్యసహస్రవర్షములు గడునిష్ఠన్. 79

క. కనకమయ మైన యీ ప్రో
లును, నిజ సుతు లాహవంబులో నమరుల చే
త నవధ్యులుఁ గాఁ, దగ న
ప్పనజజుచేఁ బడసి రసురవనితలు కరుణన్. 80

వ. ఇది హిరణ్యపురం; బిందుఁ బౌలోమ కాలకేయు లను నసురు లుండుదురు; వారమరులచేత నవధ్యు" లనిన "నట్లేని వారిపయిం బోదము; రథంబు వఱపు" మని యేను మాతలిం బంచిన. 81

చ. అతఁడును సత్తురగోరుతరయంబున దివ్యరథంబు దత్పురా
హితపురిభూరివప్రముపయిం బఱపెన్; సురవైరు లంత ను
ద్ధతు లయి ప్రోలు వెల్వడి రథంబుల షష్టిసహస్రకంబుతో
శతముఖబుద్ధిఁ జేసి కడు సైఁపక తాఁకిరి నన్ను నల్కతోన్. 82

వ. ఏనును వారల యఱువదివేల రథంబులకు గతినిరోధంబుగా వితతవృత్త వికటశిలా ప్రభవంబు లయిన దివ్యబాణంబు లేసిన, నసురులు మాయాయుద్ధనిబద్ధులై తమ పురంబుతోడన దివంబున కెగసి, మదీయమార్గణార్గళనిరుద్ధమార్గు లై నేలం బడిన, వీరల నొండు విధంబున నోర్వఁగా దని. 83

చ. ఉరగఫణాగ్రరత్నకిరణోల్లసదుగ్రభుజున్, వృషాంకు, శం
కరు, శశిఖండమండితశిఖండు, శివున్ హృదయాంబుజంబునం
దిరముగ నిల్పి, పాశుపతదివ్యశరం బదిఁబోసి యేసితిన్
సురరిపుకోటిమీఁద, హరిసూతుఁడు మాతలి మెచ్చిచూడఁగాన్. 84

వ. ఆ దివ్యాస్త్ర ప్రభావంబున సింహ శరభ శార్దూల శుండాల మహిష మహోక్ష యక్ష రాక్షస పిశాచ పన్నగ గంధర్వరూపంబు లుద్భవిల్లి యసురుల నెల్ల విగతాసులం జేసిన. 85

క. వంచనయును మాయయు మా
యించి పరాక్రాంతి, నయ్యుమేశాస్త్రమునం
గ్రంచఱ నంతకుపురి కేఁ
గించితిఁ బౌలోమకాలకేయాసురులన్. 86

వ. ఇట్లు హిరణ్యపుర నివాసులం గృతాంతపుర నివాసులం జేసి వచ్చి, వాసవునకు మ్రొక్కిన వాసవుండును నివాత కవచ పౌలోమ కాల కేయులవధ ప్రపంచంబు మాతలివలన విని సంతోసిల్లి నా కిట్లనియె.

చ. "సురలకుఁ బ్రీతి సేసితి; వసుంధర కేఁగుము; నిన్ను నీసహో
దరులు నిరంతరంబును ముదంబునఁ జూడఁగఁ గోరు చున్నవా
రరిమదభేది! నీకు విషమాజిముఖంబున మార్కొనంగ నో
పరు నరు లెవ్వరున్; హరి నిభంబులు మార్కొనునయ్య యెయ్యెడన్.

క. ద్రోణ ద్రోణజ కృప గీ
ర్వాణనదీ జాంగపతు లవశ్యమును భవ
ద్బాణహతిఁజేసి సమర
క్షోణిఁ బరిక్షీణబలు లగుదు రపజితులై." 89

క. అనిన నమరేంద్రు వీడ్కొని
చనుదెంచితి" నని కిరీటి శతముఖు లోకం
బునఁ దనచేసిన విధ మ
త్యనఘుం డేర్పడఁగం జెప్పె నందఱు వినఁగన్. 90

వ. ధర్మరాజును దమ్ముఁడు సేసిన మహాపరాక్రమంబునకుఁ జతురంభోధి పర్యంతమహీ రాజ్యం బప్పుడ తనకు సంప్రాప్తం బై నంతియ సంతోసిల్లి. 91

ఆ. దివ్యబాణములు, తదీయప్రయోగముల్
మాకుఁ జూపు మనిన మఘవసుతుఁడు
వేలువేల చూపె వేలుపు లిచ్చిన
యస్త్రశస్త్రములు నిజాగ్రజునకు. 92

వ. మఱియును. 93

చ. సురవిశిఖప్రయోగములు సూపఁ దొడంగిన నేల దర్దిరం
దిరిగెఁ, బయోనిధుల్ గలఁగె, దిగ్గజముల్ మద మేది కుందె, భా
స్కరరుచి మాసెఁ, బావకశిఖాతతితోన యడంగె గాడ్పు, లం
బరమున నిల్చి రీశ్వరుఁడు బ్రహ్మయు నాదిగ వేల్పు లందఱున్.

వ. అంత సురగణచోదితుండై నారదుం డర్జునుపాలికి వచ్చి యిట్లనియె.

తే. "ఎదురు లేక దివ్యాస్త్రంబు లిట్లు నీకుఁ
బాడియే ప్రయోగింపంగఁ బాండుపుత్ర!
సిద్ధ మివి యధిష్ఠానవర్జితములయ్యె
నేని మూఁడులోకములు దహించు నొగిని". 96

వ. అని యర్జును వారించి నారదుం డరిగిన సమరు లెల్ల నిజస్థానంబుల
కరిగి; రిట్లు పాండవులు పదిమాసంబు లుండునంత నొక్కనాఁ డమర
కన్యకలు వచ్చి యర్జునున కిట్లనిరి. 97

తే. "వనములందును బండ్రెండు వత్సరమ్ము
లలయ కజ్ఞాతచర్య యేకాబ్దకంబు
పూని నిర్విఘ్నవృత్తిఁ జల్పుదురు మీరు
పగఱ నిర్జింతు రాహవాభ్యంతరమున. 98

తే. నీ పరాక్రమ బలమున నిఖిలధరణి
రాజ్యభారంబు నీ ధర్మరాజు పూను;
రఘుకులాధీశ్వరుండైన రాముకీర్తి
యట్ల నీకీర్తి త్రిజగంబులందుఁ బర్వు." 99

వ. అని యాదేశించి దేవకన్యకలు వోయిన నిట దేవర్షియైన రోమ
శుండు ధర్మరాజునకు ధర్మానుశాసనంబు సేసి దివంబున కరిగె;

నంతఁ బాండవు లెప్పటియట్ల ఘటోత్కచసేనానీతులై క్రమ్మఱ వృషపర్వనివాసంబు సూచుచు, బదరీవనంబున నొక్కరాత్రి వసియించి, సుబాహుపురంబునకు వచ్చి, యందుఁ దమ పరిచారకులైన యింద్రసేనప్రముఖులం గూడికొని, నిజరథారూఢులై ఘటోత్కచుంబోవం బనిచి, హిమవత్పర్వతంబునందు దేవర్షి బ్రహ్మర్షి యజ్ఞప్రదేశంబుల ననేకవిధయూపంబులు సూచుచు నొక్కవర్షం బుండి; రంత నొక్కనాఁడు 100

## —: అజగరోపాఖ్యానము :—

క. మృగయార్థ మరిగి హిమవ
న్నగభూములయందుఁ బవననందనుఁ డొక ప
న్నగుచేతఁ బట్టువడి యి
ట్లగ ధర్మాత్మనూజచేత మోక్షితుఁ డయ్యెన్. 101

వ. అనిన విని జనమేజయుండు వైశంపాయనున కిట్లనియె. 102

మధ్యాక్కర. పదివేలగజములబలము గలవాఁడు, పౌలస్త్యుతోడఁ
గదనంబుఁ జేసి యనేక యక్షరాక్షసుల నిర్జించి
యుదితశౌర్యోన్నతుం డైనవాఁడు, వృకోదరుఁ డేల
పదపడి నిగ్రహీతుఁ డయ్యెఁ దా నొక్కపన్నగుచేత ?

వ. అనిన విని వైశంపాయనుం డిట్లని చెప్పె; నట్లు భీముం డొక్కండ హిమవదుత్తుంగ శృంగోపాంతకాంతారంబుల మృగయాభ్రాంతిఁ బరిభ్రమించుచు నతిశ్రాంతుం డయి తత్ప్రదేశంబున. 104

మ. అశనాశావివృతాస్యగహ్వరుఁ గృతాంతాకారు, నిశ్వాసధూ
మశిఖాధూసరితోగ్రదుర్గతరుగుల్మవ్రాతు, హారిద్రవ
ర్ణశరీరున్, భృశరూక్షదర్శను మహానాగప్రభుం గాంచె న
ర్ధశశాంకద్యుతిహాసిదారుణచతుర్దంష్ట్రిన్, జగత్త్రాసకున్. 105

వ. అమ్మహాజగరం బామిషార్థి యై భీముం బట్టికొని, వాని భుజయుగళంబుఁ దన ముఖంబున, నంగంబులు నిజాంగంబున బంధించిన నాగాయుతబలుం డయ్యును దదంగసంగంబున దుర్బలుం డయి, మెలంగ నేరక భీముం డప్పాము బలవీర్యంబులకు విస్మితుం డయి, "యిది

ప్రకృతిసర్పంబుగా; దెద్దేనియు నొక్క యద్భుతరూపం'' బని విచా
రించుచు దాని కిట్లనియె. 106

మత్తకోకిలము. "ఏను భీముఁడఁ, బాండవేయుఁడ, నిద్ధతేజుఁడ, ధర్మరా
జానుజుండఁ, బిశాచపన్నగ యక్షరాక్షసవీరులం
బూని పోరుల నోర్వ నోపెడు భూరివీరుఁడ నాగ పం
చాననాదులఁ బట్టి ద్రచ్చు ననంతబాహుబలాఢ్యుఁడన్.

ఆ. ఇట్టి నన్నుఁ బట్టి యిప్పాట బంధించు
నట్టి శక్తి యెట్టు లయ్యె నీకు ?
నిది నిసర్గశక్తియే? వరదానసం
సిద్ధి నైనయదియె ? చెప్పు" మనిన. 108

వ. అదియును దిర్యగ్జాతి యయ్యును దన పూర్వస్మృతి సెడ కుండ
వరంబుఁ గాంచుటం జేసి వాని కి ట్లనియె. 109

క. ''ఇది నా వరలాభంబున
నుదయించిన శక్తి; యెట్టి యున్నతబలసం
పదు లయిన జీవులును నా
యెదురను బలహీను లగుదు రిబ్భువినమునన్. 110

ఆ. ఎదురఁ బడినఁ దాఁకి వనలక శార్దూల
శరభసామజాదిసత్త్వతతులఁ
బట్టి తినుచు నున్న యట్టి నా కిప్పుడు
భక్ష్య మైతి వీవు పాండుపుత్ర ! 111

ఆ. శక్రపదవిఁ బొంది, సద్బ్రాహ్మణుల కవ
మాన మేను జేసి. మదము పేర్చి
ననఘ ! యిట్టు లైతి నం దొక్కమునివరు
శాపశక్తిఁ దొంటిశక్తి దఱిఁగి." 112

వ. అని దుఃఖించిన యజగరంబునకు భీముం డి ట్లనియె. 113

క. "కడుకొని కదుదుఃఖములై
నెడ నుచితమై యాత్మనింద ? యెయ్యెడల మనం

బడలక యేకాకృతి నె
ప్పుడు నుండుట నూనె వురుషు పురుషార్థ మిలన్. 114

—: ధర్మరాజు భీమసేనుని వెదకఁబోవుట :—

వ. కావున పురుషకారంబునంజేసి దైవంబు నివర్తింప నెవ్వ రోపుదు? రేను మహాబలుండ నయ్యును భవద్గృహీతుండ నై యిట్టి యవస్థం బొందితి; నాత్మత్యాగంబునకు వగవ; నపహృతరాజ్యానభోగులై మద్భ్రాతృవరులు దుర్గమంబైన యిప్పర్వతంబునం గ్రుమ్మరు చున్నవారు; నన్నుఁ గానక యెంతదుఃఖింతురో యని వగచెద" నను చున్నంత నట ధర్మతనయుండు దీప్తం బైన శివారుతంబు విని, యతిశంకితచిత్తుండయి, యనంతరంబ తన దక్షిణభుజాస్పందనం బుపలక్షించి, మీఁద లగ్గగు నంచు ననుజమధ్యంబున ననిలజుం గానక యర్జునుం గవలను గృష్ణారక్షణార్థంబుగా నియోగించి, ధౌమ్య పురోగమభూసురవరులతో భీము రోయుచుం దదీయపాదతల లలిత హలకులిశ కలశాదిలక్షణలక్షితంబైన పాంసుపథంబునం జని ముందట.

క. గిరిశిఖరాభోగబృహ
త్తరభుజగశరీరవేష్టితశరీరుండై
భరమునఁ గదలఁగ నేరక
పరమశ్రమ మడర నున్న పవనజుఁ గనియెన్. 116

క. కని యాత్మగతంబున "ని
య్యనిలజుఁ డొక పాముచేత నదె వేష్టితుఁడై
తన లావు దక్కఁగి ప్రాకృత
జనుక్రియ ని ట్లున్నవాఁడు సామాన్యముగన్. 117

వ. ఇది యేమి యాశ్చర్యంబొక్కో" యనుచు ననిలజుం జూచి దుఃఖితుం డై ధర్మజుం డయ్యజగరంబున కి ట్లనియె "నయ్యా! నీవు సర్పరూపంబుఁ దాల్చిన దైత్యుండవో! దేవతవో! యేను యుధిష్ఠిరుండ; ని న్నడిగెద; నిమ్మహాభుజు నాయనుజు నా మిషార్థివై పట్టితేని నీకు బుభుక్షానివృత్తి యగునట్లుగాఁ జాలినంత మృగమాంసంబుఁ బెట్టెద; వీని విడువు" మనిన ధర్మజునకు నయ్యజగరం బి ట్లనియె. 118

సీ. "వినవయ్య! నహుషుఁ డన్ జనపతి నేను; మీ
పూర్వజులకు నట పూర్వజుండ;
ననఘ! సుత్రామున కెన యగువాఁడ; నై
శ్వర్యగర్వంబున నార్యవృత్తి
విడిచి, వివేకంబు సెడి, సహస్రోత్తమ
బ్రాహ్మణకృత మైన బ్రహ్మరథము
నెక్కి బ్రాహ్మణులకు నక్కజం బగు నవ
మానంబు సేసినదాన నాకుఁ

ఆ. గలశభవుఁ డగస్త్యుఁ డలిగి యత్యుగ్రాహి
వగు మటంచు శాప మప్పుడిచ్చె;
మునివరేణ్యు శాపమునఁ జేసి యిప్పాట
నపయుచున్న వాఁడ నాఁటఁగోలె. 119

వ. విధివిలసితంబు పేర్మి నీ కే మని చెప్పుదు? 120

చ. చదివితి నెల్ల వేదములు, సద్విధిఁ జేసితి నూఱుయజ్ఞముల్,
విదితముగా సురేంద్రపదవీస్థితిఁ బొందితి, దుర్మదంబునం
దుదిఁ బెనుఁబాము నై యధికదుఃఖితుఁ డైతి; సుఖంబు దుఃఖముల్
వదలక చేయుచోట బలవద్విధి కేమిభరంబు సెప్పుమా? 121

వ. అయ్యగస్త్యుచేత నిట్లు శాపగ్రస్తుండ నై శక్రాసనంబువలనం బాసి యిట వచ్చుచు నుండి "మునీంద్రా! నాకుఁ బూర్వస్మృతి సెడకుండను బలవంతంబు లైన సత్త్వంబులు నన్ను ముట్టుచో బలహీనంబు లై భక్ష్యంబులుంగాను, శాపవిమోక్షంబున కుపాయంబును బ్రసాదింపు" మని కృతాంజలి నై యున్న నాకుం గరుణించి మునివరుండు నా వేఁడిన వరంబు లిచ్చి యి ట్లనియె. 122

క. "క్రమమున నీయడిగిన ప్ర
శ్నములకుఁ బ్రత్యుత్తరంబు సన్మతి నత్యు
త్తముఁ డెవ్వఁ డిచ్చు, నతని క
తమునను శాపాంత మగు బుధస్తుత! నీకున్. 124

వ. అది దీర్ఘ కాలంబునకుం గాని కా" దనియె; నేనును దద్వచనం
బిచ్చి నమ్మి పెద్ద కాలం బియ్యెడవి నున్న వాఁడ; నేఁడు నీ
తమ్ముఁడు దుష్టకాలప్రాప్తుం డైన నాకు భక్ష్యంబయ్యె; నోపుదేని నా
ప్రశ్నములకు, బ్రత్యుత్తరం బిచ్చి వీని విడిపించుకొ" మ్మనిన ధర్మ
జుం డిట్లనియె. 124

క. "నీ యడిగిన యర్థాభి
ప్రాయములకు నుత్తరంబు పరువడిఁ జెప్పెద
ధీయుత! బ్రాహ్మణులకుఁ గా
కాయతమతు లయ్యు నొరుల కవి విషయములే? 125

—: ధర్మరాజు నహుషప్రశ్నంబులకుఁ బ్రత్యుత్తరంబు లిచ్చుట :—

వ. అయినను నా నేర్చువిధంబునం జెప్పెద నడుగు" మనిన నజగరం
బి ట్లనియె. 126

ఆ. "ఘనుఁడ! యేగుణములు గలవాఁడు బ్రాహ్మణుం?
డతని కెఱుఁగఁదగినయట్టి వస్తు
వెద్ది? దీని నాకు నెఱిఁగింపు" మనిన ని
ట్లనియెఁ జెప్పెఁ బాండవాగ్రజుండు 127

సీ. "సత్య క్షమా దమ శౌచ దయా తపో
దానశీలంబు లెందేనిఁ గాన
నగు, నట్టివాఁడు బ్రాహ్మణుఁడు; సుఖంబు దుః
ఖంబునై నెడ విమోహంబు నొంద
కునికియ వానికి నుత్తమం బగు విద్య;"
యనిన నీ చెప్పిన గుణము లివియు
క్రియ శూద్రునందఁ గల్గిన నతం డుత్తమ
ద్విజుఁడు గా నేర్చునే? నిజము విడిచి

ఆ. నట్టులయిన బ్రాహ్మణాదివర్ణవిభాగ
మెట్లు గలుగునయ్య; హీను లధికు
లను వివేక మది యపార్థకం బగుఁ గాదె?"
యనిన ననియె నంతకాత్మజుండు. 128

వ. "ప్రమాదంబున వర్ణసంకరం బయినప్పుడు వర్ణపరీక్షార్థంబుగా బ్రాహ్మణాదులకు వృత్తంబు వేఱువేఱ స్వాయంభువుం డైన మనువు సెప్పె; సత్యాదిగుణంబులు శూద్రునందుఁ గలిగెనేని వాఁడు సచ్ఛూద్రుం డగుఁగాక బ్రాహ్మణుండు గా నేర్చునే? యవియు బ్రాహ్మణునందు లేనినాఁడు శూద్రుండ యనంబడుం; గావున వృత్తంబుల యుత్తమంబులు. 129

తే. విత్తహీనుండు వెండియు వివిధవిధుల
విత్తవంతుండు గా నేర్చు; వృత్తహీనుఁ
డైనవాఁడు విహీనుండ యండ్రు; గాన
విత్తరక్షకుఁ గడుమేలు వృత్తరక్ష. 130

వ. అనిన నజగరం బి ట్లనియె. 131

తే. "అప్రియం బొగిఁ జేసియు, ననృతవాది
యయ్యు, హింస గావించని యమ్మహాత్ముఁ
డేఁగు సుగతికినం; దది యెట్లు? సెప్పు
మయ్య యనఘ! యహింస మేలైన తెఱఁగు." 132

వ. అనిన ధర్మతనయుం డి ట్లనియె; "దానంబును, బ్రియంబు చేత యును, సత్యంబును, నహింసయు నను నివి నాలుగును సమానంబుల; యయినను నహింసయ విశేషం; బెట్లనిన దేవ మనుష్య తిర్యగ్యోను లనియెడు మూఁడుగతులయందును మనుష్యుండు దానాది గుణం బులు గలిగి యహింసాపరుం డయిననాఁడు దేవగతి వడయు; విప రీత వర్తనుం డయి తిర్యగ్యోనులం బొందు" నని యిట్లు తన చేసిన ప్రశ్నంబులకుఁ బ్రత్యుత్తరంబులు వలికిన ధర్మనందనున కతి ప్రీతుం డయి, భీమసేనుని విడిచి శాపవిముక్తుం డయి, దివ్యరూపంబు సేకొని యున్న నహుషునివలన నధ్యాత్మ విద్యా రహస్యంబు నిమ్ముగా నెఱింగి, యుధిష్ఠిరుండు వృకోదరుం దోడ్కొని నిజాశ్రమం బునకు వచ్చి యున్నంత. 133

క. ఖరకిరణతాపమున, నురు
తరదవదాహమున శోషితము లైన వనాం

తరతరుతతి కాప్యాయన
కరమై వర్షాగమంబు గడు బెడఁ గయ్యెన్. 134

క. నాలుఁగు కెలఁకుల నవఘన
జాలంబులు ్రవేలి కురిసె ఝుంఝూనిలవే
గాలోలము లై బహుల
స్థూలపయోధార లోలిఁ దుము లంబులుగాఁ. 135

క. ఘనతరనై శతమం బొకొ
యనఁగ ఘనాగమతమిస్ర మవిరలమై క
ప్పిన జనులకు వస్తువిభా
వన మొక్కొక్కయెడలఁ గలిగె వైద్యుతరుచులఁ. 136

చ. అరుదగు తత్పయోదసమయంబున నొక్కట విస్తరిల్లె నం
బరమున నంబుదధ్వనియుఁ, బల్వలభూముల భూరిదర్దురో
త్కరరవముల్, మహీరుహశిఖండములందు శిఖండితాండవాం
తరమదమంజులస్వనము దారతరంబగుచుఁ వనంబునఁ. 137

చ. దళితనవీనకందళకదంబకదంబకకేతకీరజో
మిళిత సుగంధబంధురసమీరణుఁ డఁ సఖుఁ దూఁచుచుండఁగా
నులియుచుఁ బువ్వు గుత్తులను నుయ్యెలలొప్పుగ నెక్కి యూఁగె ను
ల్లలదళినీకులంబు మృదులధ్వనిగీతము విస్తరించుచుఁ. 138

క. సురచాపచిత్రగగన
స్ఫురణం బురుణించునట్లు భూవనిత నిరం
తరచిత్రిత యై యొప్పెను
సురుచిరనవతృణశిలీంధ్ర సురగోపములఁ, 139

వ. తత్సమయానంతరంబున. 140

ఉ. భూసతికిం దివంబునకుఁ బొ ల్పెసఁగంగ శరత్సమాగమం
బాసకలప్రమోదకర మై విలసిల్లె మహర్షిమండలో
పాసితరాజహంసగతిభాసి ప్రసన్నసరస్వతీక మ
బ్జాసనశోభితం బగుచు నబ్జజయానముతో సమాన మై. 141

ఉ. శారదరాత్రు లుజ్జ్వలలసత్తరతారకహారపంక్తులం
జారుతరంబు లయ్యె, వికసన్నవకైరవగంధబంధురో
దారసమీరసౌరభము దాల్చి, సుధాంశువికీర్యమాణక
ర్పూరపరాగపాండురుచిపూరములం బరిపూరితంబులై. 142

నన్నయభట్టకవిత్వము సంపూర్ణము

—: ఇక్కడ నుండి యెఱ్ఱాప్రెగడ కవిత్వము :—

చ. స్ఫురదరుణాంశు రాగరుచిఁ బొంపిరివోయి నిరస్తనీరదా
వరణము లై, దళత్కమలవైభవజృంభణ ముల్లసిల్ల, ను
ద్ధురతరహంససారసమధువ్రతనిస్వనముల్ సెలంగఁగాఁ
గరము వెలింగె వాసరముఖంబులు శారదవేళఁ జూడఁగన్. 143

శా. దానాంభఃపటలంబునం బృథుపయోధారావలిం దాల్చి, గ
ర్జానిర్ఘోషము బృంహితచ్ఛలనఁ బ్రచ్ఛాదించి, ప్రావృట్పయో
దానీకంబు శరద్భయంబున నిగూఢాకారతన్ డిగ్గ నాఁ
గా నొప్పారె మదోత్కటద్విరదసంఘంబుల్ వనాంతంబునన్. 144

క. కలనీలకంఠకోలా
హలలీలలు సెందె రాజహంసకులంబున్;
విలసించె సప్తపర్ణా
వలి; విగళితకుసుమకుటజవాటికలడరెన్. 145

మ. అతిగాంభీర్యవిభూతి నేఁచుచుఁ గాహంకారనిశ్శేషశో
షితపాథోధిపయస్కుఁడైన ముని దోఁచెం బుణ్యతేజోమయా
కృతి నయ్యామ్యదిగంతవీథిఁ బ్రకట క్రీడాకళాగర్వగ
ర్జితమండూకకళంకితాంబుశుచితాసిద్ధిప్రదాచార్యుఁడై. 146

తే. విశదశారదాంబుదపరివేష్టనమునఁ
బొలుచు గగనంబు ప్రతిబింబమో యనంగ
వికచకాశవనీపరివేష్టనమున
నతిశయిల్లె నిర్మలకమలాకరములు. 147

వ. అట్టి శారదాగమంబున నుత్ఫుల్లకమలకల్హారకేసరకరాళకలితకల్లోల
మాలినియు, ననేక ము నిలోకసతతసంసేవ్యమాన విపులపులినోత్సం

గయు, నిరంతర తీర వానీరవన మండలీవిలసితయు, నాకాశసంకాశ విశదసలిలయు నైన సరస్వతీ మహానది ననుదినస్నానపానాదివిశేషంబులం బరితోషంబు నొందుచుఁ బాండునందను లమ్మరుభూమిం గొన్నిదినంబులు వసియించి, తదనంతరంబ ధౌమ్యాదిభూసురవరులు, నింద్రసేనాదిమూలభృత్యులుఁ దోడ నరుగుదేరఁ గామ్యకవనంబునకు వచ్చి, యచ్చటి మునులచేత నభినందితు లై, యందు సముచితవర్తనంబుల నుండ నంత నొక్కనాఁడు. 148

క. వాసవనందనసఖుఁ డగు
భూసురుఁ డొకఁ డరుగుదెంచి భూవినుతగుణో
ద్భాసితు ధర్మజు విప్రస
భాసీనుం గాంచి యిట్టు లనియెం బ్రీతిన్. 149

చ. "జనవర! నీవుఁ దమ్ములును సమ్మద మొప్పఁగ నివ్వనంబునం
దునికి ధ్రువంబుగా విని మహోజ్జ్వలతేజుఁడు, దేవకీసుతుం,
డనఘు.డు మిమ్ము జూచుటకు నై యిదె వచ్చుచు నున్నవాఁడు; మీ
కును ననిశంబుఁ దా హితము కోరుచు నుండు నతండు నెయ్యుఁడై.

వ. మఱియు ననేక యుగసహస్రజీవియు, నప్రమేయతపఃప్రభాసియు, వినుత విధేయుండు నగు మార్కండేయుండును భవదీయదర్శనార్థం బీక్షణంబ చనుదెంచు'' నని చెప్పిన యనంతర ముహూర్తంబున. 151

**—: శ్రీకృష్ణుఁడు సత్యభామతోడఁ బాండవులయొద్దకు వచ్చుట :—**

సీ. శైబ్యసుగ్రీవాదిజవనాశ్వయుక్తమై
యాబద్ధనూత్న రత్నాంశుపటల
భాసితంబై, చారుపతగపతాకావి
భూషితగగన మై పొలుపు మిగులు
దివ్యరథంబున దేవకీసుతుఁడు ప్రి
యంబున సత్యభామాన్వితముగఁ
దరళసౌదామినీదామసముజ్జ్వల
ధారాధరోత్సంగతలమునందు

ఆ. శశియుఁ దాను వెలుఁగు శతమన్యుఁడునుబోలె
సరుగుదెంచె ఘనరథాంగ నేమి
విపులఘోష తాండవితబర్హిశబ్దశ
బ్దాయమానవనవిభాగుఁ డగుచు. 152

వ. ఇట్లు వచ్చి వాసుదేవుండు రథావతరణంబు సేసి ధర్మనందనున కభివం దనం బాచరించి, భీమార్జుననకులసహదేవులం గౌఁగిలించుకొని, ద్రౌపదిం గారవించి, ధౌమ్యాది మహీసురులచేత నభినందితుం డయ్యె; నంతఁ గౌంతేయాగ్రజుండు గదాగ్రజునకు నర్ఘ్యాది సత్కారంబులు నిర్వర్తించి, తమ్ములుం దానును విప్రజనంబులు నతనిం బరివేష్టించి యుండె; నప్పుడు కృష్ణుండు ధనంజయుం దన చేరువ నునిచికొని చిర కాల దర్శనోల్లాసితంబు లైన యాలోకనంబుల నతని యాకారం బత్యాదరంబున నభినందించుచు ధర్మరాజున కిట్లనియె. 153

సీ. "భాగ్యంబు గాదె యీ పార్థుండు హరుఁ డాది
యైన నిర్జరసమూహంబువలన
నెమ్మిఁ గృతాస్త్రుఁ డై యే తెంచు టరయంగ;
ధన్యుండ వై తీవు ధర్మతనయ!
నీ ధర్మనిష్ఠయు నీతపంబును జూవె
యింతకుఁ గారణం బిద్ధచరిత!
రాజ్యంబుకంటెను రాజేంద్ర! ధర్మంబ
యిష్ట మై యుండు నీ కెల్లనాఁడు;
తే. వేదవేదాంగవిదుఁడవు, వివిధయజ్ఞ
కర్త వైతి, ధనుర్వేదకర్మఠుఁడవు;
ధరణి యెల్ల నేలెడి రాజధర్మ మమర
సులభ మయ్యె నీ కిహపరశోభనములు. 154

చ. దమమును, సత్యయుక్తియును, ధైర్యనిరూఢియు, నిత్యతృప్తియున్
శమమును నీకు నైజములు; సన్మతి నర్థవశంబుఁ, గామలో
భములును బొంద; వట్లగుటఁ బార్థివకుంజర! ధర్మరాజనా
మమునఁ ద్రిలోకపూజ్యమహిమం బొగ డొందెద వెల్లకాలమున్.

వ. అని పలికి వెండియు. 156

శా. ద్యూతవ్యాజమునన్ సభాంగణములో దుర్యోధనుం డట్లు దు
ర్నీతిం గూరి యొనర్చినట్టి యఘముల్ నిష్కంపధైర్యోన్నతిన్
జేతఃస్ఫారుఁడ వైన నీ కొకనికిం జెల్లెన్ సహింపంగ; వి
ఖ్యాతక్షాంతులు లేరె ధార్మికులు! నిక్కం బిట్టి రే యెవ్వరున్? 157

ఉ. ఉల్లము సత్త్వసంశ్రయము నొందినవాఁడవు; నీవు విక్రమం
బొల్లమిఁ గౌరవాధముల యుద్ధతి యమ్మెయిఁ జెల్లెఁగాక; యొం
డెల్లను నేల? నీదుమది నించుక కిన్క జనించినన్ మహీ
వల్లభ; యప్డు రూపఱదె? వారక వైరికులంబు సర్వమున్. 158

చ. వినుతభవన్నియోగ మను వేల యలంఘ్యము గాన యిమ్మెయిన్
ఘనభుజవీచివిభ్రమవికాసముఁ జూపక నిల్చెఁ గాక; స
జ్జనసుత! చూడ నీ యనుజసాగరముల్ దఱితోడ విద్విష
జ్జనలయకారులై కడఁగి సర్వజగంబుల నాక్రమింపవే? 159

ఉ. అంధకవృష్ణిభోజకుకురాన్వయభూపతు లెల్ల నీదెసన్
బాంధవసౌహృదప్రణయభక్తివిశేషము లొప్ప, నీమనో
గ్రంథి యడంగఁ జేయ నెసకంబునఁ బూనినవారు; లోభమో
హాంధులు ధార్తరాష్ట్రులు జనాధిప! మార్కొనువారె వారలన్?

క. చతురంభోధిపరీత
క్షితితలసామ్రాజ్యలక్ష్మికిం బతివి జగ
న్నుత! నీవ; నీవు దలఁచిన
నతిదుష్కర మెందు లే దనర్ఘశమహిమన్." 161

వ. అనిన సంతోషిల్లి కుంతీనందనుండు దేవకీనందనుతోడ "దేవా! యెవ్విధంబున నైన నల్పావశిష్టం బైన యివ్వనవాసంబును, నజ్ఞాత వర్తనంబును దీర్చి లోకనింద్యంబు గాని విక్రమంబునం బగఱ జయింపఁ గోరెదము; దీని నంతయు నిర్వహించు భారంబు నీ యదియ; నీ శరణంబు సొచ్చిన మాకుం బరమ శోభనంబులును సులభంబులగుట నిశ్చయంబుగాదె" యనియె; నప్పుడు కృష్ణుండు నిజసమీపంబున నున్న పాంచాలిం జూచి యి ట్లనియె. 162

సీ. "నీ పుత్రు లేవురు నీరజలోచన
యదుకుమారులుఁ దారు ముదముతోడ
ననుపమస్నేహసమాహృతహృదయులై,
కరిహయారోహణ పరతఁ దగిలి
యాడుచు, వివిధశస్త్రాస్త్రప్రయోగముల్
గఱచుచు, నొం డెల్ల మఱచియున్న
వారు; ప్రద్యుమ్నుండు వారికి దివ్యాస్త్ర
జాతంబు లెల్లను బ్రీతి నొసఁగెఁ;

ఆ. దన్వి యా సుభద్ర తన పుత్రుకంటె నీ
తనయులందుఁ గూర్మిఁ దనరఁ జేయు;
నూఱడిల్లు మింక నుజ్జ్వలోన్నతులఁ బెం
పారఁ గాల మనతిదూరమయ్యె." 163

—: మార్కండేయుం డను మహాముని పాండవులయొద్దకు వచ్చుట :—

వ. అని యాశ్వాసించు సమయంబునం బరమ తపోవృద్ధుం డయిన మార్కండేయుండు సనుదెంచినం గృష్ణుండును బాండవులు నతని నెదుర్కొని యథోక్త విధులం బూజించిరి; మునీంద్రుండును వారిని బ్రత్యేకంబ కుశలంబు లడిగెఁ; దదనంతరంబ యందఱు నాసీనులై యున్నయెడఁ బాండవహితార్థి యై వనజోదరుం డమ్మునివరున కిట్లనియె. 164

ఉ. "ఏనును, బాండునందనులు, నిమ్మునిముఖ్యులు నిప్డు లోకస
మ్మానితవాక్య! నీ దయిన మంజులవాగమృత ప్రవాహముల్
వీనులదోయి నించుచును వేడుకఁ గ్రోలికొనంగ నాత్మలం
బూనెద; మస్మదీప్సితము పూర్ణము సేయఁగ నర్హ మెమ్మెయిన్. 

వ. కావున. 166

క. దేవ నరదేవ ధరణీ
దేవచరిత్రములు, భర్తృదేవత లనగా
భూవినుత లయిన సతుల ప్ర
భావము లెఱిఁగింపు మోలిఁ బ్రస్ఫుటములుగాన్." 167

వ. అని యడుగుచున్న యెడ నారదుం డేఁగుదెంచిన నందఱు ప్రత్యుద్గతులయి ప్రణమిల్లి, యాతని నుచితపీఠంబున నునిచి, యుచిత సత్కారంబులం బ్రీతునిం జేసిన నమ్మహాముని మార్కండేయునిం జూచి "కృష్ణపాండవ ప్రియహితార్థంబుగాఁ బరమపుణ్యకథాకథనం బొనరింతువు గాక" యని పలికి వారల నామంత్రణంబు సేసి నిజేచ్ఛం జనియెఁ; దదనంతరంబ ధర్మతనయుండు మార్కండేయున కిట్లనియె. 168

సీ. "కడఁగి ధర్మములోడ నడచుచు నే మిట్లు
దందడి దుఃఖంబు లొందుటయును,
నేపున నెప్పుడు పాపంబు సేయుచు
ధృతరాష్ట్రజులు సుఖోన్నతు లగుటయుఁ,
గని యీ విపర్యయమునకు నే నూహింతుఁ
బాయక నరుఁ డిప్డు సేయు కర్మ
మున ఫల మిందుఁ బొందునొ? పరలోకంబు
నందుఁ బొందునొ? యిందు నందుఁ గనునొ?

ఆ. విశ్వకర్తయైన యీశ్వరుఁ గానని
పురుషుఁ గర్మఫలము పొరయ కున్నె?
యొడలితోనఁ గృతము వెడలిపోవునొ? యిది
దెలియవలయు నాకు నలఘుపుణ్య! 170

వ. ఇంతయు నెఱింగింప నీవ యర్హుండ" వనినఁ బరమజ్ఞాననిధి యైన యత్తపోనిధి యతని కిట్లనియె "దొల్లి విధాత ప్రథమకల్పంబున నత్యంత నిర్మలంబులును ధర్మతంత్రంబులును నైన శరీరంబులు సృజియించె; నట్లు పుట్టింపఁబడిన యామనుష్యులు మహాసత్త్వ సంపన్నులు, సత్యవాదులు, సత్యసంకల్పులు, బ్రహ్మభూతాత్ములు, స్వచ్ఛందజీవులు నై దేవయానంబుల విహరించుచు, ననాయాసంబున నధికఫలసిద్ధిం బొందుచు, సర్వధర్మజ్ఞులై, విగతమత్సరులై, బహుసహస్రసంతానులై, బహుసంవత్సరాయుష్యులై వర్ధిల్లుచుండి; రంతఁ గాలాంతరంబునం గామక్రోధాదిగుణంబులు దమ్ముం బొందుటయు మాయాప్రవర్తనులై దేవతలచేత విడువంబడి యల్పాయు

వులు: నల్పబలశరీరసత్త్వులును, దరిద్రులును, నిష్ఫలారంభులును, బహురోగపీడితులును, నాస్తికులును నై యొండొరుల మెచ్చక దురితంబులు సేయుచుఁ, దిర్యగ్యోనులం బుట్టుచు, నరకాగ్నులం గ్రాఁచుచు గతాగతభ్రమణంబుల నలయం దొడంగి; రిట్లు దిరుగు చున్న సంసారచక్రంబునందు. 170

చ. మనుజులు పుణ్యపాపములు మానక యి ట్లొనరించుచుం దుదిం
దనువు దొఱంగి పోవునెడఁ దప్పదు. నీడయపోలెఁ గర్మముల్
వెనుకన యేఁగి భూరిసుఖవిస్మృతియుం, బటుదుఃఖదైన్యముం
దనుకఁగ జేయుఁ; గ్రమ్మఱఁగఁ దాన యొనర్చు భవంబు దేహికిన్.

క. విను మనుజున కెవ్విధమునఁ
దనఁ జేసిన సుకృతదుష్కృతంబులు నెఱయం
దన కనుభవింపఁ బాలివి
తనువు సెడుం గాని కర్మతతి సెడ దనఘా! 172

వ. మఱియు నొక్క నిదర్శనంబు సెప్పెద. 173

క. ఈలోకమ యగుఁ గొందఱ
కాలోకమ కొందఱకు; నిహాంబును బరమున్
మే లగుఁ గొందఱ; కధిపా!
యేలోకము లేదు సూవె యిలఁ గొందఱకున్. 174

వ. అది యెట్లనిన. 175

చ. ధనములు పాలఁ గల్గి, సతతంబును నింద్రియవాంఛ సల్పుచున్,
మనమున నెన్నఁడున్ సుకృతమార్గము పొంతకుఁ బోక, లోభమో
హనిహతబుద్ధు లై తిరుగునట్టి జనుల్ పరలోక సౌఖ్యముల్
గనుటకు నేర, రిక్కడి సుఖంబులు మేలయి తోఁచు వారికిన్. 176

మ. ఉపవాస వ్రత సంతతాధ్యయన తీర్థోపాసనాదిక్రియా
కపరత్వంబునఁ జేసి యైహికము దుఃఖప్రాయమై పోవఁగా
విపులానందముఁ బొందఁ గల్గుఁదుది నావిర్భూతభోగైకలో
లుపబుద్ధిం జిరపుణ్యశీలురకు నా లోకంబువన్ భూవరా. 177

ఉ. ధర్మము నల్పుచుం, దగిలి ధర్మపథంబునఁ జేసి యర్థముం
బేర్మియుఁ గాంచి, ధర్మవిధిఁ బెండిలి యై ప్రజలన్ సృజించి, స
త్కర్మములం బ్రశస్తములుగాఁ గ్రతువుల్ వొనరించు సజ్జనుల్
ధర్మజ! యిందు నందును ముదంబునఁ గాంతు రభీష్టసౌఖ్యముల్.

ఆ. సత్యమును శమంబు శౌచంబు లేక నా
స్తిక్యమును నిషిద్ధసేవనంబు
గలిగి తిరుగు దుష్టకష్టజన శ్రేణి
పొలియు నుభయలోకములకుఁ గాక. 179

వ. ఇది మనుష్యుల కర్మగతి ప్రకారంబు. 180

చ. జననుత ! మీరు దివ్యులరు; సమ్మతి దేవహితార్థ మిమ్మహిన్
జననము నొందినారలు; ప్రశస్తపరాక్రమలీలఁ బేర్చి, యిం
క నఖిలశత్రునిర్మథనకర్మ మొనర్చి, మహీభరంబు దీ
ర్చి, నియతిఁ బెక్కుజన్మములు సేసి, భజింతురు దేవభావమున్.

—: మార్కండేయుఁడు ధర్మజునకు బ్రాహ్మణప్రభావంబు సెప్పుట :—

వ. అనిన విని ధర్మనందనుండు "బ్రాహ్మణప్రభావంబు వినవలతుం జెప్పవే" యనిన మార్కండేయుం డిట్లని చెప్పెఁ "దొల్లి హైహయ వంశోద్భవుం డైన ధుంధుమారుండను పేరి రాజకుమారుండు మృగయాసక్తుండై వనంబునఁ గ్రుమ్మరుచుఁ డొక్కయెడం దృణలతాగుల్మ మధ్యంబునం గృష్ణాజినోత్తరీయుం డయి యున్నవాని, నొకవిప్రు దవ్వులం గని మృగం బను బుద్ధింజేసి బాణం బేసి డాయం జని నిశ్చేతనుం డయిన యతనిం జూచి యత్యంతదుఃఖితుం డయి, పురంబునకుం బోయి, నిజవంశవృద్ధు లైన హైహయులకుం తవృత్తాంతంబునుం జెప్పి, వారిం దోడ్కొని వచ్చి యవ్విప్రకళేబరంబు సూపిన.

తే. వార లందఱు వందురి వగచి, యచటి
కటిసమీపంబునను దార్క్ష్యుఁ డను మునీంద్రు
నాశ్రమం బున్న నయ్యెడ కరిగి, కనిరి
దేవ ముని సిద్ధలోకప్రతీక్ష్యుఁ దార్క్ష్యు. 183

క. కని భక్తి మ్రొక్కుటయు న
యన్యఘుఁడు దీవించి వారి కర్థ్యమ్మగు పూ
జనము లొనరింపఁ బంచెం
దన శిష్యులఁ బరమ సంశ్రితవ్రతుఁడు కదంయన్. 184

వ. హైహయులు నమ్మునీంద్రునకు సాష్టాంగదండప్రణామంబులు సేసి "మహాత్మా! యిక్కుమారుండు మృగయాసక్తుం డై వచ్చి యింతకు మున్న యివ్వనంబున నొక్కబ్రాహ్మణుం, గృష్ణాజినావృతు, నతి శ్రాంతుం బాపంబునం జేసి మృగం బను బుద్ధి నేసిన నతండు మృతుం డయ్యె; నేము మహాపాతకదూషితుల మైతిమి; గావున మీ చేయు సత్కారంబుల కర్హులము గాము; మిప్పాపంబున కెయ్యది నిష్కృతి?" యనిన నవ్వుచుఁ దార్క్ష్యుం డి ట్లనియె. 185

క. "వినుఁ డెన్నఁడు మాయాశ్రమ
మున నెవ్వారికిఁ లేవు భూరిభయవ్యా
ధి నిరోధ మృత్యు దోషా
ద్యనేకదుఃఖములు త్రిజగదాశ్చర్యముగన్." 186

వ. అని పలికి దన పుత్త్రు నధిక తపోబలసమన్వితుం జూపి. 187

క. "ఈతఁ డగునె మీ బాలకు
చేత నిహతుఁ డైన వాఁడు సెప్పుఁ" డనుడు వా
రాతఁడ తమ మును చూచిన
యాతండగుటకు మహాద్భుతాత్మకు లగుచున్. 188

క "మృతుఁ డయి క్రమ్మఱ సంజీ
వితుఁ డయ్యె నితండు; కరము విస్మయ మిది; భూ
నుత! యిట్టి మహిమ కలిమికిఁ
గత మెయ్యది? యానతిమ్ము కారుణ్యనిధీ!" 189

వ. అని యడిగినఁ దార్క్ష్యుం డి ట్లనియె. 190

శా. ఆలస్యం బొకయింత లేదు; శుచి యాహారంబు; నిత్యక్రియా
జాలం బేమఱ; మర్చనీయు లతిథుల్; సత్యంబ పల్కంబడున్;

మేలౌ శాంతియు బ్రహ్మచర్యమును నెమ్మిం దాల్తు; మిళ్లోట నె
క్కాలంబుం బటు మృత్యురోగభయశంకం బొంద మే మెప్పుడున్.

వ. ఇది యస్మదీయప్రభావంబు; మీకుఁ జాతకభయంబు వలవ; దరుగుం"
డనినం దార్ష్యుని వీడ్కొని హైహయులు నిజనివాసంబులకుం జనిరి;
భరతవంశోత్తమ! యిట్టిదియ బ్రాహ్మణప్రభావం'' బని మఱియు
మార్కండేయుఁడు " బ్రహ్మక్షత్రియస్వరూపనిదర్శనం బయిన యితి
హాసం బొక్కటి సెప్పెద విను'' మని ధర్మరాజున కిట్లనియె. 192

చ. "వినుతచరిత్రుఁ డత్రి యను విప్రవరుండు తపం బొనర్పఁ గా
ననమున కేఁగుచుండి తన నాతిఁ గనుంగొని యిట్లనుం 'దపం
బున కిదె యేను బోని వనభూమికిఁ బోవుచు నున్నవాఁడ, నో
వనరుహనేత్ర! నీవు నట వచ్చెదొ? పుత్రులయొద్ద నుండెదో?' 193

చ. అనుటయు భార్య యిట్లనియె "నక్కట! పుత్రులకుం గుటుంబభా
వన యగువృత్తి యెల్లను ధురీనంబుగఁ జేయక, యాశ్రమాంతరం
బునకు మహాత్మ! నీకు నిటు వోవుట ధర్మువు గాదు; వైన్యభూ
జనపతి యిచ్చు నర్థులకుఁ జాలఁగ నర్థము; వేఁడు కువ్విభున్!" 194

వ. అనినం గొండొక విచారించి, భార్య పలుకులు ధర్మయుక్తంబు లగు
టకు సంతోషించి, యమ్మహాద్విజుం డప్పుడ చని యశ్వమేధాధ్వర
దీక్షితుం డయి విప్రులకు నపారధనంబు లిచ్చు చున్న వైన్యుం గని
యాశీర్వాదపురస్సరంబుగా నిట్లనియె. 195

ఉ. "నీవ విధాత; వింద్రుఁడవు నీవ; సమస్తజనేశ్వరుండవున్
నీవ; యశేషధర్మములు నీవ యెఱుంగుదు; నిన్నుఁ బోలఁగా
నీ వసుధాతలంబున మహీశ్వరు లెవ్వరు లేరు; నన్మునీం
ద్రావలి యెప్డు నిన్నుఁ గొనియాడుఁ బరిస్ఫుటవాక్యభంగులన్.''

చ. అని పలుకంగ గౌతమమహాముని యచ్చట నుండి యంతయున్
విని కలుషించి "యేల యిటు పీఁకున నోరఱుగంగఁ బ్రేలె? ద
జనపతియే విధాతయును శక్రుఁడు నీశుఁడు? నర్థకాంక్ష వై
మనమున శంక లేక యొకమానవు నింత నుతింప నేటికిన్?" 197

—: అత్రిగౌతముల పరస్పర సంవాదము :—

వ. అనుటయు నత్రి యిట్లనియె. 193

ఉ. "ఊరక మీఱ నాడెదవు; యుక్త మయుక్తము నాత్మఁ జూడఁగా
నేరవు: సర్వలోకముల నిర్మలనీతిపరాక్రమంబు లొ
ప్పారఁగ నేలి ధర్మముల కన్నిటికిం గుదు రై వెలుంగు ధా
త్రీరమణుండు; మేటిగ నుతించుట వోలదె నాకు నిమ్మెయిన్". 199

వ. అని యధిక్షేపించిన గౌతముండు. 200

ఆ. "కలయ నరలు వచ్చి తల తెల్ల నైనంతఁ
జేసి యెట్లు నీకుఁ జేరు నెఱుక ?
జ్ఞానవృద్ధుఁ డైనవాని మాటలు గదా
సభలఁ జెల్లు నార్యజనుల కెక్క." 201

వ. అని తొడంగి యయ్యిరువురు మహానాదంబుగా వాదంబు సేయు చుండఁ గాశ్యపనామధేయుం డైన ముని సభాసదు లైన మునులం జూచి "వీరలవాదు మన చేతఁ జక్కంబడ నేరదు ; సకలధర్మజ్ఞుం డయిన సనత్కుమారు నడుగుద" మనిన నాసదస్యు లందఱు సనత్కుమారుపాలికిం జని యత్రిగౌతముల వివాదంబు తెఱం గెఱింగించిన నతండు వారి కి ట్లనియె. 202

ఉ. "అత్రి నిజంబ పల్కెఁ ; దగు నాతనివాక్యము ధర్మయుక్త ; మీ
ధాత్రి సమస్తముఁ బృహదుదగ్రభుజాగ్రమునందుఁ దాల్చు స
త్క్షత్త్రియుఁ డెల్ల వారలను గావను బ్రోవఁ బ్రభుండు గావునన్
శత్రునిషూదనుం డతఁడ శక్రుఁడు నీశ్వరుఁడున్ విధాతయున్. 203

క. జనులకు నెల్లను బూజ్యుఁడు
జనపాలుం ; డతని మహితశాసనమున స
జ్జనులును మునులును సద్విధిఁ
జను వారలు గాని కడవఁ జన దెవ్వరికిన్. 204

వ. క్షత్త్రియప్రభావం బేమనవచ్చు ? విరాట్టు, సమ్రాట్టు, విధిజితుండు, సత్యమన్యుండు, యథాజీవుండు, ధర్ముండు నను భవ్యనామంబుల నాగమంబులు పార్థివుం గొనియాడుఁ; దొల్లి యధర్మంబునకు వెఱచి బ్రాహ్మ

ణులు నిజతేజోబలంబులు క్షత్త్రియంబున నిక్షేపించిరి; నాఁటంగోలె బ్రాహ్మణ్యంబు వలన క్షత్త్రంబు ప్రవర్తిల్లుచుండు; బ్రహ్మక్షత్త్రియంబులు పరస్పరసంశ్రయంబులు; వెలిగా వర్తింపనేరవు; క్షత్త్రియుండు బ్రాహ్మణసంసేవనంబునం దేజోనిరూఢుం డయి యాదిత్యుండు చీఁకటి నడంచునట్లు దురితంబుల నడంచు; నట్లగుటం జేసి క్షత్త్రియుండు సర్వాధికుండగుట నిశ్చయం'' బనిన నమ్మనువు లంపెఱుఁ జని వైన్యునకుఁ దత్ప్రకారం బెఱింగించిన నా భూవరుం డత్రిం జూచి. 205

క. నను నెల్ల జనులకంటెను
ఘనుఁడని కొనియాడి తీవు కడునిజముగఁ; గా
వున నిదె ప్రీతుఁడ నైతిని;
కొను మిచ్చెద నీకుఁ దనియఁ గోటిధనంబుల్." 206

క. అని యిష్టధనము లిచ్చినఁ
గొని వచ్చి, మునీశ్వరుండు కొడుకులకుఁ బ్రియం
బునఁ బంచి యిచ్చి, యిమ్ములఁ
జనియె వనంబునకు ధర్మసంహితబుద్ధిన్." 207

వ. అని చెప్పి మార్కండేయుండు పాండవేయునితో వెండియు నిట్లను
''సరస్వతీ గీత యను నితిహాసం బొకటి సెప్పెద; నందు విశిష్ట ధర్మంబు లెఱుఁగ నగుఁ; దొల్లి తార్క్ష్యుం డను మునివరుండు భారతి నారాధించి తనకు నద్దేవి ప్రత్యక్షం బగుటయు నిట్లని యడిగె. 208

క. ''పురుషున కెయ్యది ధర్మువు?
పురుషుం డెద్దానఁ బరమపుణ్యాత్మకుఁ డై
చిరపుణ్యగతులు వడయును?
దిరముగ నివి యానతిమ్ము దేవీ! నాకున్.'' 209

వ. అనిన నతనికి నప్పరమేశ్వరి యి ట్లనియె.

మ. ధృతి వేదంబులు నాలుగుం జదివి, భూదేవుండు నానాధ్వర
వ్రతుఁ డై యుండెడునట్టి పుణ్యుఁ డమరావాసంబునం దుండు నున్నతవృత్తస్తనభారమంథరమరున్నారీ పరీరంభసం
భృతరోమాంచసమంచితాంగుఁ డగుచుం బెక్కేండ్లు సంప్రీతితోన్.

సీ. మేలగు క్రేపుతోఁ జాలు సాలఁగఁ గల్గి
లాలితం బగు తొలుచూలిమొదవుఁ
బాత్రభూతుం డైన శ్రోత్రియునకు నిచ్చు
సదమలచరితుఁ డమ్మొదవుమేన
నెన్నిరోమము లుండు నన్ని వేలేండ్లును
సురలోకసౌఖ్యవిస్ఫురణ నొందు;
భారంబునకుఁ జాలి భూరిసత్త్వాఢ్య మై
బిరుదైన యెద్దు భూసురున కిచ్చి
ఆ. నరుఁడు ధేనుదశక మిరవొంద నిచ్చిన
ఫలము వడయు; మంచివలువ లొసఁగి
చంద్రలోకమున కతంద్రితుఁ డై చనుఁ;
గనక మిచ్చి నాకమునకు నరుగు. 212

క. కృతమతి యై యేడేఁడులు
హుతవహు ఘృతమునను బ్రీతి నొందించిన సు
వ్రతుఁ డీరేడుతరంబుల
పితరులఁ గొని దివికి నేఁగుఁ బెం పెసలారన్. 213

క. సతతంబును శుచి యై దే
వతలఁ బ్రదీప్తాగ్నియందు వనలక సంత
ర్పితులుగఁ జేసి వడయు నం
చితముగ గోలోకవాసచిరసౌఖ్యంబుల్. 214

వ. అగ్నిహోత్రం బస్మదాత్మకం బని యెఱుంగుము; సకలయజ్ఞంబుల యందుఁ గల్గిం పంబడు విశిష్టద్రవ్యంబు లన్నియు మదీయంబులు; నేను మహనీయం బైన యగ్ని హోత్రముఖంబున ననుభవింతు; నాత్మజ్ఞు లైన మహాత్ములకు నఖిలసంశయచ్ఛేదంబు సేయుదు; ననవరత స్వాధ్యాయదాన వ్రతపరాయణు లైన తపోధను లెందేని విగతశోకు లై వసియించు రట్టిది మామకం బైన పరమపదంబు; వినుము ప్రచురమధుక్షీరతోయంబులును, శర్కరాసైకతంబులును, మాంసాపూపప్రకర తీరంబులును, పాయసకర్దమంబులు నైన యేఱు

లనేకంబు లుత్పాదించి యింద్రాగ్నిప్రముఖు లైన దివిజులకుఁ దృప్తి
సేసి యజనశీలురు పెక్కండ్లు మత్పదంబునం బ్రాపింతు'' రని చెప్పినఁ
దార్క్ష్యుండు కృతాంజలి యై. 215

ఉ. ''అంబ ! నవాంబుజోజ్జ్వలకరాంబుజ ! శారదచంద్ర చంద్రికా
డంబరచారుమూర్తి ! ప్రకటస్ఫుటభూషణరత్న రోచిరా
చుంబితదిగ్వి భాగ ! శ్రుతిసూక్తవివిక్తనిజ ప్రభావ ! భా
వాంబరవీథివిశ్రుత విహారి ! ననుం గృపఁ జూడు భారతీ !'' 216

వ. అని వినుతించి కృతార్థుం డయ్యె నని చెప్పిన విని పాండు పుత్రుండు
ముకుళిత హస్తుండై 'మునీంద్రా వైవస్వతమను వెత్తెఱంగునం
బ్రభావసంపన్నుం డయ్యెం? జెప్పవే' యనిన మార్కండేయుం
డి ట్లనియె. 217

క. "విను చాక్షుషమన్వంతర
మున వైవస్వతుఁడు పరమపుణ్యుండు దపం
బొనరించె నిరాహారత
ననుపమధైర్యుండు దశసహస్రాబ్దంబుల్. 218

ఆ. అనఘుఁ డూర్ధ్వబాహుఁడై యేకపాదంబు
నందు నిలిచి బదరికాశ్రమమునఁ
జలిపె మఱియుఁ బెక్కు సంవత్సరంబులు
తపము సకలజనులు దను నుతింప. 219

**—: మార్కండేయుండు ధర్మరాజునకు వైవస్వతువృత్తాంతంబును దెల్పుట :—**

వ. ఆ వైవస్వతుం డొక్కనాఁడు గృతస్నానుం డయి జలాశయతీరంబున
నున్నంత నొక్క మత్స్యంబు జలంబులదరికిం జనుదెంచి యి ట్లనియె
''నయ్యా ! యేను గడు నల్పమత్స్యంబ నగుటం జేసి బలవంతంబు
లగు జలచరంబులవలవ నాకుఁ దద్దయు భయంబు గలిగి యుండు;
నిమ్మడువు మహామత్స్యసంకులంబు; గావున నపాయంబు వొంద
కుండ న న్నుద్ధరించి యొండెడం బెట్టవే; యేను నీకుఁ బ్రత్యుపకా
రంబు సేయ నోపుదు'' ననిన విస్మితుండై యతం డమ్మీను నెత్తి
కొనిపోయి యొక్క నూతియందు విడిచి దానిం బలుమాఱు నరసి

కొని యుండె; నదియును గ్రమంబున వర్ధిల్లి యొక్కనాఁ డమ్మను
వున కిట్లనియె. 220

ఆ. "అనఘ ! నీప్రయత్నమున నా శరీరంబు
పొదలె; నిందు నాకు మెదల నెడము
సాల; దట్లు గాన మేలుగ నొండొక
యెడకుఁ గొంచుఁ బొమ్ము కడఁగి నన్ను." 221

వ. అనిన నతం డాజలచరంబుఁ గైకొని పోయి యొక్క బావియందు
విడిచిన నది యెప్పటియట్ల యక్కజంబుగాఁ బొదలి తనకు నవ్వాపి
యందు నవకాశం బపర్యాప్తం బగుటం జెప్పి, యతనిచేత గంగమడు
వున విడువంబడి, కాలక్రమంబున నచ్చోటం దిరుగం బట్టు చాలకున్న
నతం డెత్తికొనిపోయి సముద్రంబునం బెట్టిన నది వాని కిట్లనియె.

క. "ఉపకారం బొనరించితి
కృపతో నీ విట్లు నాకుఁ గృతమతి వై; ప్ర
త్యుపకార మే నొనర్చెద
విపులగుణాభరణ ! తెలియ విను నాపలుకుల్. 223

తే. తడవులే దింక నిఖిలఘాతములుఁ బ్రళయ
మొంద నున్నవి; యిప్పు డొండొండ పొంగి
కలయఁ బాఱుఁ బయోధు లుగ్రముగఁ బుణ్య
చరిత ! యిదియ మన్వంతరసంధి యంద్రు. 224

వ. కావున నీవు దృఢరజ్జుబంధనంబును, సకలధనధాన్యసహితంబును
గా నొక్క పేరోడ గావించి, సప్తమునిసహితుండవై దాని నెక్కి,
సముద్రంబు దఱియందు నన్ను దలంచునది; యేనును ఘనశృంగ
శోభితం బయిన రూపంబునఁ బొడసూపి మీకు మే లొనరించెద" నని
యమ్మత్స్యంబు సనియె; వైవస్వతుండును దదుక్తప్రకారంబున
నోడ నిర్మించి, సకలబీజంబులు సంగ్రహించి, సప్తమునిసహితంబుగాఁ
గృతారోహణుండై పయోధిఁ దఱియం దొడంగె నంత. 225

మ. మతి వైవస్వతుచేఁ దలంపబడి యమ్మత్స్యంబు దోఁతెంచె నా
యతశృంగోన్నతమూర్తి; నాతఁడుఁ దదాజ్ఞాయత్తుఁడై తచ్ఛిరో

గతశృంగాగ్రమునం దగిల్చె నతిదీర్ఘం బైనపాశంబు; న
ద్భుతవేగంబున నోడ నీడ్చె నది యంభోరాశిమధ్యంబునన్. 226

వ. తదనంతరంబ. 227

సీ. గరుసులు గడవంగఁ గదలి యల్లల్లన
యొత్తుచు నెడముల నుత్తరించి,
వేడుకఁ జేతులు వీచి యాడెడునట్లు
లోలోర్మిపంక్తులఁ గ్రాలి క్రాలి,
ప్రమదహాసస్ఫూర్తి పచరించువిధమున
నురుఫేనరోచులఁ దెరలు గలిగి,
యురువడి వర్ధిల్లుచున్న జలంబుచేఁ
బొంగారి దెస లెల్ల మ్రింగకొనుచుఁ

ఆ. ప్రబల విలయకాల పటురయబహుళన
మీరణౌఘదుర్నివార మగుచు
నుగ్రభంగిగాఁ బయోనిధు లొక్కటఁ
బెల్లు రేఁగి జగము వెల్లివొడిచె. 228

వ. ఇట్లు లోకం బెల్ల నేకార్ణవం బైన, నమ్మత్స్యంబు దజ్జలాంతరంబున ననేక సహస్రవర్షంబు లయ్యోడం ద్రిప్పుచుఁ బదంపడి యప్పెనువెల్లి యల్లనల్లఁ దగిచిపోవం దొడంగు నెడం దుహినగిరిశృంగసమీపంబున నయ్యోడ నిలిపి వారల తోడ. 229

తే. "ఈ నగంబు శృంగంబున నిపుడు మీరు
గట్టుఁ డియ్యోడ" ననిన నా క్షణమ వారు
నట్లు చేసిరి; విను మమ్మహాద్రిశృంగ
మనఘ! నౌబంధనం బన నవనిఁ బరఁగె. 230

క. మనుసహితులైన మునులం
గనుఁగొని యమ్మీను గరము గారవమున ని
ట్లనుఁ "బ్రళయంబున కీడునఁ
బన కుండఁగ మీకు రక్ష సలిపితిఁ గరుణన్. 231

క. మునులార! యేను విశ్వం
బునకుఁ బరమకర్త యగు ప్రభుఁడ; వాత్సల్యం
బున మత్స్యమైన రూపం
బున నిమ్మెయి నిన్నిచందములఁ జనవలసెన్. 232

వ. మీరు నిర్భయులరై చరియించునది; మఱియు నిమ్మనువును సదేవాసురమానుషంబైన జగం బఖిలంబును సృజియించు; మత్ప్రసాదంబున నితనికిఁ బరమజ్ఞానోదయంబగు'' నని చెప్పి యయ్యాదిమత్స్యం బదృశ్యంబయ్యె; వైవస్వతుండును మఱియు నధికతపంబు సేసి సకలచరాచరంబుల సృజియించె. 233

క. పరమం బగు వైవస్వతు
చరితం బతిభక్తి వినినఁ జదివినను మహా
దురితంబు లడఁగు, జనులకు
నిరవుగ సిద్ధించు ననఘ! యిహపరసుఖముల్.'' 234

వ. అనిన నమ్మేదినీశ్వరుం డమ్మునీశ్వరునకుఁ బ్రణతుండై యి ట్లనియె.

క. "పరమేష్ఠికల్పుఁడవు, ని
ర్భరభూరితపః ప్రభావపరిపూర్ణుఁడ; వ
చ్చెరువు భవన్మాహాత్మ్యము
సురమునిలోకప్రణామశోభితచరణా! 236

క. అడరి నిఖిలాండకోటియుఁ
జెడునప్పుడుఁ జెడక నీవు జీవించెద; వే
ర్పడ జగములు గ్రమ్మఱఁ గలి
గెడు నప్పుడు సూచెదవు వికృతిరహితుఁడవై. 237

చ. తొడరి చరాచరప్రతతితో జగ మింతయు వార్ధిఁ దొట్టిన
ప్పుడు లలితాబ్జపీఠమునఁ బొల్చు చతుర్ముఖుఁ బద్మగర్భుఁ బెం
పడర భజించి తీవు; జగదాదిజుఁడైన ప్రభుండు నీ యెడం
గడు ననురక్తుఁడై యొసఁగెఁ గాదె మునీశ్వర! యీప్రభావమున్

క. జగముల నెల్లను గ్రమింగెడు
జగదంతకుమౌళి వామచరణం బిడఁ, బె

ల్లగు రోగజరాభరముం
దెగ విడువఁగఁ జెల్లె నీకుఁ ద్రిభువన వినుతా !

వ. సకలచరాచరోత్పత్తి స్థితి విలయప్రకారంబులు నీకుం బెక్కు మాఱులు ప్రత్యక్షంబులయి కానంబడి యుండుఁ; గావున ని న్నడిగెద; లోకంబులు విలయకాలంబున నెట్టిభంగియగు ? నెఱింగింపు'' మనిన మార్కండేయుం డి ట్లనియె. 240

—: మార్కండేయుండు ధర్మరాజునకుఁ బ్రళయప్రకారంబు సెప్పుట :—

సీ. ''శాశ్వతు, నఖిలభూతేశ్వరు, నవ్యయు
నాదిదేవుని, జగదాదిజన్ము
నాదిమధ్యాంతవిచ్ఛేదవిదూరు, నా
శ్చర్య కారణకర్మధుర్యు, నజరు
నీ ష్టసఖుఁడును నీకు బ్రెగ్గడయునై
వెలుఁగొందుచున్న యీయలఘుపుణ్యు,
లాలితదీర్ఘ విశాలసితేక్షణుం,
గనకవర్ణాంబరు, వనజనాభు,

ఆ. నింద్రనీలవర్ణు, నింద్రాదిసురగణ
వినుతుఁ గృష్ణుఁ గరము వినయ మొప్పఁ
దలఁచి యితనియాజ్ఞ దల నిడి యెఱిఁగింతు
వినుము వరుసతోడ మనుజనాథ! 241

వ. కృత త్రేతాద్వాపర కలినామంబు లయిన యుగంబులు నాలుగును బంద్రెండువేల దివ్యవర్షంబులం బర్యవసితంబు లగు; నియ్యుగంబులు నాలుగు నొక్క మహాయుగం బనం బరఁగు; మహాయుగసహస్ర పర్యంతం బైన కాలంబు బ్రహ్మకు నొక్కదినం బనంబడు; దద్దివసావసానంబునందు శతవార్షికంబైన యనావృష్టిదోషంబు ప్రవర్తిల్లు, నప్పుడు. 242

ఆ. సప్తహయుఁడు మూర్తి సప్తకం బొగిఁ దాల్చి
కరము వేఁడి మిగులు కరము లొప్ప
నదనదీజలములు నుదధిజలంబులుఁ,
దీర్చి జగములెల్లఁ ద్రేల్చు గడఁగి. 243

చ. దినకరతిగ్మ తేజము, ప్రదీప్తహుతాశనుఁ డయ్యుగాంతసం
జనితమహాసమీరణవశంబునఁ బేర్చి నగవ్రజంబుతో,
మనుజులతోడ, నిర్జరసమాజముతోడ, భుజంగపంక్తితో,
దనుజులతో జగత్త్రయముఁ దక్షణమాత్ర నొనర్చు నీఱుగాన్. 244

వ. తదనంతరంబ. 245

మ. సిత పీతారుణ నీల పింగరుచు లై, స్నిగ్ధంబు లై, యుద్యతా
యతవిద్యుల్లలితంబు లై, ఘనగిరీంద్రాకారఘోరంబు లై,
తతనిర్ఘాతనిపాత భీమభిదురధ్వానంబు లై సంతతో
ద్ధుతసంవర్తవలాహకంబులు వెసం దోఁతెంచు దిగ్భిత్తులన్. 246

ఉ. పెల్లునఁ గూలు తజ్జలము పెక్కువ నొక్కట నమ్మహానలం
బెల్లను నాఱిపోవుఁ; బృథివీశ్వర! యేఱులు నబ్ధులున్ వెసం
దొల్లిటియట్ల నిండుఁ; బటుతోయదసంఘము లంతఁ బోక గ
ర్జిల్లుచు వెండియుం గురియుఁ జిత్రము గాఁగ ననేకకాలముల్. 247

శా. ధారాపాతనితాంత వేగమున నిద్ధాత్రీతలం బాహతం
బై రూపేది మునుంగుఁ దోయములలో; నత్యంతగంభీరవాః
పూరం బంతయు ముంచి మించుటయు, దిగ్భూమీనభోభాగముల్
వే రూపింపఁగ రాకయుండఁ దమముల్ వేష్టించుఁ ద్రైలోక్యమున్.

తే. అంతఁ బరమేష్ఠిచోదిత మైన యొక్క
మారుతము నలిరేఁగి దుర్వారభంగి
విలయకాలవిశృంఖలవిపులవారి
ధరచయంబుల నెల్లను విరియఁ జేయు. 249

క. ఆమారుతంబు గ్రోలి పి
తామహుఁ డెంతయును ఘోరతమ మగు సలిల
స్తోమంబునందు నడుమం
దామరపై నిదురవోవుఁ దద్దయు నెమ్మిన్. 250

వ. ఇట్టి కల్పాంతంబు లనేకంబులు సనియె; నింకఁ గా నున్నవి యనేకం
బులు; విను మతీత కల్పాంతసమయంబున నేను బ్రబలాంధకారంబున
నేదెసయుం గానక యొక్కండన యత్యంతభయాతురుండ నగుచుం

బెద్దకాలంబు పరిభ్రమించుచుండ నొక్కతఱి నయ్యుదకమధ్యంబున నత్యున్నతం బయిన వటభూరుహంబు గానం బడియె; మఱియుఁ దదీయపర్ణ పర్యంకంబునందు. 251

క. కమనీయజలదవర్ణుని
హిమకరబింబాస్యు, నుద్యదినతేజు, బ్రమో
దమునఁ బవళించువానిం
గుమారు నొక్కరునిఁ గుసుమకోమలుఁ గంటిన్. 252

వ. కని విస్మితుండ నై యాత్మగతంబున. 253

క. లోకంబులు దెగటాఱఁగ
నే కార్ణవ మైన యిచట నిత్యాలుఁ డొకం
డేకతమున నిద్రించుచు
నేకతమున నున్నవాఁడొ? యెవ్వాఁ డగునో? 254

తే. అని తలంచుచు నల్లన యక్కుమారుఁ
జేరఁబోయిన నాతండు సితసరోజ
రేఖ దలకొనఁగా నలరించెఁ గన్నుఁ:
లవధరించెను నను లోచనాంచలముల. 255

వ. తదనంతరంబ గంభీరమధురస్వరంబున ని ట్లను "నయ్యా! నిన్ను నతి శ్రాంతుంగా నెఱింగితిఁ; గొండొకసేపు విశ్రమింపవలతేని నవకాశం బిచ్చెద; నాశరీరంబు ప్రవేశించి సుఖంబున శయనింపు" మని తన వదనంబు వివృతంబుగాఁ జేసిన నేనును బలాత్కార నిక్షిప్తశరీరుండుబోలె బరవశుండ నై తన్మార్గంబున నతని యుదరంబుఁ బ్రవేశించి యందు. 256

సీ. గంగాదినదులతోఁ, గనకశైలాది భూ
ధరములతో, సముద్రములతోడ,
వివిధ పత్తనవనద్వీపవర్షములతో,
బహుకర్మరతు లైన ప్రజలతోడఁ,

బఱిమృగవ్యాళపశుసంఘములతోడఁ,
దద్దయు నొప్పారుధాత్రిఁ గంటి;
సూర్యేందుతారకాజ్యోతిరుజ్జ్వల మైన
గగనంబుఁ, బవనమార్గ ములుఁ గంటి;
తే. శక్రవరుణయమాదినిర్జరసమేత
మైననాకంబు గంటి; మహోహియక్ష
రాక్షసాసురవిద్యాధరప్రముఖులఁ
గంటి; వేయేల సకలలోకములుఁ గంటి. 257

చ. అరుదుగ నమ్మహాత్ముని మహోజఠరాంతరభూమి నూఱువ
త్సరములయంతకాలము వసం బఱి త్రిమ్మరితిం; గడంగి య
ప్పరుసున నెందుఁ గా ల్గొనఁగఁ బట్టదు; చిత్తము భీతి మీఱఁ ద
త్పరమతి నంత నక్కపటబాలుపదంబులు సంస్మరించితిన్. 258

వ. ఇట్లు శరణ్యవరేణ్యుం డైన కారుణ్యనిధి నద్దేవుం దలంచుచుండ నతండు నన్నుం దన వదనానిలవేగంబునం జేసి వెలువరించె; నంత నెప్పటియ ట్లమ్మహావటపత్త్ర శయనుం డైన యబ్బాలు నాలోకించితి; నంత.

క. నను గనుఁగొని యెలనవ్వునఁ
దనవదనము వింతచెన్ను దలకొనఁగా ని
ట్లను నబ్బాలుఁడు విశ్రమ
మొనరించితె యనఘ! యస్మదుదరములోనన్? 260

వ. అనిన నేనును సంభ్రమంబున నతనిం జేర నరిగి, కెందామరేకులం దెగడు నంగుళంబులు గలిగి తరుణకిసలయసుకుమారంబు లయిన తచ్చరణకమలంబులు శిరంబునం జేర్చి 'దేవా! దేవరప్రసాదంబున నత్యాశ్చర్య కరణం బైన సకలచరాచర భూతప్రపంచంబుఁ జూచితిఁ; భవదీయమాయా ప్రభావంబు భావింప నేరకున్న వాఁడ.

శా. ఈయేకార్ణవ, మీవటక్షితిరుహం, బీపర్ణపర్యంక, మి
ట్లై యొప్పారుచు నుండఁగా, నుదరభాగైకప్రదేశంబునం
దీ యీరేడుజగంబులున్ మెలఁగఁ గా, ని ట్టున్న బాలత్వ మే
నే యందంబున నిశ్చయించి సుఖి నై యేపారుదుం జెప్పవే. 262

క. నాదైన యాశ్రితత్వము
నీ దగు చిత్తమునఁ గల్మి నియతమ యేనిన్
సాదరఫణితుల నన్నవ
సాదితసమ్మోహుఁ గాఁ బ్రసాదింపు తగన్. 263

—: నారాయణుఁడు మార్కండేయునకుఁ దన ప్రభావంబు సెప్పుట :—

క. అని యేను వేఁడికొనుటయు
ఘనతరకరుణారసానుకలితహృదయుఁ డై
తన దివ్యమహిమ యిట్లని
వనజాక్షుఁడు సెప్పె గారవంబున నాకున్. 264

ఆ. "అనఘ! దేవతలును మునులును నా దైన
మహిమఁ దెలియ లేరు మహితబుద్ధి:
నతులపుణ్యమతివి పితృభక్తుఁడవు గాన
యెలమి దెలియఁ జెప్పవలసె నీకు. 265

క. నారము లందురు జలముల,
నారయ నారములు నాకు నయనం బగుటన్
నారాయణుఁ డను పేర న
పారనిగమఫణితులందుఁ బరంగుదుఁ బేర్మిన్. 266

తే. అట్టి నారాయణాఖ్యుండ నైన నేను
శాశ్వతుండ నై ప్రభుఁడ నై సకలజగము
నోలిఁ బుట్టింతుఁ, బాలింతు, నుచితవేళ
సంహరింతుఁ జిదానందశాలి నగుచు. 267

మత్తకోకిలము: అంబుజాసనుఁ, డింద్రుఁ, డీశ్వరుఁ, డంతకుండు, ధనేశ్వరుం,
డంబుధీశుఁడు లోనుగా సుర లస్మదాకృతు; లుర్వి పా
దంబు, లగ్ని ముఖంబు, సూర్యసుధాకరుల్ నయనంబు, లీ
యంబరంబు శిరంబు గా నిటు లద్భుతాకృతి నుండుదున్.

చ. అతులితదక్షిణాన్వితమహాధ్వరసంఘము లే నొనర్చితిం;
జతురమనీషితా ప్రచురసౌఖ్యులు భూసురముఖ్యు, లంచిత

వ్రతులు మహీపతుల్, సుగుణవశ్యులు వైశ్యులు భక్తి నన్ను సం
తతమును గొల్తు రీక్షితి నుదాత్తమహో క్రతుకర్మశీలు రై. 269

చ. విలయపయోధిమగ్న మగు విశ్వ మహీవలయంబు దొల్లి యే
నలఘువరాహవిగ్రహుఁడ నై వెస నెత్తితి; శేషమూర్తినై
లలితఫణాసహస్రకము లావునఁ దాల్తు నశేషధాత్రియుణ
జలనిధి నిమ్నగానగ జనన్నగరీ వన మండలంబుతోన్. 270

క. బాడబదహనుఁడ నై వెస
నేడు సముద్రముల జలము లేఁ గ్రోలుదు; నీ
రేడుజగంబులు విలయముఁ
గూడ నెడం దజ్జలములు గొనకొని విడుతుణ. 271

చ. వదనభుజోరుపాదముల వర్ణచతుష్టయముణ యుగాదియం
దొదవ సృజింతు; ఋగ్యజుషసూక్తులు సామము నయ్యథర్వముణ
విదితముగా మదీయముఖవీథుల నుద్భవ మొందు; నన్నియుం
దుదిఁ బరివర్తనక్రమవిధూతను లై ననుఁ జేరుఁ గ్రమ్మఱన్. 272

క. అనహంకృతు, లక్రోధను
లనసూయులు, సంగరహితు, లధ్యాత్మవిదుల్,
ఘనసత్త్వాత్మకులు, మహా
మునులు ననుం గొల్తు రెప్డు మోక్షాపేక్షన్. 273

తే. అఖిలనక్షత్రతారాగ్రహములు, గగన
పవనదిశలును, మత్స్వరూపములు వినవె;
సకలరత్నాకరంబులు శయ్య గాఁగ
నిత్యసుఖలీలమై శయనింతు నేను. 274

క. దానము సత్యంబు తపో
జ్ఞానాహింస లనఁ బరఁగు సాత్త్వికగుణసం
తానముఁ, గామక్రోధా
జ్ఞానంబులు మన్మయములు సంయమియర్యా! 275

క. విను మింకఁ బెక్కు మాటలఁ
బని యేటికి? జగమునందుఁ బ్రకటితముగఁ గ

ల్గిన యదియు నేన; లేనిది
యను నేన; సునిశ్చితముగ నూహింపు మెదన్. 276

ఉ. ఎప్పుడు ధర్మహాని యగు, నెప్పు డధర్మము మీఱుఁ, గ్రూరులై
యెప్పుడు దైత్యు లుబ్బుదురు, హీనతఁ బొందుదు రెప్డు వేల్పు, లే
నప్పుడు సత్కులీనుల గృహంబుల నుద్భవ మొంది, లీలమై
నెప్పటియట్ల నిల్పుదు సురేంద్రుల సంచితధర్మపద్ధతిన్. 277

క. సితరక్తనీలపీత
ద్యుతివిలసితరూపములఁ జతుర్యుగముల నేఁ
నతిధృతిఁ జరియించి సమం
చిత ధర్మస్థాపనంబు సేయుదు ననఘా. 278

మత్తకోకిలము. కాలచక్రము నిర్వికల్పము గాఁగ నేన నయింతు న
న్మీలితక్రమవిక్రమైకసమృద్ధినై; విలయక్రియా
వేళ నింతయు సంహరింతుఁ బ్రవృద్ధయోగబలోల్లస
త్కాలరూపము దాల్చి దుర్వహగర్వనిర్వహబుద్ధినై.

క. నా తెఱఁ గంతయు నిప్పుడు
చేతోముద మొదవ నీకుఁ జెప్పితిఁ; ద్రిజగ
ద్ధాత యగు పితామహుఁడును
జాతుఁడుఁ నా యొడలఁ జక్క సగ బాలునుమీ.

వ. నారాయణాభిధానుండనైన యేను బాలరూపంబున శంఖచక్రగదా ధరుండనై యేకార్ణవంబునందు మహాయుగసహస్రమయం బయిన కాలంబున యోగనిద్రా పరవశుండనై యుండుదు; నిట్టి దారుణ కల్పాంతంబు సూచి నీవు భీతుఁడ వగు టెఱింగి, నీవలని యను గ్రహంబున నాత్మగుప్తంబులైన సకలలోకంబులు నీకుం గనునట్టి తెఱంగుఁ గావించితి; నింక నిశ్శంక హృదయుండ వయి వలసిన యెడం జరియింపుము; మదీయనాభికమలకర్ణికాశయనుం డయియున్న చతురాననుండు మేల్కని సృజియించు లోకంబు లేర్పడం జూచెద'' వని యానతిచ్చి యద్దేవుం డంతట నంతర్హితుం డయ్యె; నత్యంత విచిత్రబైన యీ వృత్తాంతం బంతయు నాకు ననుభవ గోచరంబైనయది. 281

శా. నా కమ్మైత్రిఁ బొడసూపెఁ దాను గృపతో నాఁ డందు, నేఁ డియ్యెడన్
నీకున్ గాదిలి చుట్టమై సచివుఁ డై నెయ్యంబునై యున్నపు
ణ్యాకారుం గమలాయతాక్షుఁ గరుణైకాయత్తు నత్యుత్తమ
శ్లోకుం గృష్ణునిఁ గంటి; నాసుకృతముల్ శోభిల్లెఁ బక్వంబు లై. 282

క. ఈదేవదేవు కరుణం
గాదే కురునాథ ! నిర్వికారుఁడ నై నిః
ఖేదుఁడ నై యుండుదు దే
వాదివివిధ భూతనిలయ మయ్యెడు నపుడున్ 283

తే. అనఘ యిద్దేవుసన్నిధి యగుటఁ గాదె
నాకుఁ బూర్వవర్తనకథనంబునందు
బోధ మిప్పుడు గల్గె? నిప్పుణ్యుఁ బరమ
పురుషుఁ బ్రభవిష్ణుఁ గృష్ణుని శరణు సొరుము." 284

—: మార్కండేయుండు ధర్మరాజునకుఁ గలియుగ ధర్మంబులు సెప్పుట:—

వ. అనిన విని ధర్మనందనుం డనుజసహితుఁ డై కృష్ణునిం బ్రశంసా వచనంబుల నభినందించి, మార్కండేయుం జూచి "మునీంద్రా! భవత్ప్రసాదంబున నత్యద్భుత పుణ్యకథాశ్రవణపరితోషితుల మైతిమి; కలియుగంబున సకలధర్మలోపం బగు నని చెప్పుదురు; తత్ప్రకారం బెఱింగింపవే" యనిన నతం డతని కిట్లనియె. 285

క. "కృతయుగమునందు ధర్మువు
చతురంశంబులను బరఁగఁ జనుఁ; ద్రేతాది
త్రితయమున నొక్కఁ డొకఁడుగఁ
బ్రతియుగమునఁ దఱుఁగఁ దొడఁగుఁ బాళులు వరుసన్. 286

వ. అట్లగుటం జేసి ధర్మంబు చరమయుగంబునఁ గరంబు దుర్లభం బయి పాదమాత్రావశిష్టం బయి యుండుఁ; దత్ప్రవర్తనం బాకర్ణింపుము.

సీ. సత్యంబు నరులకు సంక్షిప్తమగు; సత్య
హాని నాయువు గడు నఱిగి పోవు;
నాయువు దఱిఁగిన నల్పంబు లగు విద్య;
లల్పవిద్యల విమోహంబు మిగులు;

మోహంబువలనఁ బైఁ ముసురు లోభంబు; లో
 భావేశమునఁ గామ మగ్గలించుఁ;
గామంబు పెంపునఁ గడఁగుఁ గ్రోధంబు; క్రో
 ధంబున వైర మెంతయును బెరుఁగు;

ఆ. వైరమున నశేషవర్ణులు నన్యోన్య
 పీడ సేయుచును విభిన్నబుద్ధి
 నొక్కఁ డొకఁడు మేర నుండక వర్ణసం
 కరము సేయఁగలరు కలియుగమున. 288

క. జపనియమస్వాధ్యాయ
 ప్రపంచములు విడువఁ గలరు బ్రాహ్మణులు; జనా
 ధిప! శూద్రులు విపులతపః
 క్షపితులు గాఁ గలరు వినవె కలికాలమునన్. 289

మ. వివిధవ్యాఘ్రమృగోరగాకులము లై, విస్తీర్ణశూన్యాటవీ
 నివహాభీలము లై, యరాజకము లై, నిర్మూలధర్మంబు లై,
 ద్రవిళాభీరతురుష్కబర్బరపుళిందవ్యాప్తిదుష్టంబు లై
 భువిలో నెల్లెడఁ బాడగున్ జనపదంబుల్ దద్యుగాంతంబునన్. 290

క. క్షత్రియజాతులు శూద్ర చ
 రిత్రంబున, శౌర్యమును, సిరియు, దేజంబున్,
 మైత్రియును లేక చెదరి ధ
 రిత్రీశ్వర! శూన్యు లై చరించెదరు దరన్. 291

క. రసగంధద్రవ్యంబులు
 పస చెడు; సస్యంబు లల్పఫలము లగు; మహిం
 బసిపాఁడి దఱుఁగుఁ; దరువులఁ
 గుసుమఫలంబులును గరముఁ గొంచెంబు లగున్. 292

క. అరులు మిగులఁ గొని రాజులు
 నరులకు నెంతయును భయ మొనర్తురు; ధరణీ
 సురులు గడఁగి వాణిజ్యముఁ
 గరిసనమును జేయఁగలరు కలికాలమునన్. 293

సీ. పాషండదర్శనబహుళంబు లై యుండు
వర్ణాశ్రమంబులు; వసుమతీశ!
తవిలి శరీరంబుఁ దద్దయుఁ బ్రోతురు
పుణ్యఫలంబులు బొంకు లనుచుఁ;
గాలంబుతోఁ గూడఁ గల్గవు వానలు
పొల్లు లై బీజముల్ వొలిసిపోవుఁ ;
గ్రయవిక్రయంబులఁ గపటంబు దఱచగుఁ;
గడఁగి యిల్లడసొమ్ము లడఁచికొంద్రు;
ఆ. సాధుచరితు లైన జనులు దుర్గతుల రో
గములఁ దెగుదు రల్పకాలమునన ;
పాపపరులు లగ్గుఁ బరమాయువును, నరో
గతయు. సిరియుఁ బొందఁగాంతు రెందు 294

క. ఉఱవగు నారికెపంటలు ;
గొఱియల పాఁడియును దఱచగుం; బురుషులకుం
దెఱవలు సుట్టము లయ్యెద ;
రెఱచియ భుజియింతు రర్థి నెల్లజనంబుల్. 295

క. పితృదైవతకార్యంబుల
నితరేతరభోక్త లగుదు ; రెల్లయెడలఁ గు
త్సితదేశకాలపాత్ర
ప్రతతియ వర్తించు దైవపైతృకవిధులన్. 296

క. హేతుప్రత్యయవాదవి
చేతసు లై, వేదనింద సేయుచును, మఖ
వ్రాతంబులు వ్రతములుఁ బెడఁ
బాతురు దుర్మార్గకర్మపరు లై విప్రుల్. 297

మ. వనితా దుర్బల దీన బంధుజన సర్వస్వాపహారుల్, సుహృ
జ్జన మాతాపితృపుత్రహంతలు, యదృచ్ఛాకర్మశీలుర్, ధర
జనసంపూజితు లై చరింతురు ; వినష్టశ్రీకు లై విప్రు లా
జనులం జేరి ప్రతిగ్రహించెద రవజ్ఞాపూర్వదుర్వృత్తముల్. 298

మ. ధరణీరక్షణ మాచరింపక నృపుల్ దర్పంబునం బక్ష్యతో
హారులై, సాధులఁ ద్రోఁచి, చేకుఱు తదీయశ్రీధనక్షేత్రముల్
హరియింపం గలవారు; దారుణతరం బై పెల్లు చెల్లుం బర
స్పరయుద్ధంబు ధరాతలేంద్రులకు విశ్వప్రాణినాశంబుగన్. 299

క. సుతుఁ డవమానించు జనకుఁ;
బతి నవమానించు భార్య; పడఁతులుఁ బతులున్
మతి నొండొరువుల మెచ్చక
సతతముఁ జరియింతు రిష్టసంచారములన్. 300

క. నడవవు దేవపితృక్రియ;
లుడుగును వేదార్థసమ్యగుపదేశంబుల్;
గడఁగును మోహతమంబులు;
పుడమి సమస్తంబుఁ గుజనభూయిష్ఠమగున్. 301

సీ. పదియాఱువర్షముల్ పరమాయు వయ్యెడు;
ధరణీశ! కలియుగాంతమున వినవె;
యేడు నెన్మిదియును నేండ్లప్రాయంబునఁ
బ్రజ లుద్భవింతురు భామినులకు;
ద్రవిణవిహీను లై దాత యొక్కఁడు లేక
యన్యోన్యతస్కరు లగుదు రెందు;
నెఱిఁగెడువారును నెంతయుఁ గ్రూరు లై
చెనపి పాపంబు సేసెదరు సూవె;
తే. యన్నవిక్రయ మొనరింతు రఖిలజనులు;
వేదవిక్రయు లగుదురు విప్రవరులు;
పణ్యయోనుల యగుదురు పద్మముఖులు:
గష్టతర మైన యక్కలికాలవేళ. 302

తరువోజ:—

ఉక్కున శూద్రు లత్యుగ్రులై కవిసి
యొక్కండ పెక్కండ్ర నుఱక చంపుటయు,
దిక్కెవ్వరును లేక దీను లై వసుమ
తీసురుల్ నాలుగు దెసలఁ బాఱెదరు;

ప్రముక్కడిచోరులు ముట్టి నిశ్శేష
ముగ ధనావలిఁ గొని మొగి వధింపంగ
స్రుక్కి కాకులయట్లు శూన్యు లై చెదరి
సొంపఱి యడవులు సొత్తురు జనులు. 303

క. శ్రుతిధర్మంబులు శూద్రులు
ప్రతిభం జెప్పంగ వినుచు బ్రాహ్మణులు కడున్
మతి సెడి తత్సేవకు లై
యతినిందితకర్మ కారులయ్యెద రధిపా. 304

మత్తకోకిలము దేవతాయతనంబులున్, జగతీసురావసథంబులుం,
బావనాశ్రమభూములుం జెడి పాడగుఁ; శుభవృక్షవ
ల్లీవనంబులు నాశ మొందుఁ; గలిప్రచారమునందు దు
స్త్రీవిహారము మద్యపానముఁ జెల్లుఁ బెల్లుగ నెల్లెడన్.

క. గురుఁ గొనియాడఁడు శిష్యుఁడు;
గురుఁడును శిష్యునెడ వంచకుం డగు; మఱి నొం
డొరువుల నొల్లరు బంధులు
పొరిఁబొరిఁ గలవులగుఁ; బ్రజకుఁ బొడమును భయముల్. 306

తే. ఇవ్విధంబున ధర్మంబు లెల్ల నపగ
తము నఁ బడ, జను లెల్లను దల్లడిల్ల,
బహువిధోత్పాతములు పుట్టుఁ బార్థివేంద్ర!
కడఁగి తత్కాలికాల్పసంశయమునందు. 307

క. క్రమమున రాష్ట్రములును, నగ
రములును, నాశంబు నొందు; రక్షాచ్యుతు లై
భ్రమియింతురు జను లతిదు
ర్గమగిరిసరిదంతికములఁ గడు నాతురు లై. 308

—: కలియుగంబున విష్ణుండు కల్కిరూపంబున ధర్మంబు ప్రతిష్ఠించుట :—

వ. అంతఁ గలియుగాంతంబునందు భువనవిదితం బయిన శంబళగ్రామంబున
విష్ణుయశుం డను పేర విష్ణుండు గల్క్యాత్మకుం డయి జనియించి,

సంస్మరణమాత్రన వేద శాస్త్రంబులును సమస్తశస్త్రాస్త్రవిశేషంబులు నధిగమించి, సార్వభౌముం డయి.

మధ్యాక్కర. అసదృశతేజుఁడు బ్రాహ్మణానీకసహితుఁ డై కడఁగి
వసుమతియందు నధర్మవర్తు లై యున్న మ్లేచ్ఛులను
మసలక నిజశక్తిఁ జేసి మడియించి ధర్మంబు నిలిపి
వసునిధుం డొనరించుఁ బేర్మి వాజిమేధము నిష్ఠ యొప్ప.

క. ఘనుఁ డిల యెల్లను బ్రాహ్మణ
ధనముగ భాగించి యిచ్చి ధర్మయశోవ
ర్ధనుఁడై వార్ధకమున న
త్యనఘుఁడు దపోవనంబునందు వసించున్. 311

వ. అతనిచేతం బ్రతిష్ఠితం బయిన ధర్మంబు ననుసరించి బ్రాహ్మణాది వర్ణంబులు సమర్యాదంబు లై వర్తింపం గలయవి; దాననచేసి కృత యుగంబు సంప్రాప్తం బగు నందు. 312

శా. ఆరామవ్రజచైత్యగుల్మవనదేవాగారసౌమ్యంబు లై
భూరిబ్రహ్మతపస్విసంకులము లై. పుణ్యాధ్వరారంభసం
భారోదారము లై, నితాంతఫలితభ్రాజిష్ణుసస్యంబు లై
యారూఢస్థితి నెల్ల దేశములు నొప్పారుం బ్రకాశంబు లై. 313

క. సమయముతోడఁ గురియు వ
ర్షములు ; గరము తేజ మెక్కి చరియించు నవ
క్రములై గ్రహంబు; లారో
గ్యము సౌఖ్యము సమధికముగఁ గలుగు నరులకున్. 314

వ. ఇది కృతయుగ ప్రవర్తనంబు ; త్రేతాద్వాపరయుగ ద్వితమంబు నందును ధర్మంబ వర్తిల్లు; నిట్టి తెఱంగునం గాలగతు లనేకంబులు నాకుం బ్రత్యక్షసిద్ధంబు లయ్యె; నీ వడిగిన యతీతానాగతంబు లయిన విశేషంబు లెఱింగించితి; నింక నొక్క హితోపదేశంబు సేసెద నాకర్ణింపుము. 315

క. ధరణీసురులకు నెప్పుడుఁ
గరమిష్టము సేయుమయ్య కౌరవవంశో

త్తర! విప్రులు సంతుష్టిం
బొరసినఁ జేకుఱు నశేషపుణ్యఫలంబుల్. 316

సీ. సకలభూతములందు సదయాత్ముఁడవు గమ్ము;
పాలింపు ప్రజల నీ ప్రజలఁబోలె;
వితతవృద్ధాచారవేది వై ధర్మంబు
సలుపుము; దురితవర్జనము సేయు;
మెఱుఁగమి, బాప మొక్కించుక దొడరినఁ
జట్టన ప్రతీకారశాలి వగుము;
గర్వంబు విడువుము; గరము ప్రియంబును
నిజమునుగా వచోనియతి నడపు;

తే. కాలగతు లెల్ల నెఱిఁగి యస్ఖలితబోధ
యుక్తుఁడవు గమ్ము; భరతవంశోద్భవుఁడవు
నీవు గావున నత్యంతనిర్మలుఁడవు
ప్రాజ్ఞుఁడవు నీకు వేఱ చెప్పంగ నేల?" 317

వ అనిన విని "మునీంద్రా నీ యానతిచ్చిన వాక్యంబు లన్నియు నవహితుండనై వింటి; నింతకు మున్ను నాయెూపిన తెఱంగున లోభమాత్సర్యాది దుర్గుణంబులు పరిహరింతు; నింకను భవదుక్తం బైన ధర్మశాసనంబును బ్రయత్నంబునం బాలించెద" నని యతనికి యుధిష్ఠిరుండు ప్రణమిల్లి మఱియును బ్రాహ్మణ ప్రభావంబు వినువాఁడై యతనిం బ్రార్థించినఁ దద్విషయం బైన యితిహాసం బతనికి నమ్మహాముని యి ట్లని చెప్పె. 318

—: మార్కండేయుండు ధర్మజునకుఁ బ్రాహ్మణప్రభావంబు సెప్పుట :—

చ. "ఘనుఁడు పరిక్షితుం డనఁ బ్రకాశితుఁ డైన మహీవిభుండు భానునిభుఁడు భానువంశ్యుఁడు వినూతనకీర్తి యయోధ్య యేలువాఁ డనుపముఁ డొక్కనాఁడు మృగయారతుఁడై చరియించెఁ గానన మ్మున నొకరుండ యిమ్ముల నపూర్వజవోగ్రహయాధిరూఢుఁ డై. 319

వ. ఇవ్విధంబునం బెక్కుమృగంబుల వధియించుచుఁ గ్రుమ్మరువాఁ డొక్కయెడ. 320

ఆ. మదభరాభిరామమృదులయానం బొప్పఁ
నల్లఁ బొలయుచును లతాంతరములఁ
గనము లీలఁ గమ్మవిరులు గోయుచునున్న
పువ్వుఁబోఁడి నొక్కపొలఁతిఁ గనియె. 321

క. కని యంతఁ గదిసి యాకా
మిని యొప్పులు చూడ్కిఁ దగుల మీఱినతమకం
బున ననిమిషలోచనుఁ డై
జననాథుఁడు మదనబాణసంహతిఁ దూలెన్. 322

వ. అదియును నతిసుందరం బైన తదీయమూర్తి విభవంబునకు మెచ్చి సాభిప్రాయంబుగా నవలోకించె; నంత నమ్మహీకాంతుం డక్కాంత కి ట్లనియె 323

ఉ. "ఎవ్వరిదాన వంబుజదళేక్షణ! యేకత మిట్లు లేల నీ
విివ్వనభూమియందుఁ జరియించెదు?" నావుడుఁ "దంద్రిపంపునం
దివ్వనభూమియందుఁ జరియించెద నవ్వరుఁ గోరి; కన్య నే;
నెవ్వరిదానఁ గా వలయు? నేర్పడఁ జెప్పుము రాజనందనా!"

వ. అనిన దాని ప్రగల్భవచనంబులకు నధికవిలోలుం డై భూపాలుండు దన యభిలాషం బెఱింగించిన నమ్మగువ "న న్నెన్నండును జలవిహారంబునకుఁ బోనుపకుండు నది; య ట్లయిన నిన్ను వరియించెద" ననిన వాఁడును దత్సమయంబున కొడంబడి దానిం దోడ్కొని పురంబునకుం జనుదెంచి యిష్టసుఖతత్పరుం డయి యుండె; నంత నొక్కనాఁడు శరత్సమయంబునందు. 325

చ. అతులిత పుష్పపల్లవఫలాన్విత భూరుహభూరివల్లరీ
వితతముఁ, జారుకైరవ నవీనసరోరుహషండ మండలా
యతసరసీమనోహరము నైన పురోపవనంబునన్ సము
న్నతవిభవుండు వాసభవనంబు లొనర్పఁగఁ బంచి యిమ్ములన్.

క. దేవీసహితంబుగఁ బృ
థ్వీవరుఁ డవ్వనమునందు విహరించె ఘనాం

తావసరవాసరంబుల
భావితపద్మవనపవనపరిచితుఁ డగుచున్. 327

వ. అంత నొక్కనాఁడు నితాంతఘర్మజలకణకలితశరీరుండై ప్రియా సమేతంబుగా వాసగృహంబు వెలువడి తత్సమీపంబున నతిమనోహరం బయిన కమలాకరంబు గని దానితీరంబున నయ్యుగ్మలి నునిచి దాను గృతావగాహుండై. 328

క. "మేలై యున్నది జలము వి
శాలనయన! చెమట వోవఁ జయ్యన దేహ
క్షాళన మొనరింపు" మనిన
నాలేమ దరస్మితాననాంబుజ యగుచున్. 329

ఆ. మడుఁగు సొచ్చి మునిఁగి మాయమై పోయిన
నద్భుతాత్ముఁ డగుచు నవనివిభుఁడు
మడుఁగు గలయ వెదకి మానినిఁ గానక
జలము లెల్ల వెడలఁ జల్లెఁ గడఁగి. 330

వ. ఇట్లు సల్లి యందు మండూకంబు లనేకంబు లున్నం జూచి "యివి మత్ప్రియాంగనను మ్రింగినవి గాకేమి" యని కలుషించి యను చరులం బిలిచి "నాకుఁ బ్రియంబుసేయ వలసినవారు గలిగినం బుడమిం గల కప్పల నెల్లం బొదవడంచి రం" డని పంచిన నలుదిక్కు లకుం జని తదీయకింకరవర్గంబు. 331

చ. కొలఁకుల, వాఁగులన్, నదులఁ, గ్రోవుల, బావుల, నిర్ఝరంబులం
గలయఁగ రోసి రోసి వడిఁ గప్పలఁ గుప్పలుగా వధించుచో
నలుగుల మంచు భేకనివహంబు గనుంగొని భేకనాయకుం
డలఘుతపస్విరూపమున నా నృపుపాలికి వచ్చి యి ట్లనున్. 332

ఉ. "అక్కట! లోక మెల్ల నగ నాఱడిఁ గప్పలఁ జంప నేల? యిం
దెక్కడి పెంపు గల్గుఁ? బృథివీశ్వర! కోపము డింపు; కప్పలం
జక్కని మాడ్కిఁ జూడు; మిది చాల నధర్మము" నాపుడున్ విభుం
"డెక్కడిమాట! నాసతికి నె గ్గొనరించెఁ గడంగి భేకముల్. 333

వ. అని శంకించి నిజశిష్యుం డాత్రేయుం డనువానిం జూచి "శలుండు మన వామ్యంబులం గొనిపోయి యొక్క మాసం బరుగు దెంచె; వాఁడును దనయంతఁ దెచ్చుట గలుగ నేరదు; నీ వరిగి మన తురంగరత్నంబులం గొని రమ్మని" పంచిన నప్పుడ కదలి య యోధ్యకుం బోయి. 343

క. మనుజపతిఁ గాంచి యాతఁడు
"మునిపతి పుత్తేర నధిపముఖ్య! యిచటి కేఁ
జను దెంచితి; సూవాయముల
నెనసిన నెయ్యంబుతోడ నిమ్మని" యెఁదగన్. 344

క. అనవుడు శలుఁ డిట్లనియెం
"జను నినుఁ బుత్తేర నతఁడు; సాలుదు వీవుం
గొనిపోవఁ దురంగంబులఁ;
జను మీదుర్జ్ఞాపితములు నైఁపవు మాకున్." 345

వ. అనిన న మ్మునికుమారుండు గ్రమ్మఱి చని గురునకు నవ్విధం బెఱింగించిన వామదేవుండు క్రోధపరీతచేతస్కుండై శలునిపాలి కరిగి యి ట్లనియె. 346

క. "ఇమ్ము నరేశ్వర! మాతుర
గమ్ముల; నీకార్య మయ్యెఁగాదే; కడులో
భమ్మున నొండుల సొమ్ములు
ర మ్మనినన్ వచ్చునే? యెరవు పత మగునే? 347

క. పరధనహరణము దురితము;
పరికింపుము; వరుణుచేతి పాశంబుల ని
ష్ఠురముగఁ గట్టువడకు; ని
ర్భరనరకక్లేశానుశిఖలఁ బడకుము మీఁదన్." 348

చ. అనుటయు నాతఁ డిట్లనియె "నాఁడివిప్రుల కేల యశ్వముల్?
ఘనతరసత్త్వమూర్తు లనఁగాఁ దగు నెడ్లను రెంటి నిచ్చెదన్;
విను మటు గాక బల్లిద పువేసడముల్ వలతేని నిత్తుఁ గై
కొనుము తగంగ; వామ్యములఁ గోరక పొ; మ్మడియాస లేటికిన్?"

క. అనిన "నివి యేటిమాటలు ?
వినువారలు నవ్వ నకట! విప్రుల ధనముల్
గొని వేఱ యొంటి నిచ్చెద
నను టిది యేనాఁటిచంద?'' మని ముని పెలుచన్.

క. పలుకుటయు నలిగి శలుఁ "డి
ప్పలుగుఁదపసి నంటఁగట్టి పటుశూలములం
బొలియింపుఁ" డనుచు భీకర
బలుల నియోగించెఁ దనదుపార్శ్వజనములన్. 351

వ. అంతయుం జూచి వామదేవుండు ఘనరోషణభీషప్రహాస దుర్నిరీక్ష్య ముఖుం డగుటయు నాక్షణంబ ఘోరాకారు లగు రాక్షసు లనేకులు పుట్టి నిశాత శూలంబుల నాభూపాలుం బొడిచి కాలగోచరుంజేసిరి; మునీంద్రుండు నిజేచ్ఛంజనియెఁ; దదనంతరంబ శలానుజుండు దలుం డనువాఁడు నిజరాజ్యపట్టబద్ధుం డై సుఖం బుండఁ గొండొక కాలం బునకు వామదేవుండు సనుదెంచి వానిం గని ''మహాత్మా! నీవు ధర్మపరుండవు; ధర్మువు దప్ప నోడుదేని మావాహంబుల ని" మ్మను టయు దలుం డలిగి నిజసమీపంబున నున్న సారథిం జూచి యి ట్లనియె. 352

సీ. కడుఁ గ్రొవ్వి తేఁకువ సెడియె నీ పాఱుండు;
వీఁక మై నిప్పుడు వీనిఁబొమ్ము
ద్రయ్యంగఁ జేసెదఁ, జయ్యన విషదిగ్ధ
సాయకమును శరాసమ్ముఁ దెమ్ము"
నావుడు నమ్మహీదేవుండు నగుచు ని
ట్లనియె ''న న్నేయఁ దెమ్మనిన విశిఖ
మంతఃపురంబున సంతసంబున నున్న
యనఘు భవత్సుతుఁ దునుముఁగాక''

తే. యనఁగఁ దదనంతరంబ ఘోరాస్త్రనిహతుఁ
డయిన యబ్బాలుఁ గొంచు హాహారవంబు
లెసఁగ నంతిపురంబువా రెల్ల వచ్చి
రది ధ్రువంబుగఁ గనియును నవ్విభుండు. 353

వ. కోపఘూర్ణమాన విగ్రహుం డగుచుఁ దన దురాగ్రహంబు విడువక
సమీపవర్తులం జూచి. 354

మ. "వినుఁడీ సర్వజనంబులుం, గడిఁగి యీవిప్రున్ దురాలాపు, దు
ర్జనునిం దుర్మద నస్మదీయసుమహాచ్ఛాపోగ్రనిర్ముక్తబా
ణనిపాతచ్ఛిదురాంగరక్తజలశోణక్షోణిసంగస్థుఁ గాఁ
గనుఁడీ యీ దురితాత్ము" నంచు నతి శీఘ్రప్రాప్తకోదండుఁడై. 355

క. శర మరిఁబోయుటయును ద
త్కరయుగ్మము బాణకార్ముకంబులతోఁ జె
చ్చెర సంస్తంభము నొందుఁడు
నరనాథుఁడు విస్మయావనతమానసుఁడై. 356

క. పుల్లవడి చలము రోషముఁ
బొల్లయునై చనఁగఁ, గొంతప్రొద్దు మొగమునన్
వెల్లఁదనము గదుర నిలిచి
యెల్లజనులు వినఁగ మఱియు నిట్లని పలికెన్. 357

ఉ. "ఆడితిఁ బెక్కుమాట; లవి యన్నియు సమ్మయిపోయె; నస్త్రసం
తాడనశక్తి గీడ్పడియెఁ; దథ్యము బ్రాహ్మణశక్తి యెక్కు; డే
నోడుదు వామదేవునకు; నో జనసంఘములార! సజ్జనా
మ్రేడితకీర్తి నిమ్ముని నమిత్రనిషూదను నాశ్రయించెదన్." 358

వ. అని యివ్విధంబున నతం డేటు దప్పిన జోహారు వెట్టుటయుఁ దదీయ
బంధుమిత్రజనంబులు భయసంభ్రమంబులతో సమ్మునినాథు శరణు
సొచ్చి యనునయించినఁ, బ్రసన్నుండై యమ్మహాత్ముండు దత్కర
యుగ స్తంభనంబు మాన ననుగ్రహించి, తదీయనందను ప్రాణంబు
లొసంగె; నంత నమ్మహీకాంతుండు భార్యాబంధుజనసహితంబుగా
సలనీఁ బ్రణమిల్లి హయంబులఁ దెచ్చి యొప్పించినం గైకొని వామ
దేవుం డరిగె; నిట్టిది బ్రాహ్మణప్రభావం బని చెప్పిన విని. 359

క. మునిపతికి మ్రొక్కి కుంతీ
తనయుఁడు "మీకంటె వృద్ధతముఁ డగు పురుషుం
డనఘా! కలఁడెఁ? జగమ్మున"
నని యడిగిన నాతఁ డిట్టు లని యెఱిఁగించెన్. 360

—: మార్కండేయుఁడు ధర్మరాజునకు నింద్రద్యుమ్ను చరిత్రము సెప్పుట :—

క. ఘనుఁ డింద్రద్యుమ్నుం డను
జనపతి గలఁ, డాతఁ డింద్రసదనమున ముదం
బున నుండఁగ బహుకాలం
బున కాతనికీర్తి లోకమున మాయుటయుఁ. 361

తే. అమరు లిచ్చోటనుండ లే వరుగు మనుచు
నుర్విఁ ద్రోచిన, నతఁడు నాయున్నకడకు
నర్థిఁ జనుదెంచి యిట్లను "ననఘ! నన్ను
నిద్ధపుణ్యు నింద్రద్యుమ్ను నెఱుఁగుదయ్య?." 362

సీ. అనుడు నేనిట్లంటి "నయ్య! ని న్నెఱుఁగంగఁ
జాల నయ్యెద; హిమశైలశృంగ
వాసి యై యుండు ప్రావారకర్ణుం డను
పేరి ఘూకము గడుఁబెద్ద; యదియు
నాకంటె నిన్ను నిర్ణయముగ నెఱుఁగుఁ బో"
మ్మనుటయు నన్ను రమ్మనియె నతఁడు;
"ఘనరసాయనఘుటికాప్రయోగంబున
దేహతాపంబు వర్ధించె నేఁడు

తే. గదలి రాఁజాలనే" నంటిఁ; గడఁగి యన్న
రేంద్రుఁ డశ్వమై ననుఁ బ్రీతి నెత్తికొనుచు
నయ్యులూకముపాలికి నరిగి నన్ను
నడిగినట్టుల దానిఁ దా నడుగుటయును. 363

వ. అదియునుం గొండొకసేపు దలపోసి చూచి, "యేను నిక్కువంబుగా ని న్నెఱుంగ నేర; నింద్రద్యుమ్నం బను కొలనియందు నాళీకజంఘుం డను పేరి బకవల్లభుండు వసియించు; నవ్విహంగంబు నాకుఁ బెద్ద; నిన్నెఱుంగు నరుగు" మనిన నమ్మనుజపతి నాతోడఁగూడ నయ్యు లూకంబు మోచికొని నాళీకజంఘునొద్దకుం జని తన పేరు చెప్పి "న న్నెఱుందే"యనిన నదియు "నేనిన్నెఱుంగంజాల; నాకంటెఁ జిరకాల జీవియైన యకూపారుం డను కచ్ఛపంబు గల; దదియును నిక్కొలన నుండు;నజ్జలచరము ని న్నెఱుంగంబోలు; నడిగి చూతము గాక" యని

యక్కమఠంబుఁ జేర్చి కాని "యిది యొక్కధర్మసందేహంబు; నిర్ణయించు టకయి యీ యార్యజనంబులు నిన్ను గుఱించి వచ్చినవారు; నీవు సను దేర వలయు" నని వేఁడుటయును. 364

తే. కొలను వెలువడి చనుదెంచెఁ గూర్మవిభుఁడు;
వార లడిగి "రింద్రద్యుమ్న ధారుణీశు
నెఱుఁగుదే" యని; యదియు నొక్కింత సేపు
దలఁచికొని కన్నుఁగవ నశ్రుజలము లురుల. 365

వ. ఎలుంగు రాల్పడ వారలం గనుంగొని యి ట్లనియె. 366

ఉ. "అక్కట! నే నెఱుంగనె మహాగుణభూషణు నమ్మహాత్ము; న
న్నిక్కడఁ బెక్కుమాఱులు ననేకభయంబులఁ బొందకుండఁగా
నక్కటికంబుతోడఁ దగ నాతఁడు గైకొని కాచెఁ గాదె; పెం
పెక్కిన యన్నరోత్తముని నెన్నఁటికిన్ మఱువంగ వచ్చునే. 367

తే. అమ్మహాత్ముండు బహువిధయజ్ఞదక్షి
ణార్థముగ విప్రవరులకు నర్థి నిచ్చు
గోగణంబుల గొరిజల గ్రొస్సి యయ్యెఁ
గాదె యీ సరోవరము జగన్నుతముగ?" 368

వ. అనిన యనంతరంబ దేవదూతలు విమానంబు గొనుచుఁ జనుదెంచి యింద్రద్యుమ్నుంగని "మహాత్మా! నీకీర్తి జగంబునందు శాశ్వతంబై నిలిచె; నీకుఁ ద్రిదివనివాసంబు సుస్థిరంబయ్యె; నరుగుదెమ్ము; విమానం బెక్కు" మని మఱియును. 369

క. "తనకీర్తి యెంతకాలము
వినఁబడు నిజ్జగమునందు వెలయఁగ నందాఁ
కను బుణ్యలోకసౌఖ్యం
బున నెంతయు నుల్లసిల్లుఁ బురుషుం డనఘా!" 370

వ. అనుటయు నమ్మహీకాంతుడు దివిజకింకరులం జూచి "యిమ్మ్రుదుసలి తాపసుని, వృద్ధవిహంగంబును గార్యార్థంబు సహాయులుగాఁ దెచ్చితి; వీరిని నిజస్థానంబుల నునిచి వచ్చెద; నించుక నిలువుం"డని వారిచేత ననుజ్ఞాతుండయి నన్నును నులూకంబును నెప్పటి నెలవులం బెట్టి

తానును దేవయానంబునఁ బుణ్యలోకంబున కరిగె'' నని చెప్పినఁ
బ్రీతుఁడై పృథానందనుండు. 371

క. "నీకంటె వృద్ధతముని గు
ణాకర! యెఱిఁగించి; తిది మహాద్భుత'' మని సు
శ్లోకుఁడు మునివరునకుఁ బు
ణ్యాకృతికిఁ గృతప్రణాముఁడై కడు భక్తిన్. 372

—: మార్కండేయుఁడు ధర్మరాజునకుఁ గువలాశ్వ చరిత్ర సెప్పుట :—

వ. "మునీంద్రా యిక్ష్వాకువంశోద్భవుండైన కువలాశ్వునకు ధుంధు
మారుం డను పే రెట్లు గలిగెఁ? జెప్పవే'' యని యడిగిన నతం
డి ట్లనియె. 373

ఉ. శంకరసన్నిభుండు, జనశంకరుఁడున్, గరుణాకరుం, డనా
తంకుఁ, డుదంకుఁ డన్ముని ప్రతిష్ఠితుఁడై మరుభూమియందు ని
శ్శంకమతిన్ వసించి యనిశంబును నవ్యయు నచ్యుతున్ మనః
పంకజవేదిపై నిడి తపం బొనరించె ననేక వర్షముల్. 374

తే. అతని భక్తికిఁ బ్రియమంది యాదిదేవుఁ
డంబుజాక్షుఁ డధోక్షజుఁ, డక్షరుండు
గరుణఁ బ్రత్యక్షమగుటయుఁ గని యతండు
ప్రణతి యొనరించి యిట్లని ప్రస్తుతించె. 375

మత్తకోకిలము. "దేవదేవ! శ్రుతిప్రమాణవిధేయ! మాధవ! జంగమ
స్థావరాత్మకమైన లోకము సర్వమున్ భవదీయమా
యావిధేయము; విశ్వరూపుఁడ వవ్యయుండవు నీవ; స
ద్భావసుస్థితి ని న్నెఱింగినఁ బాయుఁ బాపము లచ్యుతా!

చ. అనిమిష సిద్ధ సంయమి విహంగ భుజంగముముఖ్యు లెల్ల ని
న్ననిశముఁ గొల్చి నీదయఁ గృతార్థతఁ బొందుదు; రెందు నీవు నె
మ్మనమున సంతసిల్లుదు సమస్తజగంబులు శాంతిఁ బొందు; నీ
కినుకకు మాఱు లేదు శివకీర్తన! యీభువనత్రయంబునన్. 377

మత్తకోకిలము. విక్రమత్రయలీల నోలిన విష్టపత్రితయంబుఁ బె
ల్లాక్రమించితి; క్రూరులైన సురారివీరులఁ బ్రస్ఫుర
చ్చక్రవిక్రమకేళిఁ ద్రుంచితి; సర్వయజ్ఞఫలావహ
ప్రక్రియాత్ముఁడ వీవు నిశ్చల భక్తిగమ్య! జనార్దనా!''

వ. అని మఱియుం బెక్కుభంగులం బ్రస్తుతించినం గరుణించి పాంచ జన్యధరుండు వరంబడుగు మనుటయు నుదంకుండు "దేవా! భవదీయ దివ్యరూపంబుఁ బ్రత్యక్షంబుగాఁ గంటి; నింతకంటెను మిగుల వరం బెయ్యది గల? దైనను నామనంబు నిత్యంబును సత్యధర్మశమంబుల యందుఁ దిరంబై నీయందు దృఢభక్తికంబుగావలయు; నిదియ నాకు వరం" బనుటయు నద్దేవుండు "నీకోరినయట్ల యిచ్చితి; మత్ప్రసా దంబున నీకుం బరమజ్ఞానయోగంబు సిద్ధించుం; ద్రిలోకహితం బైన కార్యం బొక్కటి నీచేత సాధితం బయ్యెడు; నది యెయ్యది యనిన వినుము; ధుంధుం డను దానవుండు జగంబుల కుపద్రవంబు సేయం గలవాఁడు; తద్వధార్థంబై నీవు బృహదశ్వసూనుండైన కువలాశ్వు నుద్యుక్తుం జేసెద; వన్న రేంద్రుండు మత్ప్రసాదలబ్ధంబైన యోగ బలంబునను భవన్నియోగబలంబుననుం జేసి యయ్యసురం బరిమార్ప సమర్థుం డగు; నవ్విశేషంబునకు నీవలన నఖిలలోకంబులు సంత సిల్లెడు" నని పలికి విష్ణుదేవుం డంతర్హితుం డయ్యె; నుదకుండును బూర్వప్రకారంబునం దపంబు సేయుచుండె; మఱియు. 379

సీ. అనఘుఁ డిక్ష్వాకుఁ డీయఖిలభూచక్రంబు
నేలి నాకమునకు నేగుటయును
నతనినందనుఁడు శశాదుండు రాజయ్యె;
వాఁడు కకుత్స్థుఁ డన్వానిఁ గనియె;
నతఁ డనేనసుఁ డను నాత్మజుఁ బడసె; నా
పృథివీపతికిఁ బుట్టెఁ బృథుఁ డనంగ;
పృథుఁడు విశ్వకుఁ డను పేరి పుత్రునిఁ గాంచె;
నతనికి జనియించె నార్ద్రిఁ డనఁగ; 380

తే. నార్ద్రినకుఁ బుట్టె యువనాశ్వుఁ డను తనూజుఁ;
డతనికిని బుట్టె శ్రావస్తుడను విభుండు;

తత్సుతుఁడు బృహదశ్వుఁ; డా ధరణిపతికి
నుగ్రతేజుండు కువలాశ్వుఁ డుదయ మయ్యె. 381

వ. అక్కువలాశ్వునకు సకలాస్త్రశస్త్రవిద్యావిశారదులు నధిక సత్త్వసంపన్నులు నైన పుత్రు లేకవింశతిసహస్రంబులు పుట్టి; రంత బృహదశ్వుండు నిజపుత్రకుం గువలాశ్వుం, బ్రాప్తసంతాను, నత్యంతధర్మాన్వితు నఖిలమహీరాజ్యభారధౌరేయుంగా నభిషేకించి తపోవనంబునకుఁ బోవ సమకట్టి యయోధ్యానగరంబు వెలువడు నవసరంబున, నవ్వార్త విని యుదంకుఁడు సనుదెంచి బృహదశ్వున కిట్లనియె.

ఉ. "నీవు ప్రజాభిరక్షణము నెమ్మి నొనర్పు; మరణ్యభూమికిం
బోవఁగ నేల ? రాజులకు భూప్రజఁ గాఁచుటఁబోలు ధర్మువుల్
భూవర కల్గునే? యడవిఁ బోయి వసించినఁ గాని కాదె? ర
క్షావిధిఁ గాదె సద్గతులు గాంచిరి తొల్లిటిరాజముఖ్యులుః. 382

క. నీరక్షణంబుకతమున
ధారుణి మముబోఁటి సాధుతపసులు నిత్య
ప్రారంభ ధర్మకర్మో
ద్ధారు లగుట యదియు విహితధర్మువు గాదే? 383

వ. విను మొక్క యద్భుతంబు సెప్పెద; మధుకైటభు లనం బ్రఖ్యాతులైన యసురుల తనయుండు ధుంధుం డనువాఁడు మహాబలపరాక్రమసంపన్నుం డై నిజతపో బలంబునం బితామహువలన వరంబు వడసి, దేవదానవగంధర్వాదులకు నజయ్యుం డై చరియించు చుండు; నయ్యసుర యిపుడు మదీయాశ్రమసమీపంబున బహుయోజన విస్తీర్ణం బగు సముద్రవాలుకాపులినతలంబునందు మహావివరంబు గావించుకొని సుఖంబున నిద్రించుచున్నవాఁడు; వాలుకాంతర్హితశరీరుం డైన వాని వదననిశ్వాసపవనంబు సధూమదహనజ్వాలాభీలం బయి సంవత్సరంబున కొక్కమాఱు వెలువడి భూనభోంతరం బెల్లను నిరంతర సికతారజః పటలంబు మాఁటుకొనం జేయుఁ; దదీయవేగంబునఁ దత్సమీపభూమి శైల కాననంబు లేడు దినంబులదాఁకఁ గంపించుచుండు; నిట్టి దారుణత్వంబుకతంబున మాకు మా యాశ్రమంబున నుండుటఁ గడుసంకటంబు; గావున నద్దురాత్ము వధియించి మాకును లోకంబులకును

క్రియంబు సేసి కృతకృత్యుండవై మఱి తపోవనంబున కరుగుము.

తే. ఎవ్వఁ డమ్మహాసురు వధియించువనికిఁ
బూను, నతనికి నాత్మీయభూరిశక్తి
యిచ్చి జయ మిత్తునని యానతిచ్చె నధిప!
యాదరంబున నాకుఁ జక్రాయుధుండు. 385

వ. కావున. 386

చ. అతులితవిష్ణుశక్తిసముపాహితమూర్తివి గమ్ము, లెమ్ము; సం
తతభుజశక్తి నిట్టి యవధాన మొనర్పఁగ నీవ కాని యీ
క్షితి నితరుండు లేఁ; డధికకీర్తియుఁ బుణ్యముఁ జేరు నిన్ను; నూ
ర్జితగుణ! యింతవట్టుఁ దగఁ జేయుము, గావుము లోక మంతయున్." 

వ. అనినం గృతాంజలి యై యుదంకునకు బృహదశ్వుం డి ట్లనియె.

క. "విమలమతి! నస్త్రసన్న్యా
సము సేసితిఁ; దప మొనర్ప సమకట్టితి; నిం
కమునీంద్ర! తపోవనగమ
నము దప్పదు నాకు; వినుము నా విన్నపమున్. 389

చ. అనఘుఁడు, మత్సుతుండు, కువలాశ్వుడు, వీఁడె మహాబలుండు, స
జ్జనహిత కారి, ధైర్యనిధి, సంభృతకీర్తి భవత్ప్రియార్థమై
జనసుత! యమ్మహాసురునిఁ జంపుట కోపు నవార్యశౌర్యవ
ర్ధను లగుచున్న పుత్రులును దాను నభేద్యభుజావిభూతితోన్. 390

వ. నాకు ననుజ్ఞ యీవలయు "నని యక్కార్యంబునకుఁ బుత్రు సమర్పించి, యమ్మునిచేత నభినంధితుండై బృహదశ్వుండు తపోవనంబున కరిగె" ననిన విని ధర్మనందనుండు మార్కండేయునితో "ధుంధుండు మధుకైటభులపుత్రుం డని చెప్పితి; రమ్మధుకైటభు లెక్కాలంబువారు? రేమిక్రమంబున నెవ్వరిచేత నే మైరి?" రని యడిగిన నతండు ధర్మనందనున కి ట్లనియె. 391

—: మార్కండేయుఁడు ధర్మజునకు మధుకైటభుల చరితము సెప్పుట :—

సీ. "అధిప! తొల్లి జగత్త్రియంబు నేకార్ణవ
మై యుండఁగా, నప్డు హరి యొకండ
భాసురభోగీంద్రపర్యంకమున భవ్య
యోగనిద్రాసుఖయుక్తి నలర,
నతిదీర్ఘ మగు కాల మరిగెఁ; బవంపడి
దైత్యు లిద్దఱు మహోదాత్తబలులు
మధుకైటభులు నాఁగ మథితశాత్రవు లేఁగు
దెంచి యప్పరమాత్ము దివ్యనాభి

ఆ. కమలమున వెలుఁగు కమలాసనునిఁ గని
దర్పదోషనిహతిఁ దలకి ప్రేయ
నతఁడు భీతి నొంది యాక్రోశ మొనరించె,
"నాదిపురుష! నన్ను నరయు" మనుచు. 392

ఉ. ఆ తెఱఁ గాత్మఁ గాంచి కమలాక్షుఁడు మేల్కని, ఘోరవిక్రమో
పేతుల దైత్యసింహుల, నపేతభయాత్ములఁ జూచి "మీర లి
ట్లీతని నుక్కనం బఱుప నేల? భవద్బలశౌర్యయుక్తికిం
బ్రీతుఁడ నైతిఁ; జెప్పుఁడ నభీష్టవరంబులు వేఁడుఁ డిచ్చెదన్". 393

తే. అనినఁ గలకల నవ్వి యయ్యసురవరులు,
"నీవు మా కేమి యిచ్చెదు? నీక మేము
వరము లిచ్చెద; మడుగుము వలచితేని"
ననిన వారల కిట్లను నవ్విభుండు. 394

క. "సత్యవ్రతులార! వరం
బత్యంతప్రీతి మిమ్మునడిగెద; లోక
ప్రీత్యర్థముగా నాచే
మృత్యువునం బొందుఁ డిపుడ మీర లిరువురున్." 395

వ. అనిన వార లొండొరుల మొగంబులు సూచి యాచక్రధరున
కిట్లనిరి 396

చ. "నగవులకేనియున్ విను జనార్దన! యెన్నఁడు బొంకు పల్కఁ; మ
త్యగణిత విక్రమోరుబలధైర్యసమగ్రుల; మెల్లభంగిఁ గా
ల గతి దొలంగఁ ద్రోవఁగఁ దలం బగునే? యగుఁ గాక నీకు మె
చ్చగ నిదె ప్రాణ మిచ్చెదము; ముక్కము చావున కాత్మ నేమియున్,

ఆ. చంపెదేని మమ్ము జలములు లేని దే
శమునఁ జంపవలయుఁ గమలనాభ!
నిక్కమింతవట్టు నీచేత మడియంగఁ
దగుదు" మనిన నగుచు నగధరుండు. 398

వ. త్రైలోక్యంబును జలమయం బగుట నాలోకించి. 399

క. పరమేశుఁడు దనయూరులు
పరపుగ నొనరించి వానిపైఁ దచ్ఛిరముల్
పరుషతరశితసుదర్శన
ఖరధారానిహతిఁ జేసి గ్రక్కునఁ దునిమెన్. 400

తే. పరఁగ నమ్మధుకైటభాసురుల సుతుఁడు
సువ్వె ధరణీశ! ధుంధుఁ డన్ శూరవరుఁడు;
వాఁడు వరగర్వమునఁ జేసి వాఁడి మిగిలి
యమరపతిఁ దొట్టి వేల్పుల నవమతించె." 401

వ. అని చెప్పి యమ్మునీంద్రుం డి ట్లనియె "నట్లు బృహదశ్వుచేత ననుజ్ఞాతుం డై కువలాశ్వుండు శుభదినంబున నుదంకపురస్సరంబుగా గృతప్రస్థానుం డై. 402

తరలము. దనుజనిర్మథనైక తత్పరతావిజృంభణ మొప్ప స
ద్వినుతతేజుఁడు ఘోరసంగరవిక్రమోత్సవలీలమై,
ఘనభుజాబలభూరిదుర్వహగర్వసంగ్రహులైన నం
దను లనేకసహస్రసంఖ్యులు దన్నుఁ గొల్వ నుదగ్రుఁ డై.

మ. చతురంగధ్వజినీపద ప్రవిహతిన్ సర్వంసహాచక్ర మా
తతకంపంబునఁ బొంద నేఁగె; నపు డద్దైత్యారి యారాజునం
దతులం బైన నిజాంశశక్తి సొనిపెన్; హర్షించి రింద్రాదిదే
వతలున్, సన్మునిముఖ్యులున్ నృపతి నైశ్వర్యోన్నతుం జేయుచున్.

ఆ. మొరసె దివ్యతూర్యములు ; నందనద్రుమ
సురభికుసుమవృష్టి గురిసెఁ గలయ ;
నప్రతీతభంగి యగు మందపవనవి
చేష్టితంబు గర మభీష్ట మయ్యె. 405

క. గగనమున సురవిమానము
లగణితముగఁ గ్రందుకొనియె; ననుకూలము లై
మృగపతిగతులు శోభన
మగు చేర్పడఁ జెప్పె నజ్జనాధిపుయాత్రన్. 406

వ. ఇట్లు సని కువలాశ్వుండు సముద్రతీరంబున విడిసి, నిజపుత్త్రుల నానా సహస్రసంఖ్యులగు వారల నవారితజవసత్త్వులం దద్వాలుకాపులిన ఖననంబు సేయ నియోగించిన. 407

మ. నరనాథోత్తమునందనుల్ గడఁగి నానాశూలకుద్దాలము
ద్గరకాష్ఠాదుల సయ్యుదగ్రసికతౌఘం బంతయున్ సత్త్వవా
సరముల్ వాయక పాయ గ్రొచ్చి నడుమన్ సంసుప్తుఁడై యున్న యా
సురవైరిం గని రుగ్రనిశ్వసననిష్ఠ్యూతాగ్నికీలావృతున్. 408

చ. అదరి నిశాతపట్టిసగదాసిపరశ్వథశూలహస్తు లై
తడయక వార లందఱును దానవుదేహము వీఁక వ్రేసియుం,
బొడిచియు నొంప నెంతయును బ్రొద్దున కయ్యసురాధముండు బి
ట్టొడలు గదల్చి నీల్గి వివృతోగ్రముఖుం డయి యావులించినన్. 409

ఉ. ఘోరన విస్ఫులింగములు వొడ్మఁగఁ దన్ముఖనేత్రనాసికా
ద్వారములందు వెల్వడియె దారుణవహ్నిశిఖాకలాపముల్ ;
వారక యందు గ్రమంది రనివార్యులు రాజకుమారు లందఱున్
ఘోరత సాగరుల్ గపిలుకోపమునందు నశించుచాడ్పునన్. 410

వ. ఇట్లు దృఢాశ్వకపిలాశ్వభద్రాశ్వులు దక్కం దక్కిన కొడుకు లందఱుఁ బొడవడంగినఁ గినుకం గువలాశ్వుండు సంహారసమయసప్తాశ్వుండు నుంబోలె నుజ్జ్వలుండయి కదియుటయు, నద్దానవుండు క్రోధసంరంభంబున సముత్థితుం డై యొక్క శూలం బెత్తికొని కవిసె; నప్పు డమ్మహీవిభుండు దదీయ దేహజనితం బై మండుచున్న యగ్ని

నాత్మీయయోగవిద్యా ప్రభావం బగు జల ప్రవాహంబునం బ్రశాం
తంబు గావించి బ్రహ్మాస్త్రంబు ప్రయోగించిన. 411

క. ఆ దివ్యాస్త్రజ్వలనము
భూదిగ్గగనములు నిండి పొదివి మహోగ్రం
బై దానవు ఘనదేహము
బూదిగ నొనరంచెఁ జిత్రముగ నొకమాత్రన్. 412

వ. అంత. 413

క. "సురశత్రుఁడైన ధుంధునిఁ
బరిమార్చితి వీవు జగదభయకారివి; భూ
వర! ధుంధుమారుఁ డనఁగాఁ
బరఁగు" మనిరి సురలు మునులు పార్థివముఖ్యా! 414

వ. ఇట్లు ప్రసన్నులై యింద్రాదిదేవతలు, నుదంకప్రముఖ సంయమి
ప్రముఖులు నమ్మహీవరు నభినందించి "నీ కెయ్యది యిష్టంబు సెప్పు"
మనిన నతండు బ్రాహ్మణ భక్తియు, ననవరత దానశీలతయు, విష్ణుని
తోడి సఖ్యంబును వరంబులుగాఁ దనకుఁ గోరిన నట్ల యొసంగి,
రాక్షసనిహతు లైన యతని పుత్రులం బునర్జీవితులుగాఁ బ్రసాదించి,
వార లందఱు నిజనివాసంబులకుం జని; రంతఁ గువలాశ్వుండును విజ
యోల్లాసభాసితుం డై, యుదంకు నిజాశ్రమంబున కనిచి, కుమార
సహస్రంబుతో నిజపురంబున కరిగి, వారాంగనానృత్యగానవిశేషంబు
లాలోకించుచు రాజధానిం బ్రవేశించి, సముజ్జ్వలసామ్రాజ్యసౌఖ్యంబు
లం బరంగుచుండె" నని మార్కండేయుండు ధర్మరాజునకుఁ గువ
లాశ్వుండు ధుంధుమారుం డైన విధంబు సెప్పెనని వైశంపాయ
నుండు జనమేజయున కెఱింగించినతెఱంగు. 415

క. చరమయుగ చలిత ధర్మ
స్థిరీకరణచతుర చరిత! ధీగుణలీలా
పరికరపరిచితనయవి
స్తర! వితరణవివరణైకదానవినోదా! 416

మాలిని కరివరకిరికూర్మక్ష్మాధరాధీశతులో
ద్ధరణగుణధురీణోద్దండబాహార్గళాగ్ర
స్ఫురితనిఖిలగోత్రాభోగభాగ్యైకభోగా!
తరుణరుచిర మూర్తీ! ధర్మతంత్రానువర్తీ! 417

గద్యము. ఇది సకలసుకవిజనవినుత నన్నయభట్టప్రణీతంబైన శ్రీమహా భారతంబునం దారణ్యపర్వంబున యక్షయుద్ధంబును, కుబేర దర్శనంబును, నర్జునాగమనంబును, పాండవులకడ కింద్రుండు సనుదెంచుటయు, నర్జునుండు నివాతకవచ కాలకేయ పౌలోమ వధప్రకారం బెఱింగించుటయు, నాజగరంబును, పాండవులు గామ్యక వనంబునకు వచ్చుటయుఁ, గృష్ణ మార్కండేయాగమనంబును, బ్రాహ్మణ ప్రభావ కథనంబును, సరస్వతీగీతయు, వైవస్వతు చరితంబును, గల్పాంత ప్రకారం బును, యుగధర్మకీర్తనంబును, వామ్యాశ్వహరణంబును, నింద్రద్యుమ్నోపాఖ్యానంబును, ధుంధుమారచరితంబును నన్నది చతుర్థాశ్వాసము.



శ్రీః

గణేశశారదా గురుభ్యో నమః

# శ్రీమదాంధ్ర మహాభారతము

## ఆరణ్యపర్వము - పంచమాశ్వాసము

శ్రీయువతీప్రియ! నృపనా
రాయణబిరుదాంకభీమ! రమణీయగుణ
శ్రీయుత! నిర్మలధర్మప
రాయణ! రవితేజ! రాజరాజనరేంద్రా.

**ధర్మరాజునకు మార్కండేయుండు పుత్రున కుండఁదగు గుణంబులం దెల్పుట**

వ. అక్కథకుండు శౌనకాది మహామునులకుం జెప్పె; నట్లు బహుభంగుల మార్కండేయుండు వివరింప బుణ్యకథావిశేషంబులు విని సంతుష్ట హృదయుండై కౌంతేయపూర్వజుండు మఱియు నమ్మునీంద్రున కిట్లనియె. 2

సీ. "సమధికదర్పదుర్జయములై నిగిడెడు
నింద్రియంబులఁ గుదియించి తెచ్చి,
మనసుపొందున నిడి; మన నహంకారంబు
పఱ్ఱకుఁ బాపి, సద్భక్తియుక్తి
నెరయంగ ననిశంబు నిజభర్తృశుశ్రూష
యందు సమాహిత యైన వనిత
యఖిలలోకోత్కృష్ట యని యెప్డు నూహింతు;
నరయఁ బతివ్రత లైనవారి
తే. చరిత మత్యంతధర్మసూక్ష్మంబుఁ, గరము
దుష్కరముగాదె తలఁప నిర్ధూతదురిత!

యట్లు గావున విన వేడ్క యయ్యెఁ జెప్ప
వయ్య పుణ్యసతీప్రభావంబు నాకు.

వ. మఱియుఁ దల్లిదండ్రు లిరువురయందును బుత్రనిమిత్తం బైన యాయాసం బెవ్వరి కెక్కుడు ? వారలయెడం బుత్రుం డెట్టివాఁడు గావలయుఁ ? హీనయోనిజాతుఁడైన పురుషుం డేమి తెఱంగునడ వడిం బరమధార్మికుల లోకంబులు వడయు ? నివియును వివరింప నీవ యర్హుండ''వనిన నమ్మహాముని యమ్మహీపతి కిట్లనియె. 4

సీ. "జతనంబు మిగుల మాసములు దొమ్మిది యుద
రంబునం గరము భరంబుతోడ
భరియించి, పదపడి ప్రాణసంశయదశ
నొంది, పుత్రునిఁ గాంచునెందుఁ దల్లి ;
తపములు యజ్ఞముల్ దానముల్ వ్రతములు
దేవతా సజ్జన సేవనములుఁ
గావించుఁ బుత్రునిఁ గామించి జనకుఁ డి
ట్లిరువురపాటును సరియె తలఁపఁ;

తే. దనయుఁ గని తల్లిదండ్రులు దమకు నతడు
భక్తుఁ డగుటకు, ధర్మానురక్తుఁ డగుట
కాసపడుదురు; విను మట్టియాస సిద్ధి
బొందఁ జేయునతడెఁ చువ్వె నందనుండు. 5

క, జననియు జనకుఁడు నెవ్వని
యనువర్తనమునఁ బ్రియంబు నందుదు రెదఁ ద
త్తనయుఁడు ధర్మముఁ గీర్తియు
ననూనముగఁ బొందు, బడయు నక్షయగతులన్. 6

—: మార్కండేయుఁడు ధర్మజునకుఁ బతివ్రతామాహాత్మ్యంబు సెప్పుట:—

వ. మఱియు నిజభర్తృశుశ్రూషయందు నిత్యాసక్త యయిన పతివ్రతకు నఖిల యజ్ఞ దాన తపః ఫలంబులు సులభంబు లగు; నొక్క యితి హాసంబు సెప్పెద; నందు నీ యడిగిన యర్థంబు లన్నియుఁ దేటపడు నాకర్ణింపుము; కౌశికుం డను బ్రాహ్మణుండు ధర్మతపశ్శీలుండు

సంతతాధ్యయనతత్పరుం డయి యొక్క విశిష్ట గ్రామంబుననుండు; నతం డొక్కనాఁడు గ్రామసమీపంబునం దొక్క వృక్షమూలంబున నాసీనుండై వేదంబులు గుణియించుచుండం దదీయశాఖాగతంబైన కొక్కెర యొక్కం డాతనిపై రెట్ట వెట్టిన, నమ్మహాద్విజుం డలిగి చూచుటయు, నది యప్పుడ నిశ్చేతనంబై నేలంబడినం గనుంగొని యతండు. 7

క. "అక్కట ! సాంహృదయము గడు
నక్కటికము లేని దయ్యెఁ; ననిమిత్తమ యీ
కొక్కెర నిటు సేసితి; నా
కెక్కడి శాంతి ?" యని వికలహృదయుం డగుచున్. 8

వ. పెక్కుభంగుల వగచి మధ్యాహ్నం బగుటయుఁ గృతాహ్నికవిధానుండై గ్రామంబున కరిగి. యందు శుచు లైన విప్రగృహంబుల కరిగి, భిక్షాచరణంబు సేయుచు నందొక్క పుణ్యగృహంబువాకిట నిలిచి, 'భిక్షాం దేహి' యనుటయు, నాయింటి యవ్వయు నతిసంభ్రమంబున భిక్ష యిడుటకుం బాత్రశోధనంబు సేయునెడ. 9

ఉ. ఆ యెలనాఁగభర్త గడు నాఁకటఁ దూలుచు వచ్చె; వచ్చినం
దోయజనేత్ర సంభ్రమముతోఁ దగుపీఠము వెట్టి, పాద్యముం
బాయక మజ్జనక్రియయు భక్తి నొనర్చి, ప్రియోక్తు లొప్పఁగా
నాయనఁ బ్రీతుఁ జేసె రుచిరాన్నరసంబులఁ జేసి చెచ్చెరన్. 10

చ. కుడిచినపిమ్మటం గుసుమకోమలి విస్తృతసంస్తరంబుగా
నొడికపుసెజ్జ సేసి ప్రియుఁ డొయ్యన యందు శయింపఁ దమ్ములం
బిడి చరణంబు లొత్తి మదిరేక్షణ యంతటిలోఁ దలంచె ము
న్నడరఁగ భిక్షుకై నిలిచినట్టి మహీసురముఖ్యు నాత్మలోన్. 11

వ. ఇట్లు దలంచి భిక్ష గొనుచుం జనుదెంచిన నమ్మగువం జూచి కౌశికుండు రోషరంజితలోచనుం డగుచు ని ట్లనియె. 12

క. "అడిగినయప్పుడ చెచ్చెరఁ
గడపినఁ బో నవ్వ ! యేను ? గడుదుర్మతి వై

పడఁతి ! నను నిలిపి భిక్షం
బిడక కడు నవజ్ఞ సేసి తేల మదమునన్ ?'' 13

చ. అనినఁ బ్రతివ్రతాతిలక మాతని కిట్లను "నయ్య ! మత్ప్రియుం
డనుపమితక్షుధా కలితుఁడై చనుదెంచిన, భక్తి నమ్మహా
త్మునకు సపర్య సేయుచు మిమున్ మదిలోనఁ దలంపఁ జాలనై
తి; నిదియుఁ దప్పుగాఁ గొనక ధీరత యొప్ప సహింపఁ గాఁ దగున్.''

వ. అనిన నమ్మహీదేవుం డప్పతివ్రత కిట్లనియె. 15

ఉ. నీ మగఁ డంత యొక్కుడె ? మనీషులు భూసురు లింతతక్కువే ?
కోమలి ! యేల యిట్లు గడుఁ గ్రొవ్వునఁ గానవు లోకవంద్యులన్
భూమిసురేంద్రులన్; దివిజపుంగవుఁ డాదిగ భక్తిఁ గొల్చుచో
నేమిటనొక్కొ వారు గడు నెల్లిదమై రిటు నీకు నిచ్చలున్ ? 16

క. అవమానితులై ధరణీ
దివిజులు క్రోధాగ్నిశిఖలు దీపించి మహో
ద్రవనద్వీపంబులతో
నవని నయినఁ బొడవడంతు రప్రతికారుల్. 17

వ. నీ వింతయు నెఱుంగ నొల్లవైతివి గాకేమి ?'' యనిన నయ్యంగన
యి ట్లనియె. 18

సీ. "దేవతాసములు భూదేవతావరు లౌట
యేను దన్మాహాత్మ్య మెఱుఁగనయ్య ?
యొక విప్రుఁ డలిగి పయోనిధిజలము ల
పేయముల్ గాఁగ శపింపఁ డెట్లు ?
దండకవిషయంబు దగ్ధంబు సేయండె
యలుకమై నొక్కమహాద్విజుండు ?
వాతాపి యను దైత్యవరు మ్రింగి యఱిగించు
కొనఁడె భూదేవుఁ డొక్కొరుఁడు గినిసి ?
తే. ధరణి మఱియును బెక్కువిధంబులందు
బ్రహ్మవిదులైన బ్రాహ్మణప్రభులమహిమ

వినమె? యెఱిఁగి యెఱింగి సద్వినుతచరిత!
కొఱవిగొని వెట్టిసే తలగోఁకి కొనఁగ? 19

వ. నా తెఱంగు సెప్పెద నాకర్ణింపుము. 20

తే. పతియచూవె నాపాలికిఁ బరమదైవ;
మేను వాఙ్మనఃక్రియలఁ దద్ధితమ యెపుడుఁ
గోరి యొనరింతు; దీనిమిగులఁగ నొండు
ధర్మువులు గాన నెందును దలఁచి చూచి. 21

వ. నీ వతిక్రోధనుండ వగుటయు నెఱుంగుదు; నీ కోపంబున నొక్క కొక్కెర నిహతంబయ్యెం గాదె? యిది మదీయ పాతివ్రత్యమహిమం జేసి కాంచితింగాన క్రోధంబుగొని యాడుట లగ్గు గా''దని యిట్లనియె.

తే. క్రోధమోహనామకులైన ఘోరశత్రు
లిరువు రెరియించుచుండుదు రెపుడు నరుని
యంతరంగ; మయ్యుభయంబు నడఁపకున్నఁ
గలదె యూరక బ్రాహ్మణ్యగౌరవంబు? 23

సీ. ఎవ్వఁడు సత్యంబు నెప్పుడుఁ బల్కు, హిం
సావిదూరుఁడు, గురుజనహితార్థి,
యింద్రియంబుల నోర్చి, యెల్లవారలఁ దన
యట్ల కాఁ జూచుఁ ధర్మాభిరతుఁడు,
కామంబు దగులండు, కర్మంబు లాఱును
సముచితసంప్రయోజ్యత నొనర్చు,
నట్టిపుణ్యాత్ముని ననఘు బ్రాహ్మణుఁ డని
యనిశంబుఁ గీర్తింతు రమరవర్యు;

ఆ. లార్జవంబు, శమము, నధ్యయనంబును,
బరమధనము సుమ్మె బ్రాహ్మణునకు;
ధర్మగతికి నివియ తగుసాధనంబులు,
వేదవిహితముఖ్యవిధులు నివియ. 24

వ. ధర్మంబు బహుమార్గదృష్టం బయి సూక్ష్మం బయి యుండు; నీవు కేవలస్వాధ్యాయ పరుండవు గాని ధర్మసూక్ష్మత యెఱుంగవు;

గావునం దడయక మిథిలానగరంబున కరుగు; మంను జితేంద్రియుం డును, సత్యవాదియు, మాతాపితృభక్తుండును నయినవాఁడు ధర్మ వ్యాధుం డను కిరాతుండు నీకు నఖిలధర్మంబులు నెఱింగించి, సంశ యచ్ఛేదంబు సేయు; నాదెసం బ్రసన్నుండ వగునది; వనితలకుం బరిజ్ఞా నంబు లేదు గావున నా రెట్టి యపరాధంబు సేసినను సహింపవలయుఁ గదా" యనినఁ గౌశికుం డి ట్లనియె.

క. నను దూఱం దగు; నీకత
మున నా చిత్తము ప్రశాంతిఁ బొరసె; బురంధ్రీ
జనవినుత! పో వచ్చెద;
ననుపమశోభనసమృద్ధిఁ లయ్యెడు నీకున్." 26

—: కౌశికుం డను బ్రాహ్మణుఁడు ధర్మవ్యాధునియొద్దకుఁ బోవుట :—

వ. అని యా క్షణంబ యమ్మహాద్విజుండు ధర్మవ్యాధదర్శనలాలసుం డై కదలి పతివ్రత యెఱుకకు విస్మయం బందుచుఁ, దన్నుం గృతాపరాధునింగాఁ దలంచుచు, ననేక నగరగ్రామంబు లతిక్ర మించి చని యనుపమానశోభాసనాథంబయిన మిథిలా నగరంబు సొచ్చి, రాజమార్గంబు దఱిసి, యచ్చటి జనంబుల ధర్మవ్యాధుం డున్న యెడ నడిగి వా రెఱింగింప నట యేఁగి ముందట నల్పమృగ మాంసఖండంబు లంగడిం బచరించి యమ్ముచున్న వాని, ననవరత విక్రయాగతజనసమావృతు, నక్కిరాతుం గని, యతిజుగుప్సితం బయిన సూనాపణంబు సేరనొల్లక తొలంగి యొక్క యెడ నుండె; నంత. 27

ఆ. వాఁడు నతని రాక పోఁడిగి నిజబుద్ధి
నెఱిఁగి యతని యున్న యెడకు వచ్చి
పరమభక్తి మ్రొక్కి ధరణిసురేశ్వరుఁ
గుశల మడిగి ప్రియము గొనలు నిగుడ. 28

చ. "అనఘ! పతివ్రతాతిలక మైన నితంబిని నా తెఱంగు సె
ప్పినఁ జనుదెంచి తీవు ననుఁ బ్రీతిఁగనుంగొన; నీ మనోరథం
బును మదిలో నెఱుంగుదుఁ; బ్రమోదముఁ బొందితి; రమ్మ మద్గృహం
బున" కని పల్కి తోడుకొనిపోయె నతండు మహీసురోత్తమున్. 29

వ. కౌశికుండును ధర్మవ్యాధుసెఱుక కచ్చెరువంది, పతివ్రత యెఱు
కయుం దలంచి, "యిది రెండవు నాశ్చర్యంబు గంటిఁ బో" మ్మని
తలంచుచుఁ బదీయభవనంబున కరిగి వానిచేతం బూజితుం డయి
యిష్టకథా ప్రసంగంబున నుండి యతని కి ట్లనియె. 30

తే. "నీవు గడు ధర్మవిదుఁడవు; జీవహింస
జీవనంబుగ నడచుట శిష్టపథ మె?
యకట! యీఘోరకర్మంబునకు మదీయ
బుద్ధి దద్దయు దుఃఖంబు వొందె నిపుడు." 31

వ. అనుటయు లుబ్ధకుం డి ట్లనియె "బ్రాహ్మణులకుఁ దప స్స్వాధ్యాయ
సత్యశౌచబ్రహ్మచర్యంబులును, రాజులకు దండనీతియు, వైశ్యులకుఁ
గృషిపశుపాలనవాణిజ్యంబులును, శూద్రులకు శుశ్రూషయు నెట్లు
పరమధర్మంబయి చెల్లు, నట్ల మాకును మృగయోపజీవనంబు పరమ
ధర్మంబు; విశేషించి యిది వంశక్రతమాగం బయిన యాచారం;
బదియునుం గాక యీ దేశంబునకు రాజైన జనకుండు నిజధర్మ
తత్పరుం డయి సకలవర్ణధర్మరక్షణంబు వదలకుండు; నట్లు గాన
యాత్మకర్మంబులు విడుచువానిం దన పుత్త్రునైనను దండితుం
జేయుఁ; గావున నేనును నిజకర్మపరిత్యాగంబు సేయ నోడుదు;
నీదృశప్రవర్తనుండ నయ్యును. 32

తే. జీవహింస యెన్నండును జేయ ననఘ!
యొరులు సంపి తెచ్చినమాంస మొనర విలిచి
తగినవెల కమ్మి బ్రతుకుదుఁ దద్ధనమున;
నమల మాంసంబు; శాంతియ సాధనంబు. 33

చ. వినయము విస్తరిల్ల గురు వృద్ధ జనాతిథి విప్ర దేవతా
ర్చన లొనరింతు; సత్యమును శౌచము నేమఱ; నీగి మన్ననం
దనుపుదు; భృత్యబంధుతతిఁ దాల్మి వహింతు; ననూయఁ జేయ; నెం
దును మదిఁ దృష్ణ సొన్పఁ; బరదోషకథావిముఖుండ నెప్పుడున్. 34

క. సతతోపవాసనియమ
వ్రతములఁ జరియింతు; నేకవనితా ప్రియుఁడన్;

ఋతుకాలరతుఁడ; నిందా
స్తుతులందు మనంబు నాకుఁ దుల్యత నుండున్. 35

వ. అట్లగుటం జేసి హీనయోనిజుండ నయ్యును నిర్మలుండ నైతిం; బ్రసంగవశం బున నింత సెప్పవలసె; నీవు ధర్మబోధార్థంబు నాయున్న యెడకుం జనుదెంచితి గావున నీకు ధర్మవిశేషంబు లెఱింగించెద; నవధానతత్పరుండ వయి యాకర్ణింపుము. 36

—: ధర్మవ్యాధుఁడు కౌశికునకు ధర్మవిశేషము లెఱిఁగించుట :—

క. తన కులధర్మము విడువక
మనుట, పరమధర్మ మండ్రు మాన్యులు; చిత్తం
బునఁ గృప గలుగుట ముఖ్యముఁ
బని; సైరణ వలయు నఖిలభావములందున్. 37

ఆ. విడుపువలయు సకలవిషయవాంఛలయందు;
విడుపుఁబోలుగుణము వెదకి యెందుఁ
గానరైరి బుధులు; గలదె పరిత్యాగ
శీలునకు నసాధ్యసిద్ధి యెందు? 38

సీ. సత్యహితాలాపచతురత యర్థంబు;
సంతతసుజనపూజనము వలయు;
విను కామసంరంభవిద్వేషములఁ జేసి
మతి గలంగినను ధర్మంబు దప్పఁ
ద్రొక్కక నడుచు టత్యుత్తమసరణి: య
ప్రియములయందును బ్రియములందు
దైన్యహర్షంబులఁ దగులక యున్నట్టి
కల్యాణవర్తనకాంతు లెస్స;
తే. యెగ్గు సేసినవారికి హితము సేఁత
యార్యజనములు గీర్తింతు; రన్యదోష
కారి దన పాపమునఁ దాన కాలిపోవు;
వేఱ వానికిఁ గీడు గావింప నేల? 39

క. ధార్మికులు సలుపు నుత్తమ
కర్మముఁ జెడ నాడు నాస్తికజనము; విను మా

దుర్మతుల తెఱఁగు గైకొని
ధర్మమునెడఁ బ్రీతి వదలఁ దగదు బుధునకున్. 40

క. మది మఱపునఁ బాపము దన
కొదవుటయును బిదప వగచి యొకసగమును, నే
నిది సేయ నింక నని యొదు
మదిఁ బెఱసగమును నరుండు మలుఁగు నఘంబున్. 41

తే. పాపముల కెల్ల నెక్కుడు పాతకములు
సువ్వె క్రోధలోభంబులు; సువ్రతాత్మ!
వాని రెంటి జయించినవాఁడుగాని
యెందుఁ బరమధార్మికుఁ డని యెన్నఁబడఁడు. 42

వ. శిష్టచరితంబులు గాని మార్గంబులు గొన్ని తృణసంవృతంబులైన కూపంబులుం బోలెఁ గపటధర్మసంవృతంబులై యుండు; వాని దవ్వులన పరిత్యజించి శిష్టాచారంబుల నడచుట ధర్మలక్షణం''బనినం గౌశికుండు "శిష్టాచారం బెయ్యది? యెఱింగింపు" మనుటయు ధర్మవ్యాధుం డిట్లనియె. 43

సీ. దానంబు, సత్యంబుఁ, దపము, యజ్ఞము, నార్జ
వముఁ, గామలోభాదివర్జనంబు,
గురుజనశుశ్రూష, క్రోధరాహిత్యంబు,
దమము, సంతోష, మధ్యయననిరతి,
దాంభికత్వములేమి, దైన్యంబు వొరయమి,
యనసూయ, యనహంక్రియాభియుక్తి,
దలఁపంగ నాద్యమై తనరు ధర్మమ యెప్డుఁ
గొనియాట, నాస్తికగోష్ఠిఁ జనమి,
తే. శీలసంరక్ష, తీర్థసంసేవ, శౌచ,
మఖిలభూతంబులందు దయార్ద్రిఁ దగుట,
మితహితోక్తులు, సంశ్రితమిత్రగుప్తి,
యిన్నియును శిష్టచరితంబు లిద్ధచరిత! 44

క. విను శిష్టచరిత గైకొని
యనసూయత నడవ నడవ నతఃకరణం
బునఁ బొదలునట్టి సమ్మద
మనఘా! దుర్లభము సూవె యన్యపథములఁ. 45

వ. కావున శిష్టాచారనియతిం జేసి గురుశుశ్రూష సలిపి కృతాధ్యయనుం డవై పరమ జ్ఞానపరిపక్వంబైన చిత్తంబుతోడం గామక్రోధమహా మకరసంకీర్ణయు, విషయజల పరిపూర్ణయునైన మోహజలధి నస్ఖలిత ధైర్యం బను తెప్పంజేసి యశ్రమంబున నిస్తరించి కృతార్థుండ వగు'' మని మఱియు నిట్లనియె. 46

క. ''క్రమమున శిష్టాచార
క్రమ మెఱుఁగఁగ ధర్మమునకుఁ గడు వాటం బై
విమలం బగుఁ జిత్తము స
త్యమును నహింసయును దనకుఁ దావలయులుగాఁ. 47

ఆ. విను మహింస ధర్మవితతి కెల్లను మేటి;
యదియు సత్యయుక్తమైన వెలయు;
ననఘ! శిష్టచరితలందు సత్యము కడు
నధిక మనిరి శ్రుతుల నరసి బుధులు. 48

తే. వేదవిహితంబులును, శాస్త్రవిహితములును,
శిష్టచరితంబులును ననఁ జెప్ప నొప్పి
ధర్మములు మూఁడువిధములఁ దనరుచుండుఁ
గడగి యిన్నియు సద్గతికారణములు. 49

మ. అనయంబున్ శ్రుతవంతుఁడై వినుతశిష్టాచారమార్గంబులం
జను పుణ్యాత్ముఁడు దుర్గముల్ గడచి ప్రజ్ఞాహర్మ్యసంరూఢుఁడై
కనుచుండుం బటుమోహపంకజలమగ్నం బైన లోకంబు వీఁ
క నధోభాగమునందు డింది కడు దుఃఖం బొందఁగా నవ్వుచున్'' 50

—: ధర్మవ్యాధుఁడు గౌశికున కహింసాస్వరూపంబు సెప్పుట :—

వ. అని పలికి ధర్మవ్యాధుండు మఱియు నిట్లనియె ''నయ్యా! నీవు దొలుత నా వర్తనంబు గనుంగొని యిది హింసాబహుళంబు గాదె

యని పలికితివి; దాని కేను దగు తెఱంగు సెప్పితి; నది యట్లుండె;
హింస యిట్టిది యహింస యిట్టి దని విభాగింప నెవ్వరికి నేర నగు?

క. మును తమ చేసిన కర్మం
బునఁ జూవె నశించు భూతములు; సంపెడువాఁ
డు నిమిత్తమాత్ర మింత యె
యని చెప్పఁగ వినమె యంచితాచారులచేఁ. 52

వ. అదియునుం గాక. 53

క. ఫలమూలౌషధిశాకం
బులుఁ బశుమృగతతులు భక్ష్యములుగా భూతం
బుల కజుఁడు సేసె నని య
స్ఖలితంబుగ మ్రోయు శ్రుతులు; కాదన వశమే? 54

సీ. అనఘ! యౌశీనరుం డగు శిబి నిజగాత్ర
హింస నింద్రాగ్నుల కిడఁడె మాంస?
మతనికి లేదె దయ్యైనయ్యు యుత్తమగతి?
రంతిదేవుం డను రాజు దొల్లి
యనుదినంబును గోసహస్రద్వయంబుఁ దా
వధియింపఁడే? వేయివత్సరములు;
దురిత మమ్మహితాత్ముఁ దొడరెనే? వేదార్థ
నిరతులై యత్యంతనియతు లైన.
తే. ధారుణీసురముఖ్యు లధ్వరములందుఁ
బశువుల వధింపరే? తగఁ బరమపుణ్య
గతులు గలుగవె వారికిఁ? గడఁగి యగ్ను
లధికమాంసార్థులని శ్రుతులందు వినమె? 55

క. పితృదైవత కార్యములం
దతిభక్తిని మాంస మిడుట యర్హమనియుఁ, ద
త్పితృదైవశేషములు స
మ్మతి భోజ్యము లనియు మునుల మతములు గావే? 56

మ. హాలికుం డెంతయు నోజతోఁ దునఁగ సీరాగ్రంబునం జోఁకి ప్రా
ణు లనేకంబులు సచ్చు; హింస యది యానో? కాదొ? వేయేల? మ
ర్త్యులు నేలం జరియించుచోఁ బదములం ద్రొక్కంబడుం బెక్కుజం
తులు; హింసావిధి గా దనంగ వశమే? దోషజ్ఞ! యూహింపుమా.

చ. సలిలము, లుర్వి, యాకసము, సర్వము జంతుమయంబు; గావునం
గలుగు నవశ్యమున్ సకలకర్మములందును హింస; హింసకుం
దొలఁగిన దేహయాత్రయును దుర్ఘట మైనటు లుండు; నింతయుం
దలఁపర; హింస సేయ మని తారు తలంతురు గొంద ఱిమ్మహిన్.

క. పనివడి యహింస వ్రతముగఁ
గొని వనమున నున్న మునులకుం దొడరదె హిం
సనము? తరు మూల ఫల శా
కనిపీడన మదియు హింస గాదొకొ? తలఁపన్. 59

తే. హింస సేయనివాఁడు లేఁ డిజ్జగమున
నొక్కఁడై నను, దమతమ యోపినట్లు
హింస తెరువున కెడగల్గి యేఁగవలయు;
నదియ చూవె యహింస నా నతిశయిల్లు.

వ. ధర్మంబు బహుప్రకారం బై యుండుఁ; దదీయసూక్ష్మగతి · దురవ
బోధంబు; గావున శ్రుతిప్రమాణంబువలనను, వృద్ధాచారనిదర్శనంబు
లను నెఱింగికొనునది. 61

ఉ. భూతహితంబుగాఁ బలుకు బొంకును సత్యఫలంబు నిచ్చుఁ; ద
ద్భూతభయాస్పదం బగు ప్రభూతపుసత్యము బొంకునట్ల; ప్రా
ణాతురుఁ డైనచోఁ, బరిణయంబునయందును, బల్కు బొంకు స
త్యాతిశయంబ యండ్రు; మహితాత్మక! యిట్టివి ధర్మసూక్ష్ముముల్."

వ. అని తెలిపి మఱియు నతండు. 63

క. "ఒప్పెడునది యైనను గడు
నొప్పనియది యైన నిజకులోచితపథముం
దప్పఁ దగ దండ్రు ధార్మికు;
లప్పని నిజభాగ్యవిహిత మని యుండఁ దగున్. 64

క. విను పూర్వకర్మ ఫలములు
దనకు వశము గాక పొందుఁ దఱితోఁ; వానిం
గనుఁగొన నేరక మూఢుఁడు
దన కాపద యైనచోట దైవము దూఱున్. 65

తే. కార్యఫలములయెడఁ దాన కర్త ననుట
కడు నెఱుంగమిఁ జువ్వె; తాఁ గర్తయేని
తగిలి తనదైన కార్యజాతంబు నెల్లఁ
జెడక ఫలియించునట్లుగాఁ జేయరాదె? 66

వ. అది యెట్లంటేని. 67

సీ. నీతిమంతులు, ధర్మనిరతులు, దక్షులు
నగు వారు నేయుకార్యములు గొన్ని
సిద్ధిఁ బొందవు; దుష్టచిత్తులు క్రూరులై
చేయఁ గొన్ని విశేషసిద్ధిఁ బొందు;
నూరక యుండంగ నొందుఁ గొందఱు విపు
లార్థముల్; గొంద ఱాయాసపడియు
నిష్ఫలారంభులై నిలుతురు; గొందఱు
పేదవారికిఁ బ్రజ పెల్లు వొడము;
తే. నర్థవంతులు గొందఱ కర్థి నధిక
దానములు ధర్మములు సువ్రతములుఁ జేయఁ
బ్రజలు పుట్టరు; విను మట్టిభంగి సుమ్ము
కర్మ ఫల మాత్మతంత్రంబు గాకయుండు. 68

క. పురుషుఁడు కర్మాధీనత
నరుగక తనవశమ యనిన నాపదలు రుజల్
మరణంబును నివి యేమియు
జొరయక యుండంగ బ్రదుకఁ బోలదె? చెపుమా. 69

ఆ. కర్మవశతఁ జావె కలుగు దేహము; దేహ
వర్తనంబు కర్మవశతఁ బుట్టు;
దేహపాత మైన దేహస్థుఁడగు జీవు
డరుగుఁ గర్మవిహిత మైన యెడకు." 70

వ. అనినం గౌశికుండు జీవుం డెట్టివాఁ డని యడిగిన లుబ్ధకుం డి
ట్లనియె. 71

—: ధర్మవ్యాధుఁడు గౌశికునకు జీవలక్షణంబు సెప్పుట :—

క. "విను జీవుండు సనాతనుఁ
డనఘుఁడు; నిజకర్మవశత నధ్రువదేహం
బునఁ బొందు; దేహపాతం
బున నెప్పుడుఁ జెడఁ డతండు భూసురవర్యా! 72

క. ఈయొడలు విడిచి వే ఱొక
కాయముఁ గైకొని శరీరి కర్మవశగతిం
బోయి సుఖదుఃఖములు గనుఁ
బాయక వెండియును దేహబంధముఁ బొందున్." 73

వ. అనిన విని బ్రాహ్మణుండు లుబ్ధకునితోడం "బుణ్యపాపానురూపంబు
లయిన దేహబంధంబు లెట్టి" వనిన వాఁ డి ట్లనియె. 74

చ. "స్థిర మగు పుణ్యకర్మమున దేవభవం బగుఁ; బుణ్యపాపసం
కరమున మానుషత్వ మగుఁ; గల్మషముల్ పశుకీటభావముం
బొరయఁగఁ జేయు; నిప్పగిదిఁ బుట్టుచుఁ జచ్చుచు మోహవార్ధిలోఁ
దిరుగుచు నుండుఁ గాని యొకతీరముఁ జేరఁడు జీవుఁ డెన్నఁడున్.

చ. ఇది సకలంబుఁ గాంచి బుధుఁ డెన్నఁడుఁ బాపముపొంతఁ బోక, ని
ర్మదనిరహంక్రియాత్ముఁడును, మత్సరదూరుఁడు నై చరించుఁ బెం
పొదవఁగఁ ధర్మమార్గమున; నొయ్యన ధర్మముతీ ఱెఱింగి తా
వదలఁడు సత్క్రియావిధము; వారక యెక్కుడొనర్చు ధర్మముల్.

చ. చిరముగ ధర్మముల్ నడపఁ జిత్తము దేఱుఁ; బ్రసన్నచిత్తుఁడై
పరువడి నింద్రియార్థముల భంగులు రిత్తలుగా నెఱింగి, చె
చ్చెర నవి యంతవట్టు నిరసించి తపోదమసత్యశీలతం
బరిణతి నొందుఁ; బొందుఁ బిదపం బరమార్థపదప్రభావమున్." 77

వ. అనిన నమ్మహాద్విజుం డమ్మహామతి కిట్లనియె. 78

ఆ. "ఇంద్రియంబు లనఁగ నెయ్యవి? యవి నిగ్ర
హింపకున్నఁ బాపమేమి దొడరు ?
వాని నిగ్రహించువానికి నగు ఫలం
బెట్టి?'' దనిన నాతఁ డిట్టులనియె. 79

క. ''విను విషయజ్ఞానమునకు
ననయంబును మనసు మూల; మది కామ క్రో
ధనిరూఢ మగుచుఁ బురుషుని
ననిశము నెలయించు నింద్రి యార్థక్రియలన్. 80

సీ. ఇంద్రియార్థంబుల నెలసిన పురుషుండు
గాఢరాగంబునఁ గరఁగుచుండు;
రాగంబువలనఁ దిరం బగు లోభంబు;
లోభి యై కరుణకు లోను గాఁడు;
మఱి సముద్ధతవృత్తి మరగుఁ బాపక్రియఁ;
దగువారు సెప్పెడి తగవు వినఁడు;
కుజనుల దెసఁ బ్రీతి గొలుపుఁ; దుల్యంబులు
గా కుండు వాఙ్మనఃకర్మభంగు;

ఆ. లిహమునందుఁ బుణ్యహీనుఁ డై చెడిపోవుఁ
బరమునందు దుఃఖభరమునొందుఁ;
గాన యింద్రియార్థగతిఁ బోక సాధుసం
సర్గఁజేసి సుగతిఁ జనుట యొప్పు. 81

వ. ఇంద్రియంబు లన నెయ్యవి యనియు నింద్రియజయసిద్ధియు నీవు నన్నడిగితివి; తత్ప్రకారంబు బ్రహ్మవిద్యా విషయంబు; మాబోఁటి వారికి నవాచ్యం బై యుండు; నైనను నీవు బ్రాహ్మణప్రవరుండవు గావున సద్బ్రాహ్మణప్రియం బవశ్యకర్తవ్యంబు; పరమ బ్రహ్మవిదు లయిన బ్రాహ్మణవరులకు నమస్కరించి, బ్రహ్మవిద్యా ప్రపంచం బెఱింగించెద; నవధానపరుండ వై యాకర్ణింపుము. 82

**—: ధర్మవ్యాధుఁడు కౌశికునకు బ్రహ్మవిద్యా ప్రపంచం బెఱింగించుట :—**

తే. అంబరము వాయు వగ్ని తోయమ్ము ధరణి
భూతపంచక మిది క్రమంబున; మహాత్మ!

శబ్ద సంస్పర్శ రూప రసములు గంధ
సంయుతంబుగ భూతపంచకగుణములు. 83

క. ఒనరఁగ నాకస మాదిగ
ననులోమముతోడ నిమ్మహాభూతము లే
మను బుట్టు; నొకటికొక్కటి
యనయముఁ బ్రతిలోమగతి లయంబునఁ బొందుఁ. 84

వ. శ్రోత్రంబును, ద్వక్కును, జక్షువును, జిహ్వయు, ఘ్రాణంబును నను నియ్యైను నింద్రియంబులు; శబ్ద స్పర్శ రూప రస గంధంబు లింద్రియ విషయంబు లై యుండు; నింద్రియపంచకంబునకు షష్ఠం బై మనస్సు ప్రకాశిల్లు; సప్తమాష్టమంబు లై బుద్ధియు నహంకారంబును వర్తిల్లు; సత్త్వంబును, రజస్సును దమస్సును గుణంబు లై యుండు; నీ చెప్పం బడిన మహాభూతప్రముఖప్రపంచం బంతయు నవ్యక్తంబను తత్త్వం బునం దావిర్భావతిరోభావంబులం బొందుచుండు. 85

క. అవ్యక్తతత్త్వ మరయఁగ
నవ్యక్తం బయ్యు నిట్టిదై లక్ష్య మగుఁ
సువ్యక్తేంద్రియభూతా
ది వ్యవహారార్థలింగదృష్టాకృతి యై.'' 86

వ. అని చెప్పి మఱియు ని ట్లనియె. 87

తే. "అనఘ! శబ్దాదివిషయంబులందుఁ దగిలి
యిచ్చఁ జరియించు నెప్పుడు నింద్రియములు;
బుధుఁడు దత్స్వభావముఁ దన బుద్ధి నెఱిఁగి
యేమఱక వానిఁ దగఁ గుదియింపవలయు. 88

ఉ. ధీరుఁడు నిర్జితేంద్రియుఁడు దెల్లముగాఁ దనుఁ గాంచు భూతవి
స్తారనిగూఢ మైన పరతత్త్వముగాఁ; దనయందు భూతవి
స్తారము నెల్లఁ గాంచు; సతతస్ఫుటదర్శనుఁ డై, సమగ్రచి
త్పారముఁ బొంది నిర్మలతపంబులయందుఁ జలింప కెన్నఁడుఁ. 89

క. తప మనఁగ సకలవిషయ
వ్యపేత మగునట్టి బుద్ధివైభవము సుమీ;

తపమున సుస్థిరుఁ డగు యో
గపరునకుం గలవె యొండు కర్తవ్యంబుల్? 90

క. స్వర్గనరకంబు లింద్రియ
వర్గసమాచరణమునన వచ్చును వినవే;
స్వర్గ మగుఁ దన్నివారణ;
దుర్గతి యగుఁ దన్ని రోధదుర్బలతమెయిన్. 91

చ. అరదము దేహ, మింద్రియము లశ్వము, లాత్మ్మఁడు సూతుఁ, డమ్మహా
తురగచయంబు ధైర్య మను తోరపుఁబగ్గములన్ దృఢంబుగా
నురపడిఁ బోక యుండ వెర వొప్పఁగఁ బట్టినవాఁడు సేమపుం
దెరువున నేఁగు, నప్పరమధీరుఁడు నువ్వె యుదారుఁ డెయ్యెడన్. 92

తే. ఇంద్రియంబులు దివిచినయెడక పాఱు
చుండు మన సెప్డుఁ; దద్వేగ ముడుపకున్న
నెడలి చెడిపోవు బుద్ధి యుదీర్ణపవన
హతిఁ బయోనిధిలోఁ గల మవియునట్లు. 93

క. పంచేంద్రియములు మనసును
బూని తనవశంబ యైనఁ బురుషుండు గదా
ధ్యానసమాధిసమగ్రుఁడు;
వానిం గీర్తింతు రమరవరులున్ మునులున్." 94

వ. అనిన నవ్విప్రుండు "సత్త్వరజస్తమోగుణంబుల తెఱం గెఱింగింపు"
మనిన నెఱుకి ట్లనియె. 95

**ధర్మవ్యాధుఁడు కౌశికునకు సత్త్వరజస్తమోగుణముల తెఱంగెఱింగించుట**

క. "అతినిందితము తమోగుణ
మతిమోహామయంబు; సత్త్వ మనయంబుఁ బ్రకా
శత నొప్పు; నుభయగుణమి
శ్రతఁ బరఁగు రజోగుణంబు సన్నుతచరితా. 96

మ. అసుఖాకారత, నిద్ర, దైన్యము, విమోహం, బక్షమత్వంబుఁ దా
మసభావంబులు; రాగ లోభ జడతా మానంబు లూహింప రా

జనవృత్తంబులు, ధైర్య శాంతి కరుణా సంతోష విద్యాదు లిం
పెసఁగఁగ సాత్త్వికచేష్టితంబులు, నిజం బి ట్లాత్మఁ గన్గొంతయున్.

చ. అనఘుఁడు సాత్త్వికుం డగు మహాత్ముఁడు బోధనిరూఢి సర్వముం
గనుఁగొని, లోకవృత్తములు గా వని రోసి, సమస్తసంగభం
గనిరతుఁ డై తొలంగు మమకారవికార; మహంక్రియాచ్యుతిం
బనుపడి సంయమప్రకటభావన నుత్తమశాంతి గైకొనున్. 98

వ. సత్త్వగుణనిబద్ధుం డగునేని శూద్రుం డైనను జన్మాంతరంబున వైశ్య
త్వంబునొంది, క్రమంబున రాజ భూసురభావంబులు భజించి, భవవిము
క్తుం డగు" నని చెప్పిన నమ్మహీదేవుం డమ్మహానుభావు నభినందించి.

తే. "దేహమున ధాతుసంశ్రయదీప్తుఁ డగుచు
వహ్ని యెట్లుండు? శారీరవాయువులకు
నెలవు లెయ్యవి? యవి నాకు నిశ్చయముగఁ
జెప్పు" మనుటయు నిట్లని చెప్పెనతఁడు 100

సీ. "మూర్ధదేశమునకు వర్ధితం బై పర్వు
నాత్మాగ్ని, నాభి దదాశ్రయంబు;
శిరమునఁ బావకాంతరమునఁ జరియించుఁ
బ్రాణుండు, భూతాత్మభావుఁ డతఁడు;
వరుసఁ బ్రాణాపాను లిరువురు నయ్యగ్ని
వెలిఁగింతు రనపేతవృత్తు లగుచు;
గుద వస్తితలము లాస్పదములు గా వహ్ని
పరిగతుండగుచు నపానుఁ డుండుఁ,

తే. గడఁగి విణ్మూత్రనిర్గమకారి యతఁడు;
కర్మబలయత్న కారి యై కంఠ తలము
నం దుదానుండు వర్తించు; నఖిలదేహ
సంధులందును వ్యానుండు సంచరించు. 101

క. విను ప్రాణాపానులు న
య్యనలుఁడుఁ బ్రాపుగ సమానుఁ డన్నరసవిపా
చనుఁ డగుచు నాభిదేశం
బున నుండును సకలధాతుపోషకవృత్తిన్. 102

క. ఇది పరమయోగదర్శన
విదితం: బిప్పాటఁ బవనవిదు లైన మునుల్
వలదక యభ్యాసవిధిన్
ముదమున ధరియింతు రాత్మ మూర్ధతలమునన్. 103

వ. ప్రాణాపానసమాహితుం డై సకల దేహంబులందును జరియించు చున్న పావకుండు జీవాత్ముండు గా నెఱుంగు; మతఁడు జలంబుల నున్న కమలపత్రంబునుంబోలె దేహంబునం దుండియు నిర్లేపస్వరూప దీపితుం డయి వెలుంగు చుండు; నిట్టి జీవాత్ముండ కదా పరమాత్ముండు. 104

క. చేతనరహితక్షేత్రముఁ
జేతనముం బోరయం జేయు జీవాత్మదశో
పేతుఁడు పరమాత్ముఁడు, వి
ఖ్యాతుఁడు త్రైలోక్యసంప్రకల్పనుఁ డనఘా! 105

క. భూతములయందు వెలిఁగెడు
భూతాత్ముని నెఱుఁగుదురు ప్రబుద్ధులు నిత్య
జ్యోతిర్మయు, నవ్యయు న
ద్వైతంబగు బుద్ధి సూక్ష్మధర్మమువలనన్.'' 106

వ. అని మఱియుఁ గౌశికునకు ధర్మవ్యాధుండు బ్రహ్మవిద్యాప్రభావంబు తెఱంగు సంప్రయోగరహస్యంబు దెలియ నిట్లనియె. 107

సీ. "తెలివి నొందిన బుద్ధిగల మహాత్ముండు శు
భాశుభకర్మములందుఁ జొరఁడు;
క్రమమున సౌఖ్యదుఃఖము లాదిగా నశే
షద్వంద్వములయందు సమత నుండు;
విను మట్టి పుణ్యున కొనరింప వలయు కా
ర్యం బెఱింగించెద; ననుదినంబు
నియతాశియును, జితేంద్రియుఁడు నై పూర్వరా
త్రమ్మున, నపరరాత్రమ్మునందు

తే. యోగధారణనిరతుఁ డై యుండ వలయు;
నపుడు బోధదీపంబున నాత్మ నాత్మ
యందుఁ గనుచుఁ నివాతదీపానుకారి
యై వెలుంగుచు, నమృతమయత్వ మొందు. 108

క. కామంబును గ్రోధంబును
నేమఱక జయింపవలయు నెల్లవిధములన్;
ధీమహిత! యదియ సతత
క్షేమంకర మైన పథము కృతబుద్ధులకున్. 109

క. నిత్యముఁ గర్మియుఁ, గర్మఫ
లత్యాగియు నగుట లెస్స, తౌల్యవియోగం
బత్యు త్తమయోగము, ద
త్ప్రిత్యయలకుండుసూవె బ్రాహ్మణుఁడు మహిన్. 110

చ. అరయఁగ జీవితంబు గడు నస్థిర; మింత యెఱింగి యాత్మ నె
వ్వరిదెసఁ గీడు రోయక ధ్రువం బగు మైత్రి భజించి, సత్క్రి పా
నిరతుఁడు, నిష్పరిగ్రహుఁడు, నిత్యతపస్వియు, నిత్యతృప్తుఁడుం,
బరమశమాన్వితుండు నగు బ్రాహ్మణుఁ డొందు సనాతనస్థితిన్. 111

వ. నీ వడిగిన యఖిలధర్మంబులు సంక్షేపరూపంబున నెఱింగించితి; నింక నెయ్యది వినవల'' తనినం గౌశికుండు "మహాత్మా! వినవలయునవి యెల్లను విశదంబుగా వింటిం; బ్రబుద్ధుండ నైతి; నీవు సర్వజ్ఞుండ వగుట దెల్లం బయ్యె'' ననిన ధర్మవ్యాధుం డతని కిట్లనియె. 112

—: ధర్మవ్యాధుఁడు కౌశికుని దన జననీజనకుల యొద్దకు దోడ్కొనిపోవుట :—

క. "ఏ నిమ్మెయి నుత్తమవి
జ్ఞానోన్నతి వడయుటకు నిజంబగు మూలం
బై నది గల దొక ధర్మము;
భూనుత! యది నీకు దృష్టముగ నెఱిఁగింతున్, 113

వ అభ్యంతర గృహంబునకు ర''మ్మని యతనిం దోడ్కొని చని మనోహరం బై చతుశ్శాలం బై వివిధసౌరభసంవాసితం బైన హర్మ్యంబునందు మహితాసనాసీను లైన వారిం, దన జననీజనకుల, నభిమతాహారపరితోషితులఁ, బరమాంబరాభరణగంధమాల్యాలంకృతమూర్తుల

నతనికిం జూపి, తానును దత్పాదప్రణామంబు సేసి వారలఁ గుశలం
బడిగిన నయ్యిరువురుం బుత్రున కి ట్లనిరి. 114

సీ. ''అన్న! కుమార! నీయట్టి సత్పుత్రుండు
గలుగ మా కేమిటఁ గడమ? సెపుమ;
నీ చేయు ధర్మంబ నీకుఁ దో డయ్యెడుఁ;
బరమాయు రర్థసంపదలుఁ గనుము;
నీచరిత్రంబున నిఖిలవంశముఁ బవి
త్రిత మయ్యె; మానుష దేహ మేల
ధరియించితో కాని, తథ్య మారయఁ బర
దేవత వీవు సందియము వలదు;

తే. వాఙ్మనఃకర్మములఁ బితృవత్సలత్వ
మొక్కరూపుగఁ జలుపుచు మన్నయట్టి
సద్గుణాకరు ని న్నెన్ని జామదగ్న్య
నొకని నెన్నంగఁదగుఁగాక యొరులు గలరె?''

వ. అని పలికి; రప్పుడు ధర్మవ్యాధుండు వారికిం గౌశికుం జూపి ''యీ
మహాత్ముండు మనలఁ జూచువేడ్క నిట వచ్చె'' ననిన నా వృద్ధు
లతనికి నర్ఘ్యసత్కారంబులు గావించినం గైకొని యతండు వారలఁ
గుశలం బడిగె; నంత నవ్విప్రునకు లుబ్ధకుం డి ట్లనియె. 116

సీ. ''జననుత! వీరు నాజననియు జనకుండుఁ
జూవె; వీరలకు శుశ్రూష సేసి
యిట్టి పరిజ్ఞాన మేను బ్రాపించితి;
నమరులఁ బూజింతు రర్థి నెల్ల
వారును; నొండుదైవంబుల నెఱుఁగ నీ
వృద్ధుల నాపాలివేల్పు లనఘ;
కమనీయఫలపుష్పగంధభూషణవస్త్ర
ములు, మనోహరభక్ష్యభోజ్యములును

తే. వీరి కెపుడు నివేదింతు; వేడ్కఁ బుత్ర
దారసహితుండ నై నియతముగ సేవ

యాచరింతును; వేదముల్ యజ్ఞములు వ్ర
తంబులును వీర నా కను తలఁపు నిజము. 117

తే. జనని, జనకుఁడు, సద్గురుఁ, డనలుఁ, డాత్మఁ
డనఁగ నియ్యేవురును నే గృహస్థుచేత
సుగతి వాంఛఁ బ్రసాదితు లగుదు రట్టి
వాఁడ చూవె ధర్మాత్ముండు వసుధమీఁద.'' 118

వ. అని చెప్పి యి ట్లనియెఁ ''బతివ్రతపనుపునం జేసి నీవు ధర్మజ్ఞానార్థంబు నాయున్న యెడకుం జను దెంచిన, నప్పతివ్రతవలని యనుగ్రహంబున నీకు నెల్లవియు నెఱింగించితిఁ; గాని నీ దెస నాదుచిత్తంబు ప్రియంపడి యుండదు; నీచేసిన యకార్యం బొక్కటి గల దది యెయ్యది యనిన. 119

ఉ. ఎంతయు వృద్ధు లై తమకు నీ వొకరుండవ తెప్పగాఁగ న
త్యంతముదంబునన్ బ్రతుకు తల్లిని దండ్రిని నుజ్జగించి ని
శ్చింతుఁడవై సదాధ్యయనశీలత వారియనుజ్ఞ లేక యే
కాంతమ యిమ్మెయిన్ వెడలి తక్కుట! నీవు కరంబు క్రూరతన్.120

ఆ. నీక వగచి వగచి నిర్భిన్నహృదయు లై
విగతచక్షు లై రి వినవె వార;
లరిగి యింక నైన నమ్మహాదునళ్ళ యు
దగ్రశోకవహ్ని నార్పనయ్య. 121

క. నీయధ్యయనమ్మును, సుకృ
తాయాసము నిష్ఫలంబు లై చను గురుసే
వాయుక్తి లేక తక్కినఁ;
జేయుము నాపలుకు; మేలు సేకుఱు నీకున్." 122

వ. అనినఁ గౌశికుం డతని కి ట్లనియె. 123

క. ఇది యట్టిద; నీ చెప్పిన
సదమలహితవాక్యభంగి సకలము వింటిన్;
వదలక యిమ్మెయిన చరిం
చెద; గురుజనములకుఁ బ్రీతిఁ జేసెద ననఘా! 124

క. నాదైనభాగ్యవశమునఁ
గాదే నీతోడిచెలిమి గలిగెం; బరమా
హ్లాదమనస్కుఁడ నైతి; శు
భోదయముల కెల్ల నింక యుక్తుఁడ నైతిన్. 125

క. పాపకృతంబగు దుర్గతి
ప్రాపుఁ గనక యుండ ననుఁ బ్రబోధాత్మకలీ
లాపరిణతుఁ గావించితి;
నాపాలిటివేల్పు వీవ నరనుతచరితా! 126

చ. అనుపమ మెట్టివారలకు నందదు ధర్మపథంబు ధాత్రిలోఁ;
విను పదివేవురం దొకఁడు విశ్రుతధర్మపరాయణుండు గ
ల్గునొ కలుగండొ సందియము; కోరి సనాతనధర్మ మూఁది యె
వ్వనికిని నీకుఁబోలె బుధవత్సల! యిట్లు చరింప వచ్చునే? 127

చ. నిను నొకశూద్రుఁగాఁ దలఁప నేర? గుణాకర! నీ చరిత్రముం
గన మది నద్భుతం బొలసెఁ; గావున నెయ్యది కారణంబుగా
నొనరఁగ నిట్టిజన్మమును నొందితి చెప్పుము; భూతభావివ
ర్తనములయందు నీకు విదితంబులు గానివి గల్గ వెమ్మెయిన్." 128

వ. అనిన నతనికి ధర్మవ్యాధుం డిట్లనియె, 129

**—: ధర్మవ్యాధుఁడు గౌశికునకుఁ దన పూర్వజన్మ వృత్తాంతంబు సెప్పుట:—**

క. "జననుత! నీ వెయ్యది యడి
గినఁ దెలుపుట నా కవశ్యకృత్యము గాదే?
విను చెప్పెదఁ బూర్వభవం
బున నే నొక బ్రాహ్మణుండఁ బుణ్యచరితుఁడన్. 130

వ. వేదవేదాంగపారంగతుండనై యుండుదు; నాకుం బ్రియసఖుండైన
యొక్క రాజపుత్రుతోడి సంగతిం జేసి ధనుర్వేదంబును నభ్యసించితి;
నొక్కనాఁ డమ్మహీపతి వేట వోయిన నేనును నతనితోడఁ జని,
వనంబునం బెక్కు మృగంబుల నేయుచుండ నం దొక్క బాణంబు
తృణలతాంతరిత దేహుండైన మునివరు నొక్కరుం దాఁకిన, నతండు
హా యనుచుం బడియె; నంత నేనును. 131

ఆ. డాయఁ బోయి తీవ్రసాయక విద్ధుఁడై
పొరలు చున్న విప్రవరునిఁ జూచి
తలరి యనునయంపుఁ బలుకులు వలికినఁ
గినిసి యిట్టు లనియె మునివరుండు. 132

ఆ. "బ్రాహ్మణుండ వయ్యుఁ బాపప్రవృత్తి వై
శూద్రకర్మమునకుఁ జొచ్చి తీవు;
గాన నిక్కువముగఁ గ్రవ్యాదజన్ముండ
వగుము మీఁద" ననియె; ననిన నేను. 133

చ. "ఎఱుఁగక తప్పు సేసితి సహింపఁగదే; కడు దుర్భవంబునం
బఱుపకు మయ్య" నావుడుఁ గృపన్ మునినాథుఁడు "దప్ప దివ్విధం;
బెఱుకకులంబునందు జనియించియు ధర్మవు లెల్ల నిమ్ముగా
నెఱిఁగెదు; తల్లిదండ్రులకు నెంతయుఁ బ్రీతి యొనర్తు భక్తితోన్. 134

వ. గురుశుశ్రూషం జేసి నీకుఁ బరమశోభనం బగు; జాతిస్మరత్వంబునుం గలుగు; నపరజన్మంబున బరమబ్రాహ్మణుండ వయ్యెద"వని యను గ్రహించిన నవ్విప్రుని దేహంబునందు నాటిన బాణంబు మెత్తన పెఱికి యతనిం దదీయాశ్రమంబునకుం జేర్చితి; నా చేసిన పుణ్యం బున నమ్మహాత్ముండు నపాయంబు వొందం డయ్యె; నాకు నిట్టి జన్మంబు నొంద వలసె" నని చెప్పినం గౌశికుం డిట్లనియె. 135

తే. "జన్మమిట్టిది, చరితంబుచంద మిట్టి;
దెన్నఁడును నిట్టి చోద్య మే నెందుఁ జూడ;
నింక జన్మాంతరముదాఁక నేల? యిపుడ
పుణ్యచరితమై నీవు విప్రుఁడవ కావె? 136

ఆ. పాపవర్తనుండు బ్రాహ్మణుం డయ్యును
నిజము శూద్రుకంటె నీచతముఁడు;
సత్యశౌచధర్మశాలి శూద్రుం డయ్యు
నతఁడు సద్ద్విజుండ యనిరి మునులు. 137

క. అనయంబు నాత్మకర్మం
బున నతినీచ మగు భవముఁ బొందవలసెనే
యని నీవు నిరంతరమును
మనమున దుఃఖింపవలదు మహిత చరిత్రా! 138

చ. నిజగుణదోషకర్మముల నెట్టన మేలును గీడువచ్చుఁ; ద
త్త్వజనితసౌఖ్యదుఃఖములఁ బ్రాజ్ఞులు దుల్యమనస్కులై, మనో
రుజలును దేహజంబు లగురోగములుం, హితధర్మకర్మ భే
షజములఁ జేసి పాపుదురు, సర్వము సాత్త్వికదృష్టిఁ జూచుచున్.

క. ప్రియములు వాయుటయును, న
ప్రియములు వెనఁ బొందుటయును బెల్లుగ నగుఁ; ద
త్క్రియలందు మూఢమతికి హృ
దయతాపము వాయ దెపుడు దరికొనుచుండున్. 140

తే. వగవు పేర్మి సెవ్వారికి వగపఁ జనదు;
చిత్తమున నేమిటికి సంతసింప రాదు;
కాన గతమునందును, ననాగతమునందు
వగవ కార్యులు సంతోషవంతు లగుచు. 141

క. వగవునఁ దేజోహీనుం
డగు; నాత్మహితక్రియలకు నక్షముఁ డగు; న
వ్వగవు దొఱఁగి యుద్యోగము
దగఁ జేయఁగఁ గలుగు సంచితములగు శుభముల్. 142

వ. కావున భూతంబుల సదసత్ప్రకారంబులు గనుంగొని, ధీరుండవై యుండు" మనిన నా ధర్మవ్యాధుండు "మహాత్మా! నీ చెప్పినయంత వట్టు నిదర్శనంబులుగాఁ గొని యేను నిఃఖేదుండనై భవిష్యత్కాల సద్భావంబునందు సమాహితుఁడనై యుండువాఁడ" ననియె; నంత నా భూదేవుండు. 143

చ. అతులితపుణ్యమూర్తివి కృతార్థుఁడ వెందును నీవు, ధర్మ మూ
ర్జితముగ నెప్పు డేమఱక చేయుచు నుండుము, నిత్యశోభన

స్థితి వెలుఁగొందు, మేను భవదీయసమాగతిఁ జేసి ధర్మను
స్థితమతి నైతి, నన్ననుమతింపు గుణాకర! పోయి వచ్చెదన్.''

వ. అని వానికిం బ్రదక్షిణంబు సేసి, వీడ్కొని చని, కౌశికుండు నిజజననీ జనకుల కతిభక్తి శుశ్రూష సేసి కృతార్థుం డయ్యెం; బాండవోత్తమా! నీ యడిగిన తెఱంగునం బతివ్రతా మహాత్మ్యంబును బితృశుశ్రూషా విశేషంబును, హీనవర్ణుం డయినవాఁడు ధర్మంబు సలుపు నుపాయం బును జెప్పితి'' ననిన విని ధర్మతనయుండు సంతసిలి మఱియు మార్కండేయు నిట్లని యడిగె. 145

తే "అగ్ని దేవుండు తొల్లి మహాతపంబు
సేసె నని విందు; నది యేల చేసె? ననఘ!
యంగిరసుఁ డేమికతమున నగ్ని యయ్యె?
నగ్ను లెన్నివిధంబుల నతిశయిల్లు? 146

**మార్కండేయుఁడు ధర్మజునకు నంగిరసుం డగ్ని యైన తెఱంగు సెప్పుట**

వ. ఇంతయు విన వలతు "ననిన నమ్మహాముని యిట్లని చెప్పె" నగ్ని దేవుండు దేవతలతోడి యలుకం జేసి హవ్యంబులు వహింప నొల్లక వనంబునకుం జని బహుకాలంబు ఘోరతపంబు సేయుచు నత్యంత కృశుం డై యాత్మగతంబున 147

చ. 'అలుక మెయిం దొడంగి విపినాంతరభూమికి వచ్చి యిట్లు నే
వెలుఁగక యున్నచో, భువనవృత్తము సర్వము నిల్చు; నిల్చినన్
జలరుహసూతి వేఱొకనిఁ జయ్యన నగ్నిపదంబునందుఁ దా
నిలుపక యున్నె? నే నిచట నిల్చుట పోలదు; పోయెదన్ వెసన్."

వ. అని తలంచి తపంబు సాలించి, నిజపదంబున కున్ముఖుం డయి చని చని, యంతకుమున్న బ్రహ్మనియోగంబునం ద్రిలోకంబులకు నగ్ని యై వెలుంగు చున్న వాని నధికతపోవిజృంభితు నంగిరసుం గని భయంపడి యెప్పటియట్ల మగిడి పోవు నెడ నంగిరసుం డతనిపాలికిం జనుదెంచి యి ట్లనియె. 149

చ. "అనఘ! జగత్త్రియార్చితుఁడ వై తిమిరాపహరుండ వై తగన్,
వనరుహగర్భుచేఁ బ్రథమవహ్నిపదంబునఁ గల్పితుండ వై

తనరుదు నీవు; నీ దగుపదంబున నే నిటు లుండ నోడుదుఁ;
ఘనముగ నీవు నీపదము గైకొనవే యవికల్పభావనన్." 150

వ. అనిన నగ్ని దేవుం డిట్లనియె. 151

క. "విను నాకీర్తి జగంబులఁ
బొనుఁగుపడియె; నీవు భువనపూజితవృత్తిం
బనుపడితి గానఁ దగు నీ
కనఘ ! యనలపదము; నాకు నలవడ దింకన్. 152

వ. నీవు ప్రథమాగ్ని వై యుండు; మేను ద్వితీయం బగు ప్రాజాపత్యాగ్ని నై వర్తించెద" ననిన నంగిరసుండు "దేవా ! యిట్లానతీవలదు: ప్రథమాగ్నిత్వంబు నీవ కైకొని, నన్ను నీకుం బ్రథమపుత్రుంగా నాదరింపు" మనినం బావకుండు దాని కొడంబడియె; నివ్విధంబున నంగిరసుం డగ్నికి నగ్రతనయుండై యగ్ని సారూప్యంబునం దేజరిల్లె; నయ్యంగిరసునకు శివ యనుదానికి బృహత్కీర్తియు, బృహజ్జ్యోతియు, బృహద్బ్రహ్మయు, బృహన్మనసుండును, బృహన్మంత్రుండును, బృహద్భానుండును, బృహస్పతియును నన నేడ్వురు కొడుకులు మఱియు భానుమతియును, రాకయు, సినీవాలియుఁ, గుహువు, నర్చిష్మతియు,మహిష్మతియు, మహామతియునన నేడ్వురు కూఁతులుం బుట్టిరి. 153

క. తనయుఁడు బృహస్పతికి న
త్యనఘుఁడు శంయుండు పుట్టి, యాగంబులలో
మునుమును హవిషాజ్యము దాఁ
గొనియెడువాఁడయ్యె నధికగుణయుక్తి మెయిన్. 154

వ. ఆశంయునకు ధర్మపత్ని యైన సత్యకు భరద్వాజుండును భరతుండును నా నిరువురు గొడుకులుపుట్టి; రందు భరతునకు భారతుం డను కొడుకును, భారతియను కూఁతురుం బుట్టిరి: భరద్వాజునకు వీర యను దానికి వీరుండు పుట్టె.

క. వానికి సరయువునకుఁ బటు
భానుండై పుట్టె సుతుఁడు భానుఁ డనఁగ: నా

భానునకు నిశ్చ్యవనుఁ డనఁ
గా నాత్మజుఁ డుద్భవించెఁ గడునుజ్జ్వలుఁ డై. 156

చ. అతనికిఁ బుట్టెఁ బుత్రుఁడు నిరంతరతేజుఁ డుదారకీర్తి. ని
ష్కృతి యనుపేరివాఁడు: విను కిల్బిషభాజను లైన మానవుల్
సతతము నాకృశాను నతిసక్తమనస్థితిఁ గొల్చి దోషని
ష్కృతి దగఁ గాంతు; రట్లగుటఁ గీర్తిత మయ్యెఁ దదాఖ్య వానికిన్.

క. ఘనుఁడు రుజస్కరుఁ డనఁగా
జనియించెను నాతనికి; రుజస్కరునకు న
త్యనుపమకాంతిపరుం డై
జనియించెం గ్రోధుఁ డనఁగ జనవరతిలకా! 158

వ. ఆక్రోధునకు రసుండు పుట్టె: రసునకు స్వాహా యను కన్యకయుం గాముం డను కొడుకునుం బుట్టిరి: కామునకు నమోఘుండు పుట్టె: నమోఘునకు నుక్థుండుపుట్టె; మఱియుం గాశ్యపుండును, వాసిష్ఠుండును, ప్రాణుండును, నాంగిరసుండును, చ్యవనుండును ననువారేవురు తేజస్వు లైన కొడుకుం బడయుదు మని యనేక వర్షంబులు ఘోరతపంబు సేసి మహావ్యాహృతి స్మరణంబు సేయుచున్నంత.

చ. అనలము చాయ మస్తకము. నర్కనిభం బగు బాహుయుగ్మముం,
గనక సముజ్జ్వలంబు లగు కన్నులుఁ, జర్మము, కృష్ణవర్ణతం
దనరిన జంఘలుం గల యుదాత్తపుదేహము దేజరిల్లఁగాఁ
దనయుఁడు పుట్టె వారలకుఁ: దద్దయు నద్భుత మందె లోకముల్.

వ. ఇట్లుపుట్టిన యప్పావకుఁడు పంచజనప్రభవుండు గావునం బాంచజన్యుం డను పేరం బ్రసిద్ధుం డై, దశ సహస్రవర్షంబులు తపంబు సేసి. నిజ మస్తకంబున బృహద్రథంతరు లను వారలను, వదనంబున హరిని, నాభియందు శివుని, బలంబున నింద్రునిం, బ్రాణంబుల వాయ్వగ్నులను బాహుయుగదంతపుటంబుల విశ్వభూతంబుల సృజియించె మఱియును.

క. తపుఁ డను వహ్ని నిరంతర
తపోనిరూఢుఁ డయి పంచదశపుత్రుల న

త్యపరిమిత ఘోరతేజో
విపులాత్ములఁ గనియెఁ గపటవృత్తినిపుణులన్. 162

వ. ఆ పదియేవురు సుభీముండు, నతిభీముండును, భీముండును, భీమబలుండును, నతిబలుండు, ననువారొక్క మొగియును, సుమిత్రుండును, మిత్రవంతుఁడును, మిత్రజ్ఞుండును, మిత్రవర్ధనుండును, మిత్రధర్ముండును ననువారొక్క మొగియును, సురప్రవీరుండును, వీరుండును, సువేషుండును, సువర్చసుండును, సురహంతయు ననువారొక్క మొగియును గా నిట్లు మూఁడు ముత్తంబులై యజమానుల యజ్ఞఫలంబు లపహరించుచుండుదురు; తత్ప్రశాంత్యర్థంబై యాగంబులందు నగ్నిచయనంబు సేయునది. 163

తే. అధిప విహగాకృతుల నొప్పు నగ్నిచయన
ముల యుదగ్ర పక్షాఘాతములను విప్ర
వరుల మంత్రఘోషములను వారు నిహతు
లై భయంపడి చేరరు యజ్ఞభూమి. 164

వ. తపుండు మఱియు సకలయజ్ఞభాగభుజులైన పుత్రుల నేవురం గనియె నందగ్రజుండు. 165

సీ. వైశ్వానరుం డను వహ్ని చాతుర్మాస్య
విధులందు భూసురవితతిచేతఁ
బర్జన్యసహితుఁడై పరమార్చనముఁ గాంచు;
నధిప రెండగు నాతఁ డఖిలమునకుఁ
బ్రభుఁడు దానై విశ్వపతి యన విలసిల్లు;
వినుము మూఁడగువాఁడు విశ్వమునకు
నాత్ముఁడై విశ్వకుం డన నొప్పు; నాలవు
నతఁడు భూతముల యాహారవితతి

తే. వెలయఁ బక్వము సేయుట విశ్వభుక్కు
నాఁగఁ బెంపొందు; గోపతినామధేయుఁ
డై సమస్తధర్మక్రియలందు హేతు
వై ప్రశస్తి వహించు నే నగు నతండు. 166

వ. మఱియు భానుం డను వహ్నికి సోమపుత్రియైన బృహద్భాసయందు బలదుండును మన్యుమంతుండును ధృతిమంతుండును నాగ్రయణుం డును నగ్నియు సోముండును నన నార్వురు గొడుకులు, నిశ యను కూతురుం బుట్టిరి; సకల తపఃఫలంబులు నిర్వహించుటకయి పురంద రుండు మను నామధేయుండయిన కొడుకుం బడసె; నమ్మనువు భానుపుత్రియైన నిశాకన్యం బెండ్లియై ప్రాజాపత్యుం డను పేరఁ బరఁగి పరమబ్రాహ్మణులచేత నర్చితుం డయ్యె; నివ్విధంబున ననేక వహ్నులు సకలధర్మక్రియాసాధకులై వెలింగిరి; దక్షిణాగ్ని ప్రముఖు లయిన వహ్నులు వాయుహతిం జేసి యన్యోన్యసంస్పృష్టంబు లయ్యె నేనియు, రజస్వలాదిసంకరంబులం బొరసెనేనియు, మృతకజాతకాది సంస్పర్శనంబునం బొందెనేనియుఁ బత్రప్రియశ్చిత్తార్థంబై యష్టా కపాలేష్టి సేయ వలయు"నని చెప్పి మఱియు మార్కండేయుం డి ట్లనియె. 167

క. అపుఁ డను వహ్ని యతులిత
రూపసి యయి ముదిత యను తరుణియందు జగ
ద్దీపకు నపారతేజు మ
హాపూజ్యుం గనియె నగ్ని నద్భుతనామున్. 168

చ. అతఁడు త్రిలోకతంత్రము నిరంతరమై చన నిర్వహించుచున్,
శతముఖుఁ డాదియైన సురసంతతికిం బ్రియ మొప్ప హవ్యముల్
సతతము మోచి యిచ్చుచు; భృశం బగు తచ్చర మోర్వ లేక సు
వ్రతనిరతుం డధర్వుఁ డనువానికి ని ట్లను నాదరంబుతోన్. 169

వ. "ఏను దుర్బలుండనైతి; నీవు దేవతలకు హవ్యంబులు మోచి యిమ్మని" వానిం బంచి తాను సముద్రంబు సొచ్చి యందు డాఁగు టయు, దేవత లద్దేవముఖుండున్న యెడ రోయం దొడంగిన నబ్ధి చరంబులైన మత్స్యంబులు సురలకు నగ్నిదేవుండు జలధి నుండుట సెప్పుటయుం, గనలి యనలుండు మీలం జూచి "జనంబులు మిమ్ము నిర్దయులై వధియింతురు గావుత"మని శాపం బిచ్చె నప్పుడు.

ఆ. హవ్యవహనమునకు నమరోత్తములు నన్ను
వేయివిధుల నొలసి వేఁడుకొనిన

నెట్లు నియ్యకొనక యెంతయు విసిగి స
మీరసఖుఁడును దనదుమేను విడిచె. 171

వ. ఇట్లు సంత్యక్తశరీరుం డై ధరాతలంబు ప్రవేశించుటయు, నతనిచేత విడువంబడిన దేహంబువలనం బాయంబున గంధకంబు, నస్థుల దేవదారువును, శ్లేష్మంబున స్ఫటికంబును, బిత్తంబున మరకతంబును, వాతంబునఁ గృష్ణశిలయు, నఖంబుల నభ్రకంబును, స్నాయుసంచయంబునం బ్రవాళంబునుం బుట్టె; నతండు భూగర్భస్థితుం డై ఘోర తపంబు సేయుచున్నంత భృగ్వంగిరః ప్రముఖులయిన మహామునులు నిజతపోబలంబున నతనికి నాప్యాయనంబు సేయుటయుఁ, దేజస్వి యై ధరణివెలువడి వచ్చి యమ్మహాత్ముం డమ్మహామునులం జూచి తదీయ తేజంబు దనకు దుస్సహం బగుటయు భయంపడి క్రమ్మఱ నంబుధి సొచ్చి యడంగిన 172

క. విను జననాయక సంయమి
జనములు వహ్నిపని యంతఁ జాలించి ప్రియం
బున సంచితవిధిసంగ్రహ
మునకై పూజించి రధికపుణ్యు నధర్వున్. 173

వ. అయ్యధర్వాగ్ని తేజంబును, నమ్మును లతనికిం జేయు బహుమానంబునుం, దన్ముఖంబున నమరులు తృప్తు లగు చునికియుం జూచి సహింపక పావకుండు సకలభూతంబులుఁ జూచుచుండ నంబుధి వెలువడి వచ్చి, నిఖిలలోకహితార్థంబుగా నెప్పటి యట్ల హవ్యవహత్వంబు నంగీకరించె; ని ట్లనేకశాఖం బయిన యగ్నివంశంబు ప్రశంసాభాజనం బయ్యెఁ; నగ్ను లెందఱైననుం దదాత్మ యైన తేజం బొక్కటియ" యని చెప్పిన విని సంతసిల్లి యమ్మహామునికి ధర్మతనయుం డిట్లనియె.

క. "మునినాథ! మహాసేనుం
డనలునకుం గృత్తికలకు హరునకు సుతుఁ డై
న నిమిత్త మేమి తెలుపఁ; గే
విననలతుం జెప్పవే సవిస్తరఫణితిన్." 175

వ. అనిన మార్కండేయు డతని కిట్లనిచెప్పెఁ "దొల్లి దైత్యులతోడరణంబు సేసి యోటువడి దేవగణసహితుం డై దేవేంద్రుండు దొలంగి పోయి దానవుల నోర్వనోపునట్టి మహాసత్త్వుం డగు సేనాపతి నెందుఁ బడ యుదునొకో యని యొక్కనాఁడు మానసం బను శైలంబునకుం జని యం దొక్కయెడ నొక్కరుండు కార్యచింతాపరుండై యున్నయెడ.

తే. 'ఒక్కదనుజాధముండు మొఱ్ఱో యనంగ
నన్నుఁ జెఱగొనిపోయెడు; నన్నలార!
యెవ్వ రిట విడిపించరే? యింతవట్టు
పుణ్యమునఁ బోవ రయ్య కారుణ్యబుద్ధి'

వ. అని యిట్లు సువ్యక్తంబైన వనితావిలాపంబు వీతెంచినం బురంద రుండు నిజాంతరంగంబు గరుణాతరంగితం బగుటయు "నోడ కోడ కిదె యేను వచ్చితి" ననుచు నద్దిక్కునకు నడచి, మ్ముంపట నతిభయం కరాకారుం, బటుగదాహస్తు, నప్రచలిత విద్యుల్లతారుచిరమూర్తి యైన దాని నొక్క కన్నియం గొని గగనతలంబునం బఱచువానిం, బ్రబలవలాహకవినీలదేహుఁ, గేశి యను దానవుం గని సరభస్తుం డై.

—: ఇంద్రుఁడు గేశి యను రాక్షసునిఁ పాఱఁ దోలుట :—

ఉ. "ఓరి దురాత్మ! యీయబల నోడక యేటికిఁ బట్టినాఁడ? వం
భోరుహనేత్ర విడ్వు; మెట వోయినఁ బ్రాణము గొందు, నింకఁ; బ్ర
స్ఫారమహీధరప్రకరభంగవిహారధురీణ, ముగ్రదై
త్యారుణరంజితోగ్రకులిశాస్త్రము సు మ్మిదె" యంచు డాసినన్.

మత్తకోకిలము. ఘోరవిక్రముఁడైన కేశియుఁ గ్రోధఘూర్ణితచిత్తుఁ డై
ధీరుఁ డుక్కున నిల్చి యగ్గద ద్రిప్పి వాసవు వైచె; న
వ్వీరుఁడుఁ గని చూర్ణితంబుగ వ్రేసె నాసురభంగిఁ బొం
గారి దారుణవజ్రపాతరయంబునం బటుహస్తుఁ డై. 180

ఆ. అసుర వీఁక నొక మహాచలశృంగంబు
విఱిచి వైచె నమరవిభునిమీఁద;
గోత్రవైరి ఘోరకలిశాభిహతి వ్రయ్య
నడిచె దానిఁ జదల నదరు లెగయ. 181

వ. ఇట్లు తన సాధనంబులు విఫలంబు లైనం దలంకి దానవుం డక్కన్నియ
దిగవిడిచి పఱచిన నింద్రుండు దానిం జేరం జని "నీ వెవ్వరి
దాన? వీరక్కసుచేత నెట్లు పట్టువడి?" యనిన నది యతని కి ట్లనియె;
"అయ్యా! యే నరిష్టనేమి యను ప్రజాపతి కూఁతుర; దేవసేన
యనుదాన; దైత్యసేన చెలియల; నేనును మాయప్పయుం గేళికా
తుకంబునఁ దండ్రి యనుమతంబు వడసి సఖీజనసహితంబుగా వెడలి
యిమ్మానసనగంబు సానుదేశంబులం గ్రుమ్మరుచుండం గేశినామ
ధేయుండైన యా యసురాధముండు. 182

క. పలుమాఱు వచ్చి తన దు
ర్విలసితములు మాకుఁ జూపు వేడుక దోఁపన్;
బలుకును మేలమునఁ; జెనకఁ
దలఁచుఁ, గదియు, మదనకదనదళితహృదయుఁ డై. 183

తే. వానిచేష్ట లన్నియు దైత్యసేన కభిమ
తంబు లై యుండు; నాకు నెంతయును దుస్స
హంబుల; వినవె యమ్మెయిన యక్కమలనయనఁ
గోరి దానవుఁ డెలయించుకొంచుఁ జనియె. 184

తే. అంతఁ బోక వెండియు వచ్చి యింత సేసె
నద్దురాత్ముఁడు నన్ను; మీ రైన కరుణఁ
దోడరి దుఃఖసాగరమునఁ బడుట దప్పె"
ననిన నయ్యింద్రుఁ డనియె నయ్యతివఁ జూచి. 185

క. "విను దక్షతనూజలు మా
జననియు మీతల్లియును; నిజంబుగ మా కీ
వనుజ వయితి, వనజానన
యొనరంగా వేఁడు నీకు నొకవర మిత్తున్." 186

వ. అనిన దేవసేన దేవేంద్రున కి ట్లనియె. 187

తే. "అనఘ! మాతండ్రియొక్కనాఁ డతిముదమున
నన్ను నుపలాలనముసేసి "నాతి! నీవు
ప్రథిత పౌరుషుఁ డగు భర్తఁ బడయు" దనియె;
నట్టి వానిని నీవు నా కరయవలయు. 188

చ. అనిమిషదానవేంద్రులకు నైన నజయ్యుఁడు, నుగ్రవైరిభం
జనుఁడు, త్రిలోకరక్షణవశంవదుఁడున్, భవదిష్టమిత్రుఁడున్,
ఘనగుణకీర్తనుండు నగు కాంతునిఁ గోరెద; నామరోథం
బు నెరయ సంఘటించి సురపుంగవ! నన్నుఁ గృతార్థఁ జేయవే.''189

వ. అనిన నింద్రుండు దీనికిం బతి యెవ్వం డగునొకో యని కొండొక
విచారించు నెడ నమ్ముహూర్తంబు రౌద్రనామకం బయి సోమ
సూర్యసంగమకారణం బయిన యమావాస్యాముఖం బై యుండం,
బూర్వసంధ్యారాగరక్తాంబుద ప్రతిబింబపటలపాటలితోదకం బైన
జలనిధి సమీపంబున నమరాసురసమరసంకులంబుగా నరుణకిరణుం
డుదయించుచుండఁ, దత్కాలంబున భృగ్వంగిరఃప్రముఖు లైన
మునులు వేల్చు హవ్యంబులు మోచికొని హవ్యవహుండు సూర్య
మండలంబు ప్రవేశించుచుండం గనుంగొని యిది సూర్యసోమాగ్ని
సమాగమం బయిన రౌద్రనామకముహూర్తంబు గావున సూర్య
సోమాగ్ని తేజంబున జని యించినవాఁడు దీనికిఁ బ్రియుండు గావ
లయు నని మనంబున నిశ్చయించి యతం డాక్షణంబ. 190

క. బాలం దోడ్కొని యబ్జజు
పాలికిఁ జని మ్రొక్కి త్రిదశపాలుఁడు "దేవా!
యీలలనకుఁ దగు నరునిఁ గృ
పాలుఁడవై యొసఁగు" మనినఁ బద్మజుఁ డనియెన్. 191

ఉ. "దీపితవిక్రమాస్పదుఁడు దీనికి వల్లభుఁ డయ్యెడుం ద్రిలో
కీపరిరక్షణక్షముఁడు, గీర్తితమూర్తి యొకండు; వాఁడ మీ
యాపద లెల్లఁ బాపుటకు నై ధృతిఁ బూను నశేషదేవసే
నాపతిభావమున్, విబుధనాయక శీఘ్రమ భావ్య మంతయున్."192

వ. అనినం బ్రీతుం డై పితామహు వీడ్కొని యింద్రుండు సనియెఁ;
దదనంతరంబ వసిష్ఠప్రముఖు లైన సప్తమహామును లమావాస్యా
హోమంబు సేయ సమకట్టిన నమరు లందఱు హవిర్భాగంబులు
గొనుటకు నాసన్ను లగుటయు. 193

క. ఆహవనీయముఖంబున
నాహూతుం డై హుతాశుఁ డమ్మును లిడఁగా
నాహుతులు గొని దివిజసం
దోహమునకు వరుస నొసఁగఁ దొడఁగెం బ్రీతిన్. 194

సీ. ఆసమయంబున నమ్మునీంద్రులభార్య
లందఱు సుస్నాన మొందఁ జేసి,
రమణీయమాల్యాంబరవిభూషణాద్యలం
కారంబు లొనరించి, గారవమునఁ,
జను దెంచి పతులకు సమ్మతిం బరిచర్య
సేయుచు మెలఁగంగ, వాయుసఖుఁడు
మెలఁతల వాలిక మెఱుఁగుఁగన్నుల యొప్పుఁ,
దెలినవ్వు మొగముల విలసనంబు,

తే. నడ బెడంగులు, నన్నువ నడుములందు
వెలయు వళులభావంబులు, వలుఁదచన్నుఁ
గవల నిక్కును నేర్పడఁ గని కరంగి
మదనమార్గణవిదళితహృదయుఁ డయ్యె. 195

వ. ఇట్లు వికలేంద్రియుం డై వైశ్వానరుం డమ్మునిపత్నులయందుఁ
దగిలిన డెందంబు మగిడింప నేరక వారలం గదియ నప్పళించి గార్హ
పత్యకుండంబునం దావేశించి. 196

చ. అతివలు దన్నుఁ జేరుటకు నాసపడుం; బొరిఁ జేరుచోట నా
యతవిలసచ్ఛిఖాగ్రముల నల్లన వారల నంటుఁ; గౌతుకం
బతిశయ మై తదంగలత లాదటఁ గౌఁగిటఁ జేర్పఁ గోరుఁ; గం
పితధృతి యై కలంగుఁ గడుఁ బెల్లగు రాగరసంబు ముంపఁగాన్. 197

వ. అంత నమ్మునీంద్రుల హోమవిధి సమాప్తం బగుటయు, జాతవేదుండు
మదనవేదనాభరంబు సహింప నోపక నిర్జనం బయిన వనంబునకుం జని,
మునిపత్నీ సమాగమంబు దుర్లభంబుగా దగచి, వెగ డంది శరీరంబు
దిగవిడువ సమకట్టునెడఁ, దదీయవల్లభ యైన స్వాహాదేవి తత్ప్రకారం
బంతయు నెఱింగి, యతనికిం బ్రియంబు సేయునది యై, సప్తమును

లలో నంగిరసుభార్య శివ యనుదాని రూపంబు గైకొని చని, యేక తంబ యున్న హుతాశనుం గనుంగొని యి ట్లనియె. 198

తే. "అంగిరసుభార్య నేను శివాభిధాన;
ననఘ! నాకును నాతోడియంగనలకు
ననుదినంబును సతిమనోహరవిలాస
మైన నీమూర్తిపైఁ గోర్కి యదరియుండు. 199

ఉ. నీమదిచంద మిట్టి దని సిక్క మెఱుంగక నే మజస్రముం
గామశరాహతిం గలఁగి కాఱియ వొందుదు మాత్మలందు; నీ
కామము మాదెసం గలిమి కౌతుకచేష్టలయం దెఱింగి యు
ద్దామమనోరథప్రచలితస్థితి నందఱముం గ్రమంబునన్. 200

చ. నినుఁ గవయం దలంచి యిట నెమ్మిమెయిం జనుదెంచినార; మిం
పునఁ జెలు లెల్లఁ దొల్త ననుఁ బొమ్మని పంచిన వచ్చితిన్; మనం
బనవరతానురాగముగ నంగజకేళి భజింపు; మింక నొం
డని యెడ సేసితేనిఁ గుసుమాస్త్రుఁడు సైఁపఁడు నన్ను బావకా!"

వ. అనిన సంతసిల్లి యగ్ని దేవుండు దానిం గైకొనియె; నదియును నతని నభిమత భోగంబులం బ్రీతునిం జేసి తదీయ తేజో ధాతువు ధరించి. యచ్చోటు వాసి యాపణంబ గరుడి యై గగనంబునకు నెగసి, యతిత్వరితగమనంబున శ్వేతపర్వతంబునకుం జని, యం దొక్క యెడ శరవణ స్తంబసంవృతం బైన కాంచనకుండంబునందు నిజ భర్తశుక్లంబు సంగ్రహించి మఱియును. 202

క. మునిపత్నులరూపులు గై
కొని యిట్టుల వరుసఁ బుష్పకోమలి ప్రియుఁ బ్రీ
తునిఁ జేయుచు రేతస్కం
దన మొనరించుచును వచ్చెఁ దత్కలశమునన్. 203

తే. విను పతివ్రతాతికలమై వెలయునట్టి
యయ్యరుంధతిరూపంబు నలవరింప
నెట్లు నేరద; కాని యయ్యింతి యున్న
యువిద లార్వురరూపులు నొనరఁదాల్చె. 204

వ. ఇవ్విధంబున నాఱుమాఱులు ప్రస్కందితం బైన యగ్ని తేజంబున.

—: కుమారస్వామి యవతారము :—

క. ఆదిత్యనిభుఁడు, విపుల
ద్ద్వాదశబాహుండు, షడ్వదనుఁ డఖిలదిశా
రోదోంతరంబు వెలుఁగ మ
హోదారుండై కుమారుఁ డుదయం బయ్యెన్. 206

వ. ఇట్లు శుక్లపక్షంబునం బాడ్యమియందు వీర్యనిషేకంబును, విదియ
యందు గర్భవ్యక్తియుఁ, దదియయందు శరీరమాత్రావిర్భావంబు
నుం, జతుర్థియందు సకలావయవసంపూర్ణతయు నై యుదయించిన
కుమారుండు పంచమియందు సముత్థితాకారుం డై పేర్చి, త్రిపుర
దహనసాధనం బైన హరుకార్ముకం బమ్మహీధరంబునందు నిక్షిప్తం
బై యున్నదానిం బుచ్చుకొని, గుణధ్వనిసేసిన. నమ్మహాధ్వని విని
కలుషించి యైరావతసుప్రతీకంబు లను దిగ్గజంబు లయ్యగ్నిభవు
పైఁదం బఱతెంచిన, నమ్మహాభుజుం డారెంటినిం బెనఁచి పట్టి రెండు
చేతుల ధరియించి తన సహజం బైన శక్తి యొక్క కేలం, గ్రీడార్థ
కలితం బైన కుక్కుటంబొక్క కేలను, బరిపూర్యమాణనినదం బైన
శంఖంబు గరద్వయంబునం దాల్చి, హస్తయుగళంబున గగనంబు
వేయుచుం బాణియుగ్మంబు వక్త్రంబుల నిడికొని బాలోచితంబు
లైన యంగుళిచర్వణంబులు పొరిఁబొరి నొనరించుచు, నిశితసాయ
కంబునం గ్రౌంచపర్వతవిభేదనంబు సేసి, పటుశక్తిపాతంబున శ్వేత
శైలశృంగభంగంబు గావించి, చెలంగి, యాఱుముఖంబుల నొక్క
పెట్ట యార్చినం బ్రళయభైరవారావభీషణం బైన తదాఘోషంబున.

మ. కులశైలంబులు గ్రక్కునం గదలె; దిక్కుల్ వ్రయ్య లయ్యెన్; మహీ
వలయం బంతయు దిర్దిరం దిరిగె; దేవవ్రాతముల్ సాధ్వసా
కులతం బొందెఁ; బయోధు లన్నియును సంక్షోభించె; సప్తాశ్వున
ప్తులు బిట్టులిక్కి రథంబు నల్ దెసలకుం బో నీడ్చె సంభ్రాంతిమై. 208

క. అట్టి మహోత్పాతంబులు
పుట్టినఁ గని మునులు లోకములకు శుభముగా

నెట్టన శాంతికవిధు ల
ప్పట్టున నొనరించి రాత్మ భావనపరులై. 209

వ. ఆ సమయంబునం జైత్రరథవననివాసులైన జను లందఱుం గూడి యంగిరః ప్రముఖ మునీంద్రుల భార్యలకు నగ్నిదేవువలనం బుట్టిన బాలుండు లోకంబులకు నిట్టి యనర్థంబు సేయం దొడంగెనని యాక్రోశించిన, నయ్యపవాదంబునకు రోసి యా సప్తమునులలోన వసిష్ఠుండు దక్కం దక్కిన యార్వురుం దమ వనితలం బరిత్యజించిరి; మఱియును గొందఱు జనులు "వీరేమి సేయుదు రిన్నిపోకలం బోయినది వహ్నిభార్యయ కాక" యని పలుకం జొచ్చి; రంత నమ్మహామునులం బాలికిం బావకాంగన చనుదెంచి యి ట్లనియె

క. "వినుం డేను వహ్నివలనం
గనినకుమారుండు వాఁడు; గడు నిజ మిది; మీ
వనితలకుం బని గా; దిటు
సనునే కులసతుల విడువ సత్పురుషులకున్ ?'' 211

వ. అని యెంత సెప్పిన వా రొడంబడరైరి; తదనంతరంబ విశ్వామిత్రుండు కుమారు కడ కరిగి, యద్దేవు శరణంబు సొచ్చి, వివిధ వాక్యంబులం బ్రస్తుతించి, తదాదేశంబున నతని జాతకర్మాదివిధు లొనరించిన నది యంతయు నెఱింగి యమరు లెల్ల నమరేంద్రుం గానం జని యి ట్లనిరి 212

ఉ. ''దారుణ శౌర్యధుర్యుఁ డతిదర్పితచిత్తుఁడు, వహ్ని సూనుఁ; డ
వ్వీరుఁడు నిన్నుఁ గైకొనక వీఁక మెయిం జనుదెంచు నిప్డు దు
ర్వారత నీ పదంబు గొనువాంఛ నవశ్యముఁ; గాన యింతలో
నీరస మెత్తి వాని వధియింపుము చెచ్చెర విక్రమోద్ధతిన్. 213

వ. అట్లయిన నీకు నింద్రత్వంబు శాశ్వతం బగు, నేమును బ్రదుకుదుము, లోకంబు లవ్యాకులంబు లగు'' ననినం బురందరుం డప్పుడ సప్త మాతృకలం బిలిచి మీరు సని వహ్నిసంభవుండైన కుమారు సమయించి నాకుం బ్రియంబు సేయుం"డని పంచినం బనిపూని వారు ఘోరంబుగా నతనిపై నడరి, తదీయ తేజోవిశేషంబునకు భయం బంది, యతని

శరణంబు సొచ్చి "యేము లోకమాతలము, మాయందు నీవు మాతృ భావంబు సేయ నర్హుండ" వనినం గుమారుండు వారి నభినందించి చేకొనియె; నంత నగ్నియు నిజపుత్త్రుపాలికి వచ్చి యతనిచేతం బూజితుం డయి తదీయరక్షాపర్వతంబున నిలిచె; మాతృగణంబు క్రోధంబునం బుట్టినయది, లోహితాస్య యను భామిని కుమారునకు దాదియై యుపలాలనంబు సేయుచుండె; నఖిలభూతగణంబులుం బఱతెంచి క్రౌంచారిం బరివేష్టించె, నది యంతయు విని కలుషించి.

—: ఇంద్రుఁడు కుమారస్వామిపై నెత్తివచ్చుట :—

ఉ. స్కందునిమీఁద నెత్తి బలగర్వితుఁడై నడతెంచె నుద్భట
స్యందనసామజాశ్వభటసంకులసైన్యసమగ్ర దేవతా
బృందసమేతుఁడై భువనభీకరసంగరకాంక్ష నింద్రుఁ డ
స్పందితశౌర్యుఁ డగ్నికణపాతభయంకరవజ్రహస్తుఁడై. 215

వ. అంత. 216

తరలము. తరళదీధితిపుంజనిర్భరదారుణాయుధపాణులై,
తెరలఁ ద్రోచి దివౌకసుల్ పఱతెంచి యార్చుచుఁ దాఁకి రా
శరవణోద్భవు, నాతఁడుం దగ సంభ్రమస్ఫుటరోషవి
స్ఫురితనిష్ఠురహాసజృంభణమున్ వహించినఁ జెచ్చెరన్. 217

తే. అతనిముఖగహ్వరంబుల నద్భుతముగ
నుగ్రదహనశిఖావళు లుద్భవించి
వేల్పుమూఁకల నరికట్టి వేల్వఁదొడఁగె,
నంత నెంతయు సంభ్రాంతు లగుచు సురలు. 218

క. నీ కింకరులము మమ్ముం
జేకొని కృపఁ గావు మనుచు శిఖినందను న
స్తోకబలు శరణు వేఁడినఁ
జేకొని దాహాభయ మిడుగఁ జేసె నతండున్. 219

వ. ఇట్లు దేవతలు కుమారు నాశ్రయించినం జూచి, బలసూదనుండు క్రోధఘూర్ణిత నయనుండై యతనిమీఁద వజ్రంబు వైచిన, నది తదీయదక్షిణపార్శ్వంబుఁ దాఁకిన, నం దొక్క పురుషుండు గాంచన

వర్ణుండును, శక్తిధరుండును, మేషవదనుండును నై విశాఖుం డను పేరం బ్రభవించె; మఱియునుం గన్యాకుమారగణంబు లనేకంబులు వుట్టె, నది యెల్లనుం గని జనితభయుండై హరిహయుం డగ్నిసంభవు సభయంబని కొలిచె; నంత నమరులు సంతసిల్లి సింహనాదంబులు నెలంగ షణ్ముఖ శతముఖులం బరివేష్టించి" రని చెప్పి వెండియు మార్కండేయుం డి ట్లనియె. 220

సీ. అయ్యగ్నిసంభవు, నాయతోన్నతబాహు,
నాముక్తకవచుఁ, దేజోమహిష్ఠుఁ
నాలోహితాంబరు, హారికుండలకర్ణుఁ,
గనకరత్నోజ్జ్వలఘనకిరీటు,
సంపూర్ణయౌవను, సర్వలక్షణయుక్తుఁ
గని యనురాగిల్లి కమలనిలయ
సాకారయై వచ్చి యఖిలంబుఁ జూడంగ
సితపద్మహస్తయై యతనిఁ బొందె.

ఆ. శ్రీసమేతుఁడై విశేషకాంతిస్ఫూర్తి
నొలసి పూర్ణచంద్రు చెలువు దాల్చి
యున్నవానిఁ జూచి యుత్ఫుల్లలోచన
కుముదు లగుచు మునులు నమరవరులు. 221

వ. అంత షష్ఠదివసంబు సంప్రాప్తం బయ్యె; నందు మహామును లందఱు మహాసేను నతిభక్తిం బూజించి కృతాంజలులై యి ట్లనిరి. 222

ఉ. "పుట్టినయాఱు నాళులకుఁ బొంపిరివోయి జగంబు లన్నియుఁ
దట్టుఁడవై జయించితి ముదంబున; నీదుమహత్త్వ మెంతయుం
జిట్టలు గాదె! యిట్టి యవిజేయుఁడ వింద్రపదంబు నీక కాఁ
బట్టముగట్టి యేలుము కృపన్ మము నెల్లను వహ్నిసంభవా" 223

వ. అనినం గ్రౌంచారి వారలం జూచి "యింద్రపదవి నుండువారి కెయ్యది కరణీయం"బని యడుగుటయు వా రి ట్లనిరి. 224

మ. "బలముం దేజము నించి లోకముఁ గృపం బాలించు; టర్కేందు భూ
జల తేజః పవనాంబరంబులకు నస్థైర్యంబు గాకుండ ని

క్షలశక్తిస్థితి నీగి; శిష్టజనరక్షాదుష్టశిక్షాసమా
కలనం బింద్రపదస్థుఁ డౌ నతనికిం గర్తవ్యముల్ షణ్ముఖా." 225

చ. అను నెడ నింద్రుఁ డి ట్లనియె "న ట్లయినం గడు లెస్స; దేవ! నీ
వనిమిషనాయకత్వమునయం దభిషిక్తుఁడ వై ముదంబుతో
ననుఁ బసగొమ్ము నీదుకరుణన్ దొసఁగెల్లను దీఱి యుండెదన్;
ఘనతరశౌర్యసారుఁడవు గావున నర్హుఁడ వింద్రలక్ష్మికిన్. 226

వ. ఏను దేవేంద్రపదవి నుండ నోడుదు; నెట్లనిన భవదీయ తేజోవిశే
షంబులు సూచి విస్మితు లై కొందఱు నీకు నింద్రపదవియందు
వేడ్క పుట్టునట్లుగా నేమేనిం జెప్పి నావలనం గొఱగామి కల్పించి
నీకును నాకును భేదంబు సేయం జూతురు; దానంజేసి నీవు కుపితుండ
వై నాయెడం గృప దప్పిన నెవ్వారికి వారింప నలవి గాదు; లోక
భయంకరం బైన విగ్రహంబు ప్రవర్తిల్లుఁ గావున నవశ్యంబును దివిజ
రాజ్యంబు నీక యొప్పించితి; మ మ్మెల్ల నేలికొ" మ్మనినఁ గుమా
రుండు నవ్వాసవు ని ట్లనియె. 227

ఉ. "అట్టివి యేల పుట్టు? నమరాధిప! నీవ జగత్ప్రభుండ వై
యిట్టిల మైన తేజము వహించి సుఖంబున నుండు; మేను నీ
చుట్టమ నై భుజాబలముపొంపున నీకెలనంబు దీర్చెదం;
జట్టన నన్నుఁ బంపుము; భృశంబుగ నెయ్యది కార్య మిత్తఱిన్."

చ. అనవుడు సంతసిల్లి యతఁ డాతని కి ట్లను; "నట్టు లైన నీ
పనుపున నేను సత్యహితభాషణ! యింద్రపదంబునందు ని
ల్చి నెగడువాఁడ నై తి; సురసేనల కెల్లను నాయకుండ వై
ఘనభుజ! నీవు సత్కృప జగద్భయ మోచన మాచరింపవే." 229

వ. అనినఁ గుమారుండు మరుత్పతి కి ట్లనియె. 230

ఉ. "నీకుఁ బ్రియంబుగా భవదనీకినికిం బతి నయ్యెదన్; భుజో
ద్రేకపటుప్రతాపము లజేయము లై పెను పొందఁ బేర్చి, ఘో
రాకృతు లైన నీ రిపుల నందఱఁ దున్మెద; సర్వలోకర
క్షాకరణైక వృత్తి నవికల్పుఁడ నయ్యెదఁ గట్టు పట్టమున్." 231

వ. అనిన నతిప్రీతుం డగుచుఁ బురుహూతుండు సకల మునిగణసమేతుం
డయి తత్క్షణంబ కుమారునకు నఖిల దేవసేనాధిపత్యంబునం దభిషేకం
బొనరించె; మునివరుల జయజయశబ్దంబులు, నమరుల సింహనాదం
బులు, గిన్నరగంధర్వగానంబులు, మంగళతూర్యారావంబులు, నప్స
రోనర్తనంబులుఁ, గల్పతరుకుసుమవర్షంబులు సమకాల ప్రవృత్తంబు
లయ్యెం; బరార్ధ్యభూషణమణి ప్రభాలంకృతం బైన కుమారు మౌళి
భాగంబున నుజ్జ్వలం బైన ధవళాతపత్రంబు సురగిరిశిఖరోపరిగతం
బగు శరచ్చంద్రబింబంబు ననుకరించు చుండె; నట్టియెడ. 232

**—: ఈశ్వరుండు కుమారస్వామియొద్దకు వచ్చుట :—**

శా. నానాసిద్ధగణంబు గొల్వఁ బరమానందంబునం జంద్ర రే
ఖా నవ్యాంచితమౌళి, భూరిభుజగాకల్పోజ్జ్వలాకారుఁ, డీ
శానుం, డానతశంకరుండు గిరిజాసంయుక్తుఁ డై వచ్చెఁ ద
త్సేనానిం బ్రియసూను షణ్ముఖుని వీక్షింపం గడుం బ్రేమతోన్. 233

వ. ఇట్లు వచ్చి మహాదేవుండు మహాసేనుం గౌఁగిలించుకొని యతనికి
విశ్వకర్మ నిర్మితంబును, హేమమయంబును నయిన పుష్పమాలిక
యొసంగె'' నని చెప్పి మార్కండేయుండు పాండవేయున కిట్లనియె;
"వినుము రుద్రుండు మున్ను నిజవీర్యంబు వహ్నియందు సంగ్రహిం
చినఁ దత్తేజోవిశేషంబునం జేసి పావకుండు గుమారు నుత్పాదించె;
నదియునుంగాక యగ్ని రుద్రుం డని వేదవిదులైన విప్రులవలన వినం
బడు; న ట్లగుటం గుమారుండు వహ్నిసంభవుండును, రుద్రసూనుం
డునునని చెప్పంబడియె; నగ్ని భామిని గృత్తికాఖ్య లైన మునిపత్ను
లార్వురరూపంబులు గైకొని ప్రియసమాగమంబు సలిపి శ్వేతశైలం
బున రేతస్కందంబు సేయుటం బ్రభవించినవాఁడు గావునఁ గార్తి
కేయ, స్కందనామంబులం బరగెఁ'' నని చెప్పి యి ట్లనియె. 234

తే. "అప్పు డింద్రుండు మున్ను దా నబ్జభవుని
యోగమున సురక్షితముగ నునిచినట్టి
దేవసేనకుఁ గన్యకాతిలకమునకుఁ
జెలువముగ నలంకారంబు సేయఁ బనిచి. 235

వ. సముచితప్రకారంబున నచ్చటికిఁ దెప్పించి, కుమారుం జూచి "యిక్క న్నియ భవదర్థం బై పరమేష్ఠిచేత సృజియింపంబడియె; గావున నివ్వరవర్ణిని బరిగ్రహింపు" మనిన నప్పార్వతీనందనుండు మందస్మిత సుందరవదనారవిందుం డయి యమ్ముహూర్తంబునందు. 236

ఉ. మానితవిక్రమోజ్జ్వలుఁడు మంగళతూర్యనినాద మొప్పఁ, దే
జోనిధి వహ్నిసాక్షిగ, విశుద్ధవిధిజ్ఞుఁడు దేవమంత్రి మం
త్రానుగమం బొనర్పఁగఁ, బ్రియం బెసలార వరించెఁ జారుప
ద్మాననఁ దేవసేనఁ గరియానఁ గరగ్రహణప్రయుక్తితోన్. 237

ఆ. గుహుఁడు దేవసేనఁ గోరి పెండిలి యైన
యాదినంబు షష్ఠి యగుటఁ జేసి
యర్చనీయ మయ్యె నాదివసంబు, లో
కముల నెల్ల వెలసె గారవమున. 238

క. ఏదినమునందు షణ్ముఖు
శ్రీదేవి వరించెఁ గమలచిహ్నితకర యై
యాదివసము పంచమి లో
కాదరణీయంబు, లక్ష్మి కాస్పద మయ్యెన్. 239

వ. ఇట్లు విహితమంగళాచారుం డయిన కుమారుపాలికిం జనుదెంచి నిజభర్తలచేతం బరిత్యక్త లైన మునిభార్య లార్వురు నధికదైన్య వివర్ణవదన లై యి ట్లనిరి. 240

చ. "కనుకనిఁ దూరి దుర్జనులు గానక చూడక యేము హవ్యవా
హనునకు నిన్నుఁ గంటి మని యాడిన, నందుల కోడి మమ్ముఁ జ
య్యనఁ బతు లుజ్జగించిరి; ప్రియంబున నిం కిట నీవు మాకు నం
దనుఁడవు; మమ్ముఁ బ్రోవ విహితంబు గుమారక! నీ కవశ్యమున్.

తే. పుణ్యలోకంబులకుఁ బాసి పొక్కుచున్న
మమ్ముఁ జేకొని కరుణాసమగ్రబుద్ధిఁ
బుణ్యగతియందు నిల్పుము; పుత్రభావ
దృష్టి వెలయ మా యలమట దీర్పవయ్య." 242

క. అనినఁ గుమారుఁడు వినయం
బున ని ట్లను "నేను మీకుఁ బుత్త్రుఁడ; మీరల్
ననుఁ గన్నతల్లులరు; వినుఁ
డనుమానం బేల? మీ ప్రియం బొనరింతున్." 243

సీ. అనుచుఁ జేరువ నున్న యనిమిషపతిఁ జూచి
"వీరికిఁ దగుపదం బారయంగ
వలయు" నావుడు బలవైరి యిట్లనుఁ "జంద్ర
సతు లైన యా దక్షసుతలలోన
రోహిణిపొరువున రుచి నొప్పు నభిజిత్తు
నా నొక్కచుక్క దాఁ బూని యిప్పు
డందరకంటె నత్యంతవల్లభ నేన
యగుదుఁ జంద్రున కని వగచి యర్థిఁ

ఆ. దపము సేయ నరిగెఁ, దత్పదం బది రిక్త
యున్నయదియు, వీరి నునుపు మచట"
ననిన వారిఁ బ్రీతి నతఁడు వీడ్కొలిపినఁ
గడఁగి వారు సనిరి గగనమునకు. 244

వ. నాఁటంగోలెఁ గృత్తిక లార్వురు నగ్నిదైవత్యం బనం బరఁగు నక్షత్రం బై దివంబున వెలింగిరి; తదనంతరంబ స్వాహాదేవి యేతెంచి కుమారుం గని "నీవు మత్పుత్త్రుండవు; నిత్యంబును నీపాల వసియింప వలతు" ననినం బ్రీతుం డై యాతం "డట్లకాక, నీవు మత్సమీపంబుననుండి, యేనును నీకోడలుం గొనియాడం బ్రియంబున నుండు" మనియె; నప్పుడు కుమారమాతృకలు హావిషయుఁ, గాళియుఁ, గౌళికయు, సుద్ధతయు, శౌరికయు, నార్యయు, వైధాత్రియు ననువార లేడ్వురుం గుమారు మ్రుంగట నిలిచి యి ట్లనిరి.

ఉ. "మమ్ము జగత్త్రియంబునకు మాతలఁగా నొనరింపు మిప్డు, ము
న్నిమ్ముల నొప్పుమాతృకల కెక్కుడు గావుత మేము, సర్వలో
కమ్ముల దొంటిమాతృకలఁ గైకొన కుండుటయుం, బ్రియంబుతో
మ మ్మనిశంబుఁ గొల్చుటయు మాకు వరంబుగ నిమ్ము షణ్ముఖా!"

—: కుమారస్వామి సప్తమాతృకల బాలగ్రహంబులఁ జేయుట :—

ఆ. అనిన నగుచు నాతఁ "డక్లేశ? వారల
పేర్మి మాన్పఁ దగవె? ప్రీతి నొందు
వరము వేఁడుఁ డిత్తు వదలక" యనుడు నా
స్కందమాత లనిరి గారవమున. 247

క. "అగుఁగాక యట్ల; యే మీ
జగములఁ గల శిశువులకు నజస్రముఁ బీడల్
దగ నొనరించుచు నీకృప
నెగడెద మివ్వరము మాకు నీ వొసఁగఁ దగున్." 248

వ. అనినం గార్తికేయుం డిట్లనియె. 249

క. "అక్కట! కీడు దలంచితి;
రిక్కార్యము దగవె? యైన నిచ్చితి; మీకున్
మ్రొక్కినఁ, గొల్చిన, వేఁడిన
నక్కటికముతోడఁ గావుఁ డమ్మ శిశువులన్. 250

క. పాయక పదియాఱేఁడుల
ప్రాయమునందాఁక నరుల బాధింపుఁడు మీ;
రాయతమదంశజనితు, న
జేయు నొకని మీకు రక్షఁ జేయం బనుతున్." 251

వ అని పలికి యమ్మహాసేనుండు నిజదేహంబునం గాంచనవర్ణుం డైన పురుషు నొక్కరు నుత్పాదించిన, వాఁడునుం బుట్టినప్పుడ యాఁకలి గదిరి తిరిగి నేలంబడి మూర్ఛితుం డైనం, గుమారుండు వానికిఁ జైతన్యం బొసంగె; నతండును స్కందాపస్మారం బను పేరి గ్రహం బై మాతృకాగణరక్షకుం డయ్యె; మఱియు శకునిమాత యైన వినతయు. దైత్యమాత యైన దితియు, గోమాత యైన సురభియు, శునక మాత యైన సరమయు, వృక్షమాత యైన కరంజయు, సర్పమాత యైన కద్రువయుఁ, గుమారుదాది యైన లోహితాస్యయు మాతృగణ సమన్విత లై గర్భపీడనంబును, శిశుపీడనంబునుం జేయుచు మనుష్యుల వలన బలి మంత్రోపహార దాన తర్పణంబులఁ దృప్తిం బొంది,

బాలురకు నాయురారోగ్యసుఖంబుల నొసంగుదురు; షోడశవర్షంబుల మీఁదఁ గొన్ని గ్రహంబులు గలవు సెప్పెద వినుము. 252

సీ. నిద్రించుతఱినొండె, నెఱయ మేల్కనియున్న
తఱినొండె, సురసముదయముఁగాంచి
భ్రమసి పల్వాలుకులు పలుకుమానవుఁ జోఁకు
నదియ దేవగ్రహ మని యెఱుంగు
నది; శయానుం డయ్యు, నాసీనుఁ డయ్యుఁ బి
తృశ్రేణిఁ గని యున్మదించెనేని
నది పితృగ్రహము; భ్రాంతాత్ముఁ డై నరుఁడు గం
ధర్వులఁ గనిన గాంధర్వమనియుఁ

తే. బరఁగు గ్రహముచోఁకది; కాలపర్యయమున
గదిరి భ్రమియించెనేని యక్షగ్రహంబు;
వాతపైత్త్యాదివికృతులవలన బుద్ధి
దప్పుటయు నొక్క గ్రహవైకృతంబ యండ్రు. 253

క. విను డెబ్బదియేండ్లగుదాఁ
కను మానవులకు గ్రహోపఘాతంబులు గ
ల్గు; ననంతరంబ గ్రహముల
పని వలవదు; ముదిమి యెల్లపనులకుఁ జాలున్. 254

క. నియతి గలిగి, యింద్రియముల
జయించి, శుచులైన శాంతిసంపన్నులకున్
భయ మొనరింపఁగ లేవ
వ్యయపుణ్యా! గ్రహము లే యవస్థలఁగుందున్. 255

వ. మఱియు నొక్కటి సెప్పెద. 256

ఆ. ఆదిదేవుఁ డగు మహాదేవుమీఁద నె
వ్వానిమనసు భక్తివైభవమున
నుల్లసిల్లు, నతని నెల్ల కాలముల డ
గ్గఱదు సూవె గ్రహవికారవితతి.'' 257

వ. అని చెప్పి మార్కండేయుం డిట్లనియె "నట్లు గుహుండు గ్రహం బుల నియోగించునెడ నగ్నివల్లభ యల్లన యతనిం జేర నరిగి యి ట్లనియె. 258

తే. "పుత్ర! విను మేను దక్షునిపుత్రి; నన్నుఁ
బావకున కిచ్చె మాతండ్రి బాల్యమునను;
నన్ను నతఁ డొల్లఁ డెంతయు; నాకుఁబతికి
నెపుడు నెడలేని పొందుగా నీ వొనర్పు." 259

వ, అనిన నగ్నిభవుండు "మహాద్విజులు వహ్నియందు హవ్యంబులు స్వాహాకారకలితంబు లయిన మంత్రంబుల నొసంగువారు; దానం జేసి నీకుఁ బ్రియునితోడి నిత్యసహవాసంబు సిద్ధించు" ననియె; నప్పుడు సకలమునిగణసమేతుండై చనుదెంచి కమలాసనుండు మహాసేను నభినందించి యంతకు మున్న సన్నిహితుం డై యున్న మహాదేవు దెసఁ జూపి యతని కిట్లనియె. 260

ఆ. "అనఘ! యితఁడె త్రిపురహరుఁడు త్రిలోచనుం;
డిదె త్రిలోకమాత హిమనగేంద్ర
తనయ; వీరు నీకుఁ దల్లియుఁ దండ్రియుఁ
జుమ్మి; వీరిఁ గొల్వు సుచిరభక్తి. 261

వ. అగ్నిదేవునియందును, దదీయభార్యయందును దారు నిజయోగ బలంబునం జేసి యావేశించి యా దంపతులు లోకహితార్థంబుగా నిన్నుం గని"రని చెప్పినఁ బార్వతీనందనుండు సానందహృదయుండయి సకలలోకగురువులైన పార్వతీపరమేశ్వరులం బూజించి, సంస్తుతించె; నంత నింద్రుండు గార్తికేయునకు నైరావణభూషణంబైన ఘంటా ద్వయంబు నొసంగిన, నం దొక్కటి కుమారుండు గైకొని యొక్కటి విశాఖున కిచ్చెం; బదంపడి. 262

**—: ఈశ్వరుండు గుమారసహితుం డై భద్రవటంబు సేరుట :—**

మ. తనయుం గౌఁగిటఁజేర్చుచున్, వరుస మూర్ధఘ్రాణముం జేయుచున్
జనితానందమనస్కుఁడై గిరిసుతాసంయుక్తుఁ డీశానుఁ డ
య్యనఘుం దోడ్కొని భద్రకేసరిసహస్రాంచద్రథారూఢుఁ డై
చనియెన్ భద్రవటస్థలంబునకు నైశ్వర్యం బహార్యంబుగన్. 263

వ. అమ్మహాదేవు ముందట ననేక యక్షగణపరివృతుండునుఁ బుష్పకాధి రూఢుండునునై కుబేరుండును, వెనుకదెస నమరగణసమన్వితుండును, నైరావతారోహణో ల్లాసియు నై వాసవుండును, దక్షిణపక్షంబునం బ్రబలరక్షోయక్షరక్షితుండై యమోఘనామధేయుండైన యక్షోత్త ముండును, గృతపరికరులైన వసురుద్రాదిత్యులును, దాపలిపక్షంబున నతిభయంకరవ్యాధిమృత్యుపరివేష్టితుండై పితృపతియును, వివిధ యాదోనివహసనాథుం డయిన వరుణుండును నడచిరి; మఱియు మూర్తిమంతంబులై శూల పట్టిస గదా ముసలాదికంబులైన యద్దేవు నాయుధంబులుఁ, గమండలు ప్రముఖోపకరణంబులుం జనియె; నయ్యాదిదేవునకు నాసన్నుండయి చంద్రుండును ధవళాతపత్రంబు ధరియించె; ననిలాగ్నులు చామరహస్తులై కొల్చిరి; విద్యయు, సావిత్రియు, గాంధారియుఁ, గేశినియు నను దేవాంగనలు దాక్షా యణిం గొల్చి చనిరి; త్రిలోచనసఖుండైన పింగళుండను యక్షుండు వృషభకేతనంబు దాల్చెఁ; నివ్విధంబున నభిరామవిభవోదారుండై కుమారగురుండు భద్రవటంబు సేర నరిగి యచ్చటఁ గుమారుం జూచి యి ట్లనియె. 264

తే. "సప్తమంబైన మారుతస్కంధమునకుఁ
బతివి గమ్ము కుమార! దేవతల కెపుడుఁ
గార్య మెఱవిఁ జేకొని కడఁకఁ దీర్పు
మనిశమును మత్పదధ్యానఘనుఁడ వగుము. 265

—: కుమారస్వామి మహిషాసురుం జంపుట :—

క. చనుము; శుభంబుల నొందుము
తనూజ!" యని కౌఁగిలించి తద్దయుఁ బ్రేమం
బున నతని వీడుకొలుపఁగ
ననఘ! మహోత్పాతములు రయంబునఁ బొడమెన్. 266

ఆ. దెసలు మండె, ధరణి దిద్దిరఁ దిరిగె, న
భ్రంబు మ్రోసె, వడఁకెఁ బర్వతములు;
జగము ఘోరతిమిరసంవృత మయ్యె; ని
ర్జరుల మనము లెల్ల సంభ్రమించె. 267

వ. తదనంతరంబ 268

మ. ఘనశస్త్రాస్త్రమహోజ్జ్వలంబు, చతురంగ వ్యాప్తభూమండలం
బు, నితాంతోద్ధతఘోరఘోషబధిరీభూతాఖిలాశాముఖం,
బనిరోధోద్ధతవేగ, ముగ్రదనుజేంద్రానీక మేతెంచె నీ
సున నీశానముఖామరప్రతతిపై శుంభద్భుజారంభ మై. 269

వ. ఇట్లు మహిషాసురసంరక్షితం బయిన దానవసైన్యంబు పఱతెంచి, చుట్టుముట్టి, యసంఖ్యసాయకంబులు, గదా ఖడ్గ ముసల పరిఘ శతఘ్నీ ప్రముఖానేకప్రహరణంబులు ప్రయోగించి, నిమిషమాత్రం బున ననిమిషసైన్యంబునం బ్రచురమాతంగ తురగరథికపదాతి ప్రక రంబులం బరిమార్చినం, గార్చిచ్చు పొదివినం జెదరిపఱచు మృగం బులుంబోలె నమరులు సమరవిముఖులై తొలంగం బాఱినం జూచి, నముచిసూదనుండు సింహనాదంబు సేయుచు నెలుంగెత్తి సురగణం బుల కిట్లనియె. 270

చ. "వలవదు సంభ్రమంబు; గరునంబుగ నియ్యెడ నెల్లవారు నే
ర్పలవడ వాహనంబులు మహాస్త్రములుం నమకట్టి క్రమ్మఱుం;
డలవునఁ దున్మి వైచెదు దురాత్ముల దైత్యులఁ నేను గల్గఁగాఁ
దలరఁగ నేల మీకు? ధృతి చాల్పుఁడు, నిల్వుఁడు, గెల్వుఁడుక్కునన్."

ఆ. అనినఁ బోక నిల్చి యాహవోత్సాహులై
సకలవాహనాస్త్రశస్త్రచయము
లలవరించి పేర్చి యార్చి తాఁకిరి వసు
రుద్రసాధ్యముఖమరుత్ప్రవరులు. 272

మ. అమరానీకవిసృజ్యమానబహుళ శస్త్రాస్త్రాహతిన్ ఛిన్న దే
హులై ఘోరమదేభముల్ బహుళరక్తాంగంబులై తూలెఁ దీ
వ్రమహావాతనిపాతజాతరభసవ్యాధూతసంధ్యారుణా
భ్రములో నా నవశంబులై యొఱలుచుం బ్రత్యర్థిసైన్యంబులన్.

మ. పురుహూతాగ్రసరప్రభూతబలసంభూతాస్త్ర నిర్ఘాత మై
తిరిగెన్ బెంపఱి దైత్యవాహినుల నుద్వృత్తాశ్వికశ్రేణి, వి
స్ఫురితోత్పాతసమీరవేగవిముఖీభూతాకృతిం దూలు భీ
కరరత్నాకరజాతసంతత తరంగవ్రాతముం బోలుచున్. 274

చ. అడరుచు దేవసైన్యవిశిఖాగ్నిశిఖావలి చుట్టు ముట్టినం
గడుపడి దానవధ్వజినిఁ గల్గు రథప్రకరంబు లన్నియుం
బొడిపొడి యయ్యెఁ, నుగ్రతరభూరిదవానల మెల్లదిక్కులం
బొడమిన వట్టికట్టియలప్రోవులు రూపఱుమాడ్కిఁ దోఁపఁగన్.

శా. గీర్వాణప్రవిముక్తబాణపటలక్రీడావిలూనంబులై
గర్వోన్మత్తసురారిశీర్షములు వీఁకన్ డొల్లెఁ, గల్పచ్ఛిదా
నిర్విద్ధాంబుదమండలోద్గతమహానిర్ఘాతపాతావధూ
తోర్వీభృద్ఘనగండశైలములతో నూహింపఁ దుల్యంబులై. 276

వ. ఇట్లు నిహన్యమానంబు లగుచు దైత్యసైన్యంబులు దైన్యంబునొంద నిలువ నోర్వక నలుదెసలం జెదరిన, నొదరి యందఱి నదల్చి, మహిషాసురుం డొక్క మహాశైలంబు వెఱికి యొకచేల నమర్చికొని, యమరుల మీఁదం గవిసినం గని జనితోత్సాహంబైన యసురానీకం బతనిం గూడికొని భేరీనిస్సాణపణవాదితూర్యరవంబులు, సింహనాదంబులుఁ జెలంగం గడంగిన నింద్రాదిసురలును బెలుచ సంగరోన్ముఖులై నిలిచిన.

క. మహిషుఁడు బల మేర్పడ న
మ్మహీధరమున్ వైచె నయ్యమరసైన్యముపై
మహి సంచలింపఁగా; దశ
సహస్ర యోధవరు లపుడు సమసిరి దానన్. 278

ఉ. అంతయుఁ జూచి యెంతయు భయంబున నింద్రునిఁ దొట్టి నిర్జరుల్
భ్రాంతమనస్కులై తిరుగఁబడ్డ, మదాంచితఘోరమూర్తియై
యంతకశౌర్యుఁ డాదనుజుఁ డంత దిగంతము దూలఁ గిట్టి, కా
లాంతకుఁ డైన రుద్రుని రథాగ్రము చెచ్చెరఁ బట్టె నుద్ధతిన్. 279

చ. హరుఁ డదె చిక్కె నింక నసురాధిపుచేఁ దెగు నంచుఁ బొంగి భీ
కరముగ దైత్యు లార్వఁగ, జగత్త్రితయంబును గంప మొందఁగాఁ,
దెరలి మునీశ్వరుల్ గరము దీనతఁ బొందఁగ మందహాసభా
సురముఖుఁడై పురారి నిజసూనుఁ గుమారునిఁ జూచి యిట్లనున్.

ఉ. "చూచితె వీనిసాహసము! శూరత మద్రథరోధి యయ్యె; ని
న్నీచుఁ, గృతాపరాధు, నవినీతు, గతాయువు మృత్యుదేవికిన్

గోచరుఁ జేయు మీవు రణకోవిద !'' నావుడు షణ్ముఖుండు గో
త్రాచలసన్నిభుండు మదనాంతకు మాటకుఁబొంగి యుక్కునన్.

ఉ. లోహితరత్నభూషణుఁడు, లోహితమాల్యధరుండు, విస్ఫుర
ల్లోహితలోచనుండు, ననలోహితవస్త్రుఁడు, లోహితాస్యుఁడై
యాహవకేళికిం గడఁగునప్పుడు సూడఁగ నొప్పె లోకని
ర్దాహసమిద్ధనూతనపతంగుఁడపోలె రథాధిరూఢుఁడై. 232

ఉ. ఆతని నుగ్రతేజు నిటలాక్షతనూభవుఁ జూచి నిర్జర
వ్రాతము భీతిఁ బో విడిచి, వారక ధీరత నిల్చె; నంత ని
ర్ధూతవిరోధి, వైరివధదోహలియై వడి వైచెఁ దీవ్రని
ర్ఘాతముతోడఁబుట్టు వనఁ గాఁ దగు నుజ్జ్వలశక్తి దైత్యుపైన్.

క. దారుణకల్పాంతాగ్ని స
మారంభము దోఁప నమ్మహాశక్తి రయం
బారంగ నడరి దివిజేం
ద్రారాతిం బొదివి భస్మితాంగునిఁ జేసెన్. 234

వ. ఇవ్విధంబున మహిషాసురుం బరిమార్చి కుమారుండు మఱియు నమ్మహా
శక్తిం బునఃపునఃప్రయోగంబు గావించుచు ననేక దైత్యదానవశత
సహస్రంబుల వధియించె; నద్దేవుని పారిషదగణంబును గవిసి యసు
రులం దునిమి తూఁటాడి తదీయ రక్తపానమాంసఖాదనంబులు సేసి
మత్తిల్లి యాడుచుం బాడుచు నతనిఁ గొనియాడుచు విహరించె;
నిట్లు వైరులం బొలియించి తిమిరంబు విరియించిన తిమిర వైరియుం
బోలె వెలుంగుచున్న కార్తికేయు నజేయుం జేర నరుగుదెంచి
దేవేంద్రుం డతనిం గౌఁగిటం జేర్చి యి ట్లనియె. 235

చ. "కమలభవప్రదత్తవరగర్వితుఁడై మముఁ జీరికిం గొనం
డమితపరాక్రముండు దనుజాధిపుఁ; డీతఁడు నీమహోగ్రకో
ప మను దవాగ్నియందు శలభంబునుబోలె నశించె; వీనికిన్
సము లగువారు వెండియును జచ్చిరి నూర్వురు దైత్యు లీయనిన్.

క. లోకత్రయంబునందును
నీ కీర్తి వెలింగె; నమరనికరము నేనుఁ

కింకరులము; గుణర
త్నాకర ! రక్షింపు మమ్ము ననిశము కృపతోన్." 287

వ. అని పలికె; నప్పుడు పార్వతీసుందరుండు నిజనందనుఁ బునఃపున రాలింగనంబుల నభినందించి, పురందరప్రముఖులం జూచి, యిక్కుమారునందు నాయం దెట్లట్లసభక్తికచిత్తుల రై వర్తిల్లుం డని యాజ్ఞాపించి, యనంతరంబ భద్రవటంబునకుం జనియె; నమరులు ప్రమదంబునం దమ తమ నివాసంబులకుం జని; రివ్విధంబున. 288

ఉ. ఒక్కదినంబునందు బలియుండు సురారుల నెల్లఁ దున్మి పెం
పెక్క దయార్ద్రుఁడై యభయ మిచ్చె జగంబుల కెల్ల షణ్ముఖుం,
డిక్కథ భక్తితో వినిన, నెప్పుడుఁ గీర్తన నేసినన్ జనుల్
నిక్కము సర్వదోషముల నీఁగి భజింతురు భవ్యభద్రముల్.'' 289

వ అని మార్కండేయుండు సెప్పినఁ బాండవులు సంతుష్టహృదయులై యమ్మహాత్మునిం బ్రశంసించిరి; వా రివ్విధంబున నభీష్టకథాగోష్ఠిం బ్రవర్తిల్లునెడఁ గృష్ణవల్లభయైన సత్యభామయుఁ బాంచాలియు నేకతంబ యొక్కయెడఁ బ్రియసల్లాపసంసక్తలై యుండి; రప్పుడు సత్యభామ ద్రౌపది కి ట్లనియె. 290

—: సత్యా ద్రౌపదీ సంవాదము :—

సీ. ''నీప్రియభర్తల, నిర్మలచరితులఁ
ప్రకటతేజుల, లోకపాలనిభులఁ
బార్థుల నీ వొకభంగిన వదలక
చెలువ యెబ్భంగి భజింతు ? దగిలి
యొక్క రొక్కనికంటె నువిద నీ కేవురు
ననురక్తు లగుట యత్యద్భుతంబు;
నగు మొగంబుల కాని నలినాక్షి నీదెసఁ
బతులకుఁ గింకిరిపాటు లేదు;

తే. వ్రతము పెంపొ, మంత్రౌషధవైభవంబొ,
సరసనైపథ్యకర్మకౌశలమొ, చతుర

విభ్రమోల్లాసరేఖయొ. వెలఁది! నీవి
శేషసౌభాగ్యహేతువు సెపుమ నాకు. 291

క. ఏనును నీవలన నిజము
గా నిది యంతయును నెఱిఁగి, కమలదళాక్షుం
బూని వశగతునిఁ జేసి, యి
మ్మానస్నేహాను భోగయుక్తిఁ దలిర్తున్.'' 292

క. అని యడిగిన మది నించుక
గినుక వొడమ నడఁచుకొనుచుఁ గృష్ణ మృదులహా
సిని యగుచుఁ, గృష్ణభామినిఁ
గనుఁగొని యి ట్లనియె నిర్వికారాకృతి యై. 293

క. ''నను నిట్లు దుష్టవనితా
జనమునటులు గాఁ దలంపఁ జనునే నీకున్?
మన నొప్పదు; పురుషోత్తము
వనితవు గాఁ దగవు నీవు వనరుహనయనా.'' 294

వ. అని మేలంపుఁజందంబున దాని వివేకవిహీనత యెఱుకపడ నాడి పాంచాలి మఱియు ని ట్లనియె. 295

చ. ''అలయక మంత్రతంత్రవివిధౌషధభంగులఁ జేసి యెంతయున్
వలతురు నాథు లంట మగువా! కడు బేలతనంబు; దాన మున్
గలిగిన ప్రేమయుం బొలియుఁ గాని, యొకండును సిద్ధిఁ బొంద; ద
ప్పొలఁతుకతోడిమన్కి యహిపొత్తుగఁ జూచు విభుం డెఱింగినన్.

చ. మగువ యొనర్చు వశ్యవిధి, మందులు, మాకులు నొందుచంద మై
మగనికిఁ దెచ్చు రోగములు, మానక మూకజడాదిభావముల్
మొగి నొనరించు; నద్దురితముల్ దనచేసినచేత లై తుదిన్
జగమున కెక్కు నిందయును సద్గతిహానియు వచ్చు నింతికిన్. 297

క. కావునఁ బతులకు నెప్పుడుఁ
గావింపం దగదు కపటకర్మంబులు; ద
ద్భావ మెఱిఁగి యనువర్తిని
యై వనిత చరింప నదియ యగు నెల్లవియున్. 298

వ. పాండవులయెడ నే నెట్టిదాననై యిట్టి సౌభాగ్యంబు నందితి నది
నీకు నెఱింగించెద నేర్పడ వినుము. 299

సీ. పతు లాత్మ నొండొక్కపడఁతులఁ గలిసిన
నలుగ; నెయ్యెడల నహంకరింప;
మదముఁ బ్రమాదంబు మాని వారికిఁ జిత్త
మేకముఖంబుగ నెల్లప్రొద్దు
భక్తి సేయుదు; జూపుఁ బలుకునుఁ గోర్కియుఁ
జెయ్వులు వింతగాఁ జేయ నెపుడు;
నమరగంధర్వయక్షాదులం దైనను
బురుషుఁ నన్యునిఁ దృణంబుగఁ దలంతు;
తే. స్నాన భోజన శయనాది సంప్రయోగ
మర్థిఁ బతులకు ము న్నొందు నాచరింపఁ;
బతులు పెచ్చిన నాసనపానాద్యనిధుల
భక్తితో నేన కాపింతుఁ; బనుప నొరుల. 300

చ. తగియెడు వేళలందు నిరతంబుగ మజ్జనభోజనక్రియల్
దగ నొడఁగూర్తు భర్తలకు; ధాన్యధనంబులు రిత్తమై వ్యయం
బగుటకు నోర్వ నెప్పుడు; గృహస్థల భాండవిశోధనంబు లి
మ్ముగ నొకనాఁడు నేమఱఁ; బ్రమోదము సల్పుదు బంధుకోటికిన్.

క. పలుమాఱుం బిలవాకిట
మెలఁగుట, యసతీజనైకమిత్రత, కలహం
బుల కెలయుట, నగుపలుకులఁ
బెలుచ నగుట నాకుఁ గాని పేరివి మగువా! 302

క. పతు లిచ్చమెయిఁ బ్రవాస
స్థితు లైనం బుష్పగంధదీప్తాభరణ
ప్రతతి ధరియింపఁ; దద్గత
మతి నగుచుఁ దదాగమంబ మదిఁ గాంక్షింతున్. 303

ఉ. అత్తకు భక్తి గల్గి మది నాయమ సెప్పినమాడ్కి జీవికా
వృత్తము లావహింతు, గురువిప్రజనాతిథిపూజనంబు ల

త్యుత్తమభక్తి నేన తగ నోపి యొనర్తుఁ; బ్రియంబు, దాల్మియు౯
మెత్తదనంబు, సన్మతియు మేలుగఁ దాల్తు సమస్తభంగులన్. 304

క. కడుమృదువు లనుచుఁ దేఁకువ
చెడి యెపుడుఁ జరింప; భరతసింహులు గోపం
బడరిన నాశీవిషముల
వడుపునఁ గ్రూరు లని వెఱపు వదలక కొల్తున్. 305

సీ. మాయత్తఁ బృథ్వీసమానఁ, బృథాదేవిఁ
గుంతిభోజాత్మజఁ, గోమలాంగి;
సతతంబు భోజనస్నానాదికములయం
దిమ్ముగఁ బరిచర్య యేన చేసి
సంప్రీతఁ జేయుదు; జనవంద్యుఁ డగు ధర్మ
తనయునిబంతి నిత్యంబుఁ బసిఁడి
పళ్లెరంబులఁ గుడుచు బ్రాహ్మణు లతిపుణ్యు
లెనిమిదివేలు; సమిద్ధమతులు

తే. యతులు పదివేలు; వారల కనుదినంబు
నన్నపానంబు లర్హసహాయ నగుచు
నొడికముగ నేన కావింతు; సుచితవస్త్ర
భూషణాదులఁ బరితోషముగ నొనర్తు. 306

వ. మఱియు ధర్మరాజు నగరియందుఁ గనకమణిమయభూషణాలంకృతు లయిన పరిచారకులు నూఱువేలు; రేయును బగలును బాత్రహస్తులై యభ్యాగతభోజనంబు లొడఁగూర్చువారు నందఱ కలరు; వీరెల్ల నిట్టిట్టి మెలకువ మెలంగుదు రని తత్కృతాకృతంబు లేన యెఱుంగుదు; నిరంతరమదధారాతరంగితకపోలంబులయిన భద్రగజశతసహస్రంబులుఁ, బ్రభూతజవసత్త్వసన్నుతంబు లయిన యుత్తమాశ్వశతసహస్రంబులుం గలవు; వానికి నన్నింటికి నిత్యోచితంబులైన ఖాద్యంబు లొనరింపను, బాలింపను దగినవారి నేన నియమింతు; నఖండభాండాగారపూరితంబులైన యగణ్యమణికనకాది వస్తువులును, బ్రతిదినవిహితంబు లయిన యాయ వ్యయంబులు నా యెఱుంగని

యవియు లేవు; గోపాలజనంబులు దుదిగాఁ గల సకల భృత్యజనంబుల జీవితంబుల నరసి యేన నడపుదుం; బరమయశోధను లగు పాండు నందనులు నిజకుటుంబ భారంబు సర్వంబు నాయంద సమర్పించి, తారు నిర్భరు లై యిష్ట విహారంబుల నుండుదురు; రే నెల్ల వెంటల నప్రమత్త నై వర్తింతు. 307

ఆ. పేగ జాము గలుగ వెడనిద్రఁ బొందుదుఁ
గాని రాజ్యభారకార్యయుక్తి
నబ్జనయన! నాకు నాహారనిద్రల
కెడయు లేదు సువ్వె యెల్లప్రొద్దు. 308

ఆ. ఇట్టి వర్తనముల నెపుడుఁ బాండవులకుఁ
దగిలి ప్రియము సేయఁ గగితిఁ గాని,
మగువ! నీవు సెప్పు మందులు మాకులు
నింద్రజాలములును నే నెఱుంగ.'' 309

వ. అనిన విని లజ్జాకలితచిత్త యగుచు సత్యభామ పాండవభామిని కి ట్లనియె. 310

క. "ఏ నెఱుఁగమి ని ట్లడిగితి;
నా నేరమి నైఁప వలయు; నగవుగఁ గొనుమీ
మానిని! నాపలుకులు; స
న్మానితము భవచ్చరిత్ర మహిమ ధరిత్రిన్.'' 311

వ. అనినం బాంచాలి మందస్మితానన యగుచు నది యట్లు కాక యని పలికి మఱియు ని ట్లనియె. 312

—: ద్రౌపది సత్యభామకుఁ బతివ్రతా ధర్మంబులు సెప్పుట :—

క. "పతిమనసు నాఁచికొనియెడు
చతురోపాయంబు నీకుఁ జపలాక్షి! సుని
శ్చితమతిఁ జెప్పెద విను మూ
ర్జితమును, ధర్మాన్వితము, సుశీలంబును గాన్. 313

చ. పతిఁ గడవంగ దైవతము భామల కెందును లేదు; ప్రీతుఁ డై
పతి గరుణించెనేనిఁ గలభామిణి! భాసురభూషణాంబరా

న్వితధనధాన్యగౌరవము, విశ్రుతసంతతియున్, యశంబు, స
ద్గతియును గల్గు; నొండుమెయిఁ గల్గునె? యెన్ని తెఱంగులారయన్.

ఆ. కరము దుఃఖపడినఁ గాని యొక్కింత సౌ
ఖ్యంబు ధర్మగతియుఁ గలుగ దెందుఁ;
జూడు మబల! భర్తృశుశ్రూషఫలము సం
తత శుభంబు గలదు ధర్మ వొదవు. 315

క. కావున నిత్యము సమ్య
గ్భావము, ప్రేమంబు, వెరవు, భక్తియుఁ బ్రియముం
గావింపుము నీప్రియునెడ;
భావముఁ దా నెఱిఁగి భర్త బాగుగ మరగున్. 316

మ. వనజాక్షుండు గడంగి నీ దగు గృహద్వారంబు సేరంగ వ
చ్చె ననంగా విని లెమ్ము సంభ్రమముతోఁ; జె న్నొందు నభ్యంతరం
బునకున్ వచ్చిన నాసనాదికరణంబుల్ దీర్పఁ దత్తజ్జనం
బు నియోగించితి నంచు నుండక, ప్రియంబుల్ సేయు మీవుం దగన్.

వ. తివిరి మురారి నీకుఁ గడుఁ దీపుగఁ జెప్పినపల్కు గల్గినం,
కువలయనేత్ర! నీమనసుగూడినవారికి నైన నెప్డుఁ జె
ప్ప వలదు; దాన నొండొకనెపంబు ఘటింతు రెఱింగిరేని నీ
సవతులు; కృష్ణుబుద్ధి విరసం బగు నీ దెసఁ దత్ప్రియుక్తిచేన్. 318

చ. పతికి ననుంగులైన తగుబంధుల మిత్రుల భోజనాదిస
త్కృతముల నాదరించుచు నకృత్రిమభక్తి నియుక్తి సంతతో
త్థితమతి వై చరింపుము; తదీయహితేతరవృత్తులైన వా
రతివ! భవత్సుహృజ్జనము లైనను గైకొన కుండు మెప్పుడున్. 319

క. విను ప్రద్యుమ్నాదిభవ
త్తనయులయెడ నైన నేకతంబున నేకా
సనమున నుండుట దూష్యం
బని యెఱుఁగుము; సతులచరిత లతిదుష్కరముల్. 320

క. కులవతులును, సతులును, ని
ర్మలమతులును నయినయట్టి మగువలతోడం

జెలిమి యొనరించునది; దు
ర్విలసితవనితాభియుక్తి విడువుము తరుణీ! 321

వ. ఇది నీకుఁ బరమసౌభాగ్యమూలం బయిన యుపాయం" బనినం బ్రీతచిత్తయై సత్యభామ యిట్లనియె. 322

సీ. "నీవు ధర్మజ్ఞవు; దేవసన్నిభులు నీ
భర్తలు మహనీయకీర్తిధనులు;
ధైర్యతేజోబలశౌర్యసంపన్నులు
గావున వీరికి నేవిధమున
ధారుణీరాజ్యంబు సేరెడుఁ దడయక;
మీ కెగ్గు సేసిన లోకనింద్య
చరితుఁడు, కౌరవధరణీశు వనితలు
దిక్కు లే కలమటఁ బొక్కుచుండఁ

తే. గని ముదంబునఁ బొందెదు వనిత! నీవు;
సుతుల నత్యంతనిర్మలమతుల శౌర్య
యుతులఁ గాంచిన సద్గుణాన్వితవు; వగపు
వలదు చిత్తంబులో నీకు జలజనయన. 323

వ. ప్రతివింధ్యాదు లయిన నీపుత్రు లేవురు నిప్పుడు వచ్చి యదుపురంబున నున్న వారు; వారి కొక్కటం గొఱంత లేదు; రుక్మిణియు సుభద్రయుఁ దక్కనవారలు నక్కుమారులయెడం దమ కొడుకులకంటె గారవంబు సేయుదురు; వారిదెస నిశ్చింతవు గ" మ్మనియె; నయ్యవసరంబునం గృష్ణుండు పాండవుల వీడ్కొని, మార్కండేయాదివిప్రజనంబు నామంత్రణంబు సేసి, గమనోన్ముఖుం డగుటయు సత్యభామ యాజ్ఞసేనిం గౌఁగిలించుకొని సగౌరవంబుగా వీడ్కొనియె; నంత వాసుదేవుండును బ్రియాసహితంబుగా రథారూఢుం డై ద్వారవతీపురంబున కరిగె; మార్కండేయుండును బాండవేయుల నాశ్వాసించి నిజాశ్రమంబునకుం జనియె;" నని చెప్పిన వైశంపాయనునకు జనమేజయుం డి ట్లనియె. 324

క. "వనముల ని ట్లనిశంబును
ఘనతరదుఃఖానుభవవికల్పితు లగుచుఁ

మనుజోత్తము లప్పార్థులు
జనసుత! యట మీఁద నెట్లు చరియింతురొకో." 325

వ. అనిన నమ్మునీశ్వరుం డిట్లని చెప్పెఁ; "గృష్ణుండు సనిన యనంతరంబ పాండవులు కామ్యకవననివాసంబు పరిత్యజించి యనేక వనశైలనదనదీవిశేషంబు లాలోకించుచు ద్వైతవనంబునకు జని; రట్టియెడం గరిపురంబున నుండి యొక బ్రాహ్మణుండు సరసకథాకథనకుశలుండు సనుదెంచి కౌంతేయులం గని, యుచితసల్లాపంబు నేసి, మగిడి ధృతరాష్ట్రుపాలికిం జనిన నమ్మహీపాలుండు పాండవుల కుశలం బడుగుటయు, నవ్విప్రుండు వారేవురు ననవరతశీతవాతాతపకర్శితాంగులై బహుదుఃఖసాగరంబున మునింగి యున్న వా రనియును, వీరనాథ యయ్యును ననాథయుం బోలెఁ బాంచాలి పరమశోకార్తయై యున్నది యనియుం జెప్పిన విని, వైచిత్ర్యవీర్యుండు విషణ్ణహృదయుం డై, కన్నీరు దొరుఁగం గొండొక సేపు పలుక కుండి పదంపడి నిట్టూర్పు నిగిడించి గద్గదకంఠుం డగుచు నిట్లనియె. 326

—: ధృతరాష్ట్రుఁడు పాండవుల వనవాసక్లేశంబునకు దుఃఖించుట :—

క. "నాచేసిన కీడునఁ, గడు
నీచుం డగు నాతనూజు నేరమి, నిమ్మై
నోచెల్ల! పార్థులకుఁ బు
ణ్యాచారుల కెందు లేనియాపద వచ్చెఁ. 327

క. నా పెద్దకొడుకు ధర్మజుఁ
గాపురుషవిదూరు, ధీరుఁ, గౌరవకులసం
దీపకు నివ్విధమున సం
తాపితుఁగాఁ జేసెనే విధాత్రు దదయుఁ డై. 328

చ. అమలనివాతసౌధములయందు, మనోజ్ఞమరాళతూలత
ల్పముల శయించి, రేపులు శుభస్థితి మాగధసూతగీతనా
దములఁ బ్రబోధముం బొరయు ధర్మసుతుండు కఠోర భూమిభా
గమున శయించి మేల్కను సృగాలనినాదవికీర్ణకర్ణుఁ డై. 329

క. నాగాయుతసత్త్వుఁడు, ది
గ్నాగాయతహస్తుఁ, డనిలనందనుఁడు మహో
ద్వేగాత్ముఁ డగుచు డస్సిన
నాగము క్రియ నుండకున్నె నవసి పనమునన్? 330

ఉ. అన్నలుఁ దమ్ములున్ సతియు నార్తిమెయిన్ బహుదుఃఖమగ్నులై
యున్న తెఱంగు సూచి, విజయుండు యుధిష్ఠిరవాక్యబద్ధుఁడై
సన్నుతుఁ డుగ్రపన్నగముచాడ్పున రోఁజుచుఁ, గ్రోధశోకవే
గోన్నతి నాత్మ నేమనుచు నుండునొ నాసుతు తప్పు లెన్నుచున్. 331

క. అక్కట! మృదుగాత్రులు, గడుఁ
జిక్కనిమనసులు, గుమారసింహులు, గవలిం
పెక్కిన సుఖముల కర్హులు;
స్రుక్కి నవయ నోర్చి యునికి చోద్యం బరయన్." 332

వ. అని పలికి వెండియు. 333

చ. "అనుపమతేజుఁ, డున్నతభుజాగ్రుఁ, డుదగ్రుఁడు, వైరినిగ్రహుం,
డనఘుండు వాయుసూనుఁడు నిజాగ్రజుచేసినసత్యపాశబం
ధనమునఁ జిక్కి తత్సమయతత్పరుఁడై యిటు ఘోరదుఃఖవే
దనములు సైఁచెఁ గాక; మది తద్దయుఁ గ్రోధమయంబు వానికిన్.

సీ. శకునికైతవము, దుశ్శాసనుచేసిన
దుష్కర్మమును, గర్ణుతులుపతనము,
దుర్యోధనునిదైన దుర్ణయంబును జిత్త
మునఁ గిరిశల్యముల్ వోలె నలఁప;
దావాగ్ని తెఱఁగున దరికొని క్రోధంబు
వనవాస మనియెడివాయుగతుల
నంత కంతకుఁ బేర్చి యవయవంబుల నెల్ల
మండంగ నెప్పుడు మధ్యముండు

ఆ. మొగము జేవురింప ముడివడుబొమలతో
నవుడుగఱచుచును భయంకరముగ
నున్న రూపు వాయకుండు నామది; వాఁడ
మిత్తి నాదు పుత్రమిత్రతతికి. 335

క. అంతకసుతుహృదయంబున
నంత గలుగ నేర దలుక; యర్జును మదిలో
నంత గలుగ; దమ్మారుతి
యంతకనిభుఁ డధికరోషుఁ డనవరతంబున్. 336

తే. అర్జునానిలప్రేరితం బగుచుఁ బేర్చి
వాయుతనయదవాగ్ని దుర్వారభంగిఁ
గర్ణసౌబలసహితముగా మదీయ
పుత్రశతకాననము వెసఁ బొదువ కున్నె? 337

క. అగుఁ గాక కర్మఫలములు
దగఁ గుడువక పోవ వశమె; దైవకృతంబుల్
మగుడునె? కౌరవ్యులకుం
దెగుకాలం బయ్యె; వగవు లెరు వింకేలా? 338

క. ఏను వల దన్న జూదము
మానఁడ; సుతుదుర్ణయంబు మగిడింపక దు
ర్మానమునఁ గులక్షయసం
ధానమునకుఁ దొడఁగితిని విధాతృనిచెయిదిన్. 339

తే. రాత్రి తెగుదల దిన మేల రాకయుండు?
దినము తెగుదల రాత్రి యేతేరకున్నె?
పరఁగ సుఖదుఃఖములు గాలపర్యయమున
నెందు మనుజులఁ బొందక యేల యుండుగు? 340

ఉ. మేలున సంతసిల్లు నెడ మేకొని యాపద లొందు; నాపదల్
దూలఁగఁ బాని సౌఖ్యముల్ దోఁచుఁ; గృతంబులు దప్ప వెమ్మెయిం;
బోలఁగ నింతయుం గని ప్రబుద్ధమనస్కులు ఖేద మోదని
ర్గాళితధైర్యసాగరులు గాక సుఖింతురు సర్వకాలమున్. 341

చ. సిరికిఁ దొలంగి, కానల వసించి, కృశించిన పార్థుఁ డట్టె! ని
ర్జరులపరంబునం బరమసమ్మదలీల మహాస్త్రలాభవి
స్ఫురణముఁ బొంది యద్దివికిఁ బోయి శరీరముతోన క్రమ్మఱన్
ధరణికి వచ్చె! నిట్టివి గదా వివిధాద్భుతకర్మపాకముల్. 342

క. గాండీవము విల్లఁటె! యా
ఖండలనందనుఁడు విల్లు గలవాఁ డఁటె! త
త్కాండంబులు దివ్యము లఁటె!
యొండేటికి వారిధనము యుర్వియు సిరియున్." 343

వ. అని ధృతరాష్ట్రుండు బహువిధంబు లగు పలుకులు పలుక విని దుర్యోధనుండు శకునిం జూచి "యీ రాజే[illegible] యింత భీతుండయ్యె?" ననుచు నతండునుం దానును గర్ణసహితుం డై యొక్క వివిక్తప్రదేశంబునకుం జని కార్యాలోచనంబున నున్న యెడం గర్ణుం డి ట్లనియె. 344

సీ. "పాలితశౌర్యులు పాండవేయులు దుఃఖ
శీలు రై యడవులపాలు పడిరి;
ధరణీశ! తొల్లి యింద్రప్రస్థపురమున
ధర్మనందనుపాలఁ బేర్మితోడ
శోభిల్లుచున్న విశ్రుతలక్ష్మి నీబుద్ధి
బలమున నిన్నుఁ జెం [illegible]
బరువడి దక్షిణపశ్చిమోత్తరపూర్వ
దేశస్థు లయిన మహీశు లెల్ల
తే. నీక యరిగాఁపు లై రిప్డు ; నిఖిల[illegible]
శైల కానన ద్వీప విశాల మయిన
మహి సమస్తంబు నేలుము మహీశ [illegible]
లీల నింద్రుండు సురలోక మేలునట్లు.

—: కర్ణ శకుని దుర్యోధనులు మంత్రంబు సేయుట :—

ఉ. జానపదుల్ పురీజనులు సంత[illegible] ప్రమద[illegible]
దైన శుభోదయంబ హ్లాదయంబులఁ గోరుచు నున్నవారు ; [illegible]
మ్మానము నొంది, కౌరవసమూహము నిన్ను భజింప, [illegible]
జోనిధి వై వెలింగెదవు సూర్యునిచాడ్పున నీవ యున్న[illegible] 346

వ. పాండవు లిప్పుడు పరమదుఃఖార్తు లగుచు ద్వైతవన[illegible] పంబున నున్నవా రని వింటిమి; నీవు [illegible]

చని యందు నీ తేజంబు ఘర్మసమయంబునాఁటి తపను తేజం బై పగతురకన్నులు గమర నతిదుస్సహం బగునట్లుగాఁ జేయుము ; దొల్లి నహుషపుత్త్రుం డయిన యయాతియుం బోలె నుజ్జ్వలుండ వై యున్న నిన్నుం జూచి పాండవులు హృదయభేదంబుగా వగచెదరు ; మిత్ర జనమోదంబును, శత్రుజనఖేదంబునుం గదా సంపదలకు దగియెడు ఫలంబు. 347

క. ధనధాన్యపుత్త్రబాంధవ
జనలాభంబులును దలఁప సరిగావు సుఖం
బునఁ దాను దనరి, శత్రులు
ఘనతరదుఃఖముల నుండఁ గని యలరుటకున్. 348

ఉ. నారలు గట్టి కూర లశనంబుగ నుగ్రవనంబులో విప
చ్చారము నొంది వందురిన ఫల్గును నుజ్జ్వలరాజ్యవైభవో
దారుల మై పనుంగొని ముదంబునఁ బొందఁగఁ గాంచుకంటె నిం
పారఁగ నొండు గల్గునె కృతార్థత యెందును గౌరవేశ్వరా ? 349

తే. అతుల సౌభాగ్యపుణ్యసమగ్రగరిమ
నొప్పు చున్న నీ దేవుల యొప్పు సూచి,
ధృతి దఱిఁగి తన్నుఁ దాన నిందించుకొనుచు
హృదయమునఁ బాండవాంగన యెరియవలదె ?" 350

వ. అనిన నది వోలు నని నాగకేతనుఁడు సంప్రీతుం డై కొండొక విచారించి రాధేయుం జూచి యి ట్లనియె. 351

క. "నాతలఁపును నిట్టిద ; నీ
వేతెఱఁ గెఱిఁగించి తది యభీష్టము ; మన మా
ద్వైతవనంబున కరుగుట
భూతలపతి యనుమతింపఁ బోలదు మదిలోన్. 352

తే. అందుఁ బాండవు లుండుట యాంబికేయుఁ
డెఱుఁగు ; మన మవ్వనంబున కేఁగుటయును
గడఁగి పార్థులతోడ విగ్రహముకొఱక
యని యవశ్యంబు వారించు నతఁడు మనల. 353

వ. అదియునుం గాక. 354

చ. ఉరుతరవిక్రమాఢ్యు లనియుం, మహనీయతపోవిశేషసు
స్థిరు లనియుం బృథాసుతులదిక్కునఁ దద్దయు భీతుఁ డై, నిరం
తరమును మానవేంద్రుఁ డెదఁ దాపము నొందుచు నుండు; వింటె! యి
క్కురువిభుఁ డింత సేపు గడుఁ గూర్చి విలాపము సేసె వారికిన్. 355

వ. అతని యొద్ద నుండి విదురుండు వారిన పోటుమానిసులుగాఁ బొగడు చుండు ; జూదంబునాఁటనుండియు విదురుండు పాండవపక్షపాతి యగుట దెల్లం బయ్యెఁ ; మన విచారించిన యిక్కార్యంబు చిన్న సన్న యెఱింగెనేనియు నాతం డెల్ల భంగుల విఘ్నంబు సేయుం ; గావున నిది యంతయు రహస్యంబుగా నొనరించికొని ధృతరాష్ట్రుండు దీని కనుమంతించుతెఱం గెయ్యది యట్టి యుపాయంబు నీవును శకు నియు నూహించునది ; మనము రేపకడ వచ్చి కురుపితామహుం డైన భీష్మునిఁ, గురువంశోత్తముం డైన ధృతరాష్ట్రుని నొడంబఱిచి వెడలుద''మని వారి వీడ్కొలిపి దుర్యోధనుం డభ్యంతర గృహంబున కరిగి యారాత్రి సముచితప్రకారంబునఁ గడపెఁ ; ప్రభాతం బగుట యుఁ గర్ణుండు దుర్యోధను కడకుం జని యి ట్లనియె. 356

ఉ. "భూతలనాథ ! యే నొకటి పోల నుపాయము గంటి ; నిప్పు డా
ద్వైతవనంబునందు విదితంబుగ నున్నవి గోకదంబముల్ ;
ప్రీతిగఁ దద్విలోకనము పేరఁ జనం దగు ; ధారుణీశ్వరుం
డేతెఱఁ గైనఁ బొమ్మను ; నభీష్టము సేకుఱు నెల్లభంగులన్." 357

క. నా విని సుబలతనూజుఁడు
''దేవా ! నీయాన ; యేను దెల్లంబుగ రే
యీావెరవె నెమ్మనమ్మున
భావించితి'' ననియె ; నంతఁ బ్రహసితముఖు లై. 358

వ. ఒండొరులచెయి సఱచి నవ్వుచు నమ్మువ్వురుం దక్షిణంబ సమంగ నామధేయుం డయిన గోపాలకు నొక్కనిం గఱపికొని ధృతరాష్ట్రు పాలికిం జని, సముచితప్రసంగ సేవావిశేషంబుల నమ్మహీవిభు సుముఖుం జేసి, యనంతరంబ ''దేవా! ద్వైత వనంబునందుల కీలా

రంబుననుండి వీఁడెయొక్క గోపకుండు వచ్చె'' ననిన నతండును వాని కభిముఖుం డై పసులసేమం బడుగుటయు వాఁ డి ట్లనియె. 359

—: కర్ణ సౌబలులు ధృతరాష్ట్రుచేత ఘోషయాత్ర కనుజ్ఞ గొనుట :—

ఉ. ''ద్వైతవనంబునట్టి సుఖవాసము గోవుల కెందు లేదు ; ధా
త్రీతలనాథ ! యిప్పుడు ప్రదీప్తము లై సతతంబుఁ బేర్చి గో
వ్రాతభయంకరంబు లగు వాలుమృగంబులు సంచరించు ; మీ
కాజెఱుఁ గెల్లఁ జెప్పుటకు నై యిట వచ్చితి నేను జెచ్చెరన్.'' 360

వ. అనిన యనంతరంబ కర్ణసౌబలులు ధృతరాష్ట్రుతోడ ''దేవా ! య ట్లయినం దడయక దుష్టమృగనాశనంబును. గోగణసంరక్షణంబును జేయుటకు భవత్సూను దుర్యోధను నియోగింపు'' మనిన నతండు గొండొక విచారించి యి ట్లనియె. 361

మ. ''తగు గోరక్ష యొనర్ప ; దుష్టమృగవిధ్వంసంబు నూహింప మే
లగు ; నైనన్ వినుఁ; డవ్వనాంతరమునం దాసక్తిమై నున్నవా
రు గరిష్ఠాత్ములు, పాండురాజతనయుల్, రూఢవ్రతాోపాధ్యు ; ల
ట్లగుటఁ మీగమనంబు నామదిఁ బ్రియం బై తోఁప దెబ్బంగులన్.

చ. వనమున కేఁగి పందురినవా రని వారల మీ రవశ్యముం
జెనకఁ దలంతు ; రప్పురుషసింహులు భూరితపోనిధుల్ ; మనం
బునఁ గలుషించి రేనియుఁ దపోమహిమన్ మిము నిర్దహింతు రొం
డె, నతులితాస్త్రశక్తిని వడిం దునుమాడుదు రాజి నందఱన్. 363

క. మున్నును మీచేతఁ గడున్
బన్నము వడి నొచ్చినారు పార్థులు : మిమ్మున్
గన్నంత నలుగ కుండునె
పన్నగరిపుసన్నిభుండు పవనజుఁ డాత్మన్ ? 364

వ. అదియునుం గాక. 365

చ. ఒకరుఁడ ధాత్రి యంతయును నోర్చెఁ గృతాస్త్రుఁడు గాక యుండియుం
బ్రకటితబాహువిక్రముఁడు ఫల్గునుఁ ; డివ్వు మహేంద్రుపాల న

త్ర్యకుటిలదివ్యబాణవిదుఁ డై యెలమిం జనుదెంచె ; నట్టివా
నికి నెదురంగ శక్య మగునే రణభూముల నింక నేరికిన్ ? 366

తే. చెనకి మీరు వారికిఁ గీడు సేయుటయును
వారు మీకెగ్గు సేఁతయు వగవ మేలు
గాదు ; వఱసిన ఘోషరక్షణ మొనర్పఁ
దగిన వారలఁ బుత్తము దడయ కందు. 367

వ. అని యొడంబడ కున్న నయ్యాంబికేయునకు శకుని యి ట్లనియె.

ఉ. "పాలితవిక్రమోన్నతులు పాండుతనూజులు ; వారి కప్రియం
బేల యొనర్తు మే ? సుధిప ! యే మటు సేసితి మేనియుం బ్రతి
జ్ఞాలపితుండు ధర్మజుఁడు సత్యము దప్పునె ? తమ్ము లేల త
చ్ఛీల మతిక్రమింతు ? రిది సిద్ధము నమ్ముము నెమ్మనంబునన్. 369

క. మాకును జిత్తంబుల మృగ
యాకౌతుక మతిశయిల్లినది ; గోగణర
క్షాకరణము గార్యం బగు ;
యేకీడును నేల పొందు నిందు ? మహీశా." 370

క. అనిన నతఁడు గొండొకపడి
మనమున నూహించి "బుద్ధిమంతుల రై గో
ధనము నరసి తడయక రం"
డని వారికి నెట్టకేల కనుమతి యిచ్చెన్. 371

ఆ. అక్షణంబ కౌతుకాతిశయవ్యగ్ర
హృదయుఁ డైన ఫణధరేంద్రకేతు
నాజ్ఞఁ గరిపురంబునం దెల్ల ఘోషింపఁ
బడియె ఘోషయాత్ర ప్రకటలీల. 372

—: దుర్యోధనుఁడు ఘోషయాత్ర వోవుట :—

సీ. అంతఁ బ్రహృష్టాత్ముఁ డై, లలితాంబరా
భరణాంగరాగవిస్ఫురితమూర్తి

నొప్పారి, విభుఁడు సహోదరులును. గర్ణ
గాంధారులును, బ్రియబాంధవులును
సముచితవాహనసైన్యసమేతులై
కొలువంగ, వెడలె నుజ్జ్వలవిభూతి ;
నాందోళికాదివాహనములఁ దత్ప్రియ
ప్రమదలు బహుసహస్రములు సనిరి ;

ఆ. కడఁగి పౌరులెల్లఁ గైసేసి పడఁతులుఁ
దారు నడచి రతిముదంబుతోడఁ ;
బ్రకటశకటవైశ్యపణ్యాంగనాదిసం
కులము నుల్లసిల్లె ఘోషయాత్ర. 373

వ. మఱియు నమ్మహీపతి పయనంబున కనురూపంబుగా నెనిమిదివేలు రథంబులు, ముప్పదివే లేనుంగులుఁ దొంబదివేలు గుఱ్ఱంబులు, శత సహస్రసంఖ్య కాల్వురుం గల మహాసైన్యంబు తోడ నడిచె ; మృగ యాకుశలులైన మృగయులు, విటవిదూషక వంది వైతాళికాది జను లనేకు లనుగమించి; రిట్లు గవ్యూతిమాత్రం బగు నేల యరిగి, యచ్చోట విడిసి, యద్దినశేషంబును రాత్రియుం గడిపి, మఱునాఁడు వివిధగిరిగహనంబు లతిక్రమించి, ఘోషంబు లున్న వనంబు సొచ్చి, యందొక్క రమణీయ ప్రదేశంబున శిబిరంబు గావించి యమ్మను జేంద్రుఁడు. 374

సీ. నానాసహస్రసంఖ్యానంబులై, సంత
తానందవిగతభయత్వలీల
నక్కాననమున నేదిక్కు సూచిన నతి
సంకులంబుగఁ గుంద శంఖ చంద్ర
హార నీహార డిండీర పటీర ము
క్తాహార హీరసంకాశములును,
గాదంబ కాలేయ కాదంబినీ నీల
జాల తమాలికాసన్నిభములు,

తే. ప్రౌఢబంధూకపల్లవభాసితములు,
వికచ కాంచనచంపకవిస్ఫుటములు,

సైనవర్ణంబు లొప్ప నేత్రాభిరామ
భంగి నలరారు గోకదంబములఁ గనియె. 375

వ. కని తదీయసమృద్ధికి సంతసిల్లుచు గోపాలజనంబులు సవినయంబుగాఁ దన్నుం గాంచిన నాదరించి, వారు దనకు నగ్గోవుల పేళ్లును లక్షణంబులు నేర్పడ నెఱింగించుచుండఁ బేరువేఱ వత్సంబులు వత్సతరంబులు మహోక్షంబులు, ధేనువులు దర్ణకంబులు మొదలైన గోవిశేషంబుల నాలోకించుచు, నయ్యైవిధంబులఁ బసికిం దగిన రక్షణంబు గావింప నర్హజనంబుల సవిశేషంబుగా నియోగించి మఱియును. 376

క. గోపాలసమన్వితుఁడై
యాపాలమునఁ దిరిగి గోరసాస్వాదనలీ
లాపరితృప్తిఁ దలిర్చె మ
హీపాలుఁడు నెమ్మిలోడ నిష్టులుఁ దానున్. 377

వ. తదనంతరంబ గాయక నర్తకాదులు, వందిమాగధజనంబులుం గనిన నాదరించి వారికి నభిమతధనంబు లొసంగి మృగయావినోదంబునకుం దొడంగి. 378

మ. హరిణవ్రాతములం గలంచుచు, నుదగ్రానేకపశ్రేణిఁ జె
చ్చెర బంధించుచు, నుగ్ర సింహనివహచ్ఛేదైకసంక్రీడబం
ధురతం బేర్చుచుఁ, బ్రస్ఫురన్మహిషశార్దూలోద్ధతక్రోడని
ర్భరపాతంబు లొనర్చుచుం దిరిగె భూపశ్రేష్ఠుఁ డక్కాననలోన్. 379

వ. మఱియు నవవికసితసురభిసరసీరుహప్రకరపరికీర్ణంబు లగు జలాశయంబు లాలోకించుచు, నతిమనోహర ప్రసూన ఫల భరిత పాదప వనాభ్యంతరంబుల విహరించుచు, నున్మదమయూర మధుకర కీర కోకిలాలాపకోలాహలంబు లాకర్ణించుచుఁ, గ్రమంబునం బరిజనసమన్వితుం డై ధార్తరాష్ట్రుండు ద్వైతవనసరోవరంబు సేరం జనియె; నంత నట ధర్మనందనుండు తత్సమీపంబున మునిజనసహాయుం డై వన్యంబు లగు ఫలమూలవిశేషంబులు సాధనంబులుగా సద్యస్కందం బను యజ్ఞంబు సేయుచుండె; నప్పుడు దుర్యోధనుండు నిజభృత్యజనుల నక్కొలనిదరిం గ్రీడాగృహంబులు నిర్మింపనియోగించిన. 380

క. వారును సంభ్రమమున న
వ్వారిరుహాకరముపొంత వదలక క్రీడా
గారములు గట్టఁ దొడఁగుడు
వారించుచుఁ బాఱుతెంచి వడి గంధర్వుల్. 381

వ. "ఇది చిత్రసేనుం డను గంధర్వపతికిం గ్రీడార్థంబు కల్పితం బైనది; గావున మీ రిక్కొలను సేరక తొలంగి పోవునది" యనిన వారు మగుడం జని దుర్యోధనునకుఁ జెప్పుటయు నతండు రణదుర్మదు లైన సైనికులం గొందఱం బంచిన సరికి వారలు గంధర్వుల కిట్లనిరి. 382

మ. "బలియుం డాధృతరాష్ట్రసూనుఁడు, మహాబాహుండుఁ దుర్యోధనుం
డలఘుం డీకమలాకరంబునకుఁ గ్రీడార్థంబు గౌతూహలం
బెలయంగాఁ బ్రియకామినీసహితుఁ డై యేతెంచుచున్నాఁడు; మీ
ర్వల దిం దుండఁ; దొలంగి పొం" డనవుడుం వా రుద్ధతక్రోధు లై.

వ. ఒండొరువుల మొగంబులు సూచి పెలుచ నవ్వి వారల కిట్లనిరి. 384

క. "ఎదిరింప దన్ను నెఱుంగఁడు;
మదమునఁ బ్రాణంబుఁ దనదు మానముఁ గోల్పో
మదిఁ దలఁచినాఁడు మీనృపుఁ;
డిదియేటికిఁ జెనఁటి చెయ్వు లిన్నియు నిచటన్. 385

వ. బుద్ధిమంతుఁ డై యూరక చనుట లెస్స యనుం'' డనినం గ్రమ్మఱి చని వారు కురుపతికిం దద్వచనంబుల తెఱం గంతయుం జెప్పుటయు నతండు రోషావేశ వివశుం డై తమ్ముల దొరలం జూచి "మీ రందఱు మీమీసైన్యంబులతోడం గూడి కడంగి దుర్వినీతు లైన గంధర్వుల గర్వంబు మాన్పి సరోవరం బాక్రమించునది; వారికి సహాయుం డయి సురగణసమేతంబుగ నింద్రుండు సనుదెంచెనేనియు నవలీల జయించునది'' యని నియోగించిన. 386

క. అతులచతురంగసేనా
న్వితు లయి, ధృతరాష్ట్రసుతులు నిరతిశయరయో
ద్ధత సింహనాదబధిరీ
కృతదిఙ్ముఖు లగుచుఁ జనిరి గినుక యెలర్పన్. 387

వ. ఇట్లు సనుదెంచు కురువీరుల కడ్డంబు వచ్చి కొందఱు గంధర్వులు
ప్రియపూర్వకంబుగా "నిట నేల వచ్చెదరు? మీకు మాతోడివిద్వేషం
బేటికి? నిలువుం"డనినం బెలుచ నార్చి సేనాగ్రచరులు వారలమీఁదం
బ్రచురశస్త్రాస్త్రపాతంబు సేయం దొడంగినం దొలంగి చని,
యాగంధర్వు లాక్షణంబ చిత్రసేనునకు నంతయుఁ జెప్పి పుచ్చినం
బ్రబలరోషరంజితాననుం డై యతండు. 388

క. "చనుఁడు రయంబున నాదు
ర్జనులం గౌరవులఁ బొదివి సమయింపుఁడు మీ"
రని బహుసహస్రసంఖ్యులఁ
బనిచెను గంధర్వవరులఁ బ్రకటితబలులన్. 389

వ. ఇట్లు పనిచిన. 390

ఉ. ఆయత కుంత కార్ముక గదాసి పరశ్వథ శూల పట్టిసా
ద్యాయుధఘోరహస్తులు, కులాచల తుంగతనుల్, ప్రచండ తే
జోయుతు లావియచ్చరులు శూరతమై నడతెంచి బల్విడిం
గో యని తాఁకి రుగ్రరణకోవిదు లై కురురాజసైన్యముల్. 391

వ. ఇవ్విధంబున గంధర్వులు పెట్టిదంబుగాఁ గిట్టి నొప్పింపం దొడంగినం
గలంగి దుశ్శాసనాది కౌరవులు ససైన్యంబుగాఁ దెరలి దుర్యోధను
చేరువకుం బఱచినఁ, గర్ణుం డొక్కరుండ సుస్థిరుం డయి నిలిచి, గంధ
ర్వుల నిలువరించి భల్లార్ధచంద్ర ప్రముఖ బహుళబాణపాతంబులం
దదీయదేహంబులు ఖండించుచు నిమిష మాత్రంబునఁ జిత్ర సేను
సైనికశతంబుల రూపుమాపుటయు, మఱియుం బైపై గంధర్వులు
శతసహస్రసంఖ్యులు తోఁతెంచినం బృథివి యెల్లను గంధ్వమయం
బైన ట్లుండె నప్పుడు. 392

చ. శకునియుఁ దమ్ములుం బ్రబలసైన్యముతో నడతేర, నాహవో
త్సుకమతి యై సుయోధనుఁడు సూతతనూభవుఁ డున్నచోటికిం
బ్రకటభుజోగ్రతం గడఁగి, బల్విడిఁ దద్రిపుకోటి దాఁకెనన్
సకలజగద్భయంకరలసత్సమరోత్సవ మయ్యె నయ్యెడన్. 393

క. కొండొక సేపునకు మహో
ద్దండనృపానేకఘోరతరవిశిఖవ్యా
ఖండితశరీరు లై ధృతి
ఖండితముగఁ బల్లటిల్లిరి గంధర్వు లనిన్. 394

—: చిత్రసేనుం డను గంధర్వరాజు దుర్యోధనునితో యుద్ధము సేయుట :—

క. గంధర్వులు దెరలుట విని
గంధర్వవిభుండు క్రోధకలుషితమతి యై
గంధగజముచందమున మ
దాంధగతిం గవిసెఁ గౌరవానీకముపై. 395

వ. ఇట్లు గవిసి చిత్రసేనుండు 396

శా. మాయాసంగరకోవిదుండు, వికసన్మాయాస్త్రజాలంబులన్
వాయువ్యాప్తి యడంగ, నర్కకిరణవ్రాతంబు రుద్ధంబుగాఁ
జేయం బొచ్చినఁ ద్రెళ్ళెఁ దేరులు, కరుల్ శీర్ణంబు లయ్యెన్, దళ
త్కాయం బయ్యె హయాలి, గూలిరి భటుల్ గౌరవ్యసైన్యంబునన్.

క. పొదలి యొకని కొక్కనికిని
బదుగురు పదుగురుగఁ గవిసి పౌరవసేనం
బొదివి సమయింపఁ దొడఁగిరి
వదలక గంధర్వు లని నవార్యోద్ధతు లై. 398

వ. అవ్వియచ్చరుల విక్రమంబునకు నోర్వక బెదరి చెదరి కురురాజ
సైన్యంబు ధర్మనందనుం డున్న కందువకుఁ బాఱం దొడంగె;
నప్పుడు రాధేయుం డజేయుం డై కులశైలంబునుంబోలెఁ దలరక
నిలిచి, గంధర్వులు గురియు శరవర్షంబున మునుఁగుచుఁ దన
యోపినంత పెనంగుచుండె; సోదరసౌబలసహాయుం డై దుర్యోధ
నుండు గర్ణసాహాయ్యంబు వదలక నిలిచె; నంత ననంతసత్త్వు లైన
గంధర్వు లనేకులు సుట్టు ముట్టి. 399

ఉ. కొందఱు సూతు, నశ్వములఁ గొందఱు, కొందఱు చాపదండముం,
గొందఱు చక్రయుగ్మకముఁ, గొందఱు విస్ఫురితాతపత్రముం,

గొందఱు కూబరంబు, మఱికొందఱు కేతువుఁ, గొంద ఱశ్వమున్,
దందడిఁ దున్మివైచి విరథత్వ మొనర్చిరి సూతసూతికిన్. 400

వ. ఇట్లు విరథుం డయి కర్ణుండు వికర్ణురథం బెక్కి రణభూమికిం దొలంగి
చనియె; దుర్యోధనుండు విముఖుండు గాక పరబలంబు మార్కొని
పెనంగం దొడంగినం గినిసి చిత్రసేనుండు వానిం దలపడి, తదీయ
స్యందనంబు రాధేయు రథంబు నట్లు భగ్నంబుగాఁ జేయించి,
విరథుం డగు నమ్మహీవిభుం గేశాకర్షణంబున నేలం బడ వైచి,
పెడకేలుగట్టి సింహనాదంబు సేసినం దక్కిన గంధర్వులుం గనుకనిం
బేర్చి యతని వనితాజనంబులను, దత్సోదరు లగు దుశ్శాసనదుర్విషహ
దుర్ముఖవివింశతి చిత్రసేనవిందానువిందులను, దత్తనూభవులను,
దదీయ మంత్రులను బట్టి బంధించి చిత్రసేనున కొప్పించి; రంతఁ
బెఱకౌరవులును బౌరులు నమాత్యులుం జెదరి యాక్రోశించుచుం
బఱచి ధర్మపుత్రు శరణు సొచ్చి యి ట్లనిరి. 401

మ. "ఘనబాహాబలదుర్నివారమహిమన్ గంధర్వవీరుల్ సుయో
ధనుఁ, దత్కాంతలఁ, దత్సహోదరుల బంధప్రాప్తులం జేసి కై
కొని వే పోవుచు నున్న వా రదె! రిపుక్షోభంబు గావించి, నీ
యనుజవ్రాతముఁ గావవే కరుణ నిండారంగ రాజోత్తమా." 402

వ. అని కృతాంజలు లై పలుకు చున్న వారిం జూచి భీమసేనుండు
ప్రహసితాననుండగుచు ధర్మపుత్త్రున కి ట్లనియె. 403

ఆ. మనకుఁ జులుక నయ్యె; మనచేయు పనియ గం
ధర్వవరులు గూడి తగ నొనర్చి;
రింత లెస్సయగునె ? యేభారమును లేక
యూరకుండ మనల నొందె జయము. 404

తే. పుట్టుఁగ ల్లరి వైయె, పాపములకు నెల్ల
దిట్ట వైయె, లోకములచేతఁ దిట్టువడిన
కట్టిఁడికి నిట్టికష్టంబు గా నొనర్చి
తగ విధాతృఁడు చతురుఁ డై నెగడె నేఁడు. 405

మ. విపరీతస్థితి నొంది, ఘోరవిపినోర్వీ వాసు లై నిన్న్యదుః
ఖపరాధీనతఁ నూలి రంచు మనలన్ గర్వోద్ధతస్వాంతుఁ డై
యపలాపింపఁగ వచ్చి, దుర్ణయపరుం డాధార్తరాష్ట్రుండు దో
షపరీతాత్ముఁడు దత్ఫలంబు గుడిచెన్ సత్యంబు సామాత్యుఁ డై. 406

వ. వానిదెసం గృప సేయ వల" దనిన ననుజునకు నగ్రజుం డిట్లనియె.

క. "అకట! యిది పరుషవాక్యము
లకు సమయమె? శరణు సొచ్చి లఘుభావముతో
వికల గతి నున్న కౌరవ
నికరమునకుఁ గరుణ సేయ నీకుం దగదే? 408

వ. ఏ కాన్వయజాతు లైన వారికి నర్థనిమిత్తం బయిన భేదం బొక్కొక్కమాటు వర్తిల్లు; నంతనచేసి సహజస్నేహంబు దప్ప నేరదు; జ్ఞాతిజనంబులు దమలో నెట్టి వారైన నొప్పుం గాని యన్యులవలనం బరిభవంబు దొడరినప్పుడు దా రొండొరులఁ జేకొన కునికి లోకనింద్యంబు; దుర్యోధనుండు దుర్వినీతుం డై నను సభార్యుం డయి పరులచేతం బట్టువడియె; దీని నుపేక్షించిన మనకుం గులహాని యగు; నిదియు నుంగాక శరణాగతరక్షణంబు రాజమాత్రంబువాని కెల్ల ధర్మంబు; నీయట్టి బాహుబలసంపన్నునకు నిట్టి సుకర్మంబు కర్తవ్యం బని వేఱు చెప్ప నేల? లెమ్ము నీవును నీతమ్ములు నిమ్ముల రథంబు లెక్కి సర్వాయుధసన్నద్ధు లై చని సుయోధను చెఱ దలుగుం" డనినఁ బవననందనుండు ధర్మనందనున కిట్లనియె. 409

సీ. "అనుమాన మొక్కింతయును లేక యలిగి జ
లంబులఁ ద్రోచె; విషంబు వెట్టె;
గృహదాహ మొనరించె; విహితదురోదర
కపటుఁ డై రాజ్యంబు నపహరించె;
జను లెల్లఁ జూడంగ వనజాక్షిఁ బాంచాలిఁ
దలవట్టి యీడ్పించె; వలువ లొలువఁ
బనిచెఁ; బుట్టినకొలె మనకు నక్కట సుయో
ధనుఁ డెగ్గు సేయనిదినముఁ గలదె?

ఆ. వానిచేత నొకటి యేనియుఁ దలఁపవు
నీవు; మనుజనాథ; కేవలంపుఁ
గరుణ వూని యుండు; దరయు నెప్పుడు నిట్టు
లైన మనకుఁ గార్యహాని గాదె.'' 410

వ. అని పూర్వవైరస్మరణకలుషితుం డై పలి-న నతనికి నజాతశత్రుండు సాంత్వన పూర్వకంబుగా ని ట్లనియె. 411

ఆ. ''కావరయ్య యనినఁ గరము దుర్బలుఁ డైనఁ
జెనసి యోపినంత సేయు ననిన,
నూరకుండు నయ్య యుత్తమశూరుఁడు
దీనజనులయున్న తెలుఁగు నూచి? 412

క, శరణం బని వచ్చిన భీ
కర శత్రువు నయిన బ్రీతిఁ గావఁగ వలయుం;
గరుణాపరుల తెఱం గిది;
యిరవుగ నరిగావు దీని కేధర్మంబుల్. 413

వ. ధృతరాష్ట్రసూనుండు భవదీయ బలశౌర్యంబులపేర్మి యెఱుంగుం గావునఁ దన్ను నవశ్యంబును విడిపింతురని మనదెస బద్ధాశుం డై యుండు; నిది మనకుఁ బుణ్యంబును గీర్తియుం జేకొను సమయంబు; ని న్నింత నిర్బంధింప వలవ, దేన యరుగుదు; నిప్పుడు యజ్ఞదీక్షితుండ నై యున్నవాఁడఁ; గావున నాకుం జనరాదు; మీరు వేగ చని గంధర్వులం బ్రియపూర్వకంబుగా ననునయించి, సుయోధను విడిపించునది; సామవచనంబులం దీరకున్నఁ బరాక్రమంబున నైనం బ్రతివీరుల నోర్చి కార్యంబు దీర్చునది; నాచేయు జన్నంబు సఫలంబు సేయుం"డనిన భీముం డెట్టకేనియు నియ్యకొనియె; నర్జునుండును ధర్మరాజు పనుపు గైకొని కురురాజు చెఱ దలుగఁ బ్రతిజ్ఞ సేసె; నకులసహదేవులు నుత్సాహసమేతు లయి; ర న్నలువురు నాముక్తకవచులు, నాబద్ధ తూణీరులు, నాకలితకార్ముకులు, నారూఢరథులు నయి యగ్రజు వీడ్కొని యతిత్వరితగతి నడచినం, గౌరవసైన్యం బంతయు వారిం

గూడుకొని సింహనాదంబులు సెలంగఁ జనియె; నిట్లరిగి వారలు గంధమాదనంబునకయి చనుచున్న యవ్వియచ్చరానీయకంబుం గూడ ముట్టిన. 414

—: భీమార్జున నకుల సహదేవులు గంధర్వులతో యుద్ధంబు సేయుట :—

క. కని గంధర్వులు గ్రమ్మఱి
ఘనులం బాండవుల నగ్నికల్పులఁ, దేజో
ధనుల, నమరేంద్రసదృశుల
ననఘుల మార్కొనిరి ప్రకటితాటోపమునన్. 415

ఉ. అగ్రజువాక్యముల్ దలఁచి యర్జునుఁ డప్పుడు వారితోడ న
త్యుగ్రత దక్కి యెంతయుఁ బ్రియోక్తుల నిట్లను "మీకు మాయెడన్
విగ్రహ మేల? నెయ్యమున విడ్వఁడు కౌరవరాజుఁ; బార్థివ
ప్రాగ్రసరుండు ధర్మసుతు పన్పిది; మీకు నలంఘ్య మిత్తఱిన్."

వ. అనిన నతనికి గంధర్వు లిట్లనిరి. 417

తే. "ధర్మజుఁడు మాకుఁ బ్రభుఁడె? యాధర్మతనయు
నాజ్ఞ నే మేల యొనరింతు? మనిమిషేంద్రుఁ
డొక్కరుఁడ మమ్ము శాసింప నొడయఁ; డన్యు
లెందు నెవ్వరైనను భయ మేమి మాకు?" 418

వ. అనిన వివ్వచ్చుం డవ్వియచ్చరుల నుపలక్షించి, "మునున్న తెరువకుం జొరనేల? యని ప్రియంబును ధర్మంబునుం గాఁ బలికితి; నెట్లును మీరు సామసాధ్యులరు గా కునికి దోఁచుచున్నయది; గావున నుగ్రం బయిన విగ్రహంబున దుర్యోధను విడిపింతు" నని వారల మీఁద నిశితవిశిఖప్రకరంబులు ప్రయోగించె; నాగంధర్వులు నతనిపైఁ బటు బాణవర్షంబులు గురిసి; రిట్లానలువురకు ననేక గంధర్వశత సహస్రంబులతో నతిఘోరసమరం బయ్యె నందు. 419

తరలము. కదిసి యర్జును తేరు భగ్నముగా నొనర్పఁ దలంచి పె
ల్లొదవి ఖేచరకోటి గ్రమ్ముటయుం, బురందరనందనుం
డదయుఁడై పదిలక్షలం, బ్రళయాగ్నికల్పుల, దివ్యులం,
గదనశూరుల నిర్దహించెఁ బ్రకాండదివ్యశరార్చులన్. 420

మహాస్రగ్ధర. ఘనకోదండోగ్రమౌర్వీక్వణ మఖిలనభో
గహ్వరాభోగభాగం
బున నాపూర్ణంబు గా, నుబ్బునఁ గవలు మరు
త్పుత్రుఁడుం దీవ్రనారా
చనితాంతాపాతలీలాసరభసగతులై
శత్రువీరవ్రజంబుం
దునుమం, దచ్ఛోణితంబుల్ దొరఁగి మడువు లై
తొట్టె నయ్యుద్ధభూమిన్. 421

వ. ఇట్లు కౌంతేయులచేతం బీడితులై గంధర్వులు దుర్యోధనాదులఁ
జెఱ లేమఱక కొనుచు గగనంబునకు నెగసి, త్రోసి పోవ నుంకించిన
నెఱింగి సవ్యసాచిరయంబున నతినిబిడబాణజాలంబులం జేసి దిఙ్నభో
మార్గంబులు నీరంధ్రంబులుగాఁ గప్పిన, నగ్గగనచరులు వలలోనం
జిక్కిన పులుఁగులుంబోలెఁ బోవ నేరక శరపంజరంబునం జిక్కియు,
నుక్కు సెడక యన్నలువురమీఁద వివిధాయుధ పరంపరలు ప్రయో
గించిన. 422

మ. అవి యెల్లం దునుమాడి క్రీడి ఘనరోషాభీలుఁడై శాతభ
ల్లవితానం బడరించినం దలలు డొల్లం, గాయముల్ మింటనుం
డి వడిం గుంభినిఁ గూలఁగా, రుధిరవృష్టిం గాలువల్ వాఱగా
దివి గంధర్వులక్రం దడంగె జగ ముద్వేగంబునం బొందగన్. 423

వ. మఱియు నర్జునప్రయుక్తం బయిన యాగ్నేయాస్త్రంబు దావాగ్ని
నీరసవిపినంబు దహించుతెఱంగున గంధర్వనివహంబు నీఱు సేయం
దొడంగినం, గినిసి చిత్రసేనుండు భీమసేనానుజుమీఁదం బటుగదాదం
డంబు వైచిన నతండు దాని నేడు తునియలుగా నేయుటయు,
గంధర్వరాజు మాయాబలంబున నంతర్హితుండై. 424

క. నలువురు పార్థుల నత్యు
జ్జ్వలశరవర్షముల ముంచి జలధరముక్రియం
బెలుచన గర్జిల్లుచు మొ
క్కలుఁ డయి తనవిక్రమంబుఁ గడఁకయుఁ జూపెన్. 425

ఆ. కాని నులుక, యింద్రసూనుండు గాండీవి
శబ్దభేదు లయిన సాయకములఁ
జిత్రసేనుసర్వగాత్రంబు భేదించి
యొక్కమాత్రలోన నుడిపెఁ గడఁక. 426

వ. ఇట్లు నొచ్చి గంధర్వనాయకుండు రణసంరంభంబు విడిచి, యర్జునుం జేరంజని, తనవాడ సూపి నిలిచిన, నవ్వీరుండును నాత్మసఖుండయిన ఖేచరపతితెఱంగు సూచి, సంహృతాస్త్రుం డయ్యె; వృకోదరాదులును సమరవిరామంబు నొందిరి; వార లందఱుఁ దమ తమ రథంబులమీఁదన యుండి యొండొరులఁ గుశలంబు లడిగి; రప్పు డర్జునుండు చిత్రసేనున కిట్లనియె. 427

క. "శిరోత్తమ! నీ కిమ్మెయి
వైరము దగునయ్య కౌరవప్రకరముతోఁ?
గౌరవపతి విడువుము త
ద్దారానుజసుతసమన్వితంబుగ నెమ్మిన్." 428

వ. అనిన నతం డర్జునున కిట్లనియె 429

సీ. "ఈదురాత్ముఁడు మిమ్ము నిష్ఠ్వనంబున నితాం
తాయాసపీడితు లైన వారిఁ,
బరమధర్మాత్ముల, భార్యాసమేతుల
నపహాసింపఁ దలంచి యరుగుదెంచె;
నింతయు నెఱిఁగి సురేంద్రుండు గలుపించి
యనుజసధూనవహాయుధాన్వితముగఁ
బాపవర్తను వీనిఁ బట్టి తె మ్మని నన్నుఁ
బనిచిన వచ్చితిఁ; బార్థ! వినవె;

తే. శక్రుపాలికి నిరె కొని చనుచు నున్న
వాఁడ; నీ వింక నొం డనవలదు; వినుము;
మత్సఖుండవు గావున మత్సరంబు
నలుకయును లేదు నీదెస ననఘ! నాకు." 430

తే. అనిన నర్జునుఁ డతని కిట్లనియె "నీవు
యోధనుఁడు మాకు వినుము, సహోదరుండు

గాన; యీతని విడుచుట గర్జ; మిదియ
ధర్మజున కెంతయును బ్రమోదంబు సేఁత. 431

చ. అమరవరేణ్యుపన్పయిన నావల నెయ్యది యైన నిప్డు ధ
ర్మమహితుఁ డైన ధర్మజునమక్షమునం దెఱిఁగించి, యాతఁ డే
క్రమమున నెద్ది సెప్పె నది గైకొని చేయుము నీవు; మత్ప్రియా
ర్థము చనుదెమ్ము" నావుడును దాని కొడంబడి చిత్రసేనుఁడున్.

—: చిత్రసేనుఁడు ధర్మరాజునొద్దకు వచ్చి దుర్యోధను విడిచిపెట్టి పోవుట :—

వ. వారలుం దాను ధర్మజుకడకుం జనిన, నయ్యజాతశత్రుండు చిత్ర
సేను నతిప్రియంబునం బూజించి "మహాత్మా! యీ సుయోధనుండు
సానుజామాత్యుం డయి మీచేత వధియింపం బడకునికి మే లయ్యె;
మీ కారణంబున మావంశంబునకు నొండొక్కహాని వొంద దయ్యె;
వీఁ డెట్టి యపరాధంబు సేసినను నది యంతయు సహించి మాకుం
గా వీని విడువ వలయు"నని ప్రార్థించిన నతం డట్లకాక యని
దుర్యోధనాదుల నందఱ విడిచి, పాండుపుత్రుల నామంత్రణంబు
సేసి, దివంబున కరిగి తత్ప్రకారంబు సకలంబును నింద్రునకు నివేదించిన,
నింద్రుండును సమర నిహతులయిన గంధర్వుల నమృతవృష్టిం జేసి
బ్రదికించె; నిట యధిష్ఠిరుండును ధార్తరాష్ట్రునకు బంధమోక్షణంబు
గావించి వాని కిట్లనియె. 433

ఉ. "ఎన్నఁడు నిట్టిసాహసము లింక నొనర్పకు మయ్య; దుర్జనుం
డన్నన సాహసక్రియలయందుఁ గడంగి నశించుఁ; గావునం
గ్రన్నన తమ్ములన్ దొరలఁ గైకొని యిమ్ములఁ బొమ్ము వీటికిన్;
సన్నుత! దీని కొండొకవిషాదముఁ బొందకుమీ మనంబునన్."

వ. అని బుద్ధి సెప్పి వీడ్కొలిపిన నతండును దీనాననుం డగుచుం జనియె;
ననుజ సహితుం డయిన ధర్మతనయు ధార్మికత్వంబు ధౌమ్యాది
భూసురులును, దదాశ్రమవాసులయిన మహామునులును బహువిధం
బులఁ బ్రస్తుతించి; రని వైశంపాయన వర్ణితంబయిన కథావిశేషంబు
సవిస్తరంబుగా. 435

క. రాజకులతిలక ! భువనవి
రాజిత సితకీర్తి! దివిజ రాజవిభవ! ని
ర్వ్యాజపరాక్రమ ! సకలధ
రాజనసంపూజ్య ! ధర్మరక్షణదక్షా! 436

స్రగ్విణి. సర్వలోకాశ్రయా ! సౌమ్యభావోదయా !
నిర్వికారాకృతీ ! నిత్యసత్యోన్నతీ !
గర్వితోద్యద్భుజాకల్పకల్పోల్లస
త్సర్వసర్వంసహాచక్ర చక్రాయుధా ! 437

గద్యము. ఇది సకలసుకవిజనవినుత నన్నయభట్టప్రణీతం బైన శ్రీమహాభారతంబున నారణ్యపర్వంబునఁ బతివ్రతాచరిత్రంబును, ధర్మవ్యాధుండు గౌశికునకుఁ బరమధర్మం బెఱింగించుటయు, నగ్నివంశాను కీర్తనంబును, గుమారోత్పత్తియు, సత్యాద్రౌపదీసంవాదంబును, పాండవులు ద్వైతవనంబునకుం జనుటయు, ధృతరాష్ట్రు వాక్యంబులును; దుర్యోధనాదుల దుర్మంత్రంబున ఘోషయాత్రయుఁ, గౌరవగంధర్వయుద్ధంబును, దుర్యోధనాదులు గంధర్వులచేతం బట్టువడుటయు, నరునుండు వారల విడిపించుటయు నన్నది పంచమాశ్వాసము.



శ్రీః

గణేశశారదా గురుభ్యో నమః

# శ్రీమదాంధ్ర మహాభారతము

## ఆరణ్యపర్వము - షష్ఠాశ్వాసము

శ్రీ లలితమూర్తి! సుమహా
చ్చాళుక్యవరేణ్య! పుణ్యచారిత్ర ! విచి
త్రాలంకారోజ్జ్వలకవి
తాలాపకలాప సంతతానందమతీ ! 1

### —: దుర్యోధనుని విషాదము :—

వ. అక్కథకుండు శౌనకాదిమహామునులకుం జెప్పె; నట్లతిమానుషం బైన యర్జును పరాక్రమంబును, నత్యంతదైన్యాస్పదం బగు దుర్యోధను పరాభవంబును, ధర్మజు దయయు నాకర్ణించి విస్మయజుగుప్సాకలితమానసుం డగుచు జనమేజయుండు వైశంపాయనున కిట్లనియె.

చ. ''అనిశముఁ బాండుపుత్రులకు నప్రియకార్యము రోయునట్టి దు
ర్జనుఁడు సుయోధనుం డటులు శత్రులచే నవమానితుండుఁ జే
ర్చినకృప నొప్పుచున్న కురుసింహులచేత విమోక్షితుండు నై
మనమున లజ్జ లేక మునిమండన! యెమ్మెయి నేఁగె వీటికిన్? 3

మత్తకోకిలము. మేనఁ బ్రాణము దాల్చి, భంగము మ్రింగి, యెప్పటి
చాడ్పునన్
మానవేంద్రుఁడ నేను దద్దయు మానినన్ దలఁ పాత్మలోఁ
బూను టాతని కెట్లు గల్గెఁగఁ బోలు? నారయ నద్భుతం
బైన తచ్చరితంబు సెప్పుమ యంతయుం బరిపాటితోన్.''

వ. అని యడిగిన నమ్మహాముని యి ట్లను "నట్లు కౌంతేయులచేత బంధమోక్షితుం డై దుర్యోధనుండు లజ్జాకజ్జలితహృదయుం డగుచుఁ జెదరిన సేనలం గూడుకొని కొంతద వ్వరిగి, యొక్క సమతలంబునం బటమందిరవిరచనంబు నిర్వర్తించి, యభ్యంతరమందిరమ్మున నొక్కరుండును దల్పంబుపయిం బడి చింతాపరవశత్వంబు నొంది, రాహుకబళనకలుషితుం డైన రోహిణీపతియునుంబోలె విషాదవివర్ణుండయి యున్న యెడఁ గర్ణుండు వచ్చి సముచితంబుగాఁ గని యన్న రేంద్రునకి ట్లనియె. 5

చ. "మనుజవరేణ్య, చూడ నతిమానుష; మమ్మెయిఁ గయ్య మెందుఁ గల్గునె? పటువిక్రమాన్వితులఁ, గ్రోధనిబద్ధులఁ, గామరూపులం
జెనయఁగ వచ్చునే ఖచరసింహుల నేరికి? నట్టివారి నే
పునఁ దునుమాడి గెల్చితి విభూతి యెలర్పఁగ నీవుఁ దమ్ములున్. 6

ఉ. అప్పుడు నీవు సూడఁగ ననంతము లై ఖచరేంద్రసైన్యముల్
గప్పె ననేకసాయకనికాయములం బడి నన్ను; నేనునుం
గుప్పలు గూల నేసి రిపుకోటి వధించితి; నంతలోన న
న్నొప్పరికించె సైన్యతతి; యొక్కఁడ నై రణభూమి నొచ్చితిన్. 7

వ. ఆలోనన విరథుండ నై వికర్ణరథం బెక్కిన నది సమరప్రదేశంబునకుఁ దొలంగఁ బఱచె; దేవా! నీవు బలవిక్రమాతిశయంబులం బ్రతివీరుల నోర్చి యక్షతుండ వై యుండుట గనుంగొని కృతార్థుండ నైతి; నిట్టి పరాక్రమంబు సేసినవా రిజ్జగంబున నెవ్వరు గల? రిది యత్యద్భుతం" బనినఁ గౌరవేశ్వరుం డాత్మగతంబున "నీతండు మత్పరికాభం బెఱుంగక యిట్లు వలికెం గా కేమి" యని లజ్జితుం డగుచు రాధేయున కి ట్లనియె. 8

సీ. "అనఘ! తమ్ములు నేను నంబరచరకోటిఁ
దలపడి పోరంగ, బలయుగంబుఁ
జచ్చియు నొచ్చియుఁ జలమునఁ బెనఁగె; నా
సమయంబునందు విక్రమ మెలర్ప

గంధర్వపతితోడఁ గలిగెఁ గయ్యము నాకు;
నాతనిశరములచేతఁ నాజి
నేను నొచ్చితి; వేయు నేల భార్యానుజ
సుతమిత్రజనసమన్వితము గాఁగ
తే. నన్నుఁ జెఱగొని గంధర్వనాయకుండు
నెగసె దివమున; కప్పుడు బెగడి చెదరి
పఱచి మనవారలెల్లను పాండుసుతుల
శరణు సొచ్చిరి దైన్యసంభరితు లగుచు. 9

ఉ. వారలయార్తిఁ జూచి జనవంద్యుఁడు ధర్మసుతుండు తమ్ములన్
భూరిబలాఢ్యులం బరమపుణ్యుఁడు నన్ విడిపింపఁ బంచె; న
వ్వీరులు నుక్కునం గవిసి పేఁకున ఖేచరకోటిఁ దొత్తి నిం
పారఁ బ్రియోక్తులం దెలఁచి; రంతటఁ దీరద కార్య మెమ్మెయిన్. 10

ఆ. అంతఁ దెగువ చేసి యంతకాకారులై
భీమపార్థయములు భీమబలులు
ఖచరతతులమీఁదఁ బ్రచురబాణౌఘముల్
గురిసి రాహవమున బరుషభంగి 11

వ. తదీయబాణపాతంబున నొచ్చి గంధర్వులు మమ్ముం గొనుచు గగనంబు
నం బఱచిన, నర్జునుండు వారికిం బోవ రాకుండ నతనిబిడబాణజాలం
బుల నంబర మార్గంబు నిరోధించినఁ జిత్రసేనుండు దన ప్రియసఖుం
డైన శతమఖసుతుం జేర నరిగి కుశలం బడిగిన, నర్జునుండునుం
బ్రీతుం డై వాని ననునయించి 'యీ దుర్యోధనుండు మా తోడం
బుట్టువు గావున నితని విడువ వలయు' ననిన నా గంధర్వ నాయ
కుండు. 12

క. మనదుర్మంత్రిత మంతయు
ఘనుఁ డప్పార్థునకుఁ జెప్పి "ఘనభుజ! యిది యిం
ద్రునిపను పగుట నపశ్యం
బును నీతని విడువ" ననియె భూరి బలుం డై. 13

క. కడు లజ్జయు దైన్యంబును
నడరి ముసుఁగువడఁగ నాకు నాత్మగతమునం
బుడమి వివరంబు లేదే
యడఁగెద నన్నట్టి దయ్యె నప్పుడు కర్ణా! 14

వ. అంతం గౌంతేయులు గంధర్వులం దోడ్కొని ధర్మరాజు పాలికిం జని, మన దుర్మంత్రంబు కతంబున బంధగోచరుండ నయిన నన్ను నయ్యజాతశత్రుముందట నివేదించిన, నతండు విడిచి పుత్తెంచె; నిది మదీయవృత్తాంతంబు. 15

క. ఒవ్వనివారల యెదురున
నివ్విధమున భంగపడితి; నే నింక జనుల్
నవ్వఁగ నేటిబ్రతుకుగా
నివ్వసుమతి యేలువాఁడ? నెట్లు చరింతుఁన్? 16

ఉ. అక్కట! యమ్మహారణమునందు వియచ్చరకోటితోడఁ బే
రుక్కునఁ బోరి యేను మృతి నొందగ నేరన; యట్లు లైన నీ
తక్కువపాటు లేక ప్రమదంబున దేవపదంబు నొందుదున్;
మిక్కిలియైన కీర్తియును మేదినియందు వెలుంగు నిత్యమై. 17

**—: దుర్యోధనుండు ప్రాయోపవేశంబు సేయఁ బూనుట :—**

వ. కావున నిట్టి దురవస్థపాలైతి; నేను బ్రాయోపవేశంబునఁ బ్రాణపరిత్యాగంబుఁ జేసెదఁ మీ రిందఱు దుశ్శాసనుం బురస్కరించుకొని పురంబున కరుగునది; మిత్రులకుఁ బ్రమోదంబును, శత్రులకు నిర్వేదనంబునుం జేయుచు మనునట్టి యేను నేఁడు పోఁడిమి సెడి పగతురచేత శిరస్తాడనంబు సేయంబడి సిగ్గు వడక బంధుజనంబులలోని కేమని యరుగుదు? నాంబికేయుం గని యే మని పలుకుదుఁ? గురువృద్ధు లయిన భీష్మబాహ్లికులయు, నాచార్యు లయిన కృపద్రోణులయు సమ్ముఖంబున నెట్లు నిలుతుఁ? బరిజనులుం బౌరులుం బురోహితులు నన్నుం గనిన నే మని సంభాషింతు? నిది యాత్మదోషంబున నైన యపాయంబు; నా కవశ్యభోక్తవ్యంబు. 18

క. విను దుర్వినయాత్మకుఁ డగు
జనుఁ డుజ్జ్వల మైన సిరియు సద్విద్యయుఁ గ
ల్గిన నందు మెలఁగ నేరక
చెనఁటి తెఱంగునకుఁ జొచ్చి చెడి పోవుఁ దుదిన్. 19

క. అకటకట! యిట్టికష్టము
నకు వచ్చితినయ్య యేను? న న్నెు వైరి
ప్రకరము లనిఁ బట్టినఁ గృప
నొకరుఁడు విడిపించె; దైవ మోపదె యెట్లున్? 20

క. మానము సెడియును నిమ్మై
మేనం బ్రాణంబు లెట్లు మేకొని తాల్తుం?
గాన యిది నిశ్చయముగాఁ
బూనితి; నా తెగువ మాన్పఁ బోల దొరులకున్.'' 21

వ. అని పలికి సమీపగతుం డైన దుశ్శాసను నాలోకించి యమ్మహీపాలుం డి ట్లనియె. 22

సీ. ''అన్న! దుశ్శాసన! నిన్ను రాజ్యమునకుఁ
బట్టంబు గట్టెదఁ బతివి గమ్ము;
శకునికర్ణులు దీర్పఁ బ్రకటవసుంధరా
వలయ మంతయు మహోజ్జ్వలత నేలు;
భ్రాతృవర్గమునకుఁ బ్రీతి సేయుము; బంధు
జనులఁ బోషింపుము; సద్ద్విజులకు
నుత్తమంబుగఁ దగువృత్తులు సెల్లింపు;
గురుజనంబుల భక్తిఁ గొలువు మెపుడు;

తే. నింద్రుఁ డమరగణంబుల నేలునట్లు
ధరణిపతుల నేలుము; బాహుదర్ప మొప్పఁ
బగఱ నుక్కడఁగింపుము; పరమమిత్రు
లైన శూరులఁ గొనియాడు మర్హభంగి." 23

వ. అనిన నమ్మాట దన హృదయంబునకు నిశితశూలం బయిన నతండు నిలువనోపక యగ్రజు పాదంబులపయిం బడి "దేవా యి ట్లానతీఁ

దగదు; నాకుం బ్రసన్నుండవగు" మని నిజనేత్రజలంబులం దదీయ
చరణయుగళం బభిషేకించుచు ని ట్లనియె. 24

చ. "అవని విదీర్ణ మైనను, హిమాద్రి చలించుట గల్గినన్, మహా
ర్ణవ జల మింకినన్, దివసనాథుఁడుఁ జంద్రుఁడు దేజ మేదినం
గువలయనాథ! నీకు నొక కుత్సితభావముఁ గల్గ నేర్చునే?
భవదుపయోగ్య మైన నృపభారము నాకు వహింప శక్యమే? 25

క. హితులై నవారిఁ బ్రోచుచు,
సతతంబును రిపుల నెల్లఁ జమరుచు, నిఖిల
క్షితితలము నీవ యేలుము
శతసంవత్సరము లధిప! జయశీలుఁడ వై." 26

వ. అనుచు నయ్యువరాజు దుఃఖాతిభారవిహ్వాలుం డై యెలుంగెత్తి
యేడ్చిన నయ్యన్నయుం గన్నీ రొలుక నూర కుండె; నప్పుడు
కర్ణుండు వారలం జూచి "యిట్లేల బాలిశులుంబోలె నేడ్చెదరు?
ధైర్యంబు దరియించి శోకవ్యసనంబులు విడువుండు; శోకశీలురం
జూచి పగతురు సంతసిల్లుదురు; శోకశీలురకుఁ బై పై శోకంబులు
వొందు" నని దుర్యోధనుం జేర్కొని యి ట్లనియె 27

క. "ఒక యల్పమనుజు క్రియ సో
మ కులోత్తమ! నీకు నిట్లు మహనీయసుఖ
ప్రకృతి యగు నిజశరీరం
బకట! విడువఁ దలఁప నగునె? యవిహితబుద్ధిన్, 28

తే. శోకమగ్నుండ వగు నిన్నుఁ జూచి బెగడి
యధిప! నీతమ్ములును నేను నధికదుఃఖ
వహ్ని పాల్పడమయ్యె; మావలనఁ గరుణ
కలిగి తేర్పవె యింకఁ గౌరవేంద్ర! 29

వ. పాండవులచేత విముక్తుండ వైతి నని వగచె; దంతియ కాని నీకుం
గార్యగతియందు వివేకంబు సాల; దది యెట్లనిన నేరాజు రాజ్యం
బున నిశ్చింతులయి జనులు తమ తమ జీవనంబుల వర్తింతు, రారాజు
నకు నట్టి జనులు బంట్లు; గావునఁ దారమ్మహీపతికిం దీఱమి గల్గినచోట్ల

నెల్లనుం దమ పౌరుషంబులు నెఱప వలయుఁ; గౌంతేయులు నీ దేశంబుననుండి నీ యాజ్ఞవలనం గృతారంభులై యున్నవా రగుటం జేసి, వారు నీ కింకరులు; నీకు నైన యక్కఱ దీర్చుట వారి కర్తవ్యకృత్యంబు; దీని కింత వనర నేల ? యదియునుం గాక పాండవులు జూదంబునాఁడ నీకు దాసులైరి; తదీయంబులైన మణి కనకాదివస్తువులును భవదధీనంబులై యున్నయవి; వారు నిన్నుం గొలిచి యుండుట లేకుండెనేనియు నింతటి కెలసంబు దీర్పనేనియు వలదే ? యిది యంతయు నూహించి వలవని వగలం బొగలక లెమ్ము; పురంబునకు నడువుము, నామాట వినక నిర్బంధపరుండవై తేనియు నిన్నేమనవచ్చు ? నిందఱము నీపోయినగతిన పోవం గలవారము; నీవు లోకంబుచేత నగుఁబాటును బొందెదవు; వింతియ" యని కర్ణుండు సెప్పిన విని దుర్యోధనుండు వెండియుం బ్రాయోప వేశంబునందు నిశ్చయంబు వదలకున్నం గనుంగొని శకుని యిట్లనియె.

క. "కర్ణునియాడినమాటలు
నిర్ణయమున కింత యొప్పవే ! యిప్పలుకుల్
కర్ణంబులఁ జొనుపుము; దుః
ఖార్ణవపారంబుఁ బొందు మవనీనాథా ! 31

తరలము. కడఁగి బుద్ధిబలంబునంద యకంటకంబుగఁ జేసి యేఁ
బుడమిరాజ్యము సర్వముం దగఁ బుచ్చి యిచ్చిన, నిమ్ములం
గుడువ నేరక దీని నిచ్చటఁ గూలఁ దన్ని, శరీరమున్
విడుతుఁ గా కని నిశ్చయించెదు వెఱ్ఱివై తె ? నరేశ్వరా. 32

ఆ. నీకు వృద్ధసేవ లే కున్కి యిప్పుడు
నాకుఁ దెల్లమయ్యెఁ బ్రాకటముగఁ;
గోపమును మనోనుతాపంబుఁ బొందుచో
ధీరుఁ డపుడ యుడుప నేరవలదె ? 33

తే. పిఱికితనము, నేమఱుటయు, నోఁపతనము,
మెత్తఁబాటునఁ గార్యంబునత్తెఱంగు
నేరమియు, విషయంబులఁగూరుటయును
గలుగు పతికి నుండదు సిరి, దొలఁగిపోవు. 34

వ. కావునఁ గార్యజ్ఞుండ వగుము; కార్యజ్ఞానం బెట్టిదనినః 35

ఉ. కౌరవనాథ ! నీకు నుపకారము సేసిరి పాండవేయు; ల
వ్వీరులయందు నెయ్యమును వేడ్కయు నొప్పఁగ నీ వభీష్టస
త్కారము సేఁత యుక్త మగుఁ గాక; ప్రియంపడ నర్హ మైనచో
దారుణశోకవహ్నిపరితాపముఁ బొందుట యుప్డు ధర్మమే ? 36

చ. కృతము దలంచి, చిత్తమునఁ గిల్బిష మంతయు నుజ్జగించి, స
న్మతులఁ బృథాతనూజుల నమానుషతేజులఁ బిల్వఁ బంచి, త
త్పితృధన మైనరాజ్యము నభీష్టముగాఁ దగ నిమ్ము; నీకు నీ
క్షితివలయంబునం బరమకీర్తియుఁ బుణ్యముఁ గల్గు భూవరా. 37

క. వారలు నీ తోఁబుట్టువు
లీ రాజ్యము మీరు వారు నేకం బై పెం
పారఁగ నేలుఁడు; దీనం
గౌరవకుల నాథ ! సౌఖ్యగౌరవ మొందుక్." 38

వ. అని శకుని సెప్పుచుండ సగ్గాంధారీనందనుండు నిజచరణసమీపంబునం బడియున్న దుశ్శాసనుం గ్రుచ్చి యెత్తి, మూర్ధాఘ్రాణంబు సేసి కర్ణసౌబలులం జూచి "మీ రేల నన్నుఁ గారించెదరు ? ధరైశ్వర్య ధనభోగంబులందు నా కభిలాషంబు లేదు; ప్రాయోపవేశంబునందుఁ గృతనిశ్చయుండ నైతి; మీరింక నొండునిఘ్నంబులు సేయక యూరక మీవలయునెడకుం బొం;" డనిన వారలు "దేవా ! నీవిధం బెట్టిద య య్యెనేని మే మెందుఁ జేరెదము ? నీతోడివారమ కాక" యని; రంతం గమలహితుండు పశ్చిమాచలసమీపగతుం డగుటయు, నన్నర నాథుండు సురలోకగమనకుతూహలియై శుచిస్నానంబు సేసి, వల్కలం బులు ధరియించి, సంధ్యాసమయసముచితంబు లగు కరణీయంబులు నిర్వర్తించి. వివిక్తదేశంబునందు దర్భాస్తరణంబున నాసీనుండై - వాఙ్నియతుండై. 39

క. క్రమమున బాహ్యేంద్రియక
ర్మము లెల్లను వదల విడిచి, మహితసమాధి
క్రమదశ నుండె నివాత
స్తిమితంబై వెలుఁగుచున్న దీపముపోలెక్. 40

ప్రాయోపవిష్టుఁ డైన దుర్యోధనునిఁ గృత్య పాతాళంబునకుఁ గొనిపోవుట

సీ. ఆ సమయమున మున్న మరేంద్రవిజితు లై
యహిలోకమున నున్న యసురవరులు
ధృతరాష్ట్రనందను తెగువ యెఱింగి, యా
త్మీయపక్షక్షయస్థితికి వగచి,
యాతనిఁ బిలిపింప నప్పుడు శుక్రాదు
లైన భూసురసమూహముల చేత
వేల్మి వెట్టించిన, వేగంబ యొకకృత్య
వెలువడి, భీషణవికృతమూర్తి,

ఆ. "యేమిపనులు గలిగె? నెఱిఁగింపుఁ" డనిన వా
"రిచటి కిపుడు కౌరవేంద్రు ననఘు
నుజ్జ్వలాంగు నాసుయోధనుఁ దెమ్ము ప్రా
యోపవేశనమున నున్నవాని." 41

వ. అని పనిచినం గృత్యయు నాక్షణంబ చని ప్రాయోపవిష్టుండై యున్న దుర్యోధను గ్రుచ్చి యెత్తికొని రసాతలంబునకుం దెచ్చి దైత్యులకు సమర్పించినం బ్రీతులై వారు వానిం గౌఁగిలించుకొని కుశలంబడిగి యి ట్లనిరి "యయ్యా! నీవు శూరుఁడవు, శూరజనరక్షితుండవు, భరతకులోద్వహుండ; విట్టి సాహసం బేల చేసితివి? మఱి యాత్మఘాతుకునకు లోకంబున నిందయు హీనతయు దుర్గతియుం బ్రాపించు; లోకవిరుద్ధంబులై మూలఘాతంబులైన కార్యంబులయందు నీయట్టి బుద్ధిమంతులు ప్రవర్తిల్లుదురే? యట్లు గావున నీ వఖిలధర్మార్థయశోభోగనాశంబైన యీ దుర్విచారంబు విడువుము; ధైర్యంబును బ్రతాపంబును జాటింపుము; శత్రుజనభంజనంబు సేయుము; నీవు మనుష్యమాత్రుండవు గావు; నీ పూర్వజన్మప్రకారంబు సెప్పెద మాకర్ణింపుము. 42

ఉ. ఏము తపంబు సేసి పరమేశ్వరు, నీశ్వరుఁ, బార్వతీమనః
కాముకుఁ, గామవైరి, నవికారుఁ, బురాంతకుఁ బ్రీతుఁ జేసినం
గామితదాయి యైన శితికంఠుఁడు నిన్నుఁ సృజించి యిచ్చె ను
ద్ధామదయావిధేయుఁడు ముదంబున మాకు నధీశ్వరుండు గాన్.

ఉ. నీ దగు పూర్వదేహము వినిర్మలవజ్రశిలావిశేషసం
పాదిత, మన్త్రశస్త్రపరిపాటనభేద్యము గాదు, నిత్యనిః
ఖేదము, పుష్పకోమలము, ఖేచరభూచరకామినీమనో
హ్లాదన; మిట్లుగా నభవుఁ డర్థి నొనర్చె నుమాసమేతుఁడై. 44

ఉ. నీవు ధరిత్రిఁ బుట్టుటయు, నీకు సహాయము సేయఁ గోరి నా
నావిధదైత్యదానవగణంబులు రాజకులంబులందు స
ద్భావన నుద్భవించెఁ బటుబాహులు, దివ్యమహాస్త్రకోవిదుల్,
ద్రావితవైరు, లుర్వి భగవద త్తపురస్సరులైన వీరులై. 45

వ. భీష్మ ద్రోణ కృపాదులు గొందఱు దేవాంశసంభవులైనను దదీయ
భావంబులు రాక్షసావేశంబు నొందెడు; దానంజేసి వారు నిర్దయులై
వివూఢులుంబోలె నన్యోన్యపరుషంబులు వలుకుచు, నలుక మిగులం
బుత్ర పౌత్ర మిత్ర భ్రాతృ శిష్య గురు బాల వృద్ధ జనభేదంబులు
విచారింపక, సమరంబు సేసి దివ్యంబులు మానుషంబులు నైన
వివిధాస్త్రశస్త్రంబులఁ బాండవపక్షక్షయంబు గావింపంగలవారు;
పాండవులు బంధుస్నేహంబు విడిచి తెగువకుం జొచ్చి నీచేత నిహతు
లగుదురు; నీమనంబున బీభత్సువలనిభయంబు గొంత గలదు; దాని
నెఱింగి నేమునుం దగు నుపాయంబు దలంచితి; మది యెట్లనినఁ
గృష్ణుచేతం జచ్చిన నరకాసురు నంశంబు గర్ణు నావేశింపంగలయది;
తత్కారణంబునం గృష్ణార్జునులతోడ బద్ధవైరుండై యవ్వీరుండు
నిజదివ్యాస్త్రంబులం గృష్ణుల నిద్దఱ నిర్దహించు; నివ్విధంబెఱింగి
యింద్రుండు పాండవ రక్షణార్థంబు వచ్చి కర్ణుకవచకుండలంబులు
గపటరూపంబున నవహరింపం గలవాఁడు; మఱియును. 46

క. క్షితి సంశప్తకు లనఁగా
శతలక్షసహస్రసంఖ్య జనియించిరి ద
ర్పితులై దనుజులు; దద్బల
తతిచే సమరమున నింద్రతనయుఁడు సిక్కున్. 47

తరలము. నిహతకంటక మైన యిద్ధరణీతలం బఖిలంబు నీ
మహితశాసనగోచరం బగు; మానవేంద్ర! ప్రసన్న తా

మహిమ నొందుము; నీప తేపవు మాకు నందఱకుం; గురూ
ద్వహా! విషాదము వొందఁ బాడియె? దైత్యపక్షభయంబుగాఁ జ.

మ. చను మిం కొండుదలంపు మాను"మని యాశ్వాసించి, వానిం బునః
పునరాలింగన మాచరించి, యెలమిం బూజించిఁ దైత్యోత్తముల్
జననాథోత్తమ! వీడుకొల్పిరి; తదాజ్ఞం జేసి యాకృత్యయున్
మును దాఁ దెచ్చినచోటఁ బెట్టె నధిపుఁ మోదంబు సంధిల్లఁగాన్.

ఉ. అంత సుయోధనుండు హృదయంబున విస్మయ మంది యంతవృ
త్తాంతము స్వప్నవృత్తముక్రియం దలపోసి, నిజంబ కాఁగ న
త్యంతము నిశ్చయించుచుఁ, బృథాసుతులన్ సమరంబులోన ని
ర్జింతున కాక యంచు వికసిల్లె దురాశయభగ్నబుద్ధి యై. 50

క. విను జనమేజయ! పౌరవ
జనవిభుఁ డబ్బంగి రాత్రిచరితం బగున
ద్దనుజసమాభాషణ మె
వ్వనికిని నెఱిఁగింప కుండువాఁ డయ్యె మదిన్. 51

వ. అంతఁ బ్రభాతం బగుటయు రాధేయుండు సుయోధనుపాలికిం జని
హేతుమద్వాక్యంబుల నతని కి ట్లనియె. 52

ఉ. "చచ్చినపిమ్మటం గడిఁదిశత్రుల నోర్వఁగ వచ్చునే? శుభం
బిచ్చునె చావు లెందును? నరేశ్వర! యాఱడి చత్తు నంట దా
మె చ్చగు నయ్య యెరికిని? మేనికి జీవము గల్గుచోన పెం
పచ్చుగ సిద్ధిఁ బొందు విజయార్థసుఖంబులు మర్త్యకోటికిఁ జ. 53

ఉ. కావున శోకదైన్యములకాలము గా దిది; లెమ్ము, విక్రమ
శ్రీ విలసిల్లు" మంచుఁ గురుసింహుని, సింహసమానుఁ, జారుశ
య్యావివశాంగు నంగపతి యాదటఁ దా నిరుగేల గ్రుచ్చి సం
భావన నెత్తుచుం బ్రణయభాషల వెండియు వాని కి ట్లనున్. 54

క. "మది నర్జునుఁ జూచి భయం
బొదవినయది నీకు; వాని నుగ్రరణమునం
బదునాలవయేఁడు జయిం
చెద; నాయుధ మంటి ప్రతిన సేసితి నధిపా." 55

—: దుర్యోధనుఁడు ప్రాయోపవేశము మాని కరిపురంబునకుఁ బోవుట :—

చ. అనవుడుఁ దత్ప్రతిజ్ఞయు సురారులవాక్యములుం దలంచి య
జ్జనపతి గాఢనిశ్చయవశంవదుఁడై శయనంబు డిగ్గి చ
య్యనఁ బయనంబు సేయుఁడని యప్పుడమాత్యులఁ బంచి యిమ్ములన్
దినముఖకృత్యముల్ సలిపి దీపితుఁడై వెడలెం బ్రియంబుతోన్.

వ. అయ్యవసరంబున. 57

చ. రయవిచలత్తురంగమతరంగములన్, మదనాగనక్రసం
చయములఁ, జంచలచ్ఛటుల సైనికమత్స్యములన్, మహోన్నతం
బయి కురురాజచంద్రు నుదయంబునఁ దద్దయుఁ బొంగెఁ బ్రస్ఫుర
ద్భయదమనోహరప్రకటభంగులఁ దద్భటవార్ధి యుద్ధతిన్. 58

ఉ. చామరపుండరీకవిలసత్సిత చారుపతాకలం గురు
గ్రామణియాత్ర యెంతయును గాంతి వహించె నభంబు, శారదో
ద్దామమరాళమండలసితస్ఫుటపద్మవనీపరిస్ఫుర
త్తామరసాకరంబునవిధంబున భూచరనేత్రపర్వమై. 59

వ. ఇట్లు దుర్యోధనుండు కర్ణసౌబలసమేతుండై దుశ్శాసనాద్యనుజగణం
బునుం, దక్కిన యమాత్యగణంబులుం గొలువఁ జెలువు మిగులం జని
కరిపురంబు ప్రవేశించి, సముచితవ్యాపారంబుల నుండునంత నొక్క
నాఁడు మంత్రిజనపరివేష్టితుండై యున్న రాజునకు భీష్ముం డి
ట్లనియె. 60

మ. "హితులై పెద్దలు బుద్ధి సెప్పఁగఁ గ్రియాహీనుండవై త్రోచి పో
యితి దుష్టాత్ములఁ గూడి; దానిఁ ఫలం బెట్లయ్యెనో చూచితే?
గతవిద్వేషుఁడు ధర్మనందనుఁడు గల్గంబట్టి యప్పాట దు
ర్గతికిం దప్పితి గాక; చిక్కితి గదా గంధర్వుచే నాజిలోన్. 61

ఉ. నీవును దమ్ములుం సతులు నెయ్యురు వైరులచే గృహీతులై
పోవఁగఁ జూచిపోయెఁ గడుఁ బొల్లఁదనంబున సూతపుత్త్రుఁ; డీ
కావరుఁ, గష్టచిత్తు నధికంబుగ నమ్ముదు నీవు; వీనిబా
హావిభవంబు గయ్యమున నక్కడఁ జూచితె కన్నులారఁగన్? 62

ఉ. ఆయతబాహు, లుగ్రబలు, లార్యులు, పార్థులు; వారిభూరి శౌ
ర్యాయుధ నైపుణక్రియలయందుఁ బదాఱవపాలుఁ బోలఁ డీ
వాయపురజ్ఞులాఁ; డధిప! వారలచందము వీనిచందముణ్
నీయెడ నిక్క మై తెలిసెనే? ఖచరేంద్రులపోరిలోపలణ్. 63

క. కులమును సిరియును జెఱుపక
యలఘుస్థితి నింక నైన నప్పాండవులం
గలసి మన వయ్య; నాదగు
పలుకు వినఁ గదయ్య; హితముఁ బథ్యముఁ జుమ్మి." 64

వ. అనిన భీష్ము వచనంబులదెస నిరాదరంబు సేసి దుర్యోధనుండు గర్ణ
సౌబలులం జూచి నవ్వుచు, వారలుం దమ్ములుం దోడన చన నక్కడ
వాసి చనియె; భీష్ముండును లజ్జితుం డై నిజగృహంబున కరిగె; నంతఁ
గౌరవేశ్వరుండు గ్రమ్మఱి యెప్పటిచోటికిం జనుదెంచి, మంత్రుల
తోడ మంతనం బుండి, "మన కెయ్యది కర్తవ్యం? బెయ్యది సేసినఁ
దేజోలాభంబు లగు?" నని యడిగినఁ గర్ణుండు "దేవా! నీ కింక
నేవిచారమ్ములు నేల? నిష్కంటకం బైన యీపృథివి సకలంబునుం
బాలించుచు మహేంద్రమహిమతోడ నఖిలసుఖంబులు ననుభవింతుగా"
కనినం బ్రీతుం డై యతండు వాని కిట్లనియె. 65

క. "నీయట్టి వీరవరుఁడు స
హాయుం డకొ! వడయ రానియదియుం గలదే
ధీయుత! నా కెయ్యదియును ?
బాయక విను నింక నొక్కపని దెల్లముగాణ్. 66

తే. ధర్మజుఁడు రాజసూయంబుఁ బేర్మిఁ జేసి
నంతనుండియు నమ్మహితాధ్వరమున
యం దభిప్రాయమైయుండు నొంద నాకు;
నమ్మఖంబు సేయింపవే యనఘ నన్ను." 67

వ. అనినం గర్ణుండు గౌరవపతి కి ట్లనియె. 68

క. "అగుఁ గాక యేమి; యిప్పుడు
జగతిం గలనృపతు లెల్ల జనవర! నీ కం

మ్ముగ వశవర్తులు; కావునఁ
దగ నుద్యోగింపు మిపుడు తత్క్రతువిధికిన్. 69

ఉ. రాజులఁ బిల్వఁ బంపుము; ధరాసురసంఘము నామతింపు; పే
రోజ నుదాత్తయజ్ఞ గృహయూపతతుల్ సమకట్టఁ బంపు; వి
భ్రాజితభక్ష్యభోజ్యవిధిశవ్యపదార్థము లానయింపు; మ
వ్యాజవిభూతి మై నమరవల్లభుచాడ్పునఁ జేయు జన్నముల్." 70

వ. అనిన సంతోసిల్లి కురుపతి యప్పుడ పురోహితునిం బిలిపించి "రాజ సూయ యజ్ఞంబు సంపూర్ణదక్షిణంబుగాఁ జేయ వలయుఁ; దత్ప్రయోగ విశేషంబులకు మీరు సాలి యుండునది" యనినం బురోహితుండు దగిన విద్వజ్జనంబులతోడ విచారించి దుర్యోధనున కిట్లనియె.

చ. "జనవర! నీకుఁ బాండవులు శత్రులు గావున నీవు వారి నో
ర్చిన మఱి కాక మున్న యిటు సేయఁగ శక్యమె రాజసూయమున్?
వినుము దగంగ నిప్పటికి వే ఱొకయజ్ఞము సేయు మిమ్ములం;
బనుపుము తత్క్రియావివిధభంగులకుం దగువారి వేగమై. 72

తే. రాజసూయంబునట్టిద రాజవర్య!
వైష్ణవం బను యాగంబు; వాసుదేవుఁ
డిమ్మఖము సేసెఁ దొల్లి; యభీష్ట మిదియ
చేయు; నిర్విఘ్నముగ నిది సెల్లు నీకు." 73

క. అనిన నిది వోలు నని య
జ్జననాథుఁడు సూతతనయసౌబలులు ప్రియం
బున ననుమతింప నభిమత
వినుతాధ్వరసంప్రయోగవిహితోద్యముఁ డై. 74

క. తనయుద్యోగము జననీ
జనకులకును, ద్రోణ విదుర శాంతనవ కృపా
ది నిఖిలమాన్యజనమ్ముల
కును దగ నెఱిగించి భరతకుంజరుఁ డెలమిన్. 75

**—: దుర్యోధనుఁడు వైష్ణవం బను యజ్ఞంబు సేయుట :—**

వ. వారిచేత ననుజ్ఞాతుం డయి నగరసమీపంబున నొక్క పుణ్యస్థలంబునం దఖిల యజ్ఞగృహంబులు నతి రమణీయంబులు గాఁ జేయించి,

యజ్ఞో పకరణంబులును సమ_స్త వస్తువిశేసంబులును సమకట్ట నియో
గించి,శుభదినంబునం బరమబ్రాహ్మణ సహాయుం డై నియతదీక్షాశోభ
నంబువ హించె నంత. 76

ఆ. అఖిల దేశవాసు లైన రాజులను, బ
విత్రచరితు లై న విప్రవరుల
నర్థిఁ బిలువ దూత లరిగిరి కౌరవే
శ్వరునియాజ్ఞఁ జేసి సమ్మదమున. 77

వ అందొక్క దూతంబిలిచి దుశ్శాసనుండు "నీవు ద్వైతవనంబునకుం జని
పాండవులను దదాశ్రమవాసు లయిన భూసురులను గౌరవేశ్వరు
నధ్వరంబునకుఁ బిలువు" మని పనిచిన వాఁడునుం జని ధర్మజుం గని
యి ట్లనియె. 78

ఉ. వీరుఁడు కౌరవుండు నిజవిక్రమలబ్ధసమున్న తార్థసం
భారములన్ మహాధ్వర మపారబలుం డొనరించుచుండి, పెం
పారఁగ నిన్నుఁ దమ్ములమహాద్విజులం బిలువంగఁ బంచె; ధా
త్రిరమణేశ! నెమ్మిఁ జనుదెమ్ము తదధ్వరముం గనుంగొనన్." 79

వ. అనిన ధర్మజుండు వాని కి ట్లనియె. 80

చ. "అనఘుఁడు ధార్తరాష్ట్రుఁడు మహాధ్వరకర్మధురీణుఁ డయ్యె నా
విని ప్రియ మందెఁ జిత్తము; పవిత్రిత మయ్యెఁ గులంబు; వింటె? యై
నను దగ మేము పూనిన ఘనం బగుపూని దీర్ప కెవ్విధం
బున నట రా నొడంబడము; భూవరుతో నిది సెప్పు మేర్పడన్." 81

వ. అనియె నప్పుడు భీమసేనుం డాదూతం జూచి "యోరి వినుము;
పదునూఁ డగు నేఁటి కడపటఁ బాండవాగ్రజుండు దీప్తంబగు శస్త్రా
స్త్రదహనంబునందు ధార్తరాష్ట్రసుతశతకంబుఁ బఱువరించి వేల్చి
రణసత్త్రంబు సేయుటకు నై వచ్చుంగాని యందాఁకం జనుదెంచుట
గలుగ దని యా దుర్యోధను నెదురన వాయోడక చెప్పు" మనిన
వాఁడును మఱిడి చని ధర్మనందను ప్రియవచనంబులను, వృకోదరు
నిష్ఠురోక్తులను ధార్తరాష్ట్రుల కెఱింగించెఁ; దదనంతరంబ. 82

క. చను దెంచిరి కౌరవుశా
సనమున ధరణిఁ గల నిఖిలజనపతులును స
న్మనులును, సమస్తజనులును
ఘనభుజు జన్నంబుఁ జూడఁ గరిపురమునకున్. 83

వ. వారి కెల్లను దగిన సత్కారంబులు సేయను, పాత్రదానంబులు గావిం
పను, ధృతరాష్ట్రుండు విదురుం బనిచె; నివ్విధంబునఁ బ్రసిద్ధదక్షిణా
న్వితం బై, ప్రభూతాన్నపానసంతర్పితసకలజనం బై, యభిమతాంబ
రాభరణపరిపూజితభూసురప్రకరం బై, యథాకాలవిహితకర్మకలాపం
బై, యథాశాస్త్రీయం బై వైష్ణవయాగంబు నిర్విఘ్నంబుగఁ బరి
సమాప్తం బగుటయు. 84

క. అవభృథశోభితుఁ డై కౌ
రవముఖ్యుఁడు భూరికనకరత్నతతుల భూ
దివిజులఁ బూజించి, నృపుల
వివిధవిధుల సత్కరించి వీడ్కొలిపెఁ దగన్. 85

వ. అట్టియెడ నధ్వరోత్సవాగతు లైన జను లనేకులు ధృతరాష్ట్రనందను
సమ్ముఖంబున నిట్లనిరి. 86

క. "జనపతు లెవ్వరు నివ్విధ
మున నిర్విఘ్నముగ నఖిలభూజనసమ్మో
దనముగఁ జేసిరె సత్క్రతు?
అనఘ! భవత్పుణ్యమహిమ లాశ్చర్య మిలన్. 87

శా. సారోదారవిభూతిమై మును హరిశ్చంద్రుం డొనర్చెం గ్రియా
పారీణుం డయి రాజసూయ; మది సెప్పన్ వింటి; మయ్యజ్ఞముం
గౌరవ్యోత్తముఁ డైనధర్మసుతుఁడుం గావింపఁగాఁ గంటి మే;
మా రెండున్ సరి గావు నీమఖముతో నత్యున్నతిన్ భూవరా! 88

క. ఈజన్న మొనర్చియు గా
దే జగదావర్తకీర్తిదీపితు లై య
వ్యాజసురలోకసుఖముల
భ్రాజిల్లిరి రఘు యయాతి భరతాదినృపుల్." 89

తే. అని నుతింపంగ మఱియును నంద కొంద
అయ్యుధిష్ఠిరు రాజసూయంబుచిదుర
పోలుఁబోల దీమఖను వైభవసమృద్ధి"
నని తలంచిరి నిజహృదయంబులందు. 90

వ. అనంతరంబ నిరంతరానంద మంద మందాయమాన మానసుం డగుచు మానవేశ్వరుండు దమ్ములు దొరలు బంధుజనంబులుం బరివేష్టింపఁ, బౌరజనదత్తాశీర్వాద జయజయశబ్దశబ్దాయమానదిగ్విభాగుం డగుచుఁ, బుణ్యాంగనా కరకలితలలితాక్షతవిశేషంబులును, బటువందిమాగధ సంకీర్తనంబులును గైకొనుచుఁ బురప్రవేశంబు సేసి, రాజమందిర గతుం డై ధృతరాష్ట్రునకు, గాంధారికిఁ గృపద్రోణభీష్ములకుం బ్రణమిల్లి యుల్లంబు వికసిల్లఁ గనకాసనాసీనుం డయ్యెఁ; నప్పుడు కర్ణుం డతని కిట్లనియె. 91

ఉ. "భాగ్యము గాదె కౌరవనృపాల! భవన్మఖ మిష్టసత్క్రియా
యోగ్యత నిర్వికల్పముగ నొందె సమాప్తి; నశేషధాత్రియుఁ
భోగ్యమ నీకు; నింక రణభూమి, బృథాసుతులన్ జయించి స
మ్యగ్యశశాలి వై భువనమాన్య! యొనర్పుము రాజసూయమున్.

క. అది యెమ్మెయి నగునో యని
మదిలో వగవంగ వలదు; మఘవతనూజుం
గదనంబునఁ జంపక యే
పదనఖధావన మొనర్పఁ బార్థివముఖ్యా!" 93

తే. అనినఁ గర్ణుఁ గౌఁగిటఁ జేర్చి, యన్న రేంద్ర
నందనుఁడు "నీసహాయత నాకుఁ గలుగఁ
బాండవుల నోర్చు టెంతటిపని మహాత్మ!"
యని సహోదరసహితుఁ డై హర్ష మొందె. 94

వ. అట ధర్మతనయుండు సూతతనయు ప్రతిజ్ఞ విని, వాని బలశౌర్య విభవంబును, నభేద్య కవచ ప్రభావంబును దలంచి విషణ్ణహృదయుం డై రేలెల్లను గన్ను మూయుటలేక వగచుచుండె; నిట దుర్యోధనుండును గర్ణసౌబలప్రవర్తిత కార్యాభిజ్ఞుం డై, భీష్మద్రోణకృపాదుల

కును, మహనీయు లైన మహీసురులకు ననుదినంబును బ్రియసత్కా-
రంబులు సలుపుచు, ధనంబు దత్తభుక్తఫలంబుగా నగచి నిరంతర
త్యాగభోగంబుల ననురాగంబు నొందు చుండె'' ననిన వైశంపాయను
నకు జనమేజయుం డి ట్లనియె. 95

క. దుర్యోధనుచేఁ దలిగి య
వార్యపరాక్రములు పాండవప్రభులు మహా
శ్చర్యచరితు లవ్వనమున
నార్యులు మఱి యెట్టివార లైరి? మునీంద్రా! 96

**ద్వైతవనంబునందలి మృగసమూహము ధర్మజు స్వప్నంబునందు వచ్చి తమ దుఃఖంబు సెప్పుట**

వ. అని యడిగిన నమ్మహాముని యమ్మహీపతి కి ట్లనియె. 97

సీ. ''ద్వైతవనంబున ధర్మజుం డొకనాఁడు
నిద్రింపఁగాఁ, దద్వనేచరంబు
లగునట్టి మృగజాతు లన్నియుఁ గలలోన
వచ్చి, కన్నుల నశ్రువారి దొరుఁగఁ,
ద మ్మొఱంగించి యాతనితోడ నిట్లను
''ధర్మాత్మ ! మీరు నిత్యంబుఁ గడఁగి
చంపంగఁ జంపంగ సమసి యల్పావశి
ష్టము లయ్యె నిప్పు డస్మత్కులంబు ;
తే. తేము బీజమాత్రమ దక్కి యిట్లు వనరు
చున్నవారము; మీరింక నొండుగడకు
నరిగి మముఁ గావరే కరుణార్ద్రబుద్ధి''
ననిన నట్లకా కని వాని కభయ మిచ్చి. 98

క. జనపతి మేల్కొని యంతయు
ననుజుల కెఱిఁగించి యిట్టు లను ''నబ్దముపై
నెనిమిదినెల లుండితి మి
వ్వనమునఁ; బగు నింక నొండువలనికిఁ బోవన్. 99

వ. ఇప్పుడు కామ్యకవనంబు బహుమృగాకీర్ణంబై, సరసఫలభరితభూరుహ
ప్రకరంబై, విమలకమలాకరాభిరామంబై యున్నయది యని
వింటిమి; గావునం గ్రమ్మఱ నందులకుం జని తృణబిందునాశ్రమంబున
వసియించుట లెస్స'' యనినం దమ్ములు 'దేవా! నీ వెట్లు నిశ్చ
యించితి మాకు నదియ యిష్టం'బని పలికిరి; తదనంతరంబ. 100

క. అనుజన్ములుఁ, బాంచాలియు
ననుచరవర్గంబు బ్రాహ్మణావలియును దోఁ
జనుదేరఁగ సమ్మదమున
ఘనతేజుఁడు సనియెఁ గామ్యకవనంబునకున్. 101

వ. ఇట్లరిగి యందుఁ గృతనివాసులై యవ్వీరులు శాకఫలమూలంబులం
జేసి దేహయాత్రలు నడుపుచు, నొండురుఁయలజడి సూచి యత్యంత
దుఃఖపరవశు లగుచు జూదంబునాఁడు దమ పడినపాట్లు దలంచి
కలంగుచుఁ, గ్రోధశోకంబులు దమలోన నుపశమించికొనుచు వర్తిల్లం
బదునొక్కం డగునేఁడు సనిన సందఱుం గాలంబు గడగాంచినవారై
వెడవెడ వికసిల్లిన చిత్తంబులతో నుచిత వృత్తంబుల నుండునంత.

శా. ప్రీతుండై చనుదెంచె నాశ్రితజనాభీష్టక్రియాశీలుఁ, డు
ద్గీతామ్నాయుఁడు, నిర్విధూతదురితక్లేశుండు, యోగామృత
స్ఫీతస్వాంతుఁ, డనంతసంతతసమావిర్భూత కారుణ్యధా
రాతోయస్నపనైకశీలుఁడగు పారాశర్యుఁ డచ్చోటికిన్. 103

క. మునిపతి దోదవ్వులఁ గని,
జనపతి దమ్ములును దాను సంప్రీతి నెదు
ర్కొని, యర్ఘ్యాదివిశేషా
ర్చనలం బరితుష్టుఁ జేసె సంభృతభక్తిన్. 104

వ. కృష్ణద్వైపాయనుండును ననవరత వనవాసాయాస కృశదేహుల,
నధిక దుఃఖాయమానహృదయులం దన మనుమలం జూచి వగచి
ధర్మపుత్రున కిట్లనియె. 105

ఉ. "కాలవిపర్యయంబున సుఖంబును దుఃఖము వచ్చుచుండు; నె
క్కాలము నేరికిన్ ధ్రువము గాదు సుఖంబును దుఃఖమున్; మహీ

పాల ! బుధుండు దద్విభవంబగు లెఱింగి ప్రవమోహభేదసం
శీలుఁడు గాఁడు వెంటను బ్రసిద్ధపథంబున నప్రమత్తుఁడై. 106

క. విను నీవును నాపదలకు
మనమున నొక్కింత యోర్చి. మహనీయముగా
నొనరింపుము తపము, దపం
బునన కదా సకలసౌఖ్యములు సిద్ధించున్ ? 107

క. శమయు, నహింసయు, సత్యము
సమతయు, నింద్రియజయంబు! శమముఁ, బరిత్యా
గమును దపోలక్షణములు;
గ్రమమున నిన్నియును నూర్ధ్వగతికారణముల్. 108

తే ఇందుఁ జేసిన పుణ్యంబ యందుఁ గుడుచు;
మీఁదిజన్మంబునకు నది మేలుఁ జేయుఁ;
గాన తనశక్తితోఁ గూడ దానధర్మ
చిరపరోపకారంబులు సేయ వలయు.'' 109

వ. అనినం బాండవాగ్రజుండు ''దానతపంబులలో దష్కరం బెయ్యది ? యెద్దాన నధిక ఫలంబగు ?'' నని యడిగిన వేదవ్యాసుం డిట్లనియె.

సీ. ''దాన మూర్జితఫలదం; బర్థసాధ్య మై
పరఁగుటఁ గరము దుష్కరము నదియ;
నరులకు నధిప ? ప్రాణంబులకంటెను
రూపింప నర్థంబు తీపు వినవె;
యుగ్రంబు లైన యాయుధముల మొనలపై
నుఱుకుట, యంభోధి నఱిసి చనుట,
కృషిపాశుపాల్యసంక్లేశంబు నొందుట,
యడవులఁ గొండల నిడుమ పడుట.

ఆ. నవసి పొవసి యనుదినముఁ బరప్రేష్యులై
యునికి దలఁప నర్థమునక చూవె;
యట్టిదుఃఖలబ్ధ మైన యయ్యర్థంబు
విడుచు టెవ్విధమునఁ గడిఁది గాదె ? 111

శా. అన్యాయార్జిత మైన విత్తమునఁ జేయం బూను దానంబు మూ
ర్ఖన్యాయం బది; దానఁజేసి ఫలపాకం బేమియున్ లేదు; యు
క్తన్యాయార్జిత మించుకంత యయినం గాలంబు, దేశంబు స
మ్మాన్యంబై తగఁ బాత్రయోగమున సౌమ్యంబై ఫలించుం దుదిన్.

వ. తొల్లి ముద్గలుం డను మహాద్విజుండు సన్మార్గోపార్జితం బైన వ్రీహి
ద్రోణంబు సత్పాత్రంబునఁ బ్రతిపాదించి కాదె పరమసిద్ధిం బొందె''
ననిన విని ధర్మనందనుండు "మునీంద్రా! ముద్గలుండు వ్రీహిద్రోణం
బెట్లుంగి నుపార్జించె? నెట్టి పాత్రంబునఁ బ్రతిపాదించె? విన వలతుం
జెప్పవే" యనిన నతం డిట్లనియె. 113

—: వ్యాసుఁడు ధర్మజునకు వ్రీహిద్రోణాఖ్యానంబు సెప్పుట :—

క. ''అతిథిప్రియుఁడుఁ విశిష్ట
వ్రతుఁడు, విమత్సరుఁడు, సత్యవచనుండు, విని
ర్జితవిషయేంద్రియుఁడు. సము
న్నతపుణ్యుఁడు, ముద్గలుఁడు సనాతనబుద్ధిన్. 114

వ. పుత్రదారసహితంబుగాఁ గురుక్షేత్రంబున వసియించి, యుంఛవృత్తి
పరాయణుం డై పాడ్యమిం దొడంగి పదునాలుగు దివసంబు
లొక్కొక్క గింజ యగు కాఁ దూమెఁడు వడ్లు సమకూర్చి, పర్వదినం
బునఁ బాకంబు సేయించి. దేవపితృపూజనంబు లొనరించి, యతిథుల
కన్నంబు వెట్టి మిగిలిన యన్నంబునఁ దాను బుత్రకళత్రంబులును
దేహయాత్ర నడుపుచు, నివ్విధంబునఁ బక్షోపవాసవ్రతంబున వర్తిల్లు
చున్నయెడ నొక్క పర్వదినంబునందు. 115

మ. మతి నత్యంతజుగుప్సితం బయిన యున్మత్తస్వరూపంబుతో
గతవస్త్రుండును, ముక్తకేశుఁడు, బహుగ్రామ్యోక్తిశీలుండు నై
హితపుణ్యుండు మునీశ్వరుం డతిథి యై యేతెంచె దుర్వాసుఁ డ
య్యతి యమ్ముద్గలుపాలికిం బటుబుభుక్షాయత్తతం దూలుచున్. 116

క. అతనిం గని యించుకంతయు
మతి ననుమానంబు లేక, మానుగఁ బ్రత్యు

ద్గతుఁ డై యర్ఘ్యముఁ బాద్యము
నతిభక్తి నొనర్చి మునికులాగ్రణి నెమ్మిన్. 117

క. అన్నంబు పెట్టె; నతఁడు త
దన్నం బంతయును గుడిచి, యాత్మఁ దనిసి, శే
షాన్నంబు మేన నిండఁగ
సన్నుతుఁ డలఁది కొని మగుడి చనియె నిజేచ్ఛన్. 118

క. మునిపతి పర్వముపర్వం
బున మఱియును నరుగు దెంచు; ముద్గలుఁడును దా
ననశనుఁ డై యుండియు న
మ్మునివరునకు నొసఁగు నన్నముం బ్రియ మెసఁగన్. 119

వ. ఇవ్విధంబున నాఱు పర్వంబులు గుడిచి దుర్వాసుండు వాని చిత్తంబున నొక్క కొఱంతయు గానక యద్భుతప్రమోదమగ్న మానసుం డై వాని కి ట్లనియె. 120

క. "నీయట్టి దానశీలుని
నీయఖిలమునందుఁ గాన నెన్నండును; స
త్త్వాయత్తమతివి, సాధువి
ధేయుండవు, నీవు పుణ్యతేజుఁడ వనఘా. 121

చ. మనమున నేవగింప కవమానము సేయక, యించుకంతయుం
గినియక, యోలమందక, యకృత్రిమభక్తి నొనర్చి తీవు స
జ్జనసుత! యన్నదానము; ప్రసాదము, సత్యము, ధైర్యమున్, దమం
బును, నపరిగ్రహత్వమును బొల్పుగ నీధన మయ్యె నియ్యెడన్. 122

చ. చవులకుఁ బ్రేముడించు నసిశంబును నాలుక; దాల్మి పెంపు, ధ
ర్మువును, శమంబుఁ ద్రెక్కొను సముద్ధతి నాఁకలి; వీని రెంటనుం
దవులవు; జీవితస్థితికిఁ దావల మన్నము; నీవు జీవితే
చ్ఛ విడిచి తివ్వు; డే మని ప్రశంస యొనర్తు? నినుం దపోనిధీ. 123

క. మనమును, నింద్రియములవ
ర్తనమును సరిగా నొనర్చు ధర్మంబు దపం

బని చెప్పుదు; రట్టితపం
బనఘా! నీయంద కలిగె నభినవభంగిన్. 124

ఉ. ప్రీతుఁడ నైతి నీ వలనఁ; బేర్చిన పుణ్యఫలంబు లెల్ల నీ
చేతివ యయ్యె; నీ దగు ప్రసిద్ధతపోవిభవంబు నిర్జర
వ్రాతము లిచ్చు సాఱెఁ; దివిదివంబున కీవును మేనితోడ వి
ఖ్యాతిగ దేవయానమున గ్రక్కున నేఁగెదు సంయమీశ్వరా." 125

వ. అని పలికి దుర్వాసుం డరిగెఁ; దదనంతరంబ హంససారసయుక్తం
బును, గింకిణీ మాలికామనోహరంబును, గామగమనంబును నయిన
విమానంబు గొనుచు దేవ దూత ముద్గలుకడకుం జనుదెంచి యి
ట్లనియె. 126

క. "అనఘ! భవత్సుకృతంబున
ననిమిషలోకాభి గమ మవాప్తం బయ్యెం;
జనుదెమ్ము; విమానము చ
య్యన నెక్కుము చిత్తమునఁ బ్రహర్షం బెసఁగన్.'' 127

వ. అనిన దేవదూతం జూచి ముద్గలుండు "మహాత్మా! దివిజలోకం
బెట్టిది? వినవలతు; నందుల గుణదోషంబు లెఱింగింప వలయు; సత్పురు
షులతోడి మైత్రి సాప్తపదీనంబని చెప్పుదురు;గావున మైత్రిం బురస్క
రించి నిన్నడిగెద" ననిన నతం డమ్మునీంద్రున కిట్లనియె. 128

—: ముద్గలునకు దేవదూత పుణ్యలోకంబు తెఱంగు సెప్పుట :—

క. ''ఈ లోకమునకు మీఁదై
చాలఁగ వెలుఁగొందుచుండు స్వర్లోకము, నా
నాలంకారయుతము, ది
వ్యాలోకము, దేవయాన మది మునినాథా! 129

చ. అమలతపోనివాసులు, మహాధ్వరశీలురు, సత్యసంధు, లు
త్తములు, జితేంద్రియుల్, సములు, దానపరుల్, రణశూరు లందు హ
ర్షమున వసింతు; రచ్చరులు, సాధ్యులు, దేవమునుల్, మరుద్వసు
ప్రముఖులు వేఱువేఱ తగుపట్టుల నుండుదు రంద యిమ్ములన్. 130

వ. మఱియు ముప్పదిమూఁడువేల యోజనంబులు విస్తృతంబైన మేరు శిఖరంబునందు నందనప్రముఖంబు లైన దేవోద్యానంబులు పుణ్య పరులకుఁ గ్రీడాస్థానంబు లై విలసిల్లు; నయ్యెడల నాఁకలియు, నీరు వట్టును, శీతోష్ణభయంబులును, జరారోగ వికృతులును బుట్ట; వెయ్యె డలం జూచిన నతి మనోహరం బై సకలేంద్రియతర్పణం బై యుండు; నిట్టి పుణ్యలోకంబునకు నర్హులయిన పుణ్యపురుషులు విధి నియోగ పక్వంబు లయిన మానుషశరీరంబులు విడిచి తేజోమయంబు లగు దివ్యదేహంబులు ధరియించి, వివిధాంబరాభరణభూషితులును, నమ్లానకుసుమమాలికామనోహరులును నై కనకవిమానంబులందు దేవదూతలచేతం గొనిపోవంబడి, యందు శోక భ్రమ శ్రమాయాస విరహితు లై వివిధసుఖంబు లనుభవించు చుండుదురు. 131

ఆ. అనఘ! యింద్రలోకమునకంటె మీఁద ని
శ్శోక మగుచు బ్రహ్మలోక మమరు;
నది యనన్యదీప్తసదన మై తన దైన
వెలుఁగునను జగంబు వెలుఁగఁ జేయు. 32

చ. మనువులు, ధాతలున్, మునులు మానుగ నుండుదు రందు; లోభమున్
గినుకయుఁ, గిల్బిషంబు, నపకీర్తియు, దుఃఖము, జన్మవైకృతం
బును జనియింప; వీభువనముల్ దెగునప్పుడు నాశ మొంద ద
ద్వినుతపదంబు; దానియెడ వేడుక సేయుదు రింద్రముఖ్యులున్.133

వ. స్వర్గంబునం గల గుణంబు లెఱింగించితిఁ, దదీయదోషంబులు సెప్పెద వినుము. 134

తే. ఇందుఁ జేసిన పుణ్యంబు లెల్లనందుఁ
గుడుచుఁగాని మర్త్యున కందుఁ గడఁగి పుణ్య
మాచరింపంగఁ గాదు; పుణ్యావసాన
మగుడు భూమిక ద్రోతురు మగుడ నతని.

క. కడు మరగిన సౌఖ్యంబులు
విడుచుటఁ జిత్తంబు దుఃఖవివశముగ మహిం

స్ఫాలనము సేయుటయు, విని
వాలి మహారోషదుర్నివారోద్ధతుఁ డై. 371

వ. సమరసన్నాహం బమర వెలువడం బోయినఁ దదీయవల్లభ యగు తార యతని వారించి యిట్లను "నేఁటిచందంబు సూడ సుగ్రీవుండు బలపత్సహాయుం డై వచ్చినవాఁ; డది యె ట్లనిన దశరథనందనుం డైన రాముండు రావణుచేత నపహృత దారుం డయి, నిజసహోదరుం డగు లక్ష్మణుండును దానును సుగ్రీవసహాయత్వం బపేక్షించి, యతని కార్యంబు దీర్ప నూనె నని వింటి; నదియునుం గాక మహాబలు లయిన మైంద ద్వివిదులు, నతిలోకపౌరుషుం డయిన హనుమయుఁ, బ్రసిద్ధబుద్ధియగు జాంబవంతుండును వానికిమంత్రులై యుండుదురు; గావున నీ విప్పుడు గయ్యంబునకుఁ బోక నా కిష్టంబు గా" ననిన నవ్వుచు నవ్వనచరవీరుండు. 372

క. ఆ వనితవచనములు సు
గ్రీవవిషయపక్షపాత కృత్రిమములు గా
భావించి, యాదరింపక
తా వెడలె ననూనబాహుదర్పం బెసఁగన్. 373

వ. ఇట్లు వెడలి కట్టెదుర నున్న సుగ్రీవుం జూచి యి ట్లనియె. 374

—: వాలి సుగ్రీవుల యుద్ధము :—

తే. "ఓరి దుష్టాత్మ! యే నిట్లు పోరఁ బెక్కు
మాఱు లెగుపంగ సిగ్గఱి పాఱుచుండు
నట్టి నీ కున్నయునికిని యిట్టలముగ
నిట్టిబీర మెక్కడనుండి పుట్టెఁ? జెపుమ" 375

వ. అనినఁ బ్రహసితముఖుం డగుచు నబ్బలిముఖుం డి ట్లనియె. 376

క. "అలిని, రాజ్యముఁ గోల్పడి
యాలంబునఁ దూల పోయి, యక్కట! బ్రదు కిం
కేలా? యని తెగువమెయిన్
వాలి రణము సేయ నమరి వచ్చితి నీతోఁ." 377

తే. చక్కఁ గమ్మెంక ముందటిచంద మొంపఁ
గలదె? తొంటి సుగ్రీవుండు గాఁడు; నేఁడు
నిన్నుఁ బోరివుచ్చికాని పో నేర్చు నెట్లు"
ననుచు నుగ్రుఁడై యప్పీరు నార్చి కవిసె. 378

వ. ఇవ్విధంబున. 379

ఉ. భూవినుతప్రభావులు, ప్రభూతబలోద్ధతు, లుగ్రవైరితే
జోవిజయుల్, నిరంతరయశోజయకాంతులు, భూరిభూరుహ
గ్రావనఖాయుధుల్, బలిముఖప్రవరుల్, గడుఁ బొంగి వాలిసు
గ్రీవులు దాఁకి రొండొరు లకృత్రిమరోషకషాయవక్త్రులై. 380

మ. తరుసంఘంబులు పూన్చి యొండొరులు నుద్యద్బాహులై వ్రేయ, ని
ష్ఠురవక్షస్స్థలపాతవేగవిరళస్తోకంబులై పోయె న
త్తరుసంఘంబులు; వెండియుం గడఁగి మాద్యల్లీల నయ్యుద్ధముం
బరుషానేకశిలాప్రయోగముల నొంపం జొచ్చి రన్యోన్యముల్. 381

క. అతులితశిలావితానం
బితరేతరతనునిపాతహేలాసంచూ
ర్ణిత మగుటయు, వారలుపటు
గతిఁ గవిసిరి బాహుయుద్ధకౌతుకమతులై 382

ఉ. ఒండొరుఁ బట్టుచుం దిగుచు, చొండొరుఁ బాయుచు వ్రేయుచున్, మహో
ద్దండత నొండొరుం దొలఁగఁ దాఁకుచు, నీఁగుచు లోఁగుచుం, జలం
బొండొరు మీఱు, చొండొరులయుద్ధతి సైపక వీఁకఁ బోరి రా
ఖండలభానుసూను లవిఖండితచండభుజాప్రచండతన్. 383

శా. దేహోత్సాహ మెలర్ప నుద్ధతమదాంధీభూతులై యాహవో
త్సాహవ్యగ్రులు విగ్రహంబు మిగులన్ సంరంభశుంభద్గతిన్
బాహాబాహిఁ బెనంగ నప్పు డమరెం ప్రౌఢద్విపద్వంద్వ హే
లాహస్తద్వయగాఢకర్షణరణోల్లాసంబు విస్పష్టమై.

వ. మఱియు నన్యోన్యదంతనఖముఖవిఖండితశరీరులై, హరివీరులు రుధిర
ధారలందడిసి పుష్పితంబు లగు నశోకంబులుంబోలె నొప్పి, చలంబులు

మెఱయం బెనంగునెడం దుల్యబలరూపవిక్రములై యున్న యయ్యన్న దమ్ముల నిరువుర నేర్పడ లక్షింపనేరక, లక్ష్మణాగ్రజుండు విలక్ష హృదయుం డై వీక్షించుచున్న, నాంజనేయుండు రాఘవునకు నభిజ్ఞానార్థంబుగా నొక్క పల్లవదామంబు సుగ్రీవు నలుతం బెట్టెఁ, దదనంతరంబ రాఘవుం డమోఘబాణంబు దొడిగి వాలి యురంబు వగులనేసినం బడి యవ్వానరుండు దశరథనందను నిందించుచుఁ బ్రాణనియోగంబు నొందె; నిట్లెఱంగున. 385

ఆ. వాలిఁ జంపి యతనివనిత సుగ్రీవుని
వశము సేసి, నిఖిలవనచరేంద్ర
పదవియందు నెమ్మిఁ బట్టంబుఁ గట్టె వి
స్ఫారయశుఁడు రామభద్రుఁ డెలమి. 386

వ. ఆ వనచరుండును రామునకుఁ గృతాంజలి యై "దేవా! యీ ఘర్మ సమయ శేషంబును, ఘనసమయంబునుం గడపి మఱి సీతాన్వేషణంబు నకు నుత్సహించుట లెస్స" యని యయ్యిరువురకును మాల్యవత్కూ టంబున నివాసంబుఁ గావించి, తానును గిష్కింధాపురంబున నుండె నంత. 387

మ. ఉరుఘర్మౌఘవిఘాతసంవిహితవిశ్వోల్లాస మై, సంచల
త్సరసాంభోద నినాదతూర్యరవ మై, చంచద్బలాకాగరు
ద్భరలీలానవచామరస్ఫురణ మై, పర్జన్యసామ్రాజ్య మొ
ప్పె రమామందిర మై యుదగ్రశిఖినీపింఛాతపత్రంబులన్. 388

వ. ఆ సమయంబున నక్కడ. 389

క. దానవనాయకు చెఱఁ బడి
జానకి యురిఁబడినహరిణశాబమపోలెన్
మానిని సంతతభర్తృ
ధ్యానవివశ యగుచు నుండెఁ దాపం బెసఁగన్. 390

వ. అమ్మగువ కాపున్న దనుజాంగనలు త్ర్యక్షియు, లలాటాక్షియుఁ, ద్విస్తనియు, నేకపాదయు, దీర్ఘజిహ్వయు, నజిహ్వయుఁ, ద్రిజటయుఁ, నేకలోచనయు మొదలయినవారు పెక్కండ్రు వికృతా

కారంబులతోడ నయ్యబలం బరివేష్టించి, యహర్నిశంబును నురక యదల్చువారును, జెలుచం దిట్టువారును, ఖరోష్ట్రనిస్వనంబులు సెలఁగ వెఱపించువారును, త్రిభువనాధిపతి యైన మన దశగ్రీవు నొల్లని యీ దుష్టమానుషిం బట్టి చెండి కండలు దిందు మనువారును నై యున్న, నయ్యువ్విద గళద్బాష్పయు, గద్గదకంఠియు నగుచు నా రాక్షస స్త్రీల కిట్లనియె 391

తే. "అమ్మలార ! మీ కలసినయట్ల చేయుఁ;
డింక నేటికిఁ దడయంగ ? నేను రాముఁ
దప్ప నొండొకపురుషుఁ జిత్తమునఁ దలఁప
నింత నిజము; నాకును జీవితేచ్ఛ లేదు" 392

వ. అనిన నజ్జానకి తెగువ రావణున కెఱింగింపఁ గొందఱు సనిరి; మఱియు సంతతప్రియవాదినియు, ధర్మజ్ఞయు నైన త్రిజట యను రక్కసి రామాంగనం జేరంజని యి ట్లనియె. 393

—: త్రిజట దన స్వప్నవృత్తాంతము సీతతోఁ జెప్పుట :—

సీ. "అమ్మ నీ కెంతయు హర్షంబుగా నొక
వార్త నే నెఱిఁగింతు, వనజవదన !
నామాట నిజముగా నమ్ముము; వినవె య
విన్ధ్యుఁడు నా నొక్క వృద్ధదైత్యుఁ
డనఘుండు రామహితాన్వేషి యై నీకు
నాశ్వాస మొనరింప నబల నన్నుఁ
బనిచెను; విను నిన్నుఁ బాసిన పిదప ల
క్ష్మణుఁడును దాను సేమమునఁ గలసి

ఆ. యఖిలవానరేంద్రుఁ డైన సుగ్రీవునితోఁ
జెలిమి సేసి, యిపుడు శీఘ్రమునన
వీరవరుఁడు నిన్ను విడిపించుపనికి నై
యొదవి యుత్సహించి యున్నవాఁడు. 394

వ. రావణునకు రంభానిమిత్తం బయిన నలకూబరుశాపంబు గలదు; గావున నీయందు బలాత్కారంబు సేయరాదు; నీకు వీనివలనిభయంబు వలదు;

మఱి యిద్ధరాత్మునకుం జేటు దెలుపునట్టి దుస్స్వప్నంబుఁ గలిగె;
నది యాకర్ణింపుము. 395

క. ఖరములఁ బూనిన రథమున
విరిసిన వెంట్రుకలు వెంట వ్రేలఁగ, దశకం
ధరుఁడు బహుళ తైలాప్లుత
శరీరుఁడై దక్షిణంబు సనఁ గలఁ గంటిన్. 396

తే. అతని చుట్టును గుంభకర్ణాదు లెల్ల
నరుణమాల్యానులేపనులై వికీర్ణ
పలితకేశులై, నగ్నులై పరఁగఁ బ్రేత
పతిదిశకు నేఁగుగతి గానఁబడియె నాకు. 397

ఉ. చారుసితోష్ణవారణలసత్సితమాల్యసితాంగరాగుఁ డై,
ధీరగుణోత్తరుం డధికధీనిలయుండు, విభీషణుండు వి
స్ఫారసితాద్రిశృంగమున భవ్యుఁడు మంత్రి చతుష్టయాన్వితుం
డై రమణీయలక్ష్మిఁ బొలుపారఁగ నేఁ గల గంటి నుగ్మలీ. 398

చ. తనసితకీర్తి విశ్వవసుధాగగనాంతరపూరితంబు గా
ఘనభుజుఁ డున్న తద్విరద కంధరసుస్థితుఁ డై ముదంబుతో
ననుజుఁడు దాను రాఘవకులాగ్రణి సన్మధుసిక్తపాయసం
బొనర భుజింపఁ గంటి వికచోత్పలలోచన! నిక్క మింతయున్. 399

క. పులిచేత వ్రేటువడి, మైఁ
గలయఁగ నెత్తురులు గ్రమ్మఁ గా నేడ్చుచు, ని
మ్ముల నుత్తరాభిముఖ వై
కలుషితగతి నరుగ నిన్నుఁ గనుఁగొంటిఁ గలన్. 400

క. నాకల నిక్కం బయ్యెడు;
శోకింపకు మమ్మ యింక సుందరి! పుణ్య
శ్లోకు, జితలోకు, నతులవి
వేకుం బ్రియుం బొందఁ గలుగు వేగమ నీకున్." 401

ఆ. అనినఁ ద్రిజటపలుకు లవి నిక్కములు గాఁగ
వగచి, సీత గొంత వనట దక్కి,

యాసతోడ నుండె; నట దశవదనుండు
సీతఁ దలఁచి వివశచిత్తుఁ డగుచు. 402

వ. తాను దేవ దానవ గంధర్వాది భూతవర్గంబుల నెల్ల జయించియుం, గందర్పదర్పంబు వారింప నోపక, యాక్షణంబ దివ్యమాల్యాంబరాభరణభూషితుం డై సంచారశీలం బైన కల్పపాదపంబునుంబోలె నొప్పియుఁ, దనయొప్పుఁ జిత్రవనంబు నందలి వటభూరుహంబు సొంపునుంబోలె నతిభీషణం బగుచుండ, నశోకవనమధ్యంబు సొత్తెంచి, రోహిణిసమీపంబునకు వచ్చు శనైశ్చరుండునుంబోలె జానకిం జేరఁ జనుదెంచి, ప్రణయపూర్వకంబుగా ని ట్లనియె. 403

క. "ఏల మదిరాక్షి! వలవని
జాలిం బడి నవసెదవు? లసద్భూషణాలీ
లాలంకృత వై నన్నుఁ గృప
నేలికొనం గదవె? వేయు నేటికి నింకన్? 404

చ. అనిమిషయక్షరాక్షసవియచ్చరకిన్నరపన్నగాసురాం
గనలఁ గరంబు చిత్తమునఁ గైకొన, కే ననురాగలీలమై
నిను మది నాదరించు టిది నీ దగుభాగ్యము గాదె? యింతయున్
వనిత! యెఱుంగ వైతి; గురువంపువిచారము లేల నీయెడన్?. 405

ఉ. రాముఁ డనంగఁ బేర్మియును రాజ్యముఁ గోల్పడి కానలోన దుః
ఖామయమగ్నుఁ డైన యొక యల్పమనుష్యుఁడు; వానిపైఁ గడుం
బ్రేముడి సేయుచున్ వగపుపెల్లునఁ జిత్తము దల్లడిల్లఁగా
నీమెయి నుండు నీ యునికి యేసుఖ మంద్రదు? లతాంగి చెప్పుమా. 406

వ. ఏను సకలలోకేశ్వరుండ; నాకుం గింకరు లై పదునాల్గుకోట్లు నిశాచరభటులును, నిరువదియెనిమిదికోట్లు రాక్షసులును, నెనుబదియాఱుకోట్లు యక్షులును వర్తిల్లుదురు; నిఖిలధనాధ్యక్షుండయిన యక్షేశ్వరుండు నాయగ్రజుండు; బ్రహ్మసమానుండగువిశ్రవసుండు మదీయజనకుండు; గుబేరునకు వినోదపాత్రంబులైన గంధర్వాప్సరోగణంబులు నన్ను సేవించుఁ; బంచమలోకపాలుం డని నన్నుఁ ద్రిభువనంబులుఁ గీర్తించు; భక్ష్యభోజ్యాదివస్తువులును సురేశ్వరగృహంబునం దెట్లట్ల

నాగృహాంబున నక్షయంబు; లిట్టి నావిభవం బింతటికిని, మదీయజీవి తంబునకు నధీశ్వరి వై సుఖంబున భోగింపు" మనిన విని వైదేహి క్రోధశోకవ్యాకులహృదయ యగుచు వానిదెసం జూడక, యొక్క తృణాంకురం బుపలక్షించి యిట్లనియె 407

సీ. "అకట! పరాంగన, నబలఁ, బతివ్రతఁ
బరికింపఁగా మర్త్యభామ నేను;
రాక్షసుండవు నీవు; రాగంబు మది నించు
కయు లేని నాదు సంగమమునందుఁ
గలిగెడు నట్టిసౌఖ్యం బెంత? యదియును
గాక యైశ్వర్యం బైన కమలగర్భు
పౌత్రుఁడ వని, లోకపాలతుల్యుఁడ వని,
హరసఖుం డైన ధనాధినాథు

ఆ. భ్రాత వని భవత్ప్రభావంబు సెప్పితి;
విట్టి నీవు ధర్మ మెఱిఁగి, దురిత
వర్తనంబు విడువ వలదె? సిగ్గేది యి
ప్పగిదిఁ బ్రల్లదములు వలుకఁ దగునె?'' 408

వ. అని పలికి జానకి యుత్తరీయసంవృతవదన యై యతికరుణంబుగా నేడ్చిన, నద్దురాత్ముండు వెండియుఁ గొన్ని దుర్వచనంబులు పచరించి, యనంతరంబ యంతర్ధానంబు నొందె; నప్పొలఁతియు నెప్పటియట్ల రాక్షసీరక్షిత యై యుండె;" నని మార్కండేయుండు ధర్మరాజు నకు నిర్దేశించిన తెఱంగు వైశంపాయనోక్తం బైన యాఖ్యానంబు విఖ్యాతమాధుర్యమనోహరంబుగా. 409

క. విమలక్షాత్రగుణోన్నత!
విమలాదిత్యాత్మజన్మ! విలసత్కమలా
రమణీకరకమలోజ్జ్వల
విమలాంబుజరేణురాగ విలసితవక్షా. 410

వనమయూరము భూసురకదంబసురభూరుహ! వికాసో
ద్భాసితకృపారసవిపాక! సుగుణైకో

ల్లాస! హర హారమృగలాంఛన మృణాళీ
హాసినవకీర్తివిసరాకలితలోకా! 411

గద్యము. ఇది సకలసుకవిజనవినుత నన్నయభట్టప్రణీతం బైన శ్రీమహాభారతంబునం దారణ్యపర్వబునందు దుర్యోధను ప్రాయోపవేశంబును, పాతాళగతు లయిన దానవు లతని నాశ్వాసించుటయు, వైష్ణవయాగప్రవర్తనంబునుఁ బాండవులు గ్రమ్మఱఁ గామ్యకవనంబున కరుగుటయు, వ్రీహిద్రోణాఖ్యానంబును, ద్రౌపదీ హరణంబును, జయద్రథు భంగంబును, రామాయణకథాప్రవృత్తియు, నందు రామరావణుల జననంబును, రాఘవు వనప్రస్థానంబును, సీతాపహరణంబును, సుగ్రీవమిత్రత్వంబును, వాలివధయును, త్రిజటాస్వప్నకథనంబును, రావణు దుష్టవచనంబులు నన్నది షష్ఠాశ్వాసము.



శ్రీః

గణేశశారదా గురుభ్యో నమః

# శ్రీమదాంధ్ర మహాభారతము

## ఆరణ్యపర్వము - సప్తమాశ్వాసము

శ్రీకర సోమాన్వయరత్నాకరహిమధామ! ధార్మికాంచితవినయో
ద్రేక! భువనైకవీర! మ
హాకావ్యరసప్రయోజనారాధమతీ!

—: రాముఁడు లక్ష్మణుని సుగ్రీవునొద్దకుఁ బంపుట :—

వ. అక్కథకుండు శౌనకాదిమహామునులకుం జెప్పె; నట్లు పరమతపో
నిలయుం డయిన మార్కండేయుండు పాండవేయులతో మఱియు
ని ట్లనియె "నంత మాల్యవత్కందరమందిరుం డైన దశరథాగ్ర
నందనుండు నవకందళితసుందరంబులును, జనకనందినీ వియోగదుస్స
హంబులు నగు ఘనసమయదివసంబుల నెట్టకేనియుం గడిపి, నిరతి
శయసాంద్ర చంద్రాతపస్నపన శీతలసమీర వాహ్యమాన వినిద్ర
కుముద కేదార సౌరభ్యనిర్భరంబులు, నతిదీర్ఘ యామంబులు నైన
శారదయామినులపనయింప నోపక యొక్కనాఁడు దమ్మునిం జూచి
యి ట్లనియె. 2

సీ. "చూచితే లక్ష్మణ! సుగ్రీవుకొఱగామి?
యమ్మెయిఁ దన పగ యడఁచి మనము
కపిరాజ్య మిచ్చినఁ గైకొని, యింద్రియ
సుఖముల నెంతయుఁ జొక్కి, నేఁడు

మనదిక్కుఁ దలఁపఁడు; మనతోడఁ బల్కిన
సమయంబుఁ జెల్లింపఁ జనదె తనకుఁ ?
గడుఁ గృతఘ్నత సేసెఁ గపికులాధముఁడు; నీ
వనఘ కిష్కింధకు నరుగు మిపుడ;
ఆ. యద్దురాత్ముఁ, గృపణు, నాత్మీయకార్యత
త్పరుని, నధికరాగపరవశాత్ముఁ
దొడరి వాలి చనినత్రోవనే యనిచి ర
మ్మెల తడయ మనకు నింక నిచట ? 3

ఆ. నీవు సనకమున్న నెఱితోడ మనకార్య
మునకుఁ దగినయత్నములు ఘటించి
యుండెనేని, వాని నొండేమియుం జేయ
వలదు; తోడి తెమ్మువార్యశౌర్య" 4

చ. అనుడుఁ దదాజ్ఞఁ బూని యతఁ డాతతకార్ముకహస్తుఁ డై రయం
బునఁ జనియెం గపీశ్వరునిప్రోలికి; వాఁడును సంభ్రమంబుతో
ననుఁగులుఁ దాను రాజసుతు నర్థి నెదుర్కొని మ్రొక్కి, యర్ఘ్యపూ
జన మొనరించుడున్ విభుని శాసన మాతఁడు సెప్పె వానికిన్. 5

వ. చెప్పిన విని భయకంపితగాత్రుం డగుచుఁ గమలమిత్రపుత్రుండు సుమిత్రాపుత్రున కి ట్లనియె "నయ్యా ! యే నేల కృతఘ్నుండ నగుదు ? జానకి నన్వేషించుటకు నై బలవంతులు బుద్ధిమంతులు నగు వానరుల ననేకుల నలుదెసలకుం బనిచితి; వారును సకలవన శైల సాగర గ్రామ నదీసహితం బైన భూచక్రంబునం దెల్ల రోసి, యొక్క మాసంబులోనం గ్రుమ్మఱి వచ్చువా రై సమయంబు సేసి పోయి; రింక నైదుదినంబులు గొఱంత యింతియు; యటమీఁద నై దేహివార్త గొనుచు దేవరం గొలువ వచ్చువాఁడ నై యున్న వాఁడ" ననినం బ్రీతుం డై లక్ష్మణుఁడు. 6

క. వానిం దోడ్కొని చని యా
భూనాథునిఁ గానిపించి, పొందుగఁ దత్కా
ర్యానుష్ఠానవిశేషము
దా నెఱిఁగించుటయు విభుఁడు దద్దయు నలరెన్. 7

వ. పదంపడి కొన్ని దినవసంబులకుఁ బూర్వపశ్చిమోత్తరదిక్కులకుం జనిన వనచరు లరుగుదెంచి రాఘవుం గని "దేవా! సకలసాగర మేఖలా వలయితంబైన భూవలయంబంతయు వెదకితిమి; మీ దేవిం బొడ గాన" మని చెప్పిన నతండు దుఃఖితుం డయి, దక్షిణదిశకుఁ బోయిన వానరులవలన వైదేహితెఱం గెఱుంగుదు నను నాసం జేసి ప్రాణం బులు ధరియించి యుండె; నంత వెండియు నొక్క మాసంబు సెల్లినఁ గొందఱు వనచరులు పఱతెంచి సుగ్రీవుం గని యి ట్లనిరి. 8

సీ. "నీవును వాలియు నేఁడును నాఁడునుఁ
బ్రియమునఁ బాటించు పెద్దతోఁట
మధువనం బదె నేఁడు మన యంగదుండును
హనుమంతుఁడును మొదలైనవారు
బలువిడిఁ జూఱాడి ఫలము లానెదరు; త
ద్రక్షకు లగుమమ్ము రయము మీఱ
భంగించి;" రనవుడు భానునందనుఁ డాత్మ
నంగదప్రముఖులు యామ్యదిశకుఁ

తే. జనినవారలు గావున జనకపుత్త్రిఁ
గనినయది బ్బది గాఁబోలుఁ గాక; యిట్లు
సేయ వెఱవరె? పతికార్యసిద్ధిసలుపు
జనుల కీచన పెందును జనున కాదె?" 9

వ. అని యూహించి తత్ప్రకారంబు రఘుపతికిం జెప్పె నంత. 10

ఉ. తేనెలు గ్రోలి క్రోలి, కడుఁ దియ్యనికమ్మనిపండు లింపు సొం
పారఁగ నాని యాని, పర పందిననీడలు మెచ్చి మెచ్చి, మం
దానిలశైత్యసౌరభసమగ్రతకుం గడుఁ జొక్కి, చొక్కి యు
ద్యానమునందు మారుతసుతప్రముఖుల్ విహరించి తృప్తులై. 11

వ. అందఱుం గూడుకొని చని సుగ్రీవలక్ష్మణసహితుం డై యున్న జననాథుం గని దండప్రణామంబులు సేసినం, గాకుత్స్థకులప్రదీప కుండు వారల ముఖవర్ణవిశేషంబు లుపలక్షించి, సీతం గనినవార కా నిశ్చయించె; నప్పు డత్యంతమతిమంతుండయిన హనుమంతుండు రాఘవునకుఁ గృతాంజలి యై యి ట్లనియె. 12

క. "దేవిఁ బొడగంటి నేను ధ
రావల్లభ! శైల సరి దరణ్య నగర పా
రావారకలిత మగువసు
ధా వలయము వెదకి వెదకి దక్షిణపుదిశన్. 13

—: హనుమంతుఁడు రామునితో సీతం జూచిన వృత్తాంతంబు సెప్పుట :—

తే. అవధరింపుము దేవ! నే మందఱమును
నేకముఖమునఁ దొలితొలి యిందునందు
నరయుచును బోయి, యొక్కెడ నతివిశాల
మైన భూవివరముఁ గంటి మద్భుతముగ. 14

వ. కని దానిం బ్రవేశించి నిరంతర తిమిగసంవృతంబును, బహుకీటసంకులంబును నైన మార్గంబున ననేక యోజనంబులు సను నెడ, ముందట నర్కప్రకాశం బైన పురంబు గానంబడియె; నందొక్క తాపసాంగన యుండి మమ్ము నాదరించి, తనపేరు ప్రభావతి యనియును, నప్పురంబు మయునిపురం బనియునుం జెప్పి, మధురంబు లయిన భక్ష్య భోజ్యంబు లొసంగినం దృప్తుల మై తదుపదిష్టమార్గంబున మహీవివరంబు నిర్గమించి, సహ్య దర్దుర శైలంబులు గడచి మలయశైల శిఖరం బెక్కి. 15

స్రగ్ధర. లీలం గల్లోలమాలోల్లిఖితగగన మై, లీననానాకుళీర
వ్యాళోగ్రగ్రాహమీనావళుల నెసఁగి, దుర్వారవారోఘగంభీ
రాలంఘ్యప్రౌఢవేగం బగుచు, బహుతరాయామవిస్తార మై బి
ట్టాలోకింపంగ నుగ్రం బగు జలనిధి నంతంతటం గంటి మంతన్.

క. కని యిది రత్నాకర; మి
వ్వననిధిసీమమునఁ గల్గువసుమతిలోనన్
జనకసుత వెదకి కానము;
చన దివ్వారాశి దాఁటి చన నెవ్వరికిన్. 17

ఉ. భూమితనూజఁ గాన మని పోయి రఘూద్వహుతోడఁ జెప్పి, య
బ్భూమిపుచిత్త మాతురతఁ బొందఁగఁ జేయుటకంటెఁ జూడఁగా,
నీమెయిఁ జావు మేలు; మన కేల విచారము లింక? నంచు నం
దేము గడంగి యందఱము నేకతమం బగు నిశ్చయంబుతోన్. 18

వ. అనశనవ్రతంబు సంకల్పించి నియతచిత్తుల మై యుండి, రాఘవు కార్యార్థం బై తెగిన జటాయువు గృతార్థుం డయ్యె; మనము నట్టి పుణ్యలోకంబు వడయము మని పలుకు చున్నయెడ. 19

క. గిరిశృంగతుంగవిగ్రహుఁ,
డురుతరసత్త్వుఁడు, విహంగమోత్తముఁ డం దొ
క్కరుఁ డొయ్యన మా యున్నెడ
కరుదుగఁ జనుదెంచి విగళితాస్రుం డగుచున్.  20

సీ. "అయ్యలార! జటాయు వని పల్కెదరు మీర
లెవ్వరు? సెప్పరే; యేను వాని
కగ్రజుండ; ననూరునాత్మజన్ముల మేము;
సంపాతి నాపేరు; సమ్మదమున
నేనును దమ్ముండు నినమండలమునకుఁ
జను వేడ్క నొకనాఁడు చదలి కెగసి
చనఁ జనఁ దీవ్రాంశుసంతాపమునఁ జేసి
కమరె నా ఱెక్కలు; గమర వయ్యె
తే. నను జూపకుమ్మ; లే నిమ్మహాచలమున
నాఁటఁగోలె నెచ్చటికిఁ జనంగ నేర
కున్న వాఁడ; నాతమ్ముఁ డెట్లున్న వాఁడొ
యెఱుఁగ; నెఱిఁగింపరే నాకు నిష్టమెసఁగ." 21

వ. అనిన నే మతని కి ఖపదీయవృత్తాంతంబును, రావణుండు దేవిం గొని పోవుటయుఁ, దదర్థంబు రావణునితో జటాయువు సమరంబు సేసి యీల్గుటయుఁ జెప్పిన విని దుఃఖితుండై సంపాతి యస్మదీయ ప్రవర్తనం బేర్పడ నడిగి మా కి ట్లనియె. 22

ఉ. "రావణు నే నెఱుంగుదుఁ; బరాక్రమదుస్సహు డన్నిశాచరుం;
డీవనరాశిమధ్యమున నిచ్చటికిన్ శతయోజనంబులన్
భూవిదితంబు లంక యనుప్రోలు తదీయనివాస; మచ్చటన్
భూవరుదేవిఁ గాన నగుఁ: బొం డరయుండు కృతప్రయత్ను లై."

క. అని యతఁడు సనిన సందఱు
మును సాగరతరణకార్యమునకు నుపాయం
బొనరఁ దలపోయునెడ; నే
నని యుత్సాహంబు సేయఁడయ్యె నొకండున్. 24

మ. జననాథోత్తమ! యేను బూని భవదాజ్ఞాలీలచెల్వంబు, మ
జ్జనకుం డైన సమీరదేవుకృపయుఁ జత్త్వోన్నతుం జేయఁగా,
ఘనవాస్తుంగతరంగసంగత మహాగ్రాహోరగాత్యుగ్రద
ర్శన మై పేర్చు పయోధి దాఁటితి జనాశ్చర్యైకసంపాది నై. 25

ఉ. ఆలవణాబ్ధిమధ్యమునయందుఁ ద్రికూటనగంబుమీఁద ను
త్తాలవిశాల హేమమణిధామసముజ్జ్వల మైన లంక యన్
ప్రోలు లోగిఁ గంటి; నెంతయు నపూర్వము దద్విభవంబు; దేవ? య
చ్చో లలితాంగి నారసితిఁ జొచ్చి యనేకవిచేష్టితంబులన్. 26

వ. అరసి యొక్కెడ రావణాంతఃపురం బయిన యశోకవనంబునందు.

సీ. కన్నీరు జడిగొని క్రమ్మఁ బ్రాఁ కెక్కిన
కమ్రకపోలభాగములు గలిగి,
యవశ మై యొఱఁగినయంగవల్లిక పొంత
నున్నభూమీరుహం బూఁత గాఁగ,
వెడలునిట్టూర్పులవేఁడిమిఁ బగిలిన
యధరపల్లవము గాఁరాకుఁ బోలఁ,
దలఁపులసందడి దందడించినతాల్మి
గదిరి శిరఃకంపగతుల బెరయ,

ఆ. నున్నపుణ్యమూర్తి, నుత్తమసౌందర్య,
నవనతాస్య, నార్త యైనదానిఁ
గని విదేహతనయఁ గా నెఱింగితి నేను
హా రఘుప్రవీర యనుచు నడల. 28

క. వినయమునఁ దేవిఁ జేరం
జని, యభివాదనము సేసి "జానకి! రఘునం
దనుదూత నేను మారుత
తనయుఁడ వానరుఁడ; నిన్నుఁ దడవ నిచటికిన్. 29

వ. అరుగుదెంచితి; రామలక్ష్మణు లత్యంత కుశలంబున నున్నవారు; వానరేశ్వరుండయిన సుగ్రీవుండు వారితో సఖ్యంబు సేసి, తత్కార్యంబు దీర్పం బూనె; నింక మసలక నీహృదయేశ్వరుండు సమదెంచు నూఅడిల్లుము 30

క. రక్కసుఁ డఁ గాను జుమ్మీ!
నిక్కము వానరుఁడ నేను; నీమదిలోనం
దక్కు మనుమాన'' మనవుడు
నొక్కింత దలంచికొని సముత్సుక యగుచున్. 31

వ. అద్దేవి నా కిట్లనియె ''నన్నా! ని న్నెఱింగితి; నది యెట్లనిన, రామహితాన్వేషి యగువాఁ డవింధ్యుం డను వృద్ధరాక్షసుండు మున్న యింతయుం ద్రిజటచేత నా కెఱింగించె; నతని పలుకులు దప్పవు; రాఘవుఁడు సుగ్రీవసహాయుం డయి యునికి గలిగినది గావున, నింకఁ దడయక యప్వీరవరుం దోడ్కొనివచ్చి నాకుం బ్రియంబు సేయుము; నీకుం గార్యసిద్ధి యయ్యెడు మరుగు'' మనితన శిరోభూషణం బయిన యీ రత్నంబు మీకు నభిజ్ఞానార్థంబుగా నాచేతికిచ్చిమఱియుఁ జిత్రకూటచరితం బైన కృతకవాయసకథయునుం జెప్పి, వీడ్కొల్పిన నేను లంకాపురదాహంబు సేసి, యిట దేవర కింతయు విన్నవింప వచ్చితి'' నని చెప్పి హనుమంతుండు జానకిహృదయంబు మూర్తిమంతం బైనపగిది నున్న యమ్మహామణి రాజచూడామణికి సమర్పించిన. 32

ఆ. అమ్మనోజ్ఞ రత్న మక్కునఁ గదియించి
పులక లెగయఁ గొంతప్రొద్దు విభుఁడు
జానకీకుచాగ్ర సంగమసుప్తుఁ డై
నట్లు యుండె ముకుళితాక్షుఁ డగుచు. 33

వ. ఇట్లు రాఘవుండు సీతావృత్తాంతంబు విని, తత్సమాగమకుతూహలవ్యగ్రుం డై సుగ్రీవుం జూచి ''దండున కాయితంబు సేయు'' మనినఁ బ్రసాదం బని యతండు నలుదిక్కులం గల వానరనాయకులం బిలువం దొడంగిన. 34

—: వానరవీరులు నానాదేశంబులనుండి సుగ్రీవునొద్దకు వచ్చుట :—

క. శతకోటిద్వయహరిపరి
వృతు లై చనుదెంచి యతులవీరులు, ధీరో
ద్ధతులు, గజుఁడు గవయుఁడు వి
శ్రుతముగ రఘుపతికిఁ దోడు సూపిరి గడఁకన్. 35

క. అఱువదికోటులు గపివరు
లుఱక జగత్త్రియము నొకట నువ్వెత్తుగొనం
దఱిగొన్నయట్లు నడవఁగ
నెఱసి కుముదుఁ డరుగుదెంచి నృపవరుఁ గనియెన్. 36

ఉ. కోటిసహస్రసేన తగఁ గొల్వఁగ, వానరసేన కెల్లఁ దా
మేటి, మహాబలుండు, నిరమిత్రుఁడు, మిత్రసహాయుఁ డై తగన్
వీటికి నుబ్బుగాఁ జటులవేగసముచ్ఛ్రితపుచ్ఛగుచ్ఛవి
స్ఫోటితదిగ్విభాగుఁ డగుచుం జనుదెంచె సుషేణుఁ డత్తఱిన్. 37

క. గణుతింప రాని వానర
గణములతో దధిముఖుండు కాకుత్స్థకులా
గ్రణికిఁ బ్రియంబుగ వచ్చె ధ
రణిభాగము వాహినీచరణచలితము గాన్. 38

ఆ. శతసహస్రకోటిసంఖ్యల యెలుఁగులు
గొలువ, జలదనీలఘోరమూర్తి,
జాంబవంతుఁ డతులసత్త్వుఁ డేతెంచె నా
భూపవరుని కార్యమునకుఁ బూని. 39

వ. మరియు ననేకు లనేక సహస్రసంఖ్యాబలంబులతోడం జనుదెంచి; రిట్లు
గూడిన కపివీరులు వివిధాకారు, లపారబలశౌర్యసారు, లతిఘోరం
బుగాఁ బేర్చి నిగుడుచు, మగుడుచుం, దాఁటుచుఁ, జాఁటుచుం దిరు
గుచు, సురుఁగుచు, మలయుచుఁ బొలయుచు, మత్తిల్లి గిరిగుహాల
యంబులందును, దరువనంబులందును, సరిదుపాంతంబులయందును,
నానందంబున విహరించుచుండిరి; తదనంతరంబ. 40

మ. ప్రభ నొప్పారి యనుంగుఁదమ్ముఁడు మహాభాగుండు సౌమిత్రి పీ
తభయుం డై కొలువం, గపీంద్రబలసంతానంబుతో నుద్ధతిఁ
శుభలగ్నంబున రాఘవుండు గదలెన్ సుగ్రీవసాహాయ్యసం
ప్రభవోత్సాహ మెలర్ప దర్పితరిపుప్రాలేయతిగ్మాంశుఁ డై. 41

ఉ. ఆహరివీరవాహినుల కన్నిటికిన్ మొగ మై, మరుత్సుతుం
డాహవదోహళుం డమ రె; నంగద నీల నలాది వీరు లు
త్సాహము మీఱ నయ్యయిదెసం దగుకావలి యై, సమగ్రస
న్నాహమహోగ్రతం జనిరి నాకవిరోధివధాభిలాషు లై. 42

వ. ఇట్లు నడచి యెడనెడం బ్రభూతవన్యఫలజలాశయంబు లగు ప్రదేశం
బుల విడియుచుం, గపిసైన్యంబు గతిపయదినంబులకు దక్షిణోదధి
తీరంబు సేరి, రెండగు వారాశియుంబోలె ఘూర్ణిల్లు చుండె; నంత
రాఘవుండు రవితనయుం జూచి యి ట్లనియె. 43

క. "మనబల మిది యతిబహుళము;
వననిధియును దుస్తరంబు; వానరవర! యి
వ్వననిధిఁ గడచునుపాయము
మన కొక్కటి నిశ్చయింపుమా తగుబుద్ధిఁ." 44

తే. అని విచారించునెడఁ గొంద అధిపుఁ జూచి
జలధి బలితంపుఁ దెప్పలఁ గడత మనిరి;
ఘనకలంబులు సమకట్టి కడత మనిరి
కొంద; అంతయు విని రఘునందనుండు. 45

సీ. అల్లన నగుచు ని ట్లనియె "మీచెప్పుటల్
దగినయుపాయంబు నగున; యయిన
నగణితం బైన యీహరిసైన్యముల కెల్ల
గలుములుఁ దెప్పలు వలయునన్ని
సమకట్టు టరయ నశక్యంబు, శతయోజ
నంబుల పరపైన యంబురాశిఁ
గలములఁ దెప్పలఁ గడచుచో, రిపుకోటి
యెదురునఁ బైఁబడి పొడువ కున్నె?

ఆ. యదియుఁ గాక యల్పు లగు వణిగ్జనముల
యోజ శూరతతికిఁ దేజ మగునె?
కాన నాదుమతము గా దివ్విధంబు; నా
మనసునిశ్చయంబు వినుఁడు మీరు. 46

చ. వ్రతము ధరించి నిష్ఠ నుపవాసవిధిం గొలుతున్ సముద్రు; నా
కితఁడు ప్రియంబుతోడఁ దెరు విచ్చుట యంతన కల్గెనేని మే;
లితరునిఁగా నను దలంచెనేని నమానుషరోషవేగదీ
పితశరవహ్ని నిజ్జలముఁ బీల్చెదఁ; బ్రేల్చెద నొక్క వ్రేల్మిడిన్." 47

—: రాముఁడు దర్భశయనుం డై సముద్రుం బ్రార్థించుట :—

వ. అని పలికి దశరథాగ్రసూనుండు దానును దమ్ముండును నుపవసించి, దర్భశయను లై జలధీంద్రు నుపాసించు చున్నంత, సముద్రుండు సకలజలచరప్రకరపరివారుం డై రాఘవునకుం బొడసూపి "యయ్యా! నీ వలనఁ బ్రీతుండ నైతి; నీ కెయ్యది ప్రియంబు సేయుదుఁ? జెప్పు" మనిన నతండు "నాకు లంకపై నరుగం దెరు విచ్చునది; యీని నాఁడు సూర్యనిభంబు లయిన మదీయదివ్యాస్త్రంబుల నిన్ను శోషింపం జేయుదు'' ననిన విని సరిత్పతి రఘుపతి కి ట్లనియె. 48

సీ. ''జననాథ నీ కార్యమునకు నే విఘ్నంబు
గావింపనోడుదు నేవిధమున;
వినుము, నావాక్యంబు; జను లెల్ల నెఱుఁగ నీ
కిత్తుటి నేఁ దెరు విత్తునేని
నిల నెల్లవాఁడును విలసితదివ్యాస్త్ర
బలమున సాధింపఁ దలఁచు నన్ను;
మీయందుఁ గపివీరుఁ, డాయతమతి, విశ్వ
కర్మసూనుఁడు శిల్పికర్మవిదుఁడు

ఆ. నలుఁడు నాఁగ నొకఁడు గలఁడు; వాఁ డొలసి నా
యందుఁ దరులు గిరులు నొందవైవ
నవి ధరింతు నేను దివిరి; నీ కది సేతు
వగుఁ గడంక నరిగి పగఱ గెలుము." 49

వ. అని యతని నొడంబఱిచి సముద్రుండు సనుటయు, నమ్మహీపతి నలు రావించి సేతుబంధనంబు సేయ నియోగించిన, ననేక వానరసహస్రంబులు నలుదిక్కులకుం బఱచి గిరిశిఖరంబులుఁ దరునికరంబులు, విఱిచి తెచ్చి యిచ్చు చుండ, నన్నలుండు మున్నీటియందు శతయోజనాయామంబును, దశయోజనవిస్తారంబునుం గా నతిదృఢం బగు సేతుబంధనంబు నిర్మించె; నయ్యవసరంబున. 50

ఆ. అన్నతోడ నలిగి యాప్తులుఁ దాను వి
భీషణుండు వినయభూషణుండు
నెమ్మి నరుగు దెంచి నృపశిరోమణి రాము
శరణుఁ జొచ్చె భక్తిభరితుఁ డగుచు. 51

క. ఆరాక్షసనృపభుని యా
కారము, నింగితముఁ జూచి కాకుత్స్థకులో
ద్ధారుఁ డతని నతిధార్మికుఁ
గా రూపించి ముద మెప్పుఁ గైకొని కరుణన్. 52

ఉ. వానికి దానవేంద్రువిభవంబు సమస్తము నిచ్చువాఁడు గాఁ
బూని ప్రతిజ్ఞ సేసి, కృతపుణ్యుఁడు లక్ష్మణుతోడి చెల్మియుఁ
వానికి నిచ్చి, చెచ్చెర నవారిత వానరసైన్యయుక్తుఁ డై
వానిఁ బురస్కరించుకొని వారిధి దాఁటె మహోగ్రలీలతోన్. 53

వ. ఇట్లు సేతుమార్గంబున సాగరోత్తరణం బాచరించి, త్రికూటపర్వతం బెక్కి, లంకానగరంబుచుట్టును శిబిరంబులు సంఘటింపం బంచిన. 54

క. తాలైలాగురు సాలర
సాల తమాలామ్ర నింబ జంబూ జంబీ
రాలంకృతలంకావన
జాలంబుల విడిసె వృక్షచరసైన్యంబుల్. 55

వ. తదనంతరంబ రావణుచారు లయిన శుకసారణు లనువారలు వానరాకారంబులు దాల్చి శిబిరంబునఁ గ్రుమ్మరుచున్న నెఱింగి, విభీషణుండా రాక్షసులం బట్టించి రామునకు సమర్పించిన, నతండు వారికి నిజసైన్యం బంతయుం జూప నియోగించి విడిచి పుచ్చుటయుం, జని

యయ్యిరువురు నమరవైరిం గని కపిసైన్యంబు దుర్జయం బనియును, రామలక్ష్మణుల తేజోమూర్తివిశేషంబులును నెఱింగించిన, నతండు దాని సరకు సేయక సమరంబునకు మోహరించి. 56

సీ. బద్ధశిలాయంత్రబహుళ మై, యుత్తాలి
తాట్టాలకాభీల మై, యుదగ్ర
కేతుపతాకాప్రకీర్ణ మై, తోమర
ముద్గ రాలాతక ముసల శూల
శర శతఘ్నీముఖ సాధనోపేత మై
యుగ్రవిగ్రహధీర యోధవీర
సంకులం బై, హయ స్యందన వేదండ
చండ మై, సముదిత సప్తసాల

ఆ. మై, యలంఘ్యపరిఖ మై, తృణకాష్ఠజ
లాదివస్తుభరిత మైన లంక
కధికరక్షఁ జేసి యప్రమాదంబున
నుండె రిపుజిగీష నుదితబలుఁడు. 57

వ. ఇట రాఘవుండును సుగ్రీవసహితుం డై యుండి యంగదుఁ జూచి "నీవు రావణు పాలికిం జని యతనికిం దగిన తెఱంగున బుద్ధిగాఁ జెప్పి జానకి విడుచుట మే లని చెప్పు" మని పనిచినం బనివూని యవ్వీరుండు. 58

శా. లంకాద్వారము దుర్నివారముగ నుల్లాసంబునం జొచ్చి, ని
శ్శంకుం డై సురశత్రుసైనికసహస్రంబుల్ దనుం జూచి యా
శంకం బొందఁగ లీలమైఁ జని, సుహృత్సంఘుంబు గొల్వన్ నిరా
తంకుం డై కొలువున్న దైత్యుఁ గని, యుద్యన్మూర్తియై యిట్లనున్.

—: అంగదు రాయబారము :—

క. "ఇనకులతిలకుఁడు, బాణా
సనవిద్యాగురుఁడు, రామచంద్రుఁడు నీతో
నను ని ట్లను మని పనిచెను;
వినుము తదీయోక్తిభంగి విస్పష్టముగాన్. 60

సీ. "అనపరాధులఁ గాననాంతరమ్మున నున్న
పేదతాపసులఁ జంపితి పలుపుర;
నమరుల యిల్లాండ్ర నతిముటిఁ జెఱ వట్టి
తఖిలలోకములకు నలఁత సేసి;
తిది యెల్ల నొకతల, యేపు మీఱఁగ నన్నుఁ
జెనకుట యొకతల సెప్ప నేల?
బలిమి యొప్పఁగ మంచిబంటవై వెడలుము
కయ్యంబునకు; నట్లు గాకయున్న

ఆ. శరణుఁజొచ్చి నాకు జానకి నొప్పింపుఁ
మొండువెంట బ్రతికి యుండఁ దీఱ;
దస్మదుగ్రశరశతాశీవిషంబుల
కెరయ నీదు ప్రాణ; మింత నిజము 61

క. మనుజుండ నైన నాతెఱఁ
గనుమానము వాయఁ జూడు మాహవభూమిన్;
విను రాక్షసులను నామం
బును నడఁపక యేను రిత్తవో నిచ్చెదనే?" 62

వ. అని పలుకుచున్న యంగదు పరుషభాషణంబులకు రోషించిన యసుర పతి కన్నెఱింగి, నలువురు రక్కసులు గ్రక్కున నవ్వాలినందనుం బొదువం బట్టిన, బిట్టెగసి హర్మ్యశిఖరంబుపైకి దాఁటుటయుఁ, దదాక్షేప వేగంబున నన్ని శాచరులు ధరణీతలంబున జర్జరితశరీరులై పడిరి; హరివీరుం డచ్చటనుండి శిబిరమధ్యంబునకు లఘించి భూనాథునకుఁ దన పోయివచ్చినతెఱంగు విన్నవించెం; దదనంతరంబ రాఘవు ననుమతంబున. 63

మత్తకోకిలము. తాలసాలశిలాగ్రహస్తు, లుదగ్రగోత్రమహీధరో
త్తాలదేహు, లనేకవర్ణులు, దారితాఖిలదిఙ్ముఖా
భీలవాలశిఖాగ్రు, లుగ్రగభీరసత్త్వులు, వానరుల్,
కాలకల్పులు పేర్చి సంతన కట్టి రాహవకేళికిన్. 64

క. పరువడి మొత్తములై బం
ధురఘోషం బెసఁగఁ బొంగి తోఁతెంచు హరీ

శ్వరబలమునందు ఘనసా
గరవీచివికాస రేఖ గానఁగ నయ్యెన్. 65

మత్తకోకిలము : కోటఁ బన్నిన ఘోరదానవకోటిఁ జుల్కనఁ దోలి, య
క్కోట నల్గడలన్ మహోగ్రతఁ గూలఁ ద్రోచి, సమున్నమ
త్కూటతోరణయంత్రకేతనగోపురాట్టకసంహతుల్
వీటతాటము సేసి రక్కపివీరు లొక్కట మాత్రలోన్.

వ. మఱియుఁ బ్రాకారంబుపై నున్న గదా పరిఘ కుంత ప్రముఖం
బులు గైకొని లంకామధ్యంబున వైవం దొడంగిన నా బాలవృద్ధం
బగు పౌరలోకంబు హాహాకారవ్యాకులం బై కలఁగంబడియె; నంత
రావణచోదితు లైన దానవులు నానా కోటిసహస్రసంఖ్య లరిగి
యెక్క డెక్కడ యని తలపడి కపిసముదయంబులం దోలి యెప్పటి
యట్ల ప్రాకారంబుం గైకొని నిల్చి; రప్పుడు. 67

క. మును మర్కటబలములచే
ననయంబును గపిలవర్ణ మైనది మగుడన్
దనుజబలసంవృతం బై
ఘనపటలచ్ఛాయఁ గోట కర మొప్పారెన్. 68

క. వచనర సేనలు దెరలిన
నినవంశోత్తములు నృపతు లిద్దఱుఁ గయ్య
మ్మునకుఁ గడంగుటఁ గ్రమ్మఱ
గొనకొని కపిసేనయెల్లఁ గోటకు గవిసెన్. 69

వ. ఇట్లు గవిసినం బ్రాకారరక్షకు లైన రాక్షసవీరులు వారలం జేర
నీక, శిలా శూల పరశు తోమ రాలాత శర కుంత ప్రముఖంబులు
ప్రయోగించినం గయికొనక, వనచరులు వృక్షశిలాప్రకరంబులు వఱ
గించుచుం గడంగి ప్రాకారంబుఁ బ్రాఁకుటయు, నయ్యిరుదెఱంగుల
వారికిం గేశాకేశి యగు సమరం బయ్యెఁ; బదంపడి రావణుండు
వనుసఁ బర్వతుండును, బ్రఘసుండును, ఖరుండును, గ్రోధవశుండును,
బ్రరుజుండునునను రాక్షసు లేవు రనేక రాక్షసపిశాచసేనాపరివృతు

లయి పురంబు వెలువడి మాయ గావించి, యదృశ్యాకారులై కపి
సైన్యంబు నొప్పింపం దొడంగినం గని. 70

ఉ. దారుణవిక్రముండు, రిపుదర్పవిభేది, మహాస్త్రవేది, మా
యారణకోవిదుండు గడు నగ్గి విభీషణుఁ డేఁగుదెంచి, య
వ్వీరులమాయయుం జలము ప్రేల్మిడిలోఁ గుదియించి, వీరకే
శీరసికుండు వారి నవలీలమెయిం దునుమాడె నందఱన్. 71

క. ఆతనిశరపాతంబుల
చేతం గడు నొచ్చి దైత్యసేన సగము ధా
త్రీతలపతితం బయ్యెఁ; వి
భీతిఁ బఱచి పురము సొచ్చెఁ బెఱసగము వెసన్. 72

క. అది యెల్ల విని దశాననుఁ
డుదిత క్రోధుఁ డయి మంత్రియుతముగ వెడలెన్
మదగజఘోటకసైనిక
పదభర భగ్నావనీవిభాగుం డగుచున్. 73

వ. ఇట్లు వెడలి యభేద్యం బగు నౌశనసవ్యూహంబు సంఘటించి వనచర బలంబుపయి నడచినం గనిఁ రాఘవుండును బార్హస్పత్యవ్యూహంబు దీర్చి పేర్చి యెదురు కొనియె; నాసేనలు రెండు నకాండక్షుభిత సాగరయుగళంబు తెఱంగు దోఁప నొండొంటిం గవిసె; నప్పుడు రాముండు రావణుతోడం దలపడియె; లక్ష్మణుం డింద్రజిత్తును, సుగ్రీవుండు విరూపాక్షునిఁ దారుండు నిఖర్వటుం దాఁకి; రి ట్లుభయ పక్షంబులకును దేవాసురులకుంబోలె నాఖిలసమరం బయ్యె నందు.

క. సౌమిత్రి నిశితవిశిఖ
స్తోమంబుల నసురపతిసుతుం బొదివెను; సం
గ్రామమునకుఁ దొలఁగక యతఁ
డామనుజోత్తముని ముంచె నాశుగవృష్టిన్. 75

ఉత్సాహము: అమరవైరివిభుఁడు, దశరథాగ్రసుతుఁడు నేపునన్
సమరసత్ప్రతాపకోపజాల్వలచ్ఛరీరులై
తుములబాణపటలవృష్టిఁ దొప్పఁ దోఁగి, యిర్వురుం
దమక మేది, తమక తమక తనిసి రాహవంబునన్. 76

వ. తదనంతరంబ. 77

క. ఆరావణుండు నిజదో
స్సారంబున రాముబాహుసారం బతిదు
ర్వారం బగు చేర్పడఁ గని
వీరారంభంబుకడఁక విడిచి రయమునన్. 78

క. మగిడి నగరంబు సొచ్చిన
బెగడి నిశాచరబలంబు పెల్లగిలుటయున్,
విగతభయుండు ప్రహస్తుఁడు
తగఁ గోల్తలసేసె నత్యుదగ్రస్ఫురణన్. 79

ఉ. ఆతనిఁ గాంచి తద్బలము లన్నియుఁ గ్రమ్మఱ నాహవోత్సవ
స్ఫీతము లై కడంగుటయుఁ, బేర్చి విభీషణుఁ డుగ్రవానర
వ్రాతసమన్వితంబుగ నవారణ మార్కొనినన్ మహారణం
బాతత మయ్యె సైన్యనివహంబులు రెంటికి నద్భుతంబుగన్. 80

వ. అంత. 81

—: ప్రహస్తధూమ్రాక్షుల యుద్ధము :—

మ. కృతహస్తుండు, ప్రహస్తుఁ, డాహవకళాకేళీవిదగ్ధుండు, ద
ర్పితుఁ డై తాఁకె విభీషణుం గడఁక మైఁ; బెంపారి వారిద్దఱున్
శితశల్యోగ్రమయూరపత్రవిశిఖశ్రేణీశతచ్ఛన్ను లై
ధృతి నొప్పారిరి చిత్రవారిధరసంక్తిచ్ఛన్న శైలాకృతిన్. 82

చ. కదిసి ప్రహస్తుఁ డార్చి పరిఘంబు రయంబున నెత్తి. భీకరో
న్మదకరిహస్త తాడనముమాడ్కి తలిర్పఁగ వ్రేసె నీసు మై
నదయత రావణానుజుని; నాతఁడు వ్రేటున కించుకంతయుం
గదలక హేమకూటగిరికై వడి నిల్చి యుదీర్ణకోపుఁ డై. 83

మ. శత ఘంటాపరిభూషితంబును, జగత్సంహారఘోరానలో
త్థితకీలాసదృశంబు నై మెఱయు శక్తిం బూన్చి మంత్రించి యు
ద్ధతతేజుండు ప్రహస్తు పై చిన వెసం దత్కూర్పరసంపాతపా
టితవక్షుండయి కూలె వాఁడు శతకోటిచ్ఛిన్నశైలాకృతిన్. 84

వ. ఇట్లు ప్రహస్తుండు పడినం దత్సైన్యంబులు విముఖంబు లగుటయు,
ధూమ్రాక్షుండు రోషతామ్రాక్షుండగుచు నతనిబిడబలాహకానీక
భీకరం బై కాలుకొనుచున్న నిశాచరచక్రంబుతో నురులం బఱ
తెంచినం, జలించి బలీముఖబలంబులు దుర్బలంబు లై తొలంగినం
జూచి, యాంజనేయుం డజయ్యుం డై నిల్చినం, జెల్చన యెప్పటియట్ల
యూథపతులుం గూడుకొని; రప్పుడు. 85

సీ. అనిలతనూజ ధూమ్రాక్షరక్షితసైన్య
యుగ్మంబునకు నయ్యె నుగ్రసమర;
మందు నిష్ఠురచరణాఘాతముల డొల్లు
నరదంబులును, శిలాహతులఁ దూలి
యొఱలు నేనుంగులు, నుత్తాలతరుహతిఁ
ద్రెళ్లు ఘోటకములుఁ, దీవ్రనఖర
దంతక్షతంబుల దళితాంగు లై నేలఁ
బడి తన్నికొను వీరభటులు నగుచు

ఆ. నధికశౌర్యసారు లగు కపివీరుల
చేత నొచ్చి, దైత్యసేన భీతిఁ
బఱచెఁ గొంత; బెండువడియుండెఁ గొంత; ధూ
మ్రాక్షు వెనుక కొదిఁగె నంతఁ గొంత. 86

మహాస్రగ్ధర. కని ధూమ్రాక్షుండు విశ్వ
గ్రసనరసలసత్కాలమేఘంబపోలెన్
ఘనగర్జాఘోష మొప్పం
గడఁగి శరశతాకల్పితాసారదుర్ద
ర్శనవీరారంభుఁ డై నన్,
సకలహరిచమూసంఘమున్ విహ్వలం బై
చనెఁ, దూలెం, గూలె, లావుం
జలమును జెదరన్, సంగడిన్ విచ్చె, నొచ్చెన్. 87

తే. అతని యుద్ధతి సైఁపక యనిలసూనుఁ
డనిలవేగుఁ డై పఱతెంచి యార్చి తాఁకెఁ;

ప్రథన మయ్యెద్దఱకు నుగ్రభంగి నమర
పతికిఁ బ్రహ్లాదునకుఁ బోలెఁ బ్రకట మయ్యె. 88

క. పరిఘంబులు గదలును బె
క్కరుదుగ రక్కసుఁడు వైచె నమ్మారుతిపై;
నురుగండశైలములు ఘన
తరువులు హరివరుఁడు గురిసె దానవుమీఁదన్. 89

వ. ఇట్లు ఇంగిం బెనంకువ సెల్లుచుండం గొండొకసేపునకు. 90

స్రగ్ధర. లంకాలుంటాకుఁ డుద్య
ల్లఘుతరగమనోల్లాసి యై డాసి, వీఁకం
బోంకం బేపారఁ జంచ
ద్భుజరచితమహాభూరుహం బెత్తి వ్రేసెం
గింకన్ ధూమ్రాక్షు; వాఁడుం
గెడసెను వదనోద్గీర్ణకీలాలధారా
పంకప్రాగ్భాగమగ్నా
పఘనవిఘటితప్రాణుఁడై యాహవోర్విన్. 91

వ. ఇత్తెఱంగున ధూమ్రాక్షుండు దెగినపిదపఁ గపివరసైనికు లార్చి హనుమంతుని ననేకభంగులం బ్రస్తుతించుచు; రజనిచరులం గనుకనిం దోలినం దూలి, యందఱుం బఱచి పురంబు సొచ్చి దనుజేంద్రునకుం బ్రహస్తధూమ్రాక్షుల మరణప్రకారంబు లెఱింగించినఁ, బ్రకటబాష్ప నిశ్వాసవివర్ణవదనుం డగుచుఁ బంక్తివదనుండు. 92

క. "కలవా రెల్లను మడిసిరి;
కలిగియు లేఁ డయ్యెఁ గుంభకర్ణుఁడు; వీనిం
దెలుపుదునొ? యేనుఁ, గొడుకుం
జల మెడపక రిపులతోడ సరిఁ బెనఁగుదునో?" 93

వ. అని వితర్కించి యప్పటికిఁ గుంభకర్ణప్రబోధంబు గార్యంబుగా నిశ్చ యించి, తదీయశయ్యాగృహంబునకుం జని, వానిం దెలుపం బరిజనం బులం బనిచిన. 94

సీ. భేరీమృదంగగంభీరనాదంబులుఁ,
గాహళఘంటికాకలకలములు;
దారుణసింహనాదంబులు నొనరింపఁ
గడుఁ బెద్దవడికి నంగము గదల్చి
యొదికిలి కను విచ్చి, హా యని బిట్టావు
లించి, కొండొక దేఱి, లేచి నీల్గి,
కలయఁ జూచుటయును, గట్టెదురనయున్న
యన్న నవ్వుచుఁ దన యనుఁగుదమ్ముఁ

ఆ. జూచి యనియె "నిట్టి చోద్యంపునిద్రలుఁ
గలవె యేరికిని జగంబులోన?
నెవ్వ రేమి సైరొ యెఱుఁగవు; ధన్యుఁడ
వీవు; మనకు నైనయెడరు వినవె. 95

వ. దశరథనందనుం డైన రాముండు నాచేత నపహృతభార్యుం డై కలుషించి, యనేక వానరయూథంబులం గూర్చికొని వచ్చి, వనధి బంధించి, మనవీటిపై విడిసి, మమ్మెల్లను నేలకుం గోలకుం దెచ్చుచున్నవాఁడు; ప్రహస్తాదివీరులు వానిచేతం బెక్కండ్రు సిక్కిరి; నీవ కాక వాని జయింప నన్యుండు శక్తుండు గాఁడు; గావున లెమ్ము; గ్రక్కునం బగతుపై నడచి పొడిచి గెలువుము; దూషణానుజులు వజ్రవేగప్రమాథులు నీకుం దోడ్పడియెద" రనిన నట్ల కాక యని కుంభకర్ణుండు విహితపరికరబంధుం డై సమరసన్నద్ధు లైన పరిజనంబులతోడం గూడి వెల్వడి నడతెంచిన. 96

—: కుంభకర్ణుండు యుద్ధము సేయుట :—

లయగ్రాహి. దారుణదవానలశిఖారుణశిరోరుహు, గ
భీరఘనకర్బురశరీరుఁ, బటురోష
క్రూరనయనాంతగళితోరుతరవహ్నికణ
ఘోరముఖు, దంతవలయారభసదంశో
ద్గారిరుధిరాధరు, నుదారభుజసారణవి
దూరితదిగంతుఁ, బదభారవినమద్భూ

భారుఁ ద్రిజగద్విజయభూరిబలు, నద్దనుజ
వీరుఁ గని యచ్చెరువు గూరఁ గపివీరుల్. 97

క. రక్కసుఁడును దనమదిలో
నక్కపి వీరులను జీరికైనఁ గొనకఁ పే
రుక్కున రఘుకులవీరుల
దిక్కునకుం గవియుదెంచెఁ దీవ్రస్ఫురణన్. 98

మ. వడి నడ్డం బరికట్టి నెట్టన హరివ్రాతంబు పెన్ భ్రామఁకులం;
బిడుగుల్వోని మహోద్ధతాశ్మముల నాభీలంబుగా దైత్యు బి
ట్టడువన్ వైవఁగఁ జొచ్చెఁ; గొందఱు బలం బారంగ వేడాసి దం
దడి తత్కాయము సించి రుగ్రనఖదంతన్యాససంక్రీడలన్. 99

ఉ. కన్నుల నిద్ర దేఱఁగ నకంపితుఁ డై, యతఁ డెంత సేసినం
దన్ను నెఱుంగ, కొక్క మొగిఁ దత్కపిసైన్యచయంబుఁ బోరఁ బే
రన్నన మ్రింగఁ జొచ్చె, విలయాగమసంభృతదర్పరోషవే
గోన్నతలీలఁ గాలుఁడు జనోత్కరమున్ గ్రసియించుచాడ్పునన్. 100

వ. ఇట్లు బల, చండబల, వజ్రబాహులు లోనుగాఁ బెక్కేంద్ర యూథపతు
లను, బహుసహస్రసంఖ్యల వానరయూథంబును మ్రింగియు, గొద
గొని వచ్చుచున్న యన్నిశాచరుని మార్గంబున నోడి తారప్రముఖు
లైన బలిముఖులు నలువంకలం బెదరి పఱచిన- 101

మ. కని సుగ్రీవుఁడు బిట్టదల్చుచును, వేగం బార దైత్యేంద్రు మా
ర్గాని సాలంబున వావి యాఁదలఁ గడున్ ఘోరంబుగాఁ బూన్చి వ్రే
సిన, నావ్రేటున నిద్రదేఱి, కడఁకం జేదోయి సారించి, య
మ్మనుజాశుండు గపీంద్రుఁ బట్టె రభసోన్మాదంబుమై నార్చుచున్.

క. పట్టువడిన సుగ్రీవునిఁ
గట్టెదురం గాంచి, యధిక కలుషితమతి యై
దట్టుఁడు లక్ష్మణుఁ డసురన్
బిట్టేసెం బిడుగుఁబోని పృథుబాణమునన్. 103

సీ. ఉరమాడి యాశరం బుచ్చి పోవుటయును,
గడు నొచ్చి యాకుంభకర్ణుఁ డలిగిఁ
వెస వాలితమ్ముని విడిచి, తోరపుశిలఁ
గొనుచు నుక్కున రామమూర్తి తమ్ము
దెసఁ బాఱుతెంచిన, ధీరుండు సౌమిత్రి
భల్లయుగ్మమునఁ దద్బాహుయుగము
నఱక మాయాబలోన్నతుఁడు దైత్యుఁడు చతు
ర్బాహుఁడై తోఁచిన భానుకులుఁడు

ఆ. చేతు లెల్లఁ దునిమె శితభల్లముల; వాఁడు
మఱి యనేకహస్తమస్తకాంఘ్రి
భాగుఁ డైనఁ గినిసి బ్రహ్మాస్త్ర మేసినఁ
గూలె నసుర గొండ గూలునట్లు. 104

వ ఇట్లు కుంభకర్ణుఁడు దెగటారినం జూచి దూషణానుజులు వజ్రవేగుం డును: బ్రమాథియు రాఘవానుజుం దలపడి నిబిడబాణౌఘనిమగ్నుం జేయుటయు, నతండును వారి నతిబహుళం బగు శరజాలంబునం బొదివినఁ, గయ్యం బొక్క ముహూర్తంబు చూపఱకు రోమహర్షణం బై చెల్లెఁ; దదనంతరంబ. 105

చ. అనిలసుతుండు నీలుఁడు రయం బెసఁగం బఱతెంచి, యమ్మహా
దనుజులమీఁద నేపున నుదగ్రనగాగ్రయుగంబుఁ బూన్చి వై
చినఁ. గడు రూపఱం జదిసి, చెప్పఁగఁ జూపఁగ లేక పోయి ర
ద్దనుజులు; వానరోత్కరము దద్దయు నుబ్బున నార్చె నత్తఱిన్

క. ఆకులపడి నలుదెసలం
గాకులక్రియఁ జెదరి, కడు వెగడుపడి, రక్షో
నీకములు లంక యెనిమిది
వాకిళ్ళం దూఱెఁ బౌరవర్గము దలఁకన్. 107

క. అంతఁ దన కూర్మితమ్ముం
డంతకుఁ గూడుటయు, దూషణానుజమృతివృ
త్తాంతంబును విని యెంతయు
వంతఁ దలరిఁ యఱచెఁ బంక్తివదనుఁ డవశుఁ డై. 108

వ. అయ్యవసరంబుననాముక్తకవచుండును,నాబద్ధతూణీరుండును,ప్రచండ కోదండ పాణియుఁ, గృపాణబాణబాణాసనాదివివిధసాధనోపేత సన్నిహితస్యందనుండును, బురందరహృదయసాగరమందరుండును నైన మేఘనాదుండు దండ్రిం జేరం జనుదెంచి వినయంబున ని ట్లనియె. 109

చ. "వగవఁగ నేల? దైత్యకులవల్లభ! యేఁ గలుగంగ నిమ్మెయిన్
జగముల నీదుశత్రులకు శౌర్యము సెల్లునె? వృత్రవైరి లో
నగు సురకోటి యే పడఁచి యప్రతిమోన్నతి నున్న నాకుఁ గ్రో
తిగముల నోర్పు టెంతపని? ధీరత నన్ గృపఁ బంపు మాజికిన్. 110

ఉ. కూడినకొండ్రముచ్చులను గ్రోఁతుల నుగ్రత ముట్టి కిన్కఁ జెం
డాడెద; నుజ్జ్వలోగ్రవివిధాంబక జృంభితదిఙ్ముఖుండ నై
యాడెద వీరనృత్యము; రయంబునఁ బార్థివసూను లిద్దఱం
గ్రీడయపోలెఁ గిట్టి పెడకేల్పగిఁ గట్టెదఁ; బట్టి తెచ్చెదన్." 111

వ. అనినం దెలివొంది మందోదరీసుందరుండు ప్రియనందనున కి ట్లనియె.

సీ. "నీ పరాక్రమలీల నిక్కమే నెఱుఁగనే?
పుత్ర! నీభుజబలస్ఫురణమునన
కాదె నా కిట్టివిఖ్యాతియు సిరియును
గలిగె; గీర్వాణసంఘంబుతోడఁ
గూడ నయ్యింద్రునిఁ గొని వచ్చి నాబంటుఁ
గా నొనరింపవే గర్వ మెసఁగ;
మాయావిదుండవు, మహితదివ్యాస్త్రవి
శారదుండవు నీవు; సంగరమునఁ

ఆ. బగతు రెల్ల వెగడుపడఁగ దృశ్యాదృశ్య
దుర్నిరూపభంగిఁ దొడరి చిక్కు
వఱుచు నీ మహోగ్రబాణపాతంబులు
దశరథాత్మజులకుఁ బరమె యోర్వ? 113

ఆ. నిఖిలశత్రుచయము నిశ్శేషముగఁ జంపి
యనఘ! సమరనిహతు లైన యస్మ

దీయజనుల ఋణము దీర్చుము; మసలక
పోయి రమ్ము; పోరఁ బొడిచి గెలుము." 114

వ. అని కౌఁగిలించుకొని వీడుకొల్పిన నింద్రజిత్తు సత్వరుం డై యరదం
బెక్కి, లంకాపురంబు వెలువడినం గని, వచనరానీకంబు లార్చుచు
నెదురు నడచుటయు, నతండు దాని నించుకయు సరకుగొనక కర
తలం బెత్తి లక్ష్మణునిం బిలిచిన. 115

—: ఇంద్రజిత్తు లక్ష్మణునితోడ యుద్ధము సేయుట :—

క. విని యాతండును మౌర్వీ
నినదంబున గగనధారుణీమధ్యం బె
ల్లను మ్రోయ మత్తగజముం
గనిన మృగేంద్రుండపోలెఁ గడఁగెం బెలుచన్. 116

వ. అంత 117

ఉ. జైత్రులు, గోత్రభూమిధరసారులు, సాగధీరు, లుల్లస
చ్చిత్రధనుఃకళావిదు, లజేయులు, భూరిజయార్థు లవ్వు సౌ
మిత్రియు మేఘనాదుఁడు నమిత్రవిభేదులు దాఁకి రార్చి లో
కత్రయభీకరప్రధనకౌతుకవేగితచిత్తవృత్తు లై. 118

క. మచ్చరము మీఱ నొండొరుఁ
జిచ్చుఱపిడుగులనుబోని శితవిశిఖములం
జెచ్చెర నొంపఁగ విలునే
ర్పచ్చుటఁ దుల్యంబ యయ్యె నయ్యిద్దఱకున్. 119

క. తనకంటె నపుడు రావణ
తనయుం డని మీఱఁ జూచుఁ; దా నాతనికం
టెను మున్న రాఘవానుజుఁ
డనుపమశరలీల నతిశయంబుగ మెఱయున్. 120

క. అంతఁ బటుతోమరంబుల
నెంతయు వెస నృపతనూజు నింద్రజి వైవన్
సంతతశరముల నన్నిటి
నింతింతలు శకలములుగ సేసె నతండున్. 121

వ. అట్టియెడ నంగదుండు గడంగి లక్ష్మణునకుం దలకడచి, యమంద వేగంబున మందోదరీనందనుం గవిసి, ఘనమహీరుహంబునఁ దన్మస్తకంబు వ్రేసినం జలింపక నిలింపపతివైరి నిశితప్రాసంబు వాసవపౌత్రుం జంప నెత్తుటయు, లక్ష్మణుండు దానిం దునియ నేసిన, నయ్యసురయు గదాదండంబుఁ దిర్చి యంగదు వక్షంబు వ్రేసినం, దొలంగక చెలంగి వాలిసూనుండు సాలవృక్షంబున నా రాక్షసు రథంబు రథ్యసారథి సహితంబుగాఁ జదియ నడిచె; నట్లు విరథుం డయి యచ్చోటన యంతర్ధానంబు నొంది గగనగతుం డయ్యెఁ; బదంపడి. 122

క. ఎవ్వలన నుఱుకునో యతఁ !
డెవ్వరి నెటు సేయునొక్కొ ! యిం దనుచుఁ గడుఁ
నివ్వెఱపడి కపిసేనలు
గ్రొవ్వు సెడం బంక్తివదనుకొడుకు క్రుద్ధతుఁ డై. 123

చ. ఉఱుముచు నంత్యకాలచరితోగ్రబలాహకలీల దోఁపఁగాఁ,
దఱచగు ఘోరవృం బిడుగుఁదండము వోని శరప్రతాన ము
క్కఱఁ దొరఁగించుచుం, గపిబలావళిఁ ద్రుంచి కలంచె నేపునఁ;
నెఱకులు నొంచి బాణమయనీరధి ముంచె రఘుప్రవీరులఁ. 124

క. మాయాధికు, నంతర్హిత
కాయుఁ, బురందరవిరోధిఁ గాకుత్స్థులు క్రో
ధాయత్తు లగుచు నేసిరి
ధీయుక్తులు శబ్దభేదిదివ్యాస్త్రములన్. 125

వ. వానికి నలిగి సుగ్రీవాదివానరులు వృక్షశిలాప్రకరంబులు గైకొని యాకసంబున కెగసిన, నద్దానవుండు వారినందఱ వెఱచఱవ నేయుటయుఁ, జేవ సెడి మగిడి పుడమి కెఱఁగిరి; వాఁ డంత నిలువక వాఁడితూపులు వఱపి రామలక్ష్మణులఁ గరంబు నొప్పించినం, జె య్యేది యయ్యన్నయుం దమ్ముండును గపిబలంబు లడల ధరణీతలంబునకు నొరగి, విలయకాలపతితు లయిన సూర్యేందుల చందంబున నున్నం గని, సింహనాదంబు సేసి. 126

మ. పరమోదాత్తులఁ, బార్థివోత్తముల, కుంభద్విక్రమారంభులన్,
సురసంకాశులఁ, గోసలప్రభుల, నస్తోక ప్రభోద్దాములన్
వరలాభోన్నతుఁ డన్నిశాచరుఁడు గర్వం బొప్ప దుర్వారని
ర్భరనాగాస్త్రములం దదాహవమహిన్ బంధించె నయ్యుద్ధతిన్. 127

వ. తదవసరంబున సుగ్రీవ సుషేణ జాంబవత్ప్రముఖు లయిన కపివీరులు రామలక్ష్మణు లున్నయెడకు జనుదెంచి, యెయ్యదియునుం జేయు నది సేరక, దుఃఖితు లగుచుండ నవ్విభీషణుండు వారి నాశ్వాసించి, బ్రహ్మాస్త్రప్రయోగంబున నారాజకుమారులకు బంధమోక్షణంబు గావించె; సుగ్రీవుండు విశల్యకరణియను నౌషధంబున వారల విశల్య దేహులం జేసె; నిట్లు ప్రబుద్ధులై రాఘవులు గ్రమ్మఱఁ గయ్యంబు నకుం గడంగి; రప్పుడు రావణానుజుండు రామునకుఁ గృతాంజలియై యి ట్లనియె. 128

సీ. "నరనాథ ? కిన్నరనాథుని పనుపున
శ్వేతుండు నాఁగఁ బ్రసిద్ధుఁ డైన
గుహ్యకుఁ డిదె మీకుఁ గొని వచ్చె దివ్యతో
యంబు; లీజలముల నంబుజాక్ష !
నయనపద్మ క్షాళనము సేయుఁ డిప్పు; డ
దృశ్యభూతము లెల్లఁ దెల్లముగను
గానంగఁబడు" నన్నఁ గైకొని రాఘవుం
డనుజసహాయసమన్వితముగ

ఆ. నట్ల చేసి కనియె నంబరమధ్యసం
చారుఁ, గృతవిపక్షసంప్రహారు.
నింద్రజాలశీలు, నింద్రవిద్రావణు,
రావణాగ్రతనయు, రహితవినయు. 129

వ. ఆ రక్కసుండునుం దన చేసిన పౌరుషంబు ప్రతిహతం బగుటకు విస్మయం బంది, మగిడి హోమకార్యంబును దొడంగం బోయిన నెఱింగి, విభీషణుండు లక్ష్మణుం జూచి "యిన్నిచునకు హోమ సమాప్తి యయ్యెనేని నెవ్వరికిం గెలువ నశక్యంబు; వీని నెన్నడిం దగిలి తెగటార్పు" మనిన నతండు. 130

ఆ. అర్చి వెనుకఁ దగిలి యశనికల్పము లైన
శరము లేయుటయు, నిశాటవరుఁడు
గినిసి వడి నెదిర్చి, కీలించె లక్ష్మణు
నంగకముల నుజ్జ్వలాంబకముల. 131

వ. ఇట్లు దలపడి యవ్వీరు లిరువురు నిశాచరవనేచరబలంబులు రణంబుడిగి వెఱఁగుపడి తమ పోరు సూచుచుండ, నుద్దండవేదండయుగళంబుపోలిక, నాభీలశార్దూల ద్వయంబుకరణి, నసహ్యాసింహాయమళంబులై వడి నతిఘోరయుద్ధంబు సేయం దొడంగి; రంత. 132

క. వడి నొక్కపెట్టు లక్ష్మణుఁ
డడరించె నిశాతశరము లాగక్కసుపైఁ;
గడఁగి యతఁడు నాతనిపై
నెడపక నాటించెఁ గలయ నెనిమిదియమ్ముల్. 133

ఆ. వాఁడితూపు లొడల వడి నాటుటయు నొచ్చి
తోనఁ బరుషరోషధూమకేతుఁ
డతిశయిల్ల రాఘవానుజం డురుచాప
శింజినీరవంబు సెలఁగఁ గదిసి. 134

—: ఇంద్రజిత్తు లక్ష్మణునిచేతఁ జచ్చుట :—

మ. శితభల్లద్వితయంబునం గడువెసం జేదోయి ఖండించి, ఖండితగోత్రాచలతుంగశృంగశతకోటిస్ఫారఘోరానల
ద్యుతిసాంద్రం బగు శాతభల్ల మొకటం ద్రుంచెం గనత్కుండలాన్వితమై యొప్పు నిశాచరేంద్రుశిరమున్ వీరక్రియాదక్షుఁ డై. 135

ఆ. భగ్నశాఖ మైన పాదపంబునుబోలె
నిట్లు సంగరమున నింద్రజిత్తు
వడినఁ జూచిఁ దైత్యబలములు భయమంది
పఱచెఁ; జెలఁగి యార్చెఁ బ్లవగబలము. 136

క. తనయునిమరణం బేర్పడ
విని దశకంధరుఁడు శోకవివశుం డై బో

రన బాష్పము లొలుకఁగ వా
యనుచుం బదినోళ్ళఁ దెఱచి యఱచెం బెలుచన్. 137

క. శోకంబు సైఁపలేక, య
శోకవనంబునకు నరిగి, సురశత్రుఁడు రో
షాకులుఁ డై జానకిఁ బ
ఱ్ఱాకారం జంపఁ జంద్రహాసము వెఱికెన్. 138

వ. అప్పుడు వయోవినయవృద్ధుం డైన యవింధ్యుం డతని వారించి యి ట్లనియె. 139

చ. "ఇది దగునే? దశానన! మహేంద్రుఁడు లో నగు దేవతాతతిం
గదనములో జయించి త్రిజగంబులఁ బేర్కొని యున్న నీకు ని
మ్ముదిత వధింతు నంట గడు మోసము గాదొకొ? యొప్పుదేని నే
పొదవఁగ రాఘవున్ గెలువు; ముగ్మలిఁ జంపినఁ బెంపు గల్గునే?"

వ. అనినం దద్వచనంబుల నుపశమితరోషుం డయి దోషాచరేశ్వరుండు సమర సన్నాహం బమర రథం బెక్కి మిక్కిలి బీరంబు సొంపార నఖిలసేనాసహితంబుగాఁ బురంబు వెల్వడి నడతెంచె నంత. 141

శా. సుగ్రీవాది సమస్తవానరులుఁ బ్రస్ఫూర్జన్మహావిగ్రహ
వ్యగ్రాకారతఁ బేర్చి, భూరుహశిలావ్రాతంబులం దాల్చి, వా
లాగ్రవ్యాచలనంబు లొప్ప, దశకంఠాగ్రేసరోదగ్ర దై
త్యాగ్రామంబు నెదిర్చినన్ సమర మత్యంతోగ్ర మయ్యెన్ వడిన్.

వ. ఆ సమయంబున నఖిలమాయాకుశలుం డైన దశముఖుండు మాయ గావించిన. 143

క. ఆరావణు దేహంబున
ఘోరగదాశక్తిఖడ్గకోదండధరుల్
వీరులు సహస్రసంఖ్యల
వారలు జనియించి రసురవరు లుద్ధతు లై. 144

వ. వారి నందఱఁ గౌసల్యానందనుండు సాంద్రశరజాలంబుల నవలీలం దునిమి తూఁటాడిన, నమ్మేటిరక్కసుండు మఱియు నొక్క మాయ

ప్రయోగించి రామ లక్ష్మణప్రతిరూపంబు లనేకంబు లుత్పాదించు టయు, నయ్యన్నయుం దమ్ముండును వెఱఁగుపడియునుం జిడిముడి వడక, యమ్మాయారూపంబు లన్నియుం దునిమె; తదనంతరంబ.

చ. అభినవభానుబింబరుచిరాకృతియున్, హరి యుగ్యముల్, మహా
రభసదురాసదంబును, విరాజితకేతనవైజయంతికా
ప్రభమును నైన తేరు సురపాలకుపంపునఁ జేసి రాఘవ
ప్రభునకుఁ దెచ్చి మాతలి సభక్తికుఁ డై ప్రియ మొప్ప నిట్లనుల్.

మ. "ధరణీనాథ! సురేంద్రుతే రిది; మహాదైత్యేంద్రులం దొల్లి యీ
యరదం బెక్కి యనేకులం దునిమె బంభారాతి ఘోరాజి; నీ
యరదం బెక్కి వధింపు మీవును మదీయస్ఫారసారథ్యని
ర్భరభంగిన్ దశకంధరుం ద్రిభువనీభంగోన్నమత్కంధరున్." 147

మ. అనినన్ మాతలి నాదరించి, యరదం బారాఘవుం డెక్కి, యు
క్కునన మీఱన్ రిపుకోటిమీఁద విసలత్కోదండమౌర్వీమహా
స్వనభిన్నాఖిలదిగ్విభాగుఁ డగుచున్, శాతాస్త్రధారాభిషే
చనపూతప్రతిపక్షసైన్యుఁ డగుచున్ సంరంభదుర్వారతన్. 148

ఉ. అత్తఱి రావణుండు విలయానలదుస్సహమూర్తి యై నరేం
ద్రోత్తముమీఁదఁ దేరు గడు నుగ్రగతిం బఱపించి, సంతతో
ద్వృత్తశరప్రవాహపరివీతదిశాముఖుఁ డైనఁ జూచి, పే
రుత్తల మంది రాతనిసముద్ధతికిన్ దివినుండి నిర్జరుల్. 149

వ. ఇట్లు దలపడి రామరావణు లతిఘోరంబుగాఁ బోరం దొడంగి; రంత బంక్తివదనుండు నిబిడజ్వాలాకరాళం బగు శూలంబు రాఘవుమీఁదం బ్రయోగించినఁ నతండును నడుమన దానిఁ దునియలు నేసిన, నీసునం బెరిఁగి సురవైరి మఱియునుం దరతరంబ శతసహస్రసంఖ్యలు గల శూలంబులు, భిండివాలంబులుఁ, దోమరంబులు. శరంబులుం బఱపించి యంబరం బెల్ల నస్త్రమయంబు గావించిన, నఖిలభూతంబులును హాహాకారవ్యాకులంబు లయ్యె; నసురసైన్యంబున భేరీప్రముఖతూర్యనినదంబులు, సింహనాదంబులు సెలంగె; నంతఁ గొండొకసేపునకు రావణప్రయుక్తం బైన శస్త్రాస్త్రదహనం

బంతయు నిరంతరవిశిఖధారాసారంబునం గబళించి, రామజలధరంబు గంభీరసంరంభంబునం బొదలుటయు, సకల ప్లవంగసముదయంబును బ్రహర్షకోలాహలం బయ్యెఁ; బదంపడి. 150

—: శ్రీరాముఁడు రావణాసురుని సంహరించుట :—

సీ. కమనీయకనకపుంఖప్రభాభాసియుఁ,
దీక్ష్ణముఖంబును, దివిజయక్ష
మునిసిద్ధసాధ్యసమ్మోదావహంబు నై
విలసిల్లుబాణ మవ్వీరవరుఁడు
గైకొని, బ్రహ్మాస్త్రకలితమంత్రాభియు
క్తంబుగా నొనరించి, కార్ముకమున
సంధించి, జగములు జయపెట్టఁ జెచ్చెరఁ
దివిచి యేయుటయును; దీవ్రభంగిఁ

ఆ. గడఁగి యాశరంబు గల్పాంతదహనంబ
పోలెఁ బంక్తికంఠుఁ బొదివి, నీఱు
గా నొనర్చె సూతఘనరథరథ్యస
మన్వితముగ నొక్కమాత్రలోన. 151

వ. అప్పు డంబరంబున దివ్యతూర్యనాదంబులు సెలంగం, గలంగి యసురు లెల్లఁ దొలంగిరి; గంధర్వగానంబులు, నప్సరోనర్తనంబులుఁ బ్రవర్తిల్లె; నింద్రాదిదేవోత్తము లన్నరదేవోత్తముం బ్రస్తుతించుచుం బ్రమోదంబు నొందిరి. 152

క. ఏకోత్సవంబు లయ్యెఁ ద్రి
లోకంబులు, నఖిలలోకలుంటాకుఁడు, ఘో
రాకారుఁడు, దశవదనుఁడు
గాకుత్స్థనిశాతశరముఖంబునఁ బడినన్. 153

ఉ. అంత ననంతకీర్తి, శరణాగతరక్షణశాలి, రాఘవుం
డెంతయు వేడ్కతోడ నసురేంద్రుపదంబున నవ్విభీషణున్
సంతతపుణ్యుఁ బుణ్యజనసంతతివర్ధనుఁ గట్టెఁ బట్ట మ
త్యంతదయాంతరంగుఁడు గృతాహితభంగుఁడు దానుఁ దమ్ముఁడున్.

వ. తదనంతరంబ యవింధ్యుండు విభీషణసహితుం డై జానకి నుచిత యానంబున నునిచికొని రామదేవుపాలికిం దెచ్చి "దేవా! దేవిం బరిగ్రహింపు" మని విన్నవించుటయు నతండు. 155

చ. అతిమలినాంగి, జీర్ణమలినాంబర ధారిణి, సంతతాశ్రుపం
కితవిలసత్కపోలఁ, బరికీర్ణ జటాయిత కేశభార, నా
యతఘనదుఃఖదూషితఁ, బ్రియాంగనఁ గన్గొని యప్రియాత్ముఁ డై,
నుతచరితుండు దద్దయు మనోవ్యథ సేయుచు నింతి కిట్లనున్.

సీ. "అధికదుష్టాచారుఁ డైన దశాననుఁ
డింతకాలముఁ దనయింటఁ బెట్టి
కొని యున్న నిన్నుఁ గైకొనిన నస్మచ్చరి
త్రమునకుఁ దొడరదే ధర్మహాని ?
పరిభవంబునకు నై ప్రతికారముగ వైరిఁ
గూల్చితిఁ గాని, నీకొఱకుఁ గాదు;
మెలఁత! నీచరితంబు మే లైనఁ గీ డైనఁ
గా నిమ్ము; నిన్ను నిక్కముగ నొల్లఁ;

ఆ. బరఁగఁ గుక్కవాతఁ బడిన హవ్యముభంగి
యయ్యె నీ తెఱంగు నరయ నిపుడు;
గాన యిచటఁ దటయఁ గాదు; చెచ్చెర నీకు
నిష్ట మయినకడకు నేఁగు మతివ ?" 157

ఆ. అనినఁ జెవులఁ గొఱవి గొని చూఁడిన ట్లైనఁ
దాల్మి పెల్లగిల్లఁ దరళనయన!
మొదలు నఱక నొఱగు కదళిచందంబున
నెలఁత దల్లడమున నేల వ్రాలె. 158

క. వెఱఁగుపడి హర్ష రాగము
దఱిఁగిన వెలువెల్ల నై, వదనములు వ్రాలం,
దెఱఁ గేదిఁ ఱిచ్చపడి ర
త్తఱిఁ దత్పరిజనము లెల్లఁ దద్దయు వంతన్. 159

తే. పడఁతి యల్లన మఱికొంతపడికిఁ దెలిసి
యలసమూర్తియై, దండడి నశ్రు లురులఁ,
గేలు మొగిడించి వసుమతీపాలుఁ జూచి
యెలుఁగుగుత్తుకఁ దగులంగ నిట్టులనియె. 160

క. "నినుఁ గీడు వొరయ కుండఁగ,
జనులకు నానిక్క మెక్క, జననాయక! నే
ననలంబుఁ జొచ్చి వెడలెదఁ
గనుఁగొను; మిచ్చనవు నాకుఁ గరుణింపు దగన్. 161

ఉ. నా దగుబుద్ధి నీదుచరణస్మరణంబ యొనర్చుఁ గాని, యొం
డేదియు నెన్నఁడుం దలఁప దిట్టిద; యొం డొకచంద మైన ని
మ్మేదినియుం గృశానుఁడు, సమీరుఁడు, శీతకరుండు, నర్కుఁడుం
గా దన కీక్షణంబ ననుఁ గాల్ప రె? వేల్పులు చెట్ట నైతురే?"

వ. అని పలుకుటయు నప్పుడు పృథివ్యాదిభూతంబు లెలుంగులు సెలంగ
నెల్లవారును వినం దమ నామంబు లెఱింగించి యి ట్లనిరి 163

క. "విను ముత్తమురాలు సుమీ
జననాయక! జనకతనయ; సందేహపడం
బనిలేదు; మాకుఁ దెల్లము;
జనులకు మము మొఱగఁ రాదు సకలక్రియలన్." 164

వ. అనిన యనంతరంబ సకలసురమునిగణసహితంబుగాఁ బితామహుండు
సమదెంచి, రాఘవుచేత నమస్కృతుం డై యి ట్లనియె "నయ్యా!
నీవు సకలభూత దుస్సహుం డైన రావణుం బరిమార్చి లోకహితంబు
నేసితివి; వినుము; నలకూబరుశాపంబునం జేసి దశగ్రీవునకుఁ బరస్త్రీల
యందు బలాత్కారంబు సెల్లదు; కావున నీధర్మపత్ని యొం డొక్క
దురితంబును బొరయదు; నీవు నిర్వ్యిచారుండ వై యిప్పతివ్రతం బరి
గ్రహించి, నెమ్మదిఁ బురంబున కరుగు" మని పలికి, యతనికిఁ బ్రియం
బుగాఁ దత్సమరనిహతు లైన వానరులఁ బ్రాప్తజీవులంగాఁ జేసి,
పరమేష్ఠి సనియె; బురందరసారథియును దాశరథి వీడ్కొని
హరిసహస్రయుక్తంబయిన రథంబు గైకొని నాకలోకంబున కరిగె;
నంత. 165

మ. అవిరోధంబున జానకీసహితుఁ డై యాబద్ధరత్నప్రభా
నవపుష్పం బగు పుష్పకం బను విమానం బెక్కి, యర్కాన్వయ
ప్రవరుం డిమ్ముల నేఁగె సమ్మదభరప్రాగ్భారవారాకర
ప్లవమానుం డగుచుం బురంబునకుఁ బ్రాప్తశ్రీవిశేషోన్నతిన్. 166

వ. ఇట్లరిగి భరతాదిబంధుజనంబులు, నఖిలపరిజనంబులు నభినందింప, వసిష్ఠవామదేవాదివిరచితం బైన యభిషేకశోభనంబు వహించి, రాముండు సుగ్రీవ విభీషణాది సుహృజ్జనంబులను, ఋక్షవానరబలంబులను బ్రకట బహుమానవిశేషంబుల నాదరించి వీడ్కొలిపి, యభిమతభోగంబుల, నిరంతరత్యాగంబులఁ, బ్రభూతయాగంబులఁ, బ్రసిద్ధుం డయి బహుసహస్ర వత్సరంబులు వసుమతీ సంరక్షణం బాచరించె; నిది రాఘవుచరిత్రంబు. 167

ఉ. వారక యిట్లు పూని వనవాసనిరంతరదుఃఖమున్, మహా
వైరికృతాపకారదురవస్థయు నోర్చి శుభంబు నొందఁడే
యారఘురాముఁ ? డట్ల వసుధాధిప! నీవును దుఃఖ మింతయుం
బైరణ నోర్చి పొందెదవు సర్వమహీవలయాధి రాజ్యమున్." 168

వ. అని చెప్పిన విని యుధిష్ఠిరుండు రాముని పరాక్రమ విశేషంబు గొని యాడి, జానకి పాతివ్రత్యమహిమయు నింత యొప్పునే యని పలికి, "మునీంద్రా; పతిభక్తితాత్పర్యంబున నఖిలదుఃఖంబుల కోర్చి, శుభంబు లొందిన పుణ్యసతిచరిత్రంబు వినవలతుం జెప్పవే" యనిన నతనికి మార్కండేయుండు "సావిత్రియను రాజపుత్రి చరిత్రంబు విను; మది నీ ప్రశ్నంబునకు నుత్తరం బగు" నని యిట్లనియె. 169

—: మార్కండేయుఁడు ధర్మజునకు సావిత్ర్యుపాఖ్యానంబు సెప్పుట :—

సీ. "కలఁడు మద్రేశుండు ఘనుఁ డశ్వపతి యను
ధరణీశుఁ; డతఁడు సంతానకాంక్ష
నెంతయు ధృతిఁ బదునెనిమిదియేఁడులు
సావిత్రిఁ గొల్చెఁ; సజ్జనవిభునకు
నద్దేవి ప్రత్యక్షమై "వరమడుగుము"
నావుడు, నతఁడు వినమ్రుఁ డగుచు

"నాత్మజుఁ గోరెద;" ననవుడుఁ " గన్నియ
పుట్టు నీ" కనియె నా భువనమాత;
తే. యనుడు "దేవి! భవత్కృప నస్మదీయ
వాంఛితము సఫలంబు గావలదె?" యని నృ
పోత్తముఁడు విన్నవింప, నయ్యోగమూర్తి
గాఢకారుణ్యవికచపద్మాత్క్రమల యగుచు. 170

వ. "ఏను నీమనోరథంబు తెఱంగు మున్న చతుర్ముఖున కెఱింగించిన, నతండు గన్నియఁగా నిర్దేశించె; నద్దేవుని యానతి యమోఘంబు; విను మక్కన్నియకారణంబున నీకు నొక్క విధంబునం బిదపఁ బుత్ర శతలాభంబు నగు; సంతసిల్లు" మని యనుగ్రహించి యద్దేవి యంతర్ధానంబు నొందె; నయ్యశ్వపతియును సావిత్రీ ప్రసాదంబున నిజధర్మపత్ని యయిన మాళవియందు సావిత్రి యను కూఁతుం గని యక్కన్నియ నతిగౌరవంబునం బెనిచె; నంత. 171

క. అవనజాక్షి పరిస్ఫుట
యౌవన యై సిద్ధసాధ్యయక్షామరక
న్యావలిఁ దనసౌందర్య
శ్రీవిలసనరేఖ నపహసించుచు నొప్పెన్. 172

తే. కోరి జనపతి దనకూర్మికూఁతుఁ జూచి,
"గుణవయోరూపముల కనుకూలుఁడైన
భర్త నెమ్మెయి దీనికిఁ బడయువాఁడ
నొక్కొ" యని యెందుఁ దడవుచునుండె నెలమి. 173

వ. అదియును సాళ్వపతి యైన ద్యుమత్సేను కొడుకు సత్యవంతుండు రూపవంతుండనియును, గుణవంతుండనియును విని, వానియందుఁ జిత్తంబు దగిలియున్నను. సిగ్గు పెంపున నెవ్వరికి నెఱింగింప కుండె; నంత నొక్కనాఁ డమ్మద్రపతికడకు నారదుం డరుగుదెంచిన, నతం డమ్మహాముని నుచితసపర్యాపరితోషితుం జేసి, సద్గోష్ఠీవిశేషంబు సలుపుచున్న యెడ. 174

క. నెచ్చెలులు దన్నుఁ గొలువఁగఁ
బచ్చవిలుతుకలిమి యెల్లఁ బద్మాననయై
యచ్చుపడినట్లు మెఱయుచు
నచ్చటి కేతెంచె భూవరాత్మజ నెమ్మిన్. 175

వ. ఇట్లు వచ్చి సఖీజనంబు నంతంత నిలిపి, మెలపుతోడిపొలుపున నమ్ముగ్ధ లీలామధురం బగుచుండఁ దండ్రికి మ్రొక్కిన, నతండు ప్రగాఢ స్నేహసన్నాహదోహళం బగు చిత్తంబుతో నత్తన్వి గ్రుచ్చి యెత్తి, నిజాంకతలంబున నునిచికొని, సముచితోపలాలనకేళీపరవశుం డయ్యె, నప్పుడు నారదుం డమ్ముద్దియం జూచి యశ్వపతితోడ "నిక్కన్నియం దగిన వరున కొసంగక యిట్లేల యునిచినాఁడ?" వనిన నతండు గూఁతున కిట్లనియె. 176

తే. "తల్లి! నీగుణరూపవృత్తముల కెందుఁ
దగినవరుఁ గాంచనైతిని దడవి; కాన
నీ మనస్సున కెక్కిన నృపకుమారుఁ
గోరి వరియింపు; మిదియ నాకును బ్రియంబు," 177

వ. అనిన నదియుఁ గొండొక లజ్జించి, కోర్కి పెంపున సిగ్గు దొలంగం ద్రోచి, ప్రకట కౌతూహలతరళితాంతరంగ యగుచుఁ దండ్రికి నల్లన యి ట్లనియె. 178

క. "చిరకీర్తి సాళ్వభూవరు
వరతనయుం డయిన సత్యవంతుఁడు నాకుఁ
వరుఁడుగఁ గోరుదు మదిలో;
నరవర! యాతనికి నిమ్ము ననుఁ బ్రీతిమెయిన్. 179

వ. సాళ్వపతి యిప్పుడు దైవయోగంబునం జేసి విగతచక్షుం డయి, తన రాజ్యంబు వైరులచేతం గోల్పడి, పుత్రదారసహితంబు వనంబున నున్నవాఁ; డెట్లయినను సత్యవంతున వరియింతు" ననిన మద్రేశ్వరుండు నారదుం జూచి "మునీంద్రా! మీ యెఱుంగనివారు లేరు; సావిత్రిచేత వరియింపఁబడిన కుమారుం డెట్టివాఁడు? వాని గుణ రూపశీలంబు లెఱింగింపుఁ" డనిన నారదుం డి ట్లనియె. 180

సీ. "సత్యంబు పలుకుట సత్యవంతుం డన
నతఁ డొప్పు; మఱియుఁ జిత్రాశ్వుఁ డనఁగ
నామాంతరంబు నన్నరనాథసుతునకుఁ
గలదు; తేజంబునఁ గమలమిత్రు
బుద్ధి నింద్రాచార్యుఁ బురుడించు; శూరత
వాసవుఁ, దాలిమి వసుధఁ బోలుఁ;
గాంతిఁ జంద్రున కెన గాఁదగు; రూపున
నాశ్వినేయుల సరి యనఁ దలిర్పుఁ; 180

ఆ. దపము, శమము, దమము, దానంబు, బ్రాహ్మణ
భక్తియును, మహానుభావతయును
నతనియంద కాని యన్యులయందు లే;
దింత నిక్కువము మహీతలేశ! 181

వ. వానియందును గీడు నొక్కటియుఁ గలదు; నేడు మొదలుగా నొక్క సంవత్సరంబునకు మృతిం బొందు; నిది నీకుఁ జెప్ప వలయుటం జేసి చెప్పితి" ననిన నతండు గూఁతు మొగంబు సూచి "తల్లీ! యమ్మహాత్ముండు దేవరహస్యంబు లెఱుంగు; నీతని వచనం బమోఘంబు; నీకు నట్టి వరుం డేల? యొండొక్క వరుని వెదకికొ"మ్మనిన నక్కన్నియ తండ్రి కి ట్లనియె. 182

క. "వినుము మనోవాక్కాయము
లన మూఁడు దెఱంగు లందు నంతఃకరణం
బనఘ! ప్రధానము; గావున
మనమునఁ గైకొన్నభర్త మానం దగునే? 183

వ. సత్యవంతుం డెట్టివాఁ డైన నగుంగాని యే నింక నొరుల వరియింప నొల్ల" ననిన నశ్వపతి నారదు దెసఁ జూచుటయు నతం డి ట్లనియె.

చ. "గొనముల ప్రోక నీయనుఁగుఁగూఁతురు; దీని తలంపు మాన్పఁగా
మనకు నశక్య; మింక ననుమానము లేల? నరేంద్ర! కూఁతుఁ జ
య్యన నృపసూతి కిమ్ము; కమలానన చేసిన పుణ్యగౌరవం
బున నయినం బ్రియుండు పరిపూర్ణచిరాయురుపేతుఁ డయ్యెడున్."

వ. అనిన నమ్మహీపతి యమ్మునిపతికి మ్రొక్కి "నీవు మాకుం బరమ గురుండవు; నీ యానతిచ్చినట్ల చేసెద" ననిన నారదుండు వారి దీవించి దివంబునకుం జనియె నంత. 186

సీ. అమరఁ బుణ్యదినంబునందు బాంధవమంత్రి
వృద్ధపురోహితవితతితోడ
సావిత్రిఁ దోడ్కొని, జననాయకుండు వై
వాహికమహనీయవస్తుకోటి
గొనుచుఁ, బుణ్యారణ్యగోచరుం డై తప
స్వి స్థితుఁ డైన యాద్యుమత్సేనుకడకు
జనిన, నారాజును సంభ్రమంబున నశ్వ
పతికి నర్ఘ్యాదిసంభావనంబు

ఆ. లాచరించి; సముచితాభిమతాలాప
పూర్వకముగ సుజనపూజ్యుఁ డతని
యాగమననిమిత్త మడిగిన, మద్రేశుఁ
డెలమి సాల్వపతికి నిట్టు లనియె. 187

క. "ఈకన్నియ నాకూఁతురు;
మాకులమున కెల్లఁ దేవ; మనుజోత్తమ! నీ
వీకన్నియఁ గోడలు గాఁ,
గైకొనుము మదీయవచనగౌరవబుద్ధిన్." 188

వ. అని పలికి సావిత్రి నతనికి నభివందనంబు సేయించి మఱియు నతండు.

క. "నీకొడుకు సత్యవంతున
కీకన్నియ దగు; నరేంద్ర! యీ కన్నియకున్
నీకొడుకు దగు; ననన్యగు
ణాకరు లియ్యిరువురును సమంచితమూర్తుల్." 190

వ. అనిన నతనికి ద్యుమత్సేనుం డి ట్లనియె. 191

తే. "విగతరాజ్యుల మై ఘోరవిపినములకు
వచ్చి యిమ్మెయిఁ దపమున్నవార మేము;

బాల, సుకుమారి యిది జనపాల! యడవి
నుండి మాతోడి యిడుమకు నోర్చునయ్య ?" 192

వ. అనిన నశ్వపతి యతని కిట్లనియె. 193

చ. కలిమియు లేమియుఁ సతము గా; వవి సెందినచోఁ జెలంగుచుం
గలఁగుచు నున్కి ధీరులప్రకారమె ? లెస్సగ నింతవట్టు నేఁ
దెలియుదుఁ; జెప్పెదఁ వసుమతీవర ! పిన్న యనంగ నేల ? యే
కొలఁదియుఁ గాదు; ధీరమతి గూఁతురు; పేర్కొనఁ జాలఁ బెంపునన్.

క. నీతోడ వియ్య మందం
జేతోగతి నాసఁ జేసి చెచ్చెర నిట్లే
నే తెంచితి; మత్ప్రార్థన
భ్రాంతిగఁ జేకొనక యునికి పాడియె నీకున్ ?" 195

—: సావిత్రి సత్యవంతుని వివాహం బగుట :—

వ. అనుటయు నయ్యంధనృపతి తత్సంబంధమునకు సంతసిల్లి, నిజాశ్రమ వాసు లైన మునులం గూర్చుకొని, శుభలగ్నంబున సత్యవంతునకు సావిత్రిం బరిణయంబు సేసె; నయ్యశ్వపతియునుం గూఁతునకు నల్లునకు వివిధాంబరాభరణాది వస్తువిశేషంబు లొసంగి నిజపురంబున కరిగెఁ; బదంపడి. 196

తే. పడఁతి రమణీయభూషణాంబరవిలాస
ముజ్జగించి, వనాంతరయోగ్యలీల
వల్కలాజినవసన యై, వదల కధిక
భక్తి భర్తృశుశ్రూషణపరత నుండె. 197

క. ఆ మెలఁత సేయు సవినయ
సామకథల, మృదుగభీరసంభావనలఁ
మామయు న త్తయు సంతో
షామృతమునఁ దేలి రంతరంగమునఁ దగన్. 198

వ. సావిత్రియుఁ దన మగని యాయుఃప్రమాణంబు నారదముని చెప్పిన దినంబు మొదలుగా ననుదినంబును లెక్క యిడికొనుచుండె; నిట్లు వర్తిల్లు చుండ నాలుగు దివసంబులు గొఱంతగా నొక్క సంవత్సరంబు గడచిన. 199

క. నాలవదినంబు పతి మృతి
కాలం బని మది నెఱింగి, కడు నిష్ఠమెయిం
జాల భరంబుగఁ బూనెను
బాల త్రిరాత్రోపవాసపరమవ్రతమున్. 200

వ. దానికి విస్మయం బంది ద్యుమత్సేనుండు గోడలిం బిలిచి "తల్లీ యిట్లేల దుస్తరంబగు వ్రతంబు గొడంగితి ?" వనిన నమ్మద్ర రాజ తనయ వినయంబుతో ని ట్లనియె. 201

క. "మీరు మదీయం బగు వ్రత
భారమునకు వగవ వలదు; పరమశుభంబుల్
గోరి యొనరింపఁ బూనితిఁ;
గారణమును మీ కెఱుంగఁగా నగు మీఁదన్.'' 202

వ. అనిన నతం డట్లేని మేలు గాక యనియె; నంతఁ జతుర్థదివసంబున.

సీ. కడురేపకడయ మేల్కాని, నిజభర్తకు
మరణదినం బని మానసమునఁ
దద్దయు శోకసంతాపంబు గదురంగ
దినముఖోచితవిధుల్ దీర్చి, భక్తిఁ
బతికి సమంచితపావనపరిచర్య
యప్పుడు కడువేడ్క నాచరించి,
యత్తకు మామకు నచటివిప్రులకును
వేర్వేఱ ప్రణమిల్లి, వేడ్క వారు
తే. దనకు సౌభాగ్యభాగ్యవర్ధనము గాఁగ
నిచ్చు దీవన మదలో గ్రహించియున్నఁ
బ్రొద్దు జామెక్కుటయుఁ బూవుఁబోఁడిఁ బిలిచి
మామ యిట్లని పలికె సమ్మానమెసఁగ. 204

క. "కడు నుగ్రం బగు వ్రత మిది
దొడఁగితి; దివసత్రయంబుతో నది సెల్లెం;
బడఁతీ ! యెంతయు డస్సితి;
దడయక పారణ యొనర్పఁ దగదే యింకన్.'' 205

వ. అనిన సావిత్రి యతని కిట్లనియె. 206

ఆ. "అధిప! ప్రొద్దు గ్రుంకునంతకు నేఁడును
గుడువఁ దగదు నాకుఁ; గోరి యిట్లు
గాఁగ వ్రతముఁ బూనుకాలంబున యేను
నిశ్చయించుకొనిన నియమమిదియ." 207

వ. అనియె; నప్పుడు సత్యవంతుండు సమిత్కుశఫలాహరణార్థంబు వనంబునకుం గదలినం జూచి, సావిత్రి యతనిఁ జేరం జని, "వనంబున కేనును నీతోడఁ జనుదెంతుఁ; దోడ్కొని పోవలయు" ననిన నతండు "నీవు త్రిరాత్రోపవాసంబునం జేసి యెంతయు డస్సినదానవు; రా నోప" వనిన నది వాని కిట్లనియె. 208

మ. "ఉపవాసశ్రమ మించుకేనియును నా యుల్లంబునం దోఁప; దీ
విపినం బుజ్జ్వలపుష్పపల్లవఫలావిర్భూతి నానాలతా
గపరీతం బన విందుఁ; జూడఁగ మదిం గౌతూహలం బయ్యె; న
న్నుపరోధింపకు; మింతవట్టు చన వీ యుక్తుండ వెబ్బంగులన్."

వ. అనిన నతం డట్లకాక చనుదె మ్మనుటయు సావిత్రి చయ్యనం జని, భార్యాసహితుండయి యున్న తన మామకుం బ్రణమిల్లి "మీకొడుకు వనంబునకు నగ్నిహోత్రార్థం బై సమిధలు దేర నరిగెడు; నాకును నతనితోడన చని వనంబు సూడ వేడ్క యైనది; మీరు నా కివ్వరంబు గృపసేయ వలయు" ననిన నాతం "డిమ్మగువ యెన్నండును నెయ్యదియును నడుగ; దిత్తెఱంగు దీనికిం బ్రియం బై యున్నది; నాకు నివారింప నేల?" యని తలంచి యనుమతించిన నయ్యిరువుర యడుగులంబడి వీడ్కొని. 210

## —: సత్యవంతుఁడు సావిత్రీసహితుం డై వనంబునకుం బోవుట :—

క. చిత్తంబునఁ బై కొనియెడు
నుత్తల మడఁచుచును, ముఖపయోరుహమునఁ ద
ళ్కొత్తెడు వెడనవ్వునఁ బ్రియు
చిత్తం బిగురొత్తఁ జనియెఁ జెలువ యడవికిన్. 211

వ. ఇట్లాదంపతులు మందగమనంబున నరిగి పరిసరారణ్యంబు దఱియం జొచ్చి రప్పుడు. 212

సీ. కమనీయకమలినీకల్లోలవీథులఁ
గదలు రాయంచల గతుల యొప్పు,
బహుపుష్పపల్లవప్రకరచిత్రితము లై
తనరారు తరులతాతతుల సొంపు,
మకరందరసపానమదవిలోలంబు లై
క్రాలెడి యెలదేఁటిగముల యులివుఁ,
బరిపక్వమంజులఫలరసోద్ధతము లై
పలుకు రాచిలుకల పటురవంబు, 212

ఆ. ప్రియుఁడు వేఱువేఱ ప్రీతి మైఁ జూపుచుఁ
జెప్పుచును జనంగఁ, జిగురుఁబోఁడి
గనుచు వినుచు నిర్వికారసల్లాప మిం
పార నతని తెఱఁగు నరయు చుండె. 213

వ, తదనంతరంబ యారాజర్షినందనుండు మధురంబు లగు ఫలంబులు గోయుచు గరిడియ నిండించి, యొక్కయెడఁ బరశుపాతమునం జేసి కాష్ఠదళనంబు సేయందొడంగి, శ్రమంపడి యొల్లంబోయి, గొడ్డలి పుడమిపయి వైచి నిరంతరనిశ్వాసవేగ వివర్ణ వదనుం డగుచు సావిత్రిం గనుంగొని. 214

చ. "ఒడలు వశంబు గాదు; శ్రమనొందినయట్లు మనంబు చూలెడిం;
గడఁగి శిరంబు శూలవిశిఖప్రకరంబున నొంచినట్టి ద
య్యెడు; నిలువంగ నోర్వ; నొకయించుక సేపు శ్రమంబు దీఱ నీ
యెడ శయనింతు" నావుడు సితేక్షణ మెత్తనిసంభ్రమంబుతోన్.

క. తనయంకతలమ ప్రియుశిర
మున కుపధానముగఁ జేయ. భూపతనయుఁ డొ
య్యన వ్రాలి సోలి నిశ్చే
తనుఁ డైన ట్లుండెఁ; గొంతతడవున కెదురన్. 216

మ. కనియెం గోమలి నీలమేఘ విలసత్కాలాంజనాకారు, ఘో
రనిశాతోత్కటదంష్ట్రు, నుజ్జ్వలచలద్రక్తాక్షుఁ, బ్రత్యగ్రకాం
చనవర్ణాంబరు, నంత్యకాలదహనజ్వాలాప్రచండున్, జగ
జ్జనసంత్రాసను, నొక్కదివ్యుఁ బటుపాశప్రౌఢహస్తోద్ధతున్. 217

వ. అప్పురుషుండును నధికసంరంభంబున సత్యవంతుం గదిసిన, నయ్యింతి యెంతయు భయంబునం బ్రియునిశిరం బొయ్యన దిగువం జేర్చి నిల్చి కృతాంజలి యై "యయ్యా! మీ రెవ్వ? రియ్యెడకు నెయ్యది సేయం దలంచి విజయంచేసితి ?" రనిన నతం డి ట్లనియె.

సీ. "కాలుండఁ జువ్వె యేఁ గమలాక్షి; నను నీవు
మహితపాతివ్రత్యమహిమఁ జేసి
కానంగఁ జాలితి; కాన రా దన్యుల
కిటు; నీదుభర్తకు నిపుడు కాల
మగుటయు, వీఁడు మహాపుణ్యనిధి గాన
యితరులఁ బనుపక యేన వీనిఁ
గ్రచ్చఱఁ గొనిపోవఁగాఁ జనుదెంచితి"
నని యుగ్రభంగి నయ్యంతకుండు. 218

ఆ. ధరణినాథతనయు తనువునఁ బ్రాదేశ
పరిమితాత్ముఁ డగుచుఁ బ్రజ్వరిల్లు
జీవు వెడలఁ దిగిచి, చెచ్చెర సతిదీర్ఘ
భయదపాశనికరబద్ధుఁ జేసి. 219

మ. కొని వేగంబున దక్షిణాభిముఖుఁ డై ఘోరంపుమార్గంబునం
జనఁగాఁ జొచ్చెఁ; ననంతరంబ మదిలో సావిత్రి శోకంబు పై
కొనఁ, బ్రాణేశ్వరుదేహ మొక్కయెడ సంగుప్తంబు గావించి, యా
తనిపజ్జం దగఁ దాను నేఁగెఁ బదపద్మంబుల్ వడిం దొట్రిలన్. 220

ఆ. దానిఁ జూచి కరుణ ధర్ముండు "నీ వేల
వచ్చెదవు ? లతాంగి! వలదు నిలువు;
మింక నీ కగమ్య మిటమీఁదిదెరు వెల్ల"
ననిన నతని కిట్టు లనియెఁ బొలఁతి. 221

క. "పతు లెందుఁ జనిన నచటికి
సతులకుఁ జన నలదె? నీప్రసాదముననుఁ, మ
త్పతిభక్తికతముననుఁ సం
స్తుతగుణ! నా కరుగరాని చోటులుఁ గలవే? 222

వ. సకలమార్గంబులందును ధర్మమార్గంబు ప్రధానం; బట్టిధర్మంబునకు నాధారంబు సజ్జనుల యని వినంబడు; నట్టి సజ్జనసందర్శనం బెప్పుడు వృథగాదు; గావున సజ్జన శేఖరుండ వనం జను నీదైన సందర్శనంబునం బరమశుభంబులం బొందక యేను రిత్తజనంబుల తెఱంగున నూఱక యెట్లు మగుడుదు?" ననిన దాని ప్రగల్భవచనంబులకు నద్భుతం బంది ధర్ముం డి ట్లనియె. 223

ఆ. "తనులతాంగి! భవదుదార వాగ్భంగికి
మెచ్చు వచ్చె నాత్మ; నిచ్చువాఁడ
వేఁడు మొక్కవరము, విభునిజీవిత మొక్క
టియును దప్ప; నేదియయిన నొండు." 224

—: సావిత్రి యమునివలన నభీష్టవరంబులు వడయుట :—

చ. అనవుడు మద్రరాజసుత ప్రాంజలి యై సమవర్తితోడ ని
ట్లను; "రిపుకోటిచే నపజయంబునఁ బొంది వనాంతరంబునం
దనవరత వ్రతాభిరతుఁ డైన మహాత్ముఁడు, సాళ్వభూవిభుం,
డనఘుఁడు లబ్ధచక్షుఁ డగునట్టులుగాఁ గరుణింపవే దయన్." 225

క. నావుడు "నట్టుల యయ్యెడు;
నీ విట రా వలదు; మగుడు నెమ్మి" నని వెసం
బోవఁ దొడంగెను బితృపతి;
యావెలఁదియు నంత నిలువ కరిగెఁ బిఱుందన్. 226

వ. అట్లు సని చని మఱియు ని ట్లనియె. 227

చ. "ఎడపక వాఙ్మనఃక్రియల నేరికి నెగ్గొనరింపఁ బూన; రె
య్యెడలను దీనులం గరుణ యేర్పడఁ బ్రోవన చూతు; రిచ్చుచోఁ
గడమ పడంగ నీ రెదిరికాంక్షితముల్ దుదిముట్టఁ దీర్తు; రె
క్కుడు మదిఁ గూర్తు రాశ్రితులకుఁ; విను మిన్నియు నార్యధర్మముల్.

క. నీ వెఱుఁగనియది యెయ్యది
దేవోత్తమ! ధర్మగతుల కెఱుఁ గెల్ల భవ
ద్భావాధీన మగుటఁ గా
దే వెలసితి నీవు ధర్మదేవత యనఁగాన్. 229

క. సమబుద్ధితోడఁ దత్త
త్సముచితకర్మఫల మఖిలజంతుతతులకున్
సమకూర్చుట, నీ కయ్యెను
సమవర్తి యనంగఁ బేరు జగదభినుత మై. 230

క. యముఁ డండ్రు నిన్ను నార్యులు
యమింతు భూతముల నెల్ల; నట్లగుటఁ దగున్;
శమనుండ వైతి కల్మష
శమనంబునఁ జేసి నీవు జలజాప్తసుతా!'' 231

వ. అనినం బ్రేతపతి యాపుణ్యసతి కిట్లనియె. 232

క. ''తృషితుఁ డగువానిఁ బరిలఘు
తుషారతోయములు మోదితునిఁ జేయుగతిన్
హృషితాంగుఁ జేసె నను గ
ల్మష హారణములైన నీ సమంజసభణితుల్. 233

వ. కావున సత్యవంతు ప్రాణంబులు దక్కం దక్కినకోర్కి యెయ్యది
యైనం జెప్పుము; సఫలంబు సేసెద'' ననిన సావిత్రి ''దేవా! వైరుల
చేత నపహృతం బైన రాజ్యం బెప్పటియట్ల ద్యుమత్సేనుండు
ప్రాపించునట్లుగా ననుగ్రహింపవే'' యని వేఁడుటయు వైవస్వతుం
డట్ల యగునని పలికి యి ట్లనియె. 234

ఆ. ''వలదు నిలువు మింక; వదలక నీభక్తి
మగని కెక్కె; దుర్గమంపుఁద్రోవ
యిది; కృతంబు లయ్యె నెల్లయు; నీ విట
వచ్చు సెలవు లేదు వనజనయన!'' 235

వ. అనిన నమ్మహాభాగ యతని కిట్లనియె. 236

క. "ధర్మాత్ములు దమ సలిపెడు
ధర్మక్రియ దప్పు రెట్టిదశలందును; మో
హోర్మియుఁ, దాపముఁ బుట్టవు
ధార్మికహృదయములఁ; బ్రథమధర్మాధ్యక్షా! 237

క. కావునఁ బతియనుగమనం
బేవిధమున విడువఁ దగవె; యెట్లయినను మో
హావేశముఁ బొందక ధ
ర్మావస్థితి సలుప వలదె యవహితబుద్ధిన్ ?" 238

తే. అనిన నంతకుఁ డిట్లను "సతిప ! నీవు
ప్రకటధర్మవిశేషతత్పరవు; గాన
యింక నొకవరమిత్తుఁ, బ్రాణేశుబ్రతుకు
వలదుగాని, యొండడుగుము వలయుదాని." 239

వ. అనుటయు నక్కాంత కృతాంజలి యై "మాతండ్రి మద్రేశ్వరుం డపుత్రుకుం; డతనికిఁ బుత్రశతలాభం బగునట్లుగాఁ బ్రసాదింపు" మని యభ్యర్థించిన నట్ల కానిచ్చితి నని పల్కి ధర్మరాజు "నేఁడు నీవు గడుదూరంబు వచ్చి డస్సి; తింక మగుడుట లెస్స" యని పలికిన నప్పతివ్రత యి ట్లనియె. 240

తే. "నాకు డప్పి యెక్కడిది ? మనంబు భర్తృ
చరణపంకజాసక్త మై కరముభక్తి
నలరు చున్నది; సతులకు నన్య మెట్టి
దియును ధర్మమె భర్తృసంశ్రయమకాక. 241

వ. మఱియు నొక్క విన్నపంబు సేసెద. 242

ఆ. ఆత్మధర్మనిరతు లైన పుణ్యాత్ములు
దుర్లభులు; సమస్తదురితములును
శాంతిఁ బొందు వారిసంసర్గమునఁ; దీర్థ
పూతమతులు వారె భూతలమున. 243

ఉ. వారలపేర్మిఁ గాదె శశివారిజమిత్రులు నిర్వికారసం
చారత నల్లసిల్లెదరు, సర్వపయోనిధులున్ నిరాకులా

కారతఁ గ్రాలెదుం, గులనగంబులు నిశ్చలరూఢిఁ జాల నొ
ప్పారెదు; భూతధాత్రి నిఖిలైకధురీణతఁ బేర్మిఁ బొందెదున్.''

వ. అని పలికి మఱియు నిట్లనియె. 245

తే. ''ఏడుమాటలాడినయంత నెట్టివారు
నార్యజనులకుఁ జుట్టంబు లగుదు రనినఁ,
జిరసమాలాపసంసిద్ధిఁ జేసి నీకు
నేను జుట్టమ నని వేఱ యేల చెప్ప? 246

వ. కావున మిత్రమనోరథం బవశ్యకర్తవ్యంబుగాఁ జిత్తగింపు'' మనిన నమ్మహాను భావుం డబ్బామినిదెసం గనుంగొని ''నీకుం బ్రసన్నుండ నైతి; నభీష్టం బైన వరం బొక్కటి యిచ్చెద వేఁడు'' మనిన నమ్మానిని యిట్లనియె. 247

క. ''మది సత్యవంతుజీవిత
మది యిమ్ముగఁ దొలఁగఁ బెట్టి యన్యంబుల ని
చ్చెద నని పలుకుదు మును నీ;
వది యిప్పుడు లేద; యింక నడిగెదఁ బ్రీతిన్. 248

చ. పతివిరహంబు దుస్సహము; భర్తృవినాకృత యైనకాంత దూ
షిత యగు సర్వమంగళవిశేషములందును; గాన మత్ప్రియుం,
డతులితకీర్తిశాలి, సుగుణాఢ్యుఁడు, సాళ్వసుతుండు లబ్ధజీ
వితుఁడుగ నిమ్ము ధర్మపదవీపరిరక్షణ! పుణ్యవీక్షణా'' 249

వ. అనిన నట్ల చేయుదు నని యాతఁ డంబ కృతాంతుండు సత్యవంతు నపగతపాశుం జేసి యాసుందరి కిట్లనియె. 250

చ. ''కొను మిదె నీ మనఃప్రియునిఁ గోమలి! వీఁడు చతుశ్శతాబ్దముల్
మను నిటమీఁద; బుత్రులఁ గ్రమంబున నూర్వురఁ గాంచుఁ; గీర్తివ
ర్ధనుఁ డగు; సంతతాధ్వర విధానములం బరితుష్టి సేయు న
య్యనిమిషకోటి నెల్లను; నిజాన్వయమౌళివిభూషణుం డగుణ్.'' 251

వ. అని యాదేశించి యాతం డంతర్హితుం డయ్యె; నక్కాంతయుఁ గ్రమ్మఱి చని యెప్పటియట్ల జీవితేశ్వరుం దన తొడలపై నిడికొని

కూర్చున్న యెడం, గొండొక వడికి లబ్ధచేతనుం డై, సత్యవంతుండు
తెలిసి, నిజవల్లభం జూచి యి ట్లనియె. 252

క. "కడుఁ దడవు నిద్రవోయితిఁ
బడఁతీ! ననుఁ దెలుపఁగలదె? బలియుఁ డొకరుఁ డె
క్కుడుజవమునఁ బట్టి బలం
బెడలఁగ ననుఁ దిగిచె; నాతఁ డెవ్వఁడు సెపుమా? 253

చ. అది కల గాదు; నిక్కువము యైనటు లున్నది; నాకు నెంతయున్
మది వెఱ పుట్టె" నావుడును మానిని యిట్లను "నీకు నంతయుఁ
ముదమున రేపు సెప్పెదఁ; దమోమయమై యిదె శర్వరీముఖం
బొదవె; విలంబనం బిచట నొప్పదు; లెమ్ము నరేంద్రనందనా! 254

మ. అదె నక్తంచరు లిందు నందును మహోగ్రాకారులై క్రందుగా
మెదలం జొచ్చిరి; ఘోరఫేరవరుతుల్ మిన్నందెఁ దీవ్రంబు లై;
పదశబ్దంబులు మీఱఁ జూడు కలయం బాఱం దొడంగెం బెనుం
గదుపుల్ గట్టి మృగంబు లియ్యెడ; భయోత్కంపంబు నా కయ్యెడిన్.

క. విను నీవు దడయుటకు మీ
జననియు జనకుండుఁ గరము సంతాపభరం
బునఁ బొందుదు రింతకుఁ; గ్ర
న్నన వారికి సంతసం బొనర్పవె యధిపా!" 256

వ. అని పలికి తదీయవిషాదచేష్టితంబు లుపలక్షించి వెండియు. 257

చ. "తమమును బెల్లుగాఁ బరఁగె; దవ్వు నిజాశ్రమభూమియున్; దను.
శ్రమమును బాయ దిప్పు నను చందమ యైనఁ జనంగ నేల? యిం
పమరఁగ నింత ప్రొద్దు సుగుణాకర! యిచ్చట నిల్చి రేపు వో
దమె? తెలుఁ గెద్ది?" నావుడును దన్వికి సాళ్వతనూజుఁ డిట్లనున్.

క. "మానె శిరోవేదన; నా
మేనికిఁ దగు లావు వచ్చె; మెల్లన యరుగం
గా నోర్తుఁ; దల్లిదండ్రులఁ
గానక యే నెట్లు నిలుతు గానన భూమిన్?. 259

క. ఇంతకు మున్నెన్నఁడు నే
నింతతడవు వారిఁ బాసి యెందుఁ దడయ; నేఁ
డింతపడి మసలుటకు వా
రెంత వడిరో? యేమి యైరో? యెట్లున్నారో! 260

ఆ. సంధ్యప్రొద్దు నన్ను జనని యెన్నఁడు నిలు
వెడల నీదు; నేఁడు విపినభూమి
మధ్యరాత్రివేళ మసలుట కాయమ
యెట్టిపాటు పడునొ యే నెఱుంగ. 261

సీ. కౌఁగిట నను: జిక్కఁగదియించి శిరముమూ
ర్కొంచును బాష్పముల్ గురియుచుండఁ
"బట్టి! మా యొడలును, ప్రాణంబులును, నెల్ల
యర్థముల్ నీవ; మాయన్న! నీవు
దేసగా సంసారతీరంబు సేరెద
మని తలంచెదము సు మ్మన్న; యన్న!
కన్నులు లేని మా కన్నులుఁ గాళులు
నీవ కదన్న! మానిఖిలవంశ

ఆ. మును సముద్ధరించు మోపు నీయదియ క
దన్న" యనుచు నిట్టు లగ్గలంపుఁ
బ్రేమ ననుదినంబుఁ బ్రేముడింతురు వృద్ధు
లక్కటకట! యేమి యైరొ నేఁడు! 262

ఆ. అడవి కేఁగుదెంచి యడరంగ ఫలమూల
తతులు గొనుచు నేను దడయ కపుడ
పోవఁ గాన నైతి; దైవోపహతి నింత
చిక్కువడితి; నేమి సేయువాఁడ?. 263

క. నా యున్నచో టెఱుంగక
యా యాశ్రమవాసు లైన యందఱ నతిదుః
ఖాయత్తుఁ డగుచు నడుగును
మాయయ్య దలంకి మాటిమాటికి నన్నున్. 264

క. నావార్త వినక యింతకు
నావృద్ధులు భిన్నహృదయులై ప్రాణంబుల్
వో విడుతురు గా; కచటికిఁ
బోవం బని గలదె? యేనుఁ బుచ్చెద నసువుల్.'' 265

—: సత్యవంతుఁడు సావిత్రితోడ మరలి తన యాశ్రమంబునకు వచ్చుట :—

వ. అని బహుప్రకారంబులం బలవరించి, కన్నీరు నించిన నక్కాంత దుఃఖాక్రాంత యగుచు నతని నాశ్వాసించి, నవమృణాళమృదులంబు లగు భుజంబులం గౌఁగిలించి, యెగయ నెత్తిన నెత్తన నిలిచి, యతండు ధూళిధూసరం బైన శరీరంబు దొడసికొని గమనంబున కుత్సహించిన. 266

క. ఫలభారము దుర్భర మని
వెలఁది యచట నొక్క వృక్షవిటపంబున ని
మ్ముల గరిడియ దగిలిచి యు
జ్జ్వలపరశువుఁ గొనుచు మృదులసంభ్రమలీలన్. 267

వ. జీవితేశ్వరు వామబాహువు నిజవామభుజంబుపయి నిడికొని, దక్షిణ హస్తంబున నతని గ్రుచ్చి కౌఁగిలించి, మందగమనంబున నాశ్రమోద్దేశంబునకు మగిడె; నంతకు మున్న యక్కడ. 268

ఉ. కన్నులు వచ్చి యెల్లెడలుఁ గన్గొని, వృద్ధనరేంద్రుఁ డాత్మకుం
గన్నులఁ బోలె నైన తన గాదిలిపుత్త్రుఁడు గాననంబులో
నెన్నఁడు లేనియంతతడ వేటికిఁ జిక్కెనొ? యంచు నార్తితోఁ
గన్నులు లేనియట్లొకఁడుఁ గానక యేడ్చె సతీసమేతుఁడై. 269

తరలము. కొడుకు నిందును నందు రోయుచుఁ గోరి ప్రేమభరంబునం
గొడుకుసద్గుణకోటు లెల్లను గోటిభంగుల మక్కువన్
గడన సేయుచు, సత్యవంతునిఁ గానరే మునులార! యీ
యడవిలోపల నంచు. హా సుత యంచు ధైర్యము డించుచున్.

వ. ఉన్నంతఁ దదాశ్రమవాసు లైన మును లందఱు నతనిం బొదివికొని, తదీయనయన లాభంబునకు విస్మయం బందుచు, నుచిత వాక్యంబుల నతని నాశ్వాసించు చుండిరి; తదనంతరంబ యొక్క ముహూర్తంబు

నకు సావిత్రీసహితుం డై చిత్రాశ్వుండు సనుదెంచిన, నా వృద్ధదంప
తు లత్యంతహర్షంబున నతనిం గౌఁగిలించుకొని, మూర్ధాఘ్రాణంబు
సేసిరి; మునివరులును గరంబు సంతసిల్లి; రప్పు డారాజర్షిముఖ్యుండు
పుత్రునిం జూచి "యయ్యా! యి శ్లేల వనంబులో మసలి'' తని యడి
గిన, నతండును దానుఁ జని పండ్లు గోయుటయును. గాష్ఠదళనంబు
సేయునెడం దలయేరు గదిరి నిలువ నోపక విశ్రమించుటయుఁ, ద
న్నొక్క పురుషుండు గలలోన నిగ్రహించుటయుం జెప్పునెడ, సావిత్రి
మామ కి ట్లనియె. 271

సీ. ''ఈరాజసుతునకు నిద్దినంబున మర
ణం బని మును చెప్పె నారదుండు;
మునినాథువచనం బమోఘంబు గావున
నేమఱ కేను నేఁ డితనితోడ
నడవికి నేఁగితి; నచట నీతఁడు సుప్తుఁ
డై యున్న యెడ వచ్చె నంతకుండు;
వచ్చి యివ్విభుని జీవముఁ గొని పోవంగ
వెనుకన చని యేను వివిధభంగి

ఆ. సత్యధర్మఫణితి సంస్తుతించుటయుఁ, గృ
పార్ద్రచిత్తుఁ డగుచు నజ్జముండు
నాకు నెమ్మి నొసఁగె నాలుగువరము;
లం దొకట నితఁడు జీవయుక్తుఁ డయ్యె. 272

వ. మఱియు నొక వరంబు భవదీయనయనోన్మేషణకారణం బయ్యెఁ;
దక్కిన వరద్వయంబునకు మీకు వైరిహృతరాజ్యసంప్రాప్తియు,
మదీయజనకునకుఁ బుత్రశతలబ్ధియు నగు" నని చెప్పిన నయ్యిద్దఱుఁ
బరమానంద కందళిత శీతల శిశిర హృదయు లై కోడలి కి ట్లనిరి.

క. "ఆపత్సముద్రమగ్నం
బై పోయెడు నస్మదన్వయము పెం పెసఁగం
దేప యయి కడవఁ బెట్టిన
నీపుణ్యచరిత్ర గీర్తనీయము దల్లి." 274

వ. అని యభినందించి; రప్పు డయ్యిందువదనను మునివరు లందఱుఁ బ్రశంసా వచనంబుల నుపలాలించి, వారల దీవించి, నిజగృహంబులకుం జని; రంతం గతిపయ దివసంబులకు. 275

సీ. ఆసాళ్వభూపతి యాప్తమంత్రులు, మూల
భృత్యులుఁ, బౌరులుఁ, బృథివిఁ గలుగు
పెద్దలుఁ గూడి సంప్రీతి నాతనిపాలి
కేతెంచె వినయసమేతు లగుచు,
"నవనీశ! నీశత్రుఁ డాత్మీ యభృత్య భే
దనమునఁజేసి బాంధవసహాయ
సహితుఁ డై మృతిఁ బొందె; సకలజనంబులు
నేకచిత్తంబున నిపుడు నిన్నుఁ

ఆ. బ్రకటరాజ్యపదవిఁ బట్టంబు గట్టంగ
వచ్చినారు; నిఖిలవసుధయందు
విస్తరిల్లె నీదువిజయఘోషము; భద్ర
గజము నెక్కి వేగ కదలు మింక. 276

క. ప్రాకటతపోబలంబున
నాకలితవిలోచనుండ వై యున్న నినున్
లోకేశ! చూడఁ గంటిమి; మా
కన్నులు చల్లనయ్యె మాభాగ్యమునన్." 277

వ. అనినం బ్రహృష్టహృదయుండై ద్యుమత్సేనుండుఁ దత్క్షణంబ తదాశ్రమవాసు లయిన మునుల నామంత్రణంబు సేసి, కొడుకునుం దానును గజారూఢుఁ డై సతీసమేతుఁ డగుచు, బహుళచతురంగసేనాసంకుల గమనంబునం బురంబునకుఁ జని, సకలమహీరాజ్యంబును గైకొని, చిత్రాశ్వునకుం బురజనసమ్మతిం బ్రథితయౌవరాజ్యపట్టం బొసంగి, పరమైశ్వర్యధుర్యుం డయ్యె; నిత్తెఱంగున. 278

క. తన మగని, నత్తమామల,
జననీజనకులను, దన్ను, సకలకులంబుల్
ఘనముగ సముద్ధరించెను
జనవర! సావిత్రి ధర్మచరితము కంచే. 279

తే. ఆపతివ్రతయట్లు యీ యాజ్ఞసేని
పరమ కల్యాణి. ధర్మ సంభావనీయ;
యధిప! మిమ్మును మీయఖిలాన్వయంబు
నుద్ధరించు మహాభాగ్యయుక్తిఁ జేసి." 280

క. అని చెప్పి పాండుతనయుల
ననఘుల వీడ్కొని, మునీంద్రుఁ డనుపమ తేజో
ఘనుఁ డగు మార్కండేయుఁడు
దనయాశ్రమమునకు నరిగెఁ దద్దయుఁ బ్రీతిన్. 281

**—: సూర్యుఁడు బ్రాహ్మణవేషమునఁ గర్ణునకు హితంబు సెప్పుట :—**

వ. అని చెప్పిన విని జనమేజయుండు వైశంపాయనునితో "మునీంద్రా! యింద్రుండు గర్ణుకవచకుండలంబు లెవ్విధంబున నేల యపహరించెం? జెప్పవే" యని యడిగిన నతం డి ట్లనియె. 282

సీ. "వనమున నప్పాండుతనయు లుండఁగ, నందు
వరుసఁ బండ్రెం డగు వత్సరంబు
కడపట, నింద్రుఁడు గడఁగి పాండవహిత
కారి యై కర్ణునికవచకుండ
లములు మాయాప్రయోగమున హరింపంగఁ
దలఁచిన, నాతనితలఁ పెఱింగి
జలజాప్తుఁ డొకనాఁడు వెలయ రాధేయున
కది యెల్ల నెఱిఁగింతు నని తలంచి,

ఆ. లోకనుతుఁడు బ్రాహ్మణాకార మొప్పంగ
నతని యున్నకడకు నరుఁగు దెంచి,
యేకతంబ యున్నయాకర్ణుతోడ న
భీష్టభంగి దోఁప నిట్టు లనియె. 283

క. "ఓకర్ణ! సుజనవినుత గు
ణాకల్ప! భవద్ధితార్థ మై యొకకార్యం
బేకతమ చెప్ప వచ్చితిఁ;
బ్రాకటముగ వినుము నాదుపలుకులు వరుసన్. 284

వ. పాండవపక్షపాతి యై పాకశాసనుండు భవదీయంబు లయిన కవచ
కుండలంబులు హరింపం గోరి, నీవు బ్రాహ్మణప్రియుండ వనియును,
బ్రాహ్మణు లడిగిన నెయ్యది యైనను వంచన సేయ వనియును
నెఱుంగుం గావునఁ, గపట బ్రాహ్మణుం డై వచ్చి యడుగం గల
వాఁడు; నీవును గవచకుండలంబు లీవలవదు; రత్న కాంచన వనితా
ప్రముఖంబు లయిన పదార్థంబులు సూపియుం బ్రార్థించియు నెవ్వి
ధంబున నయినం గడపి పుచ్చవలయు; నట్లు గాక వీని నతని కిచ్చి
తేని మృత్యువశంబునం బొందఁ గలవాఁడవు. 285

చ. అమృతమయంబు సువ్వె సుగుణాకర! యిమ్మహనీయవస్తుయు
గ్మ; మివియ యుండునేనిఁ ద్రిజగంబులయందు నశేషశత్రులో
కమునకు నీవు వధ్యుఁడవు గావు; నిరంతరసౌఖ్యసంప్రమో
దమున వెలుంగు దీ; విది హితంబుగఁ జెప్పితి మోసపోకుమీ." 286

క. అనిన విని సూతతనయుఁడు
వినయంబున నిట్టు లనియె "విప్రాకారం
బున వచ్చిన వేల్పువు నీ
వనఘా యెవ్వఁడవు? నాకు నానతి యీవే." 287

క. అనిన నతఁ "డేను సూర్యుఁడ;
మనమున నీయందుఁ గలుగుమక్కువఁ, గర్జం
బొనరఁగ నుపదేశింపం
జనుదెంచితి'' ననిన నతఁడు సంభ్రమ మొప్పన్. 288

వ. అభివాదనంబు సేసి "దేవా! దేవర నాకత్యంతహితుండ వగుటం
జేసి కృతార్థుండ నైతి; నిం కొక్క విన్నపంబు సేసెద నవధరింపుము.

ఉ. భూసురకోటి వేఁడుటయుఁ బోఁడిగఁ బ్రాణము లైన నీగి నా
బాస; దినేశ! లోకమునఁ బ్రస్ఫుట మింతయు; నట్లు గావునన్
వాసవుఁ డట్టె న న్నడుగ వచ్చుఁ బ్రియంపడి; నాకు నొక్కట్రాఁ
తే? సురలోకవందిత! మదిం గవచంబును గుండలంబులున్? 290

క. జగముల నెల్లను నిండిన
పొగడిత గడువెలితి సేసి, పొల్లయొడలికై

తగవే జన్మవ్రత మిటు
దిగ విడువఁగ నేఁడు నాకుఁ? త్రిభువనదీపా! 291

మ. మతిఁ గుంతీసుతపక్షపాతి యగుచున్ మాయాస్వరూపంబుతో
జితదైత్యేంద్రుఁడు శతక్రతుండు నను భిక్షింపంగ నేతెంచున
ట్టి తెఱం గైనను. దదీయ కీర్తియ చుమీ డిందుం; ద్రిలోకీసము
న్నతమై యొప్పు మదీయకీర్తి; యిది సూ నాపుణ్య మెబ్భంగులన్.

ఆ. కీర్తి విడువఁ జాలఁ; గీర్తితో మెలఁగంగఁ
జావు వచ్చె నేనిఁ జత్తుఁ గాని;
జగములోన నెల్ల సడికంటెఁ జావు మే
లనఁగఁ బరఁగుమాట యనఘ వినవె?

ఉ. కీర్తియ యిచ్చుఁ బుణ్యగతిఁ; గీర్తియ తల్లియుఁబోలెఁ బ్రోచు; స
త్కీర్తియ యాయువున్ సిరియు; గీర్తివిహీనుఁడ చూ శవంబు; దు
ష్కీర్తను నెల్లచేటులును గిట్టి హరించు ననండె తొల్లి భ
క్తార్తిహరుండు నాఁ బరఁగు నంబుజసూతి జగద్ధితంబుగన్. 294

సీ. విప్రులు గడు నర్థి వేఁడినఁ గడిమితోఁ
బొచ్చెంబు సేయక యిచ్చు టొకటి;
బలితంపుఁ బగతురఁ బరిమార్చు టొక్కటి
దండిమై యనిఁ జచ్చుటొండె నొకటి;
శరణాగతుని నెట్టిశత్రుని నైనను
గరుణించి చంపక గాచు టొకటి;
భామినీద్విజవృద్ధబాలాతురుల కైన
యాపదఁ జెచ్చెరఁ బాపు టొకటి;
ఆ. యనఘ! యివి వ్రతంబు లై చెల్లు నాకు; నిం
దొకటి దప్పెనేని వికలకీర్తి
నగుదుఁ; గాన యిత్తు నఖిలభావముల నా
ఖండలునకుఁ గవచకుండలములు.'' 295

వ. అనినఁ గర్ణునకు సూర్యుం డి ట్లనియె. 296

క. ''కడు నెయ్యురు హితముగఁ జె
ప్పెడుపలుకులు వినవు; గరము జేలవు; నీ వె
క్కడ ? బుద్ధితెరువు లెక్కడ ?
చెడక వినుము నీకుఁ దెలియఁ జెప్పెదఁ గర్ణా ! 297

క. తనకుఁ, దనయులకు, సతులకు,
జననీజనకులకు, బంధుజనులకుఁ గీడొం
దనితెరువునఁ గీర్తిగొనం
జనుఁ గా; కందఱును జెడు యశం బేమిటికిన్ ? 298

ఉ. కావున నీవు ప్రాణములు గావుము; కీర్తి యటుండ నిమ్ము; నీ
జీవిత మున్నఁ గీర్తి మఱి చేరదె ? కీర్తి యొకం డనంగ నే
లా ? వనితల్ దనూభవులు లక్ష్మలు బంధులు సార్వభౌమతే
జోవిభవంబు నిమ్మపడఁ జొప్పడుఁ బ్రాణ మొకండు గల్గినన్. 299

క. మృతుఁ డైన నరుఁడు వెస భ
స్మితుఁ డై చనుఁ గాక కీర్తి మేలిమి గనునే ?
మృతదేహంబునకు నలం
కృతిఁ జేసినయట్లు మృతునికీర్తియుఁ బిదపన్. 300

వ. నీవు నాకు నత్యంతభక్తుండ వగుటం జేసి భక్తజనరక్షణంబు గర్తవ్యంబు గావున నీ కిట్లన్నియుం జెప్పవలసె; మఱియు దేవనిర్మితంబైన రహస్యంబొక్కటి గలదు; దానం జేసి నీయందు నాకు వాత్సల్యంబు మిగిలియుండు; నది యిప్పు డేను జెప్పఁ; బిదపఁ దనయంతన యెఱుకఁ గంబడియెడు; నీకు నర్జునునకుం దెగని పగ యైయుండు; మీకుఁ గయ్యంబు నయ్యెడు; నందు నీవు సహజకుండలమండితుండ వగుటం జేసి యర్జునున కజయ్యుండ వయ్యెద; వట్లుంగాక వీనిం గోలుపోయి తేని నెంతయు దెప్పరం బగు'' ననినం గర్ణుం డిట్లనియె. 301

మ. ''కరుణామూర్తివి నీవు సంతతము భక్తశ్రీసమాధానత
త్పరచిత్తుండవు; గావునం గడఁగి నాపై మక్కువం బద్మినీ
వర ! మే లానతి యిచ్చి; తిం కొకటి దేవా ! నిన్నుఁ బ్రార్థించెదం;
గరుణన్ నాప్రతికూలదుర్లలితవాక్యంబుల్ సహింపం దగున్. 302

క. అనృతమున కెంత వెఱతునొ
విను మంతకు నకును నంత వెఱవ; మును గ్రహిం
చినవ్రతము విడిచి దుర్గతిఁ
జనఁ జాలుదునయ్య? నన్నుఁ జనునే మాన్పన్. 303

వ. అర్జునుండు దుర్జయుం డని చూడ వలదు; నీవును మదీయంబు లగు దివ్యాస్త్రవిశేషంబు లెఱుంగుదు; జామదగ్న్యుండును, ద్రోణుం డును నాకు నొసంగిన దివ్యాస్త్రంబు లల్పంబులు గావు; గావున నవశ్యంబును సమరంబున నమరరాజనందనుం దెగటార్ప నోపుదు; నీ వింక నొండు దలంపక నాకు ననుజ్ఞ యి'' మ్మనిన నొక్కింత విచారించి యా దేవుండు రాధేయున కి ట్లనియె. 304

-: సూర్యుఁడు గర్ణునితో నింద్రుచే శక్తిఁ గైకొనుమని చెప్పుట :-

తే. ''ఎల్లభంగుల నిశ్చయం బిదియయేని
వత్స! విను మింక నొక్కటి; వాసవునకుఁ
గలదు దారుణంబును సమోఘంబునైన
శక్తి; యది నీకు నడుగుము సవినయముగ.

క. తొలితొలి బలసూదనుచేఁ
జెలువుగ నాదివ్యశక్తి సేకుఱఁ గొని, కుం
డలములుఁ గవచంబును మఱి
యలఘుమతీ! యిమ్ము; భద్ర మగు నట్లయినన్.

ఉ. వైరులఁ జంపి చంపి వెస వచ్చుఁ గరంబున కాజిలోన న
ద్దారుణశక్తి; వాసవుఁడు దానన తొల్లి సహస్రసంఖ్యలం
గ్రూరసురారిసంఘములఁ గూల్చె; మహాభుజ! నీకు నెమ్మి నా
ఘోరవుసాధనంబు దొరకొన్న నవశ్యము గెల్తు పోరులన్." 307

వ. అని చెప్పి కమలహితుం డంతర్హితుం డయ్యెఁ; గర్ణుండు వాసవురాక కెదురు చూచు చుండె'' ననిన విని జనమేజయుండు వైశంపాయనున కి ట్లనియె. 308

మధురాక్కర. "కలదు దేవగుహ్యం బని కమలబాంధవుఁడు గర్ణుఁ
బలికె నని చెప్పి తది యెద్ది? బలియుఁ డాసూనజుండు
లలితకవచంబు మణికుండలములు నెమ్మెయిఁ బడసి
వెలసె? నవ్విధ మింపుగ వివరింప వలయు నాకు."

వ. అనిన వైశంపాయనుం డది యంతయుం జెప్పెద వినుమనియిట్లనియెఁ "దొల్లి కుంతిభోజు నింటికి దుర్వాసుం డతిథి యై వచ్చి. వానిచేతం బూజితుం డై నాకు నీయింటఁ గొంతకాలము వసియింప నిష్టం బైనది; నాయున్న యంత కాలంబును నీవును నీ యనుచరులును నిర్వ్యాజం బగు భక్తి సేయవలయు; నిట్లొపుదే? యనుటయు నొడంబడి యతండు దన కూఁతుం బృథ యను కన్యకం బిలిచి యమ్మహామునిం జూపి. 310

ఉ. "దేవసమానుఁ డీధరణిదేవుఁడు వేడుక మద్గృహంబునం
దా వసియింపఁ గోరుటయు దానికి నేనను నియ్యకొంటి; నిం
దీవరనేత్ర! నీవుఁ గడు ధీరవు, ధీవినయోపచారసం
భావితవృత్త; వట్లగుట భక్తి భజింపుము బ్రాహ్మణోత్తమున్.

క. ఇతఁ డెయ్యది యెత్తటి స
మ్మతిఁ గోరిన నది ఘటించి మచ్చిక నిడి తో
షితుఁ జేయు; మిమ్మహాత్ముని
మతి యలుగక యుండవలయు మానిని యెపుడున్.

ఆ. వినుము విప్రవరులు వెడవెడ గినిసి రే
నియును ధరణి యెల్ల నీఱు సేయఁ
జాలుదురు తపఃప్రశస్తులు; దుర్వార
తేజు, లెందు నధికధీరమతులు. 313

క. భూదేవపరాభవమునఁ
గాదే వాతాపిదండకప్రభృతులు పెం
పేది చెడిరి; భూదేవు
నాదరమునఁ గాదె బ్రతికినవి యిజ్జగముల్. 314

సీ. పసిబిడ్డ వయ్యును బడతి! నీ వెంతయు
గుణవంతురాలవు; గురులయందు,
బెద్దలయందును, బృథివీసురులయందుఁ
గడు భక్తి సేయుదు కమలనయన;
బంధులుఁ, జెలులు, సంబంధిజనంబులుఁ
బురమువారును, నంతిపురమువారుఁ
బూఁబోఁడి! నిను నెమ్మిఁ బొగడనివారు లే;
రేమని వర్ణింతు నేను నిన్ను ?
తే. యదుకులంబునఁ బుట్టి, యత్యంతసౌఖ్య
మమరఁ బెరిఁగితి, నాపుత్రివై; త్రిలోక
సుందరము రూపు; ప్రాయంపుసొంపు, నిట్టి
దిచ్చరిత్రంబు సతులకు నెందుఁ గలదు ? 315

వ. నీ గౌరవం బంతయు నెఱింగి కాదె వహ్నిసమానుం డైన యీ మహా
ముని నారాధించుటకు నీయందు భారం బెక్కించెద; నీవును దర్పం
బును నహంకారంబును దూరంబున నిడి, యిప్పుణ్యపురుషుం
బరితుష్టుం జేసి కృతార్థతం బొందు" మనిన నక్కన్నియ దండ్రి
కి ట్లనియె. 316

ఉ. "కోరుదు నేను విప్రతతిఁ గొల్వఁగ నెప్పుడు నాత్మలోన; నా
కోరినకోర్కి నేఁడు దలకూడె; నరేశ్వర ! యట్లుఁ గాక నీ
కోరినయట్టియవ్విధము గోరి యొనర్చుట నాదుభాగ్యసం
భారము గాదె ? యీయడుము భారము నాపయిఁ బెట్టి నెమ్మదిన్." 317

వ. అని పలికిన సంతసిల్లి కుంతిభోజుండు దుర్వాసున కక్కన్నియం జూపి
యి ట్లనియె. 318

క. ఈ పిన్నది నాకూఁతురు
తాపసజనముఖ్య! మిమ్ముఁ దాఁ గొలువంగా
నోపుమ నని పూనెం; బసి
పాప సుఁడీ; కినుక లేక పనిగొనవలయున్. 319

—: కుంతి దుర్వాసునకుఁ బరిచర్య సేయుట :—

చ. ఎఱుఁగక తప్పుగా మెలఁగెనేనియు, దానికి సైఁచి, నేరుపుల్
గఱపి ప్రియంబుతోఁ గొలువు గైకొనఁగాఁ దగు మీకు; బాలురుం,
దెఱవలు, వృద్ధులుం, దమకుఁ దెల్లమ, దప్పులు సేసి రేనియున్
మఱతురు గాని యల్గరు సమగ్రశమాన్వితు లైనతాపసుల్." 320

వ. అని యప్పగించి యప్పార్థివేంద్రుం డప్పు డమ్మునీంద్రునకుఁ జంద్రికాధవళంబైన సౌధంబునందు శయనాసన ప్రముఖోపకరణంబులు, నభిమతాహార సాధనద్రవ్యంబులు నాయితంబులు సేయించి తాను సంతసంబున నూఱడి యుండె; నంత, 321

క. భావించి నాఁడునాఁటికి
వేవిధముల మిగుల భక్తివినయంబులతో
దైవోపచారముల భూ
దేవోత్తముఁ గొల్చెఁ గుంతిదేవి నియత యై. 322

సీ. అతఁడును దద్భావ మరయంగ మదిఁ గోరి
రూపించి యిటపోయి రేప వత్తు
నని పోయి నడికిరే యర్థితోఁ జనుదెంచు,
రేయి వచ్చెద నని రేప వచ్చు;
నేప్రొద్దు వచ్చిన నింతి యప్పుడ భక్ష్య
భోజ్యముల్ గ్రొత్తపొల్పుగ నొనర్చు;
నెయ్యది గోరిన నిచ్చకు రాఁ బెట్టు;
నలయదు మదినైన నలుగ దెపుడు;

ఆ. ననుదినంబు భోజుఁ డాత్మజఁ బిల్చి త
ద్వర్తనంబు నడుగ, వనజముఖియుఁ
దాను గొల్చు తెఱుఁగుఁ, దాపసవరునిచం
దమును జెప్పుచుండుఁ దండ్రి యలర. 323

వ. అంత నొక్క సంవత్సరంబు పరిపూర్ణంబయినఁ బ్రీతుం డై దుర్వాసుండు గుంతిం జూచి "నీచేసిన యారాధనంబునకు మెచ్చితి! నభిమతంబు లిచ్చెద; నడుగు" మనిన నమ్మానిని గృతాంజలి యై

"మీరు నాపలనం బ్రసన్నుల రయితిరి; దీనికి మా తండ్రియుం గరంబు నలరు; నింతియ చాలు; నొం డేల" యనిన నతం ''డక్లేని నిది యొక్క మంత్రంబు గైకొను; దీనం జేసి యెయ్యేనివేల్పు నాహ్వా నంబు సేసెద, వవ్వేల్పు సనుదెంచి నీవశంబున నుండు'' ననిన నొం డన వెఱచి, కుంతియుం బ్రసాదం బనియె; నమ్మునీంద్రుండు దాని కమ్మంత్రంబు విధియుక్తంబుగా నుపదేశించి, కుంతిభోజుని దీవించి నిజేచ్ఛం జనియె; నంతఁ గొంతకాలంబునకు. 324

మ. "మదిఁ గారుణ్యము సేసి విప్రవరుఁ డీమంత్రంబు నా కిచ్చెఁ; నే నిది యేచందమొ చూతు'' నంచు నొకనాఁ డిచ్ఛన్ ఋతుస్నాతయై సుదతీరత్నము పూర్వశైలతటిపై శోభిల్లు తిగ్మాంశుఁ జూ చి దళత్పద్మము మాడ్కి నుల్లసితమై చిత్తంబు రాగిల్లఁగన్. 325

వ. సహజకుండలకవచాభిరామం బయిన తదీయమూర్తివిభవంబున కోటు వడి ''దేవా! భవత్సమానసుందరుం డగు నందనుం గరుణింపవే''యని మనంబునం గోరుచు మంత్రోచ్చారణంబు సేయుచున్నఁ, ప్రభాక రుండును నిజయోగబలంబున మూర్త్యంతరంబు ధరియించి కుంతి పాలికిం జనుదెంచి మధురస్వనంబున. 326

తే. ''అబల! నీమంత్రబలమున నరుగుదెంచి
నాఁడ; నీవాఁడ నైతి; మనఃప్రియంబు
నీకు నెయ్యది యొనరింతు? నిజము చెపుమ;''
యనినఁ బడఁతి యి ట్లనుఁ గమలాప్తుతోడ. 327

తే. "కార్య మొక్కటియునులేదు; కౌతుకమున
నేను మంత్రంబు నొడివితి; నింతమాత్రఁ
జేసి నీకు నిచ్చటికి విచ్చేయ నేల?
దివికి నరుగుము క్రమ్మఱ దేవ! నీవు." 328

వ. అనిన దానికి సూర్యుం డి ట్లనియె. 329

ఉ. ''క్రమ్మఱ పోక తప్పెడినె? కామిని! యేమని మున్ను నీవు చి
త్తమ్మునఁ గోరి, తద్విధము దప్పక యిప్పుడుఁ బల్క రాదె? తే

జమ్మున మత్సమానుఁ గవచస్ఫుటకుండలమండితాంగు స
త్సమ్మతుఁ బుత్త్రుఁ గోరవె, నిజమ్ముగ నావలనం దలోదరీ? 330

వ. కావున నిప్పుడు మదీయసమాగమంబున కొడంబడుము; నీకోరినయట్టి తనయుండు జనియించు; నిట్లు సేయనివాఁడు నిన్నును భవజ్జననీజనకులను భస్మంబు సేయుదు; మఱియు నీదైనశీలవృత్తంబు దెలియంగక మంత్రంబు గర్వంబునం జేసి నీ కుపదేశించిన తాపసు నీక్షణంబ నిర్దహింతు; నిదె యంబరంబుననుండి యింద్రాదిసురవరులు నీకతమ్మునఁ జిక్కువడి యున్న నన్ను నవ్వుచున్న వారు; వీరిం జూడు;" మని దివ్యదృష్టి యిచ్చినం జూచి, కుంతిభోజ రాజనందన డెందంబున నమందలజ్జావివశ యగుచు దినేశ్వరున కిట్లనియె. 331

క. "నను నిచ్చుటకుం గర్తలు
జననియు జనకుండుఁ గాక చను నే నాకుఁ
వనితాధర్మము విడువఁగ?
ననఘా! యిట్లయిన ధర్మహానియుఁ గాదే? 332

ఆ. మంత్రబల మెఱుంగ మదిఁ గోరి తప్పు సే
సితి; మహాత్మ! దీనిఁ జెట్ట గాఁగ
నవధరింప, కెట్టులైన నాబాల్యంబుఁ
గరుణ సైఁప వలయుఁ; గమలమిత్ర! 333

వ. అని మఱియు ననేకప్రకారంబుల దివాకరు ననునయించి, యెట్లునుం గ్రమ్మఱింప నేరక, దన కారణంబునఁ గులంబునకును, గురుజనంబులకును, నపాయం బగు ననియునుం దలపోసి, భయంబు మిగులఁ దెగువ సేసి యతనికి ట్లనియె. 334

చ. "ముదము దలిర్ప బంధుజనమున్, గురువర్గముఁ గూడి రూఢి నొ
ప్పిదముగ ధర్మమార్గమునఁ బెండిలి సేయఁగఁ బిమ్మటన్ సము
న్మదరసకేళి లీలకుఁ గ్రమం బగుఁ గాక; కులంబుఁ, శీలమున్
వదలి వధూజనంబులకు వచ్చునె యిమ్మెయి వేడ్క సల్పఁగన్? 335

క. బంధుమతి నైన నను ని
ర్బంధము మెయి ధర్మబాహ్యపథమున నలినీ

బాంధవ! యిటు సేయుటయు న
మంథరభవదీయకీర్తి మలినము గాదే? 336

చ. జగములయందు ధర్మవును సత్యము నీయది గాదె? యెందు నే
తగవులు నీయెఱుంగని విధంబులె? యిట్టిది నీదు బుద్ధికిం
దగ వగునేని మార్పలుకుదాననె యే? నగుఁ గాక; నీకు నిం
పగు తెఱఁ గాచరింపు మిట; యావల నయ్యెడునింద కోర్చెదన్."

సీ. అనుటయు నద్దేవుఁ డయ్యిందుముఖిఁ జూచి
తల్లిదండ్రులును, బాంధవజనంబు
గారు ని న్నీగికిఁ గర్తలు; విను నీవ
యొడయురాలవు నీకు నుజ్జ్వలాంగి;
కామంబు లెల్లను గామించి పొందుట
నయ్యెఁ గన్యాశబ్ద; మట్లుగాన
యాత్మతంత్రత్వంబునందు నీ కెగ్గు లేఁ
దే నేల నడతు ధర్మేతరంబు;

ఆ. మత్సమాగమమున మదిరాక్షి! నీదు క
న్యావ్రతంబు చెడదు; నందనుండు
నధికతేజుఁ డుదయ మగు; నిన్ను లోకనిం
దయును బొందకుండుఁ దథ్య మబల!" 338

—: కుంతి సూర్యునివరంబున గర్భంబు దాల్చి కర్ణుం గాంచుట :—

వ. అని యొడంబఱిచి సూర్యుండు తత్సమాగమంబునం బ్రీతుం డయి, దానికి గర్భాధానంబు సేసి, గగనంబున కరిగె; నంతఁ బూర్వపక్షంబు నందు జంద్రుండునుం బోలె గర్భంబును గ్రమంబునఁ బ్రవర్ధనంబు నొందుచు, నభివ్యక్తం బయ్యును, బ్రభాకరుమహిమం జేసి లోకవిదితంబు గాకుండెఁ; దత్ప్రకారంబు దాదికూఁతు రొక్క_తియ యెఱుంగు; నిట్లు వర్ధిల్లుచుం బది యగు మాసంబున నొక్క_నాఁటి నిశాసమయంబునం గన్యాంతఃపురంబునందు. 339

ఆ. కొడుకుఁ గనియె సహజకుండలకవచాభి
రాము, విమలకమలకోమలాక్షు,

దీర్ఘబాహుఁ, జారుదృఢదేహుఁ, దరుణార్క
తేజుఁ గుంతిభోజరాజపుత్రి. 340

వ. ఇట్లు జనియించిన యర్భకుం జూచి లోకాపవాదభయంబునకుం దలరి వెఱచి, యాతఁడంబ యొక్క మంజూషలోన నబ్బాలకుం బదిలంబుగా నిడి, దాని నతి దృఢంబుగాఁ దెప్పం బంధించి, సఖియునుం దానును గొని చని, పురసమీపగతంబయిన యశ్వనదీప్రవాహంబున విడిచి, కుంతి యెంతయు సంతాపంబున నిట్లని విలాపంబు సేసె. 341

ఆ. "కొడుక ! నిన్నుఁ గాంచు కొఱఁతనోముల కాని
పెంచి గారవించి పేర్మినీదు
ప్రోపుఁ గుడువఁ గాంచు పుణ్యంబు దుది ముట్ట
నేల చేయ నైతి నేను గుఱ్ఱ? 342

మ. నెఱయం బున్నమచందురుం జెనయు నీసెమ్మోమునం దియ్యమై
చిఱునవ్వొప్పఁగఁ జూడ నీక, పులకల్ సెల్వొంద నిన్ గ్రుచ్చి య
క్కఱ దీఱం బొరి నక్కునం గరము వీఁకం జేర్పనీ, కిమ్మెయిన్
వఱదం ద్రోవఁగ జేసెనే యకట దైవం? బెందుఁ జొత్తున్ సుతా!

సీ. ఏ పుణ్యసతికి నీ వింకఁ జేపడియెదో ?
యెక్కడఁ బడియెదో? యే నెఱుంగ;
నేపుణ్యురాలొకో యిప్పుడు నినుఁ బుత్రుఁ
గాఁ గాంచుటకు మేలికలను గాంచు;
లలిఁ బాంసుకేళి నల్లన నడపాడుచు
నవ్యక్తమధురవాక్యామృతంబు
వీనులఁ గురియుచు, వెడఁదగన్నులుఁ బిన్న
నవ్వును శుభలక్షణములు నమరఁ

ఆ. దేజరిల్లు నిన్నుఁ దెఱవ యెవ్వత యొక్కొ
యడర గ్రుచ్చి యురమునందుఁ జేర్చి,
వేడ్క మిగిలి పేనవేలభంగులఁ గొని
యాడి యాడి, ముద్దులాడుఁ గొడుక. 344

ఉ. లాలితయౌవనోజ్జ్వలవిలాసములం దులకించి, సుందరా
ఖీలవిచేష్టితం బమర, భీమ మనోభవసింహరేఖమై
వాలవె యింక నీ వెలమి, వామనిలోచన లంగజన్మ లీ
లాలస లై, విపతులు భయాలసు లై, ధృతి యేది చూడఁగన్.

ఆ. ఎచట నున్న నైన నెల్లప్పుడును నిన్నుఁ
గన్నులారఁ జూడఁ గాంచుఁ గాన,
తనయ! నిన్నుఁ గనిన తపనుండు గడు ధన్యుఁ
డయ్యె; మందభాగ్య నైతి నేను. 346

చ. ఇనుఁ డలచేత మాటు వడు టెన్నఁడు గల్గునె? నిన్ను నెమ్మి నేఁ
గనియెదఁ గాక యింక నొకకాలమునం దయినం; దనూజ! నీ
వినుతశరీరభావమును, వీనుల సన్మణికుండలంబులున్,
ఘనతరవజ్రవర్మముఁ బ్రకాశత నొందఁగ యుండ నేర్చునే? 347

చ. దివి, భువి, నంతరిక్షమున, దిక్కుల, గాడ్పున, నగ్ని యందు, న
ర్ణవములయందు, ఘోరవిపినంబులయందును నీకు నెప్పుడున్
శివ మగుఁ గాక! దిక్పతులు, సిద్ధులు, సాధ్యులు, రుద్రు, లాశ్వినుల్
పవనులుఁ బుత్ర! నిన్నుఁ గృపఁ బాయక యెప్పుడుఁ గాచు
చుండెడున్."

వ. అని యేడ్చుచుం గుంతి యచ్చటం దడయ వెఱచి గూఢప్రకారం
బునఁ గన్యాంతఃపురంబునకు వచ్చి, యెప్పటియట్ల వర్తిల్లు చుండె;
నట మంజూషయు నశ్వనదీప్రవాహవేగంబునఁ జర్మణ్వతికిం జని,
యందుండి యమునాగతం బై, యట చని భాగీరథిం బడి, సూత
విషయంబునం జంపానగరంబుచేరువ నరుగుచుండె; నా సమయంబున.

సీ. ధృతరాష్ట్రసఖుఁ డైన యతిరథుం డను సూతుఁ
డతివలుఁ దానును నతివిభూతి
గంగలో జలకేళిసంగతుం డై యుండి,
తుంగతరంగానుషంగవశతఁ
జనుదెంచు మంజూషఁ గని, కడు వేడుకఁ
దన పరిజనములఁ బనిచి పట్టి

తెప్పించి, ధీయుక్తి యొప్ప నేకతమున
నప్పెట్టె దెఱచి, తా నప్పు డందు

ఆ. వినుత హేమకవచుఁ, గనకకుండలధరు,
ననుపమానతేజు, ఘనుఁ గుమారుఁ
గని, మనంబులోన ననయంబు విస్మయం
బొనర గ్రుచ్చి యెత్తికొని ముదమున. 350

వ. తన జీవితేశ్వరి యైన రాధకుం జూపి యి ట్లనియె. 351

క. "అనపత్యుల మైన మనకు
మన పాలిటివేలు పిక్కుమారుని నిచ్చెన్;
వనజాక్షి! వీఁడు మానుష
జనితుఁడు గాఁ; డరయ దేవసంభవుఁడు సుమీ." 352

క. అని దానిచేతి కిచ్చినఁ
గొని యురమునఁ నదియు నదిమికొనియెఁ గొడుకు; న
వ్వనితకుఁ జాలెంత తెఱం
గునఁ జన్నులు సేఁపె నపుడు గూరిమి పేర్మిన్. 353

వ. ఇట్లు దంపతులు ప్రమోదసంపద నొంపారం గుమారుం గొని నిజ మందిరంబున కరిగి; యాత్మీయకులోచితంబు లగు జాతకర్మాది సంస్కారంబు లొనరించి, సహజకుండలాలంకృతకర్ణుం డగుటం జేసి వానికిఁ గర్ణుం డని నామకరణంబు సేసి; రంత. 354

క. వసువర్మధరుఁడు గావున
వసుసేనుం డనఁగ బేరు వాని కిడిరి పెం
పెసఁగఁగ భూసురు; లాది
త్యసుతుం డిబ్బంగి సూతతనయుం డయ్యెన్. 355

వ. తద్వృత్తాంతం బంతయుఁ గుంతి తన యాప్తచరులవలన విని శిథిలీకృతసంతాపయయి యుండె; నతిరథుండును సంప్రాప్తయౌవనుం డైన కొడుకుం దోడ్కొని వచ్చి, ద్రోణాచార్యులయొద్ద నస్త్రశిక్ష సేయం బెట్టె; నాసూతసూనుండు మఱియుఁ గృపాచార్యులవలనను, జామదగ్న్యువలనను వివిధాస్త్రలాభంబు నొంది, క్రమంబున దుర్యో

ధనుతోడ బద్ధసంఖ్యుం డై యతనికి బ్రియంబు సేయం దివిరి, దివిజ
రాజనందనుతో మచ్చరించుచుఁ బాండవుల కప్రియంబు సేయు
చుండె. 356

ఉ. ఆతనియస్త్ర వీర్యము, సమంచితకుండల వజ్రవర్మవి
ఖ్యాతియు నాత్మలోఁ దలఁచి కౌరవనాయక! ధర్మసూనుఁడున్
భీతమనస్కుఁ డై, యతఁ డభేద్యబలుం డని సంతతంబు నై
ర్యాతిశయంబు డించి, హృదయవ్యథఁ బొందుచు నుండెఁ గానలోన్.

వ. అయ్యుధిష్ఠిరునకుఁ బ్రియం బాచరింపఁ గోరి, కవచకుండలంబులు
గొనుటకై పురందరుం డొక్కనాఁడు బ్రాహ్మణరూపంబునం జని,
మధ్యాహ్నసమయంబునఁ గర్ణుండు సూర్యోపాస్తి సేయు చుండి
బ్రాహ్మణులకు నభీప్సితంబు లిచ్చుతఱిం గని, భిక్షాం దేహి యను
టయుఁ గర్ణుం డతని కి ట్లనియె. 358

చ. "అలసవిలాసలాలసరసాన్విత లైన నితంబినీజనుల్
వలసిన, భూరి విస్ఫురితవస్తుసమగ్రము లైన గ్రామముల్
వలసిన, నుల్లసన్మణిసువర్ణవిభూషణగోధనావళుల్
వలసినఁ గోరు; మిచ్చెద ధ్రువంబుగ" నావుడు నాతఁ డి ట్లనున్.

క. "విను మివి యెయ్యవియును నా
కు నభీష్టము గావు; నీదు కుండలములు స
ద్వినుత! కవచంబు నిచ్చినఁ
గొనియెద నీ నోపుదేని, గుణరత్ననిధీ!" 360

చ. అనవుడు, గర్ణుఁ డి ట్లనియె "నక్కట! యేను విశిష్టవస్తువుల్
గొనకొని యిత్తు నాఁగ నిటు గోరెదు నీవు దలంప కప్రయో
జన మగువాని; భూమిసురసత్తమ! యెంతయు బేలవైతి; ము
న్నెనయఁగ నిట్టు లెవ్వరును నెయ్యెడ వేఁడిరె యిజ్జగంబులన్?

క. కుండలములుఁ గవచము న
ట్టుండఁగ ని; మ్మనఘ! వేఁడు మొండుధనంబుల్;
నిండింతు నీమనోరథ;
మొం డేమియు ననకు మింక నూర్జితచరితా!" 362

వ. అనిన నతం డెవ్విధంబున నొడంబడక, కవచకుండలంబులయందు బద్ధాభిలాషుండయి పలికినఁ, గర్ణుండు వానిం బ్రార్థించియుఁ, బుజ్జగించియు, ననేకమణికనకాదిద్రవ్యంబులు నివేదించియు, నెట్లును నొడంబఱుప నేరక యతని కి ట్లనియె. 363

తే. "సహజములు నాకు నిక్కవచంబుఁ గుండ
లములు; నివి లేక యున్న నే సమరభూమిఁ
గడిఁదిశత్రులచేత భంగంబు వడుదు.;
గాన యీఁ జాల నయ్యేద వీని నేను. 364

క. నానాజనపదబహుళము,
నానాధనసంయుతంబు, నారాజ్యము స
మ్మానంబున నిచ్చెదఁ; గాన
వే నను గారింప కింక విప్రవరేణ్యా!" 365

వ. అనియును నతనియందు సుముఖత్వంబు గానక, కానీనుండు దరహసితాననుం డగుచుఁ గృతకభూసురు నుపలక్షించి యి ట్లనియె. 366

చ. "ఎఱిఁగితి నేను నిన్ను; విబుధేంద్రుఁడ వీవుఁ; జగత్త్రియంబు గ్ర
చ్చఱ భవదీయరక్షణమునందు వెలుంగుచు నుండు; నిట్టి ని
న్నుఱవుగ నేను వేఁడుకొన యుక్తుఁడఁగాక, మొఱంగి నన్ను న
క్కఱపడి నీవు వేఁడు టిది గర్జమె? నిర్జితదైత్య! చెప్పుమా?" 367

తే. అనిన నింద్రుఁ డి ట్లనియె "మీయయ్య పద్మ
హితుఁడు ము న్నింత సెప్పె నీ కిష్ట మెసఁగఁ;
గాన యెఱిఁగితి; నీ వింకఁ గడప నేల
యనఘ! మాబోఁటులకుఁ బ్రియం బైనపనికి?" 368

వ. అనిన రాధేయుండు "దేవా! యట్లయిన నఖిలశత్రుఘాతిని యైన నీయమోఘశక్తి నాకుం గృప సేసి, కవచకుండలంబులు గొను" మని నంబాకశాసనుం డి ట్లనియె. 369

ఉ. "ఇచ్చెద శక్తి నీకు; విను మేర్పడ; నాజి మదీయశత్రులం
గ్రచ్చఱఁ జంపి చంపి యది గ్రమ్మఱ చేతికి వచ్చు చుండు; నీ

కిచ్చుట యట్లు గాదు; భువి నెందును దుర్జయుఁ డైన నీ రిపుం
జెచ్చెరఁ దున్మ నొక్కరున చేకుఱు; నన్ను భజించుఁ గ్రమ్మఱన్.

వ. ఇట్టిది సమయంబుగాఁ బరిగ్రహింపు" మనినఁ గర్ణుండు నాకుం గల
పగతుం డొక్కరుండ; వాని వధియించుటయ మదీయమనోరథం"
బనుటయుఁ బురందరుండు దరహాసితవదనుం డై. 371

ఉ. "నీయభిలాష మేము మది నిక్క మెఱుంగుదు; నుగ్రశౌర్యుఁ, దే
జోయుతుఁ, బార్థు నోర్తు నని చూచెదు; నీ కది యేల తీరు? రా
ధేయ! దయావిధేయుఁడు, విధేయజగత్త్రియుఁ, డవ్యయుండు, నా
రాయణుఁ డమ్మహాత్మునకు రక్షకుఁ; డేరికి వాఁడు సాధ్యుఁడే?"

వ. అనినం దపన నందనుం "డది యట్లుండె; నాకు సహజం బైన కవ
చంబు నొలిచి యిచ్చిన మదీయదేహంబు గరంబు వికృతం బగు; నది
యే మని యవధరించిన" తనిన నింద్రుండు "నీశరీరంబు భవజ్జనకుం
డైన యరుణకిరణువర్ణం బెట్టిదట్టిదీప్తిం జెలువొందు"నని పలికి వానికి
నమోఘశక్తి యొసంగి, "దీని నాపత్కాలంబునం దక్కఁ బెఱయ
ప్పుడు ప్రయోగించిన నీకు నపాయం బగు" నన చెప్పెఁ; దదనంత
రంబ యవ్వీరుండు గవచకుండలంబులం బుచ్చి యతని కిచ్చి. 373

చ. అలఘునిశాతశస్త్రమున నంగము లన్నియు నిర్వికారుఁ డై
యొలువఁ దొడంగినట్టియెడ "హో" యని కిన్నరయక్షసిద్ధసా
ధ్యులు దివినుండి యార్చుచును దూర్యరవంబు సెలంగ నద్భుతం
బెలయఁగఁ బుష్పవృష్టిఁ గురియించిరి కర్ణుపయిం బ్రియంబునన్. 374

వ. ఇట్లు సూతపుత్రుని వికృతగాత్రుం జేసి వాసవుండు ప్రమదవికాస
భాసితుండగుచు నిజలోకంబున కరిగెఁ; దద్వృత్తాంతంబంతయు విని
కౌంతేయు లత్యంత సంతోషంబునం బొదలిరి; గాంధారేయులు
దుఃఖవిదారితహృదయు లై" రని యిట్లు కుండలాహరణంబు సవిస్త
రంబుగాఁ జెప్పిన విని జనమేజయుండు వైశంపాయనున కిట్లనియె.

క. "అనయము దుస్తర మగున
వ్వనవాసము నిస్తరించి, ద్వాదశవర్షం

బునకడపట నేమివిధం
బొనరించిరి ? మత్పితామహుల్ మునినాథా.'' 376

వ. అనిన నమ్మహీపతి కమ్మహీదేవుం డిట్లనియె ''నట్లు మార్కండేయు వలనఁ బుణ్యకథలు విని పాండవు లనంతరంబ క్రమ్మఱి ద్వైతవనంబున కరిగి, యందున్నయెడ నొక్కనాఁడు సుఖాసీనుం డయి యున్న ధర్మరాజు పాలికి నొక బ్రాహ్మణుండు సంభ్రమంబున బఱతెంచి యి ట్లనియె.

**—: ధర్మరాజు బ్రాహ్మణుని యరణి దెచ్చుటకుఁ బోవుట :—**

క. ''తరుశాఖఁ దగిల్చిన నా
యరణి యొకమృగంబు వచ్చి యతిరయమున న
త్తరువున నొరసి కొనంగా
ధరణీశ్వర ! తగిలెఁ జువ్వె తచ్ఛృంగమునన్. 378

క. దానిఁ గొని పఱచె నమ్మృగ;
మానతనృపలోక ! నాకు నయ్యరణిఁ దగం
గా నిపుడు దేరఁ బనుపవె
భూనుత ! నిత్యవిధి లోపమునఁ జన కుండన్.'' 379

చ. అనవుడు నాక్షణంబ మనుజాధిపుఁ డుద్ధతచాపహస్తుఁ డై
యనుజులుఁ దాను నెంతయు రయంబున నాహరిణేంద్రుపజ్జఁ గై
కొని చని కూడ ముట్టి, మెఱుఁగుల్ నిగుడం బటుసాయకంబు లే
సిన నొకయమ్ము నమ్మృగము సెందద చేరద యద్భుతంబుగన్.

వ. అదియును వాది నతిదూరంబుగా నెలయించికొని చని యొక్క ఘోరవిపినంబున నదృశ్యం బైన, నయ్యత్నంబు విఫలం బగుటకు విషాదంబు నొందుచు, నయ్యేవురు నతిశ్రాంతు లై శీతలచ్ఛాయం బగు నొక్క వటమహీరుహంబుక్రింద విశ్రమించి; రప్పుడు నకులుండు ధర్మనందనున కి ట్లనియె. 381

క. ''కులశీలోన్నతియు, విని
శ్చలకరుణారతియు, ధర్మసంగ్రహమతియుం
గల మనకు నివ్విధంబున
నలజడి వచ్చుటకు మూల మది యెయ్యదియో ?'' 382

వ. అనిన నమ్మహాప్రాజ్ఞుం డతని కి ట్లనియె. 383

క. "వినుము సుఖమునకు దుఃఖం
బునకుం గారణము దనదు పూర్వకృతం బై
చను కర్మము; కారణ మిది
యని యన్యము గలుగ నేర దం డ్రొక్కటియుఁ." 384

వ. అనుటయు భీమసేనుండు నకులున కి ట్లనియె. 385

ఆ. "ప్రాతికామి వోయి పాంచాలిఁ గొలువులోఁ
పలికిఁ దేర, నపుడ యలుక యెసఁగ
నాంబికేయసుతుల నందఱఁ దునుమ కే
మునికి నిట్టి యెడరు మనకుఁ బుట్టె." 386

చ. అనవుడు నర్జునుం డనియె "నాసభ సూతసుతుండు పేర్చి ప
ల్కిన పటువాక్యముల్ వినియుఁ గిన్కకుఁ బూనక యేఁ దొలంగి కా
ననమున కిట్లు కాతరజనంబులచాడ్పున నేఁగు దెంచుటన్,
మనకు దురంతదుఃఖములు మానక పైకొని వచ్చెఁ దమ్ముఁడా."

వ. అనిన యనంతరంబ సహదేవుం డి ట్లనియె. 388

ఆ. "దుష్టశీలుఁ డైన దుర్ద్యూతపరుని గాం
ధారిఁ బట్టి యేను దడయ కపుడ
తునుమ కునికి, నిట్టిదుర్దశ పాలైతి
మనఘ! మనము కాననాంతరముల." 389

వ. అని యి ట్లందఱు నన్ని తెఱంగులఁ బలుకుచుండ నజాతశత్రుండు నకులుంజూచి, "భవదీయసోదరు లత్యంతపిపాసితు లై నవారు; నీ విమ్మహీరుహం బెక్కి జలంబు లున్న యెడ యరయు" మనిన నతండును దద్వచనానురూపంబున నవ్వనస్పతిసమారోహణంబు సేసి, దెసలు గలయం బరికించి దూరంబున సలిలంబు లున్న వని యన్న కెఱింగించిన నతం "డట్లేని నీవ పోయి జలపానంబు సేసి. మాకును జలంబులు గొని ర"మ్మని పనుచుటయును, మాద్రేయుండు వృక్షావతీర్ణుం డయి రయంబునం జని, ముందట నతిమనోహరం బగు తటాకంబుఁ గని, జలంబులు ద్రావం బోయిన నొక్క యశరీరభూతం బి ట్లనియె. 390

—: నకులాదులు యక్షుని నిరాకరించి నీరు ద్రావి మూర్ఛితు లగుట :—

క. "ఓయన్న ! యీ తటాకము
నాయది; నీ వీజలము గొనఁగ వలతేనిఁ
నాయడిగిన ప్రశ్నములకు
ధీయుత ! యుత్తరము లిమ్ము తేటపడంగాన్." 391

క. అనుటయు నవ్వాక్యముదెస
ననాదరము సేసి, నకులుఁ డక్కొలనం దె
య్యనినీరు ద్రావి నిశ్చే
తనుఁ డై యక్షణమ పడియెఁ దత్తీరమునన్. 392

వ. అట ధర్మపుత్త్రుండు సహదేవుం గనుంగొని "నకులుండు జలంబులకుం జని తడసె; నీ వరిగి యతనిం దోడ్కొని జలంబులు గొనుచు ర"మ్మని పనిచిన నక్కుమారుం డతిశీఘ్రగమనంబునంబోయి, బద్మినీతీరంబునం బడియున్న యన్న తెఱంగుఁ జూచి, విస్మయశోకవ్యాకులహృదయుం డగుచు "నిది యేమినిమిత్తంబున నయ్యెనో" యని యూహించుచుఁ, బెల్లడరు తృష్ణాభరంబు సహింప నోపక, జలంబుల దెస నాసఁ జేసి కొలనికి డిగ్గిన నెప్పటిభూతం బి ట్లనియె. 393

ఆ. "అనఘ! యీజలాశయము నాయధీనంబు;
సాహసంబుఁ జేసి చనదు చొరఁగ;
నాదు ప్రశ్నములకు నలి నుత్తరము లిచ్చి,
వారి గొనుము నీవు వలసినట్లు." 394

క. అనిన నది యాదరింపక
ఘనుఁ డాసలిలములు ద్రావి, గ్రక్కున విష మె
క్కినవిధమునఁ బరవశుఁ డై
ఘనసాలమహీరుహంబుకరణిం బడియెన్. 395

సీ. అంత నంతకసూనుఁ డంతరంగంబున
సంతాప మెసఁగ వాసవతనూజుఁ
గనుఁగొని "యన్న నీయనుఁగుఁదమ్ములు వోయి
కడుఁదడవయ్యె; నిక్కాననమున

నెయ్యది వుట్టెనో? చయ్యన నీ వేఁగి
వారినిఁ దోడ్కొనిఁ వారి గొనుచుఁ
జనుదెమ్ము" నావుడు ఘనభుజుం డధికర
యంబున నరిగి, జలాశయంబు

ఆ. తీరభూమిఁ బడినవారి, నవారిత
మహితశౌర్యధనుల, మాద్రిసుతులఁ
జూచి, విస్మయైకగోచరుఁ డై సవ్య
సాచి యుల్లమున విషాద మడర. 396

క. నాలుగుదిక్కులుఁ గనుఁగొని,
యాలో నెవ్వరిని గాన, కత్యంతపిపా
సాలసుఁ డై సలిలంబులు
గ్రోలఁగ సమకట్టి యొయ్యఁ గొలనికి డాసెన్. 397

వ. డాయుటయు నాకాశవాణి యి ట్లని వీతెంచె. 398

మ. "బలిమిం జొచ్చిన నెట్టివారి కయినం బ్రాణంబుపై వచ్చు; నీ
సలిలావాసము మత్పరిగ్రహము: తృష్ణాచ్ఛేద మొందం జలం
బులు ద్రావన్ వల తేనిఁ, బ్రశ్నములకుం బోం దొందఁగా నుత్తరం
బులు నా కి'' మ్మనుడున్ మనంబునఁ బృథాపుత్రుండు సక్రోధుఁ డై.

ఉ. ''మ్రుచ్చిలి నిల్చి దుర్వచనముల్ పచరించినఁ జెల్ల నిత్తునే?
చెచ్చెర నీయొలుం గడఁగఁ జేసెద నిప్పుడు సూడు" మంచు వి
వ్వచ్చుఁడు శల్దభేదిశరవర్గముఁ దద్వచనంబు చక్కటిం
గ్రచ్చఱ నించె మౌర్వీరవకంపితసర్వదిగంతరాళుఁ డై. 400

ఆ. ఇట్టు లేయుటయును నెప్పటివాక్యంబు
మఱియు వినఁగఁబడిన, మఘవసూనుఁ
డలసి కొలను సొచ్చి, యంబుపానము సేసి
యిలకు నొఱగె వివశహృదయుఁడగుచు. 401

వ. తదనంతరంబ యుధిష్ఠిరుండు భీమసేను నాలోకించి "కవలును గవ్వడి
యును నింత వడి దడయుటకు నిమిత్తం బయ్యెదియో? నీవు నరుగు''
మనినం గిమ్మిరవైరి మారుతజవంబున నమ్మువ్వురుఁ జనినచొప్పునం.

జని పద్మాకరకూలంబునందు నిద్రా వివశులుంబోలెఁ బడి యున్న
తమ్ములం గని దుఃఖితుం డై. 402

తరలము. "ఇది మనుష్యకృతంబు గాదు; సురేంద్రకిన్నరపన్నగ
త్రిదశనిర్మిత మైన కర్మము; దీని నెంతయు నేర్పడం
బిదపఁ జూచెదఁ గాక'' యంచు విభీతిదూరుఁడు నీరువ
ట్టొదవఁ దత్సరిలాశయంబు సముత్సుకుం డయి చొచ్చినన్.

వ. అంతరిక్షగోచరం బైన వచనం బి ట్లని వినంబడియె "నయ్యా! నీ
వి ట్లేరి సాహసంబు సేసె? దిక్కొలను మత్పూర్వపరిగ్రహంబు; నీ
వోపుదేని నాయడిగిన యర్థంబులకు నుత్తరంబు లిచ్చి, జలంబులు
ద్రావు" మనిన నప్పలుకులు గైకొనక వృకోదరుండు నిపీతసలిలుం
డై యచ్చోటన మూర్ఛితుం డై పడియె; నిట పాండవాగ్రజుండు.

క. తమ్ములు నలుగురు నొక్కట
నమ్మెయి మసలుటకు నాత్మ నత్యంతవిషా
దమ్మొలయ సముత్థితుఁ డై
క్రమ్మఱ నమ్మార్గ మపుడు గైకొని నడచెన్. 405

సీ. అపగతజనశబ్ద మై, యనభివ్యక్త
మార్గ మై, యవిరళదుర్గశైల
తరుగుల్మవల్లీవితాన మై, గజసింహ
శరభశార్దూలసూకరలులాయ
బహుళ మై, బహువిధపక్షికోలాహల
భయద మై కడుఁ బర పయిన యడవి
నమజుల వెదకుచు ననఘుండు సని కాంచెఁ
గమలాకరంబుతీరమునఁ బడిన

ఆ. వారిఁ, బూరువంశవరుల, భీమార్జున
యముల, నమితబలుల, విమలమతులఁ,
బ్రళయపతితలోకపాలసంకాశుల,
భూరిపుణ్యధనుల, వీరవరుల. 406

మ. కని డెందంబునఁ దల్లడం బడర, దీర్ఘశ్వాసవైవర్ణ్యముల్
దనుకం దాల్మి చలింప, విస్మయపరీతస్వాంతుఁడై, శోకబా
ష్పనిరుద్ధాకులలోచనుం డగుచు, మూర్ఛల్ పైకొనం గొంతసే
పు నరేంద్రోత్తముఁ డుండెఁ జిత్రమునరూపుంబోలెఁ దా నచ్చటన్.

వ. పదంపడి డెందంబు ధృతిపొందున నిడికొని, యతం డన్నలువుర
సుపలక్షించి, నలు దెసలుం బరికించి యాత్మగతంబున. 408

తే. "ఒరులు వచ్చినచొప్పు లే; దరిగినట్టి
చొప్పు లేదు; పెనంగినచొప్పు లేదు;
ఘనభుజులయంగకంబులు గనుఁగొనంగ
నక్షతము: లేలయొకొ్కో యిట్లయిరి వీరు? 409

ఉ. క్రూరుఁడు ధార్తరాష్ట్రుఁ డతికుత్సితుఁ: డెంతయుఁ బాపబుద్ధి; గాం
ధారుఁడు పెక్కుమాయలకుఁ దావల; మక్కట! యద్దురాత్మకుల్
వారక యెద్దియేని యొకవంచన మై నిటు సేసిరొక్కొ? యె
వ్వారలు నాత్మ నమ్మరు రె వక్రవిచారులఁ బాపకారులన్.? 410

క. వదనంబుల తెలివియుఁ, గర
పదరుచియుం జెడదు; వీరు వడుటకుఁ గత మీ
యుదకము విష దిగ్ధం బని
మదిఁ దలంపంబోల; దేమి మాయయొ యెఱుఁగన్. 411

చ. పుడమియు సర్వసంపదలుఁ బోల్పఱ వైరులపాలు సేసి, యీ
యడవికి వచ్చి భీకరమృగావలిపొత్తున నున్న వీరి వె
న్నడికొని యిట్లు సేసెనె యనాథులఁబోలె విధాతృఁ; డింక నె
క్కడఁ జనువాఁడ ? నేది గడగాఁ దరియింతు దురంతదుఃఖముల్ ?

సీ. పుత్రులు దుఃఖార్తిఁ బొగులుట కనిశంబుఁ
బొక్కుచు నున్న యప్పుణ్యచరిత
మాతల్లి పాండునిమహిషి, నా కెదురుగా
వచ్చి, కౌఁగిటఁ జేర్చి "వత్స నాఁడు
దమ్ములఁగుఱ్ఱలు నీవుఁ దగ విపినంబున
కరిగితి; రిప్పు డయ్యనుజు లెందుఁ

జనిరి ? నీ వొక్కండ చనుదెంచి, తిది యేమి ?"
యనిన, నాయమతోడ నకట ! యేమి 413

ఆ. యనఁగ నేర్చువాఁడ ? నాచార్యవిదురశాం
తనవకృపులు నను ముదంబుతోడఁ
గుశల మడిగిరేనిఁ గుశల మే మనువాఁడ ?
దలఁగ రాని యెడరు దగిలె నాకు.''

వ. అని పెక్కుదెఱంగుల వగచి, యాధర్మజుండు దప్పి కోర్వక నీళ్లు
ద్రావుట కై సరోవరంబులోనికి దిగుటయు, నశరీరభూతం బిట్లనియె.

మ. "విను మే నొక్కబకంబ; నిక్కొలను పృథ్వీనాథ ! నా సొమ్ము; నీ
యనుజుల్ మద్వచనంబు గైకొనక తోయాస్వాదు లై యివ్విధం
బునఁ బ్రాణచ్యుతిఁ బొంది; రీవును గడున్ మోహంబునన్ సాహసం
బునకుం జొచ్చిన నట్ల యయ్యెదు సుమీ ! మున్మట్ట వారించితిన్.

క. ఏనడిగినయర్థములకు
భూనుత యుత్తరము లిచ్చి, పొలు పొంద, బయః
పానము సేయుము" నావుఁడు
నానిర్మలచరితుఁ డంబరాభిముఖుం డై. 416

వ. "అయ్యా ! నీవు బకరూపధరుండ వై యున్న రుద్రుండవో, పావ
కుండవో, పవనుండవో ? యట్లు గానినాఁడు కులపర్వతప్రతిము
లయిన నాతమ్ములం బడఁద్రోచునట్టి బలంబు పులుఁగులకుం గలదె ?
దేవాసురగంధర్వయక్షాదులకు దుర్జయు లైన యివ్వీరుల నిట్లు సేసి,
నీవు గానివాఁడవపోలెం దొలంగి యున్నాఁడవు; నాకు నద్భుత
భయకౌతుకంబు లొక్కటం బొడమెడు; నీ వెవ్వండవు ? నీతలం
పెయ్యది ? చెప్పి నా హృదయవేదన నపనయింపవే''యనిన నదృశ్య
భూతం బిట్లనియె, 417

ఆ. ''కౌరవేంద్ర ! బకమఁ గాను నే; విను మొక్క
యక్షవరుఁడ; నిచట నస్మదీయ
నికృతిఁజేసి పడిరి నీతమ్ము లందఱు''
ననుచు నాక్షణంబ యతని యెదుర. 418

మ. నిలిచెం దాళసముచ్ఛ్రితాంగుఁడు, మహానిర్ఘోషసంతర్జి తా
ఖిలభూతప్రకరుండు, దీర్ఘవిపులగ్రీవుండు, దంష్ట్రాసము
జ్జ్వలవక్త్రుండు, విరూపలోచనుఁడు, దీవ్రస్ఫారతేజోఘనుం,
డలఘుం డాసరసీతటాగ్రమున నయ్యక్షుండు ఘోరాకృతిన్. 419

వ. ఇట్లు నిలిచి కౌంతేయాగ్రజున కి ట్లనియె. 420

క. "నాయనుమతి లేకుండఁగ
నీయుదకము ద్రావిరేని యెవ్వారైనన్
ధీయుత! చత్తురు; నీ వటు
సేయవు, సమ్యగ్విచారశీలుఁడ వగుటన్. 421

వ. కావున మదీయంబు లగు ప్రశ్నంబుల కుత్తరంబు సెప్పు" మనిన నతండు "మహాత్మా! నీ చిత్తంబునకు వచ్చునట్లుగాఁ జెప్ప నాబోఁటివానికి శక్యం బగునే? యైనను నానేర్చువిధంబునఁ జెప్పెద నడుగు" మనిన నయ్యక్షుం డి ట్లనియె. 422

—: ధర్మరాజు యక్షప్రశ్నముల కుత్తరంబు లిచ్చుట :—

క. "దినకరు నెయ్యది నడపును?
దినకరు నెవ్వారు గొలిచి తిరుగుదు? రద్దే
వుని యస్తమించు నేమిట?
ననఘ! తదాధారభూత మది యెయ్యదియో?" 423

తే. అనిన ధర్మజుఁ డి ట్లను "నబ్జహితుని
నడపు బ్రహ్మంబు; సురకోటి నడచుఁ గొలిచి;
ధర్మచే నస్తమితుఁ డగుఁ దపనుఁ; డమ్మ
హాత్మునకు సత్య మాధార మండ్రు బుధులు." 424

వ. అనిన విని యక్షుం డి ట్లనియె. 425

క. "ఏమిట శ్రోత్రియుఁడనఁ జను?
నేమిటఁ గడు మహిమవడయు నిమ్ముగఁ బురుషుం?
డేమిట సహాయయుతుఁ డగు?
నేమిట నగు బుద్ధిమంతుఁ డేర్పడఁ జెపుమా? 426

వ. అనిన నతం డిట్లనియె. 427

క. "శ్రుతమువలన శ్రోత్రియుఁడగు;
నతులతపోయుక్తిఁ గడుమహత్త్వమువడయున్;
ధృతిచే సహాయయుతుఁ డగు;
నతిశయముగ బుద్ధిమంతుఁ డగు బుధసేవన్." 428

వ. అని చెప్పిన నప్పార్థివోత్తమున కప్పురుషుండు వెండియు నిట్లనియె.

తే. "ఏమికతమున భూదేవుఁ డెసఁగు దేవ
భావమున? నాతనికి సాధుభావ మెవ్వి
ధమున నగు? నసాధుత్వ మెద్దానఁ జెందు?
మానుషుం డగు నాతఁ డేదానఁ? జెపుమ" 430

చ. అనవుడు ధర్మజుం డనియె "నధ్యయనంబున దేవభావముం
గను నవనీసురప్రవరుఁ; డధికవ్రతశీలత సాధుభావ మా
తనికి; విశిష్టవృత్తి దిగఁ ద్రావి యసాధు వనంగ నుండు; శౌ
చనియతి లేక మృత్యుభయసంగతి నాతఁడు మానుషుం డగుఁన్.

క. నా విని యతఁ డాతనితో
"జీవన్మృతుఁ డెట్టివాఁడు?" సెప్పు మనుటయుఁన్
"దేవాతిథిపితృభృత్యజ
నావళులకు నిడక కుడుచునతఁ"డని చెప్పెఁన్. 432

చ. విని మగుడంగ వాఁడు పృథివీపతిఁ జూచి "ధరిత్రికంటె వ్రేఁ
కన యగుదాని, నాకసముకంటెఁ గడుం బొడవైనదాని, గా
డ్పునకును నెక్కుడై జవము పొంపిరి వోయెడుదానిఁ, బూరికం
టెను దఱచైనదానిని ఘటింపఁగఁ జెప్పుమ నాకు" నావుడున్.

వ. అమ్మనుజోత్తముం డయ్యక్షోత్తమున కిట్లనియె. 434

ఆ. "తల్లి వ్రేఁగు సువ్వె ధరణికంటెను; నాక
సంబుకంటెఁ బొడవు జనకుఁ డరయ;
గాడ్పుకంటె మనసు గడుశీఘ్రగతి; తృణో
త్కరముకంటెఁ జింత గరము తఱచు." 435

వ. అనిన నంబరచరుం డమ్మహీవరున కి ట్లనియె. 436

తే. "మొనసి నిద్రించియును గన్నుమూయ దెద్ది?
పుట్టియును జేతనత్వంబుఁ బొరయ దెద్ది?
యరయ రూపు గల్గియు హృదయంబు లేని
దెద్ది? వేగంబుకతమున నెద్ది వొదలు?"

తే. అనినఁ "గన్ను మూయదు సుప్త మయ్యు మీను;
పుట్టియును గ్రుడ్డు చేతనం బొరయ కుండు;
హృదయరహితంబు రారూప; మేఱు రయము
కతన వర్ధిల్లు" నవి చెప్పెఁ గౌరవుండు. 438

వ. చెప్పిన నయ్యతుం డతనితోఁ "దెరువు నడుచువానికి, రోగార్తునకు, గృహస్థునకు, మృతిఁ బొందినవానికి నెవ్వ రెవ్వరు సుట్టంబు?" అనిన నప్పుడమిఱేఁ డన్నలువురకుం గ్రమంబున సార్థంబును, వైద్యుండును, సద్భార్యయుఁ, గృతం బగు ధర్మంబును బరమమిత్రంబు లని నిర్దేశించుటయు, వాఁడు వెండియు ని ట్లనియె. 439

క. "ఎయ్యది ధర్మమునకుఁ గుదు?
రెయ్యది యాశ్రయము గీర్తి? కి మ్మగుమార్గం
బెయ్యది సురలోకమునకు?
నెయ్యది సుఖములకు నిక్క? యేర్పడఁ జెపుమా." 440

వ. అని యడుగుటయు. 441

క. "అమరఁగ దాక్షిణ్యము ధ
ర్మమునకుఁ గుదు రండ్రు; కీర్తిమహిమ నెలవు దా
నము; సత్యము సురపురిమా
ర్గము; శీలము సంశ్రయము సుఖంబుల కెల్లన్." 442

వ. అని యుధిష్ఠిరుం డెఱింగించిన నతండు. 443

చ. "నరునకు నాత్మ యెవ్వఁడు? ఘనంబుగ దైవిక మైనచుట్ట మె
వ్వ రతనికిం? దదీయ మగు వర్తన మేమిట నిర్వహించు? భూ
వర! యతఁ డేమి పూని యనవద్యతఁ బొందుఁ? నెఱుంగఁ జెప్పు మీ
వరుదుగ" నన్న నక్కురుకులాగ్రణి యాతనితోడ ని ట్లనుఁ. 444

తే. "ఆత్మజుఁడు సువ్వె పురుషున కాత్మ యయ్యె;
నాతనికి భార్య దైవిక మైన చుట్ట;
మతని జీవిక పర్జన్యుకతనఁ జెల్లు;
నతఁడు దానము గొనియాడి యతిశయిల్లు." 445

చ. అన విని "మేటిధర్మ మగునట్టిది యెయ్యది? యేది యెప్పుడుం
దనియఁగఁ బండి యుండు? విదితంబుగ నెయ్యది నిగ్రహించినం
దనరుఁ బ్రమోదసిద్ధి? నియతంబుగ నెవ్వరితోడిసంధి యెం
దును వికలంబు గాదు? పరితోష మెలర్ప నుపన్యసింపుమా." 446

వ. అని దివ్యుండు పలికిన నాదివ్యబోధనుం డిట్లనియె. 447

ఆ. "విను మహింస మేటి యనఁ జను ధర్మంబు;
యాగకర్మ మెపుడు నమరఁ బండి
యుండు; మనసుక్రొవ్వు ఖండింపఁగా మోద
మెసఁగు; సుజనసంధి యెడలదెందు." 448

తే. అనిన నతఁడు "లోకమున కెయ్యదియు దిక్కు?
జలము నన్నము నెద్దానసంభవించు?
విష మనంగ నెయ్యది? శ్రాద్ధవిధికి నెద్ది
సమయ?" మనిన నిట్లనిచెప్పె జనవిభుండు. 449

తే. "సజ్జనులు దిక్కుసూవె యీ సర్వమునకు;
నభము, ధరణియు, జలము, నన్నమ్ము నుద్భ
వించు నెలవులు; విషమగు విప్రధనము;
లనఘ! శ్రాద్ధకాలము బ్రాహ్మణాగమంబు." 450

వ. అని తెలిపిన నయ్యక్షుండు ధర్మనందనుతో "మనుజుం డెయ్యది పరిత్య
జించి సర్వ జన ప్రియుండును, నిశ్శోకుండును, నర్థవంతుండును, సుఖ
యును నగు?" ననిన నమ్మహీపతి యతని కిట్లనియె. 451

తే. "సర్వజనసమ్మతుండగు గర్వముడిగి;
క్రోధ మడఁచి శోకమునకుఁ గొలువుగాఁడు;

